# మహాభారత
# మహిళా దర్శనం

"శూద్రస్సాధుః కలిస్సాధుః
సాధుస్సాధ్వ్యశ్చ యోషితః"



డా॥ శ్రీమతి ఎన్. శాంతమ్మ

"అంబ నవాంబుజోజ్జ్వల కరాంబుజ శారద చంద్ర చంద్రికా
డంబర చారుమూర్తి ప్రకటస్ఫుట భూషణ రత్నరోచిరా
చుంబిత దిగ్విభాగ శ్రుతిసూక్త వివిక్త నిజ ప్రభావ భా
వాంబర వీధి విశ్రుత విహార నమం గృపజూడు భారతీ !



హరికిన్ బట్టపుదేవి పున్నెముల ప్రోవర్థంబు పెన్నిక్క చం
దురు తోఁబుట్టువు భారతీగిరిసుతల్ తోనాడు పూఁబోణి తా
మరలం దుండెడి ముద్దరాలు జగముల్ మన్నించు నిల్లాలు భా
సురతన్ లేములు వాపుతల్లి సిరి యిచ్చున్ నిత్యకల్యాణముల్



అమ్మలగన్నయమ్మ ముగురమ్మల మూలపుటమ్మ చాల పె
ద్దమ్మ సురారులమ్మకడుపారడి బుచ్చెడి యమ్మ తన్నులో
నమ్మిన వేల్పుటమ్మల మనమ్ముల నుండెడియమ్మ దుర్గ మా
యమ్మ కృపాబ్ధి యిచ్చుత మహత్త్వ కవిత్వ పటుత్వ సంపదల్

# మహాభారత మహిళా దర్శనం

"శూద్రస్సాధుః కలిస్సాధుః
సాధుస్సాధ్వ్యశ్చ యోషితాః"

డా॥ శ్రీమతి ఎన్. శాంతమ్మ

ప్రథమ ముద్రణ : నవంబరు,2000.

ప్రతులు : 1000



వెల : రూ.150/-

ప్రతులకు :

1. డా॥ఎస్. శ్రీకాంత్,
7-945.
ఆశానగర్,
అనంతపురం రోడ్,
గుత్తి - 515401.

2. శ్రీమతి రోజమ్మ, ప్రిన్సిపాల్,
సెయింట్ జోసఫ్స్ ఇంగ్లీష్ స్కూలు,
41/91, నరసింగరావు పేట,
కర్నూలు.

3.శ్రీమతిడి.ప్రభావతీ అయ్యపురెడ్డి
C/o.శ్రీ డి.అయ్యపురెడ్డి,అడ్వకేటు,
శ్రీనివాసనగర్, కర్నూలు.

ముద్రణ :

**శ్రీ బాలాజీ గ్రాఫిక్స్**
**&**
**శ్రీ శారదా ప్రింటర్స్,**
సీతంపేట, రాజమండ్రి.
ఫోన్ :473554(0883)

ఈ గ్రంథం పొట్టి శ్రీరాములు తెలుగు

విశ్వవిద్యాలయం వారి ఆర్థిక సహాయంతో

ముద్రించబడింది.

ఆచార్య హెచ్.ఎస్. బ్రహ్మానంద,
ఎమ్.ఏ.(తెలుగు), ఎమ్.ఏ. (లింగ్విస్టిక్స్), పిహెచ్.డి.,
కార్యదర్శి,
ధర్మప్రచార పరిషత్తు,
తిరుమల తిరుపతి దేవస్థానములు

తిరుపతి,
తేది. 7-9-2000

# భారతీయ స్త్రీ

**యది హాస్తి తదన్యత్ర - యన్నే హాస్తి నతత్ క్వచిత్**

అని అన్నాడు వ్యాస మహర్షి. ఈ భారతంలో ఏది ఉందో అదే ఇతరత్రా కనిపిస్తుంది. ఇందులో ఏది లేదో అది మరెక్కడా లేదు - అని అర్థం. స్త్రీ పాత్రల విషయమూ అంతే. భారతంలో ఎలాంటి స్త్రీలు కనిపిస్తున్నారో అలాంటి వారే ఈనాడూ కనిపిస్తున్నారు. పురుషుల విషయమూ అంతే.

దీన్నిబట్టి 'ఇతిహాసం' జరిగిన కథను చెప్పేది కాగా 'పురాణం' నమూనా ప్రతీకలతోడి కథను చెపుతుంది. అందుకే ఈ కథ పాతబడదు. ఎన్ని యుగాలు గడిచినా ధృతరాష్ట్రులూ పుడతారు, పాండురాజూ పుడతాడు. ఇలాగే కౌరవులూ, పాండవులూనూ.

ఈ నేపథ్యంలోంచి భారతంలోని స్త్రీ పాత్రలను అధ్యయనం చేయాలి. తొలుత కనిపించే పాత్ర గంగాదేవి. చివర కనిపించే పాత్ర ఉత్తర. వంశాలను వృద్ధి చేసుకోవడం కోసం బావతో సంతానం పొందమని చెప్పింది సత్యవతి. దాయాదులు భాగం ఇవ్వకపోగా తాను బావగారి ఇంటిలోనే ఉంటూ, తన కొడుకుల రాజ్యభాగం కోసం అవిశ్రాంతంగా పోరాటం సల్పి చివరికి అక్కా బావల పరిచర్యలోనే తనువు చాలించిన మహాధైర్యవతి కుంతి. తన భర్తలకు మరలా రాజ్యం వచ్చే దాకా, తన శత్రువులు చచ్చేదాకా, తాను జుట్టు ముడువనని ప్రతిజ్ఞ చేసింది ద్రౌపది.

ఇలాంటి ప్రధాన పాత్రలతో పాటు ఎన్నో వందల అప్రధాన పాత్రలున్న మహేతిహాసం భారతం.

పురాణాలు, ఇతిహాసాలలోని పాత్రలు ఒక యుగానికి - ఒక సమాజానికి ప్రతిబింబాలు కావు. మానవ మనస్తత్వంలోని పొరలను, సకల దుర్గుణాలను "contrast" రూపంలో నిరూపించడం, పౌరాణికుని దృష్టి. అంచేతే రామాయణంలోని సుగ్రీవుడు అన్నభార్య తారను, వాలి తమ్ముడిభార్య రుమను

పరిగ్రహించినట్టు కథ ఉంది - అదే రామాయణంలోనే సీతను తల్లిగా పూజించిన లక్ష్మణస్వామీ ఉన్నాడు. భారతంలోనూ అంతే. తన భర్త మరణించగా తానూ సహగమనం చేసి, ప్రాణత్యాగం చేసిన మాద్రి ఉండగా, భర్తృవియోగ దుఃఖాన్ని దిగమ్రింగి పిల్లల్ని కాపాడటానికే బ్రతికిన కుంతి పాత్ర ఉంది. ఈ దృష్టితో చూసినపుడే పౌరాణిక పాత్రల వైవిధ్యం, లోకానికి పౌరాణికుని దృక్పథం స్పష్ట మవుతుంది. వాల్మీకి దాంపత్యాన్ని బోధించటానికే రామాయణం రాశాడు.అలాగే స్త్రీల ఔన్నత్యాన్ని, ఆత్మవిశ్వాసాన్ని, వారి సత్వరజస్తమోమయ వాంఛాబలాన్ని నిరూపించడానికే 'కుంతి' ప్రధానమైన భారతాన్ని రాశాడు.

కుంతి గౌరవించిన స్త్రీ గాంధారి. గాంధారి భర్త కనులు లేనివాడని తానూ కళ్ళకు గంత కట్టుకొని జీవించింది. అదే ఆమె పాతివ్రత్యధర్మం. దాని శక్తి ఎంత గొప్పదంటే తాను పుత్రశోకాన్ని పొందటానికి కారణమైన కృష్ణుని ఆమె శపించగలిగింది. ఆమె అధర్మపక్షం ఏనాడూ మాట్లాడలేదు. చివరికి దుర్యోధనుడు యుద్ధానికి వెళ్తూ దీవించమన్నపుడూ 'యతోధర్మస్తతోజయః' అని దీవించింది. అంటె ధర్మం ఎక్కడ ఉందో, విజయం అక్కడే ఉంటుందని అర్థం.

'ధర్మోరక్షతి రక్షితః' - ధర్మాన్ని ఎవరు కాపాడుతారో వారిని ధర్మం కాపాడుతుంది. అంచేత పాండవులు ధర్మాన్ని పాటించి విజయం పొందారు. దాయభాగాన్ని దాయాదులకు ఇవ్వటం ధర్మం. ఇవ్వక దుర్యోధనుడు ధర్మభంగం చేశాడు. అందులో భాగమే ద్రౌపదీ పరాభవం. దాని ప్రతిఫలమే ధర్మక్షేత్రంలో ఘోరయుద్ధం. కృష్ణుడు ధర్మరాజు పక్షంలో నిలవటంవల్ల ధర్మం జయించింది.

చిత్రమేమిటంటే ద్రౌపది తప్ప- తక్కిన స్త్రీ పాత్రలన్నీ వారివారికి క్షేమమైన చోట్లనే ఉన్నారు. ఒక్క ద్రౌపదే అరణ్యఅజ్ఞాతవాసాలు చేసింది. చివరికి రాయబారం ఫలించకుండా కృష్ణుణ్ణి ఉసిగొల్పిందికూడా ఆమే. శత్రువులు చచ్చేదాకా ఊర్కొనే తత్త్వం కాదామెది. అలా పాండవుల వీరలక్ష్మిగా ద్రౌపది కన్పిస్తుంది. చివరికి పాండవ కౌరవవంశాలకు మిగిలినవాడు ఉత్తరకుమారుడు పరీక్షిత్తు. ద్రౌపదికొడుకులు ఉపపాండవులూ చనిపోయారు. ఇలా అయ్యాక సుభద్రాదులందరూ చనిపోయారు. చివరికి మిగిలింది ద్రౌపదిమాత్రమే. మహాప్రస్థానక్రమంలో తొలుత పడిపోయింది ద్రౌపది. ఆమె పడటానికి హేతువడిగాడు భీముడు. ధర్మరాజు ఇలా అన్నాడు.

"ఐదుగురు భర్తలున్న ద్రౌపదికి అర్జునుని మీద ప్రత్యేకమైన అభిమానం. ఈ పక్షపాతం వల్ల ఆమెలో ధర్మభంగమయ్యింది. దానితో ఆమె పతనమైంది"

ఈ ఘట్టం అర్థం చేసుకోవాలంటే ఇతిహాసకారుని దృక్పథం అర్థం కావాలి. భీమార్జున నకుల సహదేవులలో దోషాలు చూపాడు వ్యాసుడు. చివరకు ధర్మరాజులోకూడా దేహసహజమైన'మమత' (వీరు నావారు-వీరు పరాయివారన్న భావన) స్వర్గానికి వెళ్ళినా నశించలేదని నిరూపించాడు. దేవగంగలో మానవదేహాన్ని వదిలి 'ధర్మాంశ'గా నిలబడ్డాక లోకంలో కనిపించే ద్వైతభావాలు ఏవీలేని ఒక మహానందానుభవం అతనిలో కలిగింది. దాన్నే విముక్తి అని - తృష్ణాక్షయమని- శాంతరసమని - ఆ ప్రశాంతిని మానవుడు అందుకోవాలని వ్యాసుడు ప్రబోధించాడు. ఇతిహాసాలన్నీ ఈ అంశం ప్రతిష్ఠించడానికే పుట్టాయి.

అంచేత వ్యాసుడు ' పురుష' ప్రధానవాది కాడు. పురుషార్థప్రధానవాది. తత్సాధనక్రమంలో స్త్రీ పురుషులిరువురూ ఆయనకు సమానమే. వారివారి స్థానాలు, వారివారి పరిమితులు వారికి ఉన్నాయి. ఈ పరిమితులు శ్రేయస్సు దృష్టితో పుట్టాయి తప్పా కేవలం ప్రేయస్సుకోసం కాదు. స్త్రీ పురుషులకు సుఖంకావాలి. కానీ ఈ సుఖం దేహసంబంధమైనదే అనుకోవడం ఆధునికులు చాలామంది చేసిన తప్పుడు ఆలోచన.

మనిషికి ధనంవల్లకాని, సుఖంవల్లకాని 'శాంతి' లభించదు. ఇది ఇండియాలో ఐనా అంతే. అమెరికాలోనైనాఅంతే. కేవలం మానసికమైన విశ్రాంతి వల్లనే ఆనందాన్ని అనుభవించగలడు. ఆ విశ్రాంతి మనిషి కోరికలను సన్మార్గం వైపు మరలించి తన ప్రవర్తన ఇతరులకు బాధాకరం కాకుండా నడచుకోవడమనే జీవనశైలిలో పుడుతుంది. దైవభావన - కర్మఫలత్యాగం - పరోపకారచింతన - వసుధైక కుటుంబభావనల వల్ల ఈ విశ్రాంతి సామాజిక ప్రయోజనకారి అవుతుంది. నిజానికి మహాభారత తాత్పర్యం అత్యాధునికంగా చెబితే ఇదే.

ఈ నేపథ్యంలో మహాభారతంలోని స్త్రీపురుషపాత్రల్ని చూడాలి. డా.శాంతమ్మ గారు నేను చదివే రోజుల్లో ప్రైవేటుగా M.A పరీక్ష రాసి, ర్యాంకుతో పాసయ్యారు. అప్పటినుంచి ఉత్తమ అధ్యాపకురాలిగా పేరు పొందినవారు. వారి భర్త శ్రీపూర్ణచంద్రుడుగారు నిండైన మనిషి. మనుష్యులను బాగా గమనించడం -వారిని సహృదయంతో అర్థం చేసుకోవటం స్వభావంగా కల్గిన శాంతమ్మగారు 'కుంతి'పాత్ర ను ఆధారంగా స్త్రీ చరిత్రను - వికాసాన్ని - అధ్యయనం చేశారు. అప్పుడూ నేనే పర్యవేక్షణ చేశాను. తరువాత భారతంలోని స్త్రీ పాత్రలన్నిటినీ అధ్యయనం చేయమని నేనే కోరాను. దాదాపు మూడువందల నలభై మూడు పాత్రలను ఏరి, వారికథలను విశ్లేషించి, భారత సంస్కృతిలోని కొన్ని మౌలికమైన

విలువలమీద ఆమె అధ్యయనం చేశారు. దాని ఫలితమే ఈ గ్రంథం. ఆమె నిశిత పరిశోధనకు,విశ్లేషణా పటిమకు తార్కాణం.

చివరగా ఒకమాట - స్త్రీపురుషులలో ఎవరూ చెడ్డవారు కారు. మంచివారూ కారు. మంచిచెడులు చాలా సాపేక్షకమైన తత్త్వాలు.' మనిషి' గా చూసినపుడు ప్రతిమనిషి ప్రవృత్తికి - ప్రవర్తనకు వెనుక ఒక అగాధమైన 'మనస్సు' ఉంది. దానిలోతు భారతమంత. దాని పేరే 'సంస్కారం'. ఆ సంస్కారం 'భారతీయత'ను నిరూపిస్తోంది.

ప్రపంచంలోని స్త్రీలందర్నీ ఒకవైపు నిల్పి, భారతీయ స్త్రీని గుర్తించమంటే ఇట్టే గుర్తుపట్టగలం. ఆమె చీర చిరిగిపోయి ఉండవచ్చు. ఆమెకు అలంకార సామగ్రి చాలకపోవచ్చు - లేకనూపోవచ్చు. కాని ఆమె చుట్టూపిల్లలు. ఆమె ఒక పిల్లలకోడి. వారికోసమే ఆమె బ్రతుకుతుంది. వారిలోనే తన ఆశలు పండించు కొంటుంది. భర్త సహకరించినా, సహకరించకపోయినా, ఉన్నా పోయినా ఆమె జీవిత రథాన్ని మాత్రం లాగుతూనే పోతూంటుంది.

ఇంతకథ జరిగినా ఆమె భర్తను మరచిపోదు. మరో మగవాని పేరు తలవదు. ఆమె సుశీల. ఆమె సచ్చరిత్ర పిల్లలకు మార్గదర్శకమవుతుంది. అందుకే 'అమ్మ' అనే మాటలో అన్ని లోకాలు ప్రతిధ్వనిస్తాయి పిల్లలకు. ఆమె పేరు ఒకనాడు అదితి. మరోనాడు వినత. ఇంకోనాడు సావిత్రి. మరోయుగంలో సీత. ఇంకో యుగంలో కుంతి. ఇంకోనాడు ద్రౌపది. ఈనాడు 'భారతి'.

ఆమె అందరికీ అణగిమణగి ఉంటూ అందరి తలల్లోనూ మాణిక్యంగా ప్రకాశిస్తూ ఉంటుంది. తండ్రికి శ్రాద్ధం మాత్రమే పెడతారు.తల్లినిమాత్రం హృదయంలో ఆలయం కట్టి ప్రతిష్ఠించుకొంటారు.

ఆమె వినయం ఒక బ్రహ్మాస్త్రం. ఆమె మంచితనం ఒక వజ్రాయుధం. ఆమెకు సృష్టిలో సాటిలేదు. ఆమె పువ్వులా సుతిమెత్తనిది. అవసరమైతే మహాసర్పంలా వెంటాడి చంపగలదు. అందుకే ఆమెను 'శక్తి' స్వరూపిణి అని అన్నారు. స్త్రీ సత్త్వరజస్తమో గుణ సమన్వయమని చెప్పారు.

ఆధునికులు భారతీయ స్త్రీని పురుషునితో సమానస్థానం పొందాలని ప్రబోధిస్తున్నారు. ఆమెస్థానం పురుషునిస్థానంకన్నా చాలా గంభీరమైంది. ఉదాత్తమైంది- అని భారతంలోని స్త్రీపాత్రలు నిరూపిస్తున్నాయి.

పురుషార్థ సాధనలో స్త్రీపురుషులు రథచక్రాలవంటివారు. ఎవరూ అప్రధానులు కారు.

'సాధు సాధ్వ్యశ్చయోషితః' అని వ్యాసమహర్షి అంటాడు. యుగాల్లో కలియుగం, వర్ణాల్లో శూద్రుడు - సాధువులలో స్త్రీలు శ్రేష్ఠులని ఆయన అభిప్రాయం.

**ఆ శ్రేష్ఠత ఎలా వచ్చిందో తెలుసుకోవాలంటే ఈ గ్రంథం తప్పనిసరిగా చదవాలి.**

భారతీయ 'ధర్మం'లోని శ్రేష్ఠతకూడా ఇదే. "**యత్ర నార్యస్తు పూజ్యతే రమంతే తత్ర దేవతాః**" అని నిష్కారణంగా అనలేదు.

ఆమధ్యలో బాలచందర్ 'ఆకలిరాజ్యం' అని ఒక చలనచిత్రం నిర్మించారు. అందులో ముగ్గురు యువకులు ఆకలిపోరాటం చేస్తారు. వారిమధ్యలో ఒక 'శ్రీదేవి' ఉంది. ఆ ఆకలినివారు చాలా ఆనందంగా అనుభవించటానికి ఆ 'తల్లి' సహాయపడుతుంది.

గోర్కి 'అమ్మ'నవల రాశాడు. అది సమాజంలోని 'అమ్మ'లకోసం 'స్త్రీ' అని ఒక కథా రాశాడు. అది స్త్రీ పురుషుల మధ్యనున్న స్వచ్ఛసంబంధాన్ని చాటింది. స్త్రీ పురుషుల సంబంధం ఒక మనోమయబంధం. దానికి పరస్పర విశ్వాసం భూమిక. మరోటి ఏదీ లేదు. దాన్నే మానవధర్మం అంటాము. ఆ అనాది దంపతుల విశ్వాస ఫలితమే ఈ విశాల విశ్వం. ఇంత వైవిధ్యంలోనూ ఎక్కడో తళుక్కుమంటున్న ఆ విశ్వాసాన్నే 'దాంపత్యం' అంటాం. దానివల్ల 'కుటుంబం' పుట్టింది. ప్రతి సమాజంలోనూ దాని విలువదానిదే. ప్రపంచమంతా ఒక 'కుటుంబం' అనుకుంటే అందులోని స్త్రీ పురుషులే భారత కథలో కనిపిస్తారు.



ఆచార్య శలాక రఘునాథ శర్మ,
ఆంధ్రభారతి శాఖాధ్యక్షుడు,
శ్రీకృష్ణదేవరాయ విశ్వవిద్యాలయం,
అనంతపురం.

తేది. 9-9-2000

# సౌజన్యసంభావనము

పురుషార్థముల విజ్ఞాన సర్వస్వముగా శ్రీవేదవ్యాసులవారు శ్రీమహాభారతాన్ని మానవజాతికి అందించారు. అందులో లేనిది మరొకచోట వెదకటం వ్యర్థశ్రమ. బహుశః ప్రపంచంలో ఇట్టి గౌరవస్థానం పొందిన గ్రంథం మరొకటి ఉండడం అసంభవమైన అంశం.

ప్రాచీన ఆర్షవాఙ్మయం మహిళకు మహనీయ స్థానాన్ని కల్పించింది. ఒకటి రెండు సందర్భాలలో కొన్ని కఠోర నియమాలను స్త్రీజాతికి విధించిన మాట సత్యమేగాని అది సాధకలక్షణంగానే కానీ బాధకలక్షణంగాకాదు. సమన్వయ దృష్టితో పరిశీలిస్తే మాన్యతా లక్షణమే మహోన్నతంగా కనిపిస్తుంది.

కవిత్రయం వారు శ్రీమహాభారతాన్ని తెలుగుజాతికి ఉపాస్య వాఙ్మయ స్వరూపంగా అందించారు. వారి ప్రయత్నంలో అంతర్లీనంగా వ్యాసదర్శనం చేయించే ప్రయత్నం ఉన్నది. ఆంధ్రమహాభారతం ఒకగొప్ప వాఙ్మయదీధితి.

విశ్వవిద్యాలయంలోను, ఇతరత్రాను భారతంలోని అనేక అంశాలపై పరిశోధనలు జరిగాయి. ఇంకా ఎన్నో పరిశోధనలు జరగడానికి అవకాశం పుష్కలంగా ఉన్నది.

శ్రీమతి డా॥శాంతమ్మగారు మహాభారతంలో మహిళా దర్శనం చేసి, చేయించడానికి చేసిన కృషి ప్రశంసనీయమైనది. పూర్వం అనేకులు

ఏతన్ముఖంగా ప్రయత్నాలు చేశారు. కానీ అవిఏవీ సమగ్రతకు నోచుకోలేదు. ఆ కారణంగానే శాంతమ్మగారి కృషికి ఒక ప్రత్యేకత సిద్ధిస్తున్నది.

మహాభారతం ఆమూలాలనుండి ఆమూలదాకా చదవటమే ఒక మహాకార్యం. అందులో ఉన్న ప్రతి స్త్రీ పాత్రతత్వాన్ని అనుశీలించడం అందరికీ సాధ్యమయ్యే విషయంకాదు .ప్రతిపాత్రనూ ఒక ప్రత్యేక దృక్కోణంతో విశ్లేషించి నిర్ణయ కథనపురస్సరంగా నిరూపించటం మరింత కష్టసాధ్యమైన అంశం. శ్రీమతి శాంతమ్మగారు ఈ మోకాటిపర్వతాల నన్నింటినీ ధైర్యసాహసాలతో దాటి మహిళా మహోన్నత స్వరూప దర్శనం చేశారు. ఆమె చేసిన కృషికి పిహెచ్.డి. పట్టా లభించడం పెద్ద ప్రతిఫలంగా నేను భావించను.

నేటి స్త్రీవాద దృక్పథంతో నాటి స్త్రీని అంచనా వేయటం ఒక విధంగా అందరూ హర్షించదగిన విషయంకాదు. కానీ అది పరిశోధన ప్రయాణంలో ఒక అనివార్యమైన మజిలీ మాత్రమే. ఇంకా ఎన్నో సార్వకాలిక సత్యాలను ఆవిష్కరించడానికి ప్రయత్నించిన డా॥ శ్రీమతి శాంతమ్మగారు సహృదయుల అభినందనలకు అర్హురాలే అవుతుంది.

భాషలో, భావనలో, విషయనివేదనలో డా॥ శాంతమ్మగారిది ఒక ప్రత్యేకమైన దారి. దానితో ఈ గ్రంథానికి పఠనీయతాలక్షణం పరిపూర్ణంగా సిద్ధిస్తున్నది.

డా॥ శాంతమ్మగారినీ, ఈకృషికి మార్గదర్శనం చేసిన ఆచార్య బ్రహ్మానందగారినీ మనసారా అభినందిస్తున్నాను.



శ్రీమతి రోజమ్మ,
M.A., M.Ed.,
ప్రిన్సిపాల్,
సెయింట్ జోసఫ్స్ ఇంగ్లీష్ స్కూల్,
41/91, నరసింగరావు పేట,
కర్నూలు.

# ఆత్మీయావలోకనం

డా. శ్రీమతి శాంతమ్మగారు కీ.శే. నూకల శేషయ్య శ్రీమతి నూకల సంజీవకొండమ్మగార్ల జ్యేష్ఠపుత్రిక. నూకల శేషయ్య గొప్ప గాంధేయవాది. మహాత్మాగాంధీ సిద్ధాంతాలతో ప్రభావితుడై స్వాతంత్ర్య సమరంలో అత్యంత ఉత్సాహంతో పాల్గొన్నారు. లాహోరు,కరాచీ కాంగ్రెస్ సభల (1929-1930) లోను ఉప్పు సత్యాగ్రహం, క్విట్ ఇండియా ఉద్యమాలలోను పాల్గొన్నందుకు అరెస్టయి, అవిభక్త భారతదేశం లోని ముల్తాను(ఇప్పటి పాకిస్తాను) లో రెండు సంవత్సరాలు కఠినకారాగారవాస శిక్ష ననుభవించారు. తాను వైశ్యకులంలో జన్మించినా, వెనుకబడిన కులానికి చెందిన సంజీవ కొండమ్మగారిని వివాహమాడి గాంధీజీ సిద్ధాంతాలను ఆచరణలో చూపించి, ఎందరికో మార్గదర్శకుడైనాడు. నూకల సంజీవకొండమ్మ భర్తకు ఏమాత్రం తీసిపోని సచ్ఛీలవతి, పుణ్యవతి, ఆదర్శహిందూ మహిళ. తన ఇరవై ఆరవయేటనే భర్తను కోల్పోయినా, స్వాతంత్ర్యసమరసాధనలో ఆస్తిపాస్తులు కరిగిపోయినా, బంధుమిత్రుల అండదండలు లేకున్నా, మొక్కవోని ధైర్యంతో భారతీయస్త్రీలకు ఉగ్గుపాలతో లభించే ఓర్పు, త్యాగనిరతి, సచ్ఛీల బలంతో తన ముగ్గురు బిడ్డలను పెంచి అహర్నిశలు అభివృద్ధిపథంలో నడిపించగల్గిన శ్రమజీవి, అమాయక మాతృమూర్తి.

డా.శాంతమ్మగారుself made person, స్వయంసిద్ధ. చిరుప్రాయం లోనే ఎనిమిదవతరగతి (E.S.L.C) విద్యార్హతతో జూనియర్‌బేసిక్ ట్రైనింగ్ పూర్తిచేసి ప్రాథమిక పాఠశాల ఉపాధ్యాయినిగా ఉద్యోగంలో చేరి కుటుంబభారాన్ని మోస్తూ తల్లికి చేదోడు వాదోడుగా నిలిచారు. ఇక అక్కడినుండి స్వయంకృషితో అధ్యయనం అవిరామంగా కొనసాగించారు. పసివయస్సులోనే దక్షిణ భారత హిందీ

ప్రచారసభవారి ప్రాథమిక పరీక్షలో దక్షిణ భారతానికే ద్వితీయురాలిగా, ఆంధ్రప్రదేశ్‌కు ప్రథమురాలిగా ఉత్తీర్ణురాలై రవీంద్రుని గీతాంజలి వంటి అమూల్య గ్రంథాలను బహుమతులుగా పొందడం హిందీ అధ్యయనానికి స్ఫూర్తినీయగా స్వీయకృషితోనే 'రాష్ట్రభాషాప్రవీణ' పట్టాను సాధించారు. హిందీ పండితురాలిగా పదోన్నతి పొందారు.

అయినా ఆగని తపనతో కఠోరదీక్షతో విద్యార్హతల్ని పెంచుకుంటూ వచ్చారు. శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయంనుండి ఎం.ఏ. డిగ్రీని(తెలుగు) మూడవర్యాంకుతోను, బి.యిడి పట్టాను రెండవర్యాంకుతోను సాధించారు. 1975లో టంగుటూరి ప్రకాశం పంతులుగారి శతజయంతి ఉత్సవాల సందర్భంగా నిర్వహించిన అంతర్ కళాశాలల వక్తృత్వ పోటీలో బి.యిడి విద్యార్థినిగా పాల్గొన్న శాంతమ్మ విశ్వవిద్యాలయానికే ప్రథమురాలిగా వచ్చారు.

ఆంధ్రప్రదేశ్ పబ్లిక్ సర్వీస్ కమీషన్ పరీక్షలో నెగ్గి, 1982లో జూనియర్ లెక్చరర్‌గా నియమితురాలైనారు. పాణ్యం, కర్నూలు, ఎమ్మిగనూరులలో పనిచేసి ప్రస్తుతం అనంతపురం జిల్లా గుత్తిలో ఉద్యోగబాధ్యతలు నిర్వహిస్తున్నారు."ఆంధ్ర మహాభారతంలోని కుంతి -ఒక పరిశీలన" అన్న అంశంపై పరిశోధించి ఎం.ఫిల్ పట్టాను పొందారు. ఈ జ్ఞానపిపాసి విద్యాతృష్ణ అంతటితో ఆగలేదు. సంసార ఉద్యోగ బాధ్యతలతో సతమవుతున్నా, వయసు మీదపడుతున్నా భయపడక "ఆంధ్ర మహాభారతంలోని స్త్రీపాత్రలు- సాంస్కృతికాధ్యయనం" అన్న విషయాన్ని పరిశోధనాంశంగా స్వీకరించి, తరచి తరచి శోధించి, భారతంలోని మరుగున పడిఉన్న స్త్రీ పాత్రలను వెలుగులోకి తెచ్చి, తన పరిశోధనకు డాక్టరేట్ పట్టాను పొందారు. ఇది ఈమె కీర్తికిరీటంలో కలికితురాయి. ఈమె పిహెచ్.డి. సిద్ధాంతగ్రంథమే "మహాభారత మహిళాదర్శనం"గా మీ ముందుకు వచ్చింది.

ఇన్ని ఘనవిజయాల వెనుక అకుంఠితదీక్షతో నిర్విరామంగా ఆమె చేసిన కఠోర పరిశ్రమ, మొక్కవోని పట్టుదల ఉన్నాయి.

"తనిసిరే వేల్పులుదధి రత్నములచేత
వెఱచిరే ఘోరకాకోలవిషముచేత
విడచిరే యత్నమమృతంబు వొడముదనుక
నిశ్చితార్థంబు వదలరు నిపుణమతులు"

అన్న భర్తృహరి సూక్తికి ఉదహరణ ప్రాయం శ్రీమతి శాంతమ్మ జీవితం. ఆమె కృషి వెనుక, విజయపరంపర వెనుక ఆమె భర్త శ్రీ పూర్ణచంద్రుడుగారి సంపూర్ణ సహకారం, ప్రోత్సాహం పరిపూర్ణంగా ఉంది.

డా.శాంతమ్మగారు కర్నూలు, అనంతపురం జిల్లావాసులకు ఉపన్యాసకురాలిగా చిరపరిచితురాలు. ఈమె ఉపన్యాసాలు సెలయేరులాగా సాగుతాయి. జలపాతంలాగా దూకుతాయి. శ్రోతలనాకట్టుకునే చక్కటి స్వరం ఈమెకు దేవుడిచ్చినవరం. భాషకందని భావాలు ఈమె మేధస్సునుండి అవిరామంగా ప్రవహిస్తాయి. ఉపన్యాసం మొదలిడవలెనేగాని,దాని ప్రవాహానికిక అడ్డులేదు.తాను చెప్పదలుచుకున్న విషయాన్ని స్పష్టంగా, సూటిగా,పరిపూర్ణంగా మనోమోహకంగా చెప్పడం ఈమె శైలి.

అమోఘమైన జ్ఞాపకశక్తి ఈమెకుగల మరోవరం. ఏ విషయాన్నైనా క్షుణ్ణంగా పరిశీలించి ఆకళింపు చేసుకొనగల సమర్థత, చూసిన, నేర్చుకున్న విషయాలు మస్తిష్కంలో పదిలపరచగల సామర్థ్యం, మృదుమధుర సంభాషణ,సచ్ఛీలత, నిరాండంబరత ఈమెకు పెట్టని భూషణాలు. స్త్రీగా తోటిస్త్రీల సమస్యలనర్థం చేసుకొని సహాయసహకారాల నందించడం ప్రవృత్తిగాగల శాంతమ్మగారు ఆంధ్రమహాభారతంలోని స్త్రీపాత్రలను నాటి సంస్కృతీ విశేషాల నేపథ్యంలో శోధించి,ఎన్నెన్నో చారిత్రక సత్యాలను కాచి వడబోసి, భారతస్త్రీపాత్రల ఔన్నత్యాన్ని ఆంధ్రపాఠకలోకానికి అందించడానికి కంకణం కట్టుకున్న మొదటివనిత.

ఒకవైపు విద్యార్హతలు పెంచుకుంటూ, మరోవైపు ఉద్యోగధర్మాన్ని సమర్థవంతంగా నిర్వహిస్తూ తోడి ఉపాధ్యాయులు, విద్యార్థుల మన్ననలనందు కొంటూనే ఈ బహుముఖ ప్రజ్ఞాశాలిని స్త్రీల సమస్యలనుగూర్చి రేడియో ప్రసంగాలు చేశారు. వందలాది సభలలో వక్తగా విజయదుందుభి మోగించటం మాత్రమేకాదు ఎన్.ఎస్. ఎస్. ప్రోగ్రాం ఆఫీసరుగా సమాజసేవాకార్యక్రమాలను అంతే విశిష్టంగా చేపట్టి,విద్యార్థినులచే చేయించారు. పచ్చదనం - పరిశుభ్రత, అక్షరాస్యత, ఎయిడ్స్ నిర్మూలన,స్త్రీ శిశుసంక్షేమం - మొ॥ ఎన్నో అంశాలపై సభలు, సెమినార్లు,ర్యాలీలు నిర్వహించి,జన్మభూమి కార్యక్రమాలలో పాల్గొని పొందిన ప్రశంసలు, పతకాలు ఎన్నెన్నో.

ఈ సంవత్సరం రాష్ట్రస్థాయి ఉత్తమ అధ్యాపకపురస్కారాన్ని రాష్ట్ర

ముఖ్యమంత్రి శ్రీ చంద్రబాబునాయుడు గారి చేతులమీదుగా సెప్టెంబరు అయిదున హైదరాబాదు రవీంద్రభారతిలో జరిగిన ఉపాధ్యాయ దినోత్సవంలో అందుకోవడంతో ఈ యశస్వి కీర్తిచంద్రికలు రాష్ట్రవ్యాప్తమయ్యాయి.

ఇటువంటి బహుముఖ ప్రజ్ఞాశాలి, స్నేహశీలి పరిచయభాగ్యం, మైత్రీబంధం భగవదనుగ్రహంగా నేను భావిస్తున్నానుఎందరికో ఆమె జీవితం మార్గదర్శకం, స్ఫూర్తిప్రదం కావాలని, భగవంతుడామెకు, ఆమె కుటుంబానికి ఆయురారోగ్యసౌభాగ్య సంపదల ననుగ్రహించాలని, తెలుగు సాహితీ సేవకామెకు మరిన్ని అవకాశాలు ప్రసాదించాలని ప్రార్థిస్తూ సెలవు తీసుకుంటున్నాను.

కర్నూలు<br>తా. 5.10.2000

మీ<br>**రోజమ్మ**



ముఖ్యమంత్రి శ్రీనారా చంద్రబాబునాయుడుగారి స్వయహస్తాల నుండి
రాష్ట్రస్థాయి ఉత్తమ అధ్యాపక అవార్డును స్వీకరిస్తున్న రచయిత్రి



రాష్ట్రస్థాయి ఉత్తమ అధ్యాపక అవార్డును
ముఖ్యమంత్రినుండి స్వీకరించే వేళ భర్తతో
రచయిత్రి

# అంకితం



కీ.శే. నూకల శేషయ్యగారు
1907-1952

మహాత్ముని సిద్ధాంతాలచే ప్రభావితుడై, స్వతంత్రతా సంగ్రామంలో మహోత్సాహంతో ముందుకురికి,1929-30లలో జరిగిన లాహోరు, కరాచీ కాంగ్రెసు సభలలోను, ఉప్పుసత్యాగ్రహంలో పాల్గొన్నందుకు అవిభక్త భారతదేశం (ఇప్పటి పాకిస్తాను)లోని మూల్తానులో రెండు సంవత్సరాల కఠిన కారాగారవాస శిక్షననుభవించి, గాంధేయవాదిగా, గాంధీజీ సిద్ధాంతాలను ఆచరణలో పాటించి చూపిన నా కన్నతండ్రి కీర్తిశేషులు నూకల శేషయ్యగారికి,



నూకల సంజీవకొండమ్మ
జననం: 25-2-1925

పట్టుమని పాతిక సంవత్సరాలు నిండీ నిండకుండానే భర్తృ వియోగం ప్రాప్తించగా, మోడువారిన తన జీవితాన్ని కన్నబిడ్డలనుపెంచి పెద్దజేయటానికే కరిగించిన నా మాతృమూర్తి శ్రీమతి నూకల సంజీవ కొండమ్మకు

భక్తితో......

# కృతజ్ఞతలు

ఈ పరిశోధనావ్యాసనిర్మాణంలో ఆద్యంతం నాకు అమూల్యమైన సలహాలనిచ్చి సహకరించిన నిర్దేశకులు, వ్యాసస్వరూపాన్ని నిర్ధారించడమే కాక తిరుమల తిరుపతి దేవస్థానముల ధర్మప్రచార పరిషత్తు కార్యదర్శిగా గురుతరమైన బాధ్యతలతో క్షణం తీరిక లేనప్పటికీ అభ్యర్థించిన వెంటనే అనతి కాలంలో చక్కటి సమీక్షను వ్రాసిపంపిన గురువర్యులు ఆచార్య హెచ్. ఎస్. బ్రహ్మానంద గారికి, పరిశోధనాకాలంలో నన్నెంతో ఆదరించిన శ్రీమతి నిర్మలా బ్రహ్మానందగారికి,

పరిశోధనకు నాకవకాశమీయడంతోబాటు అవశ్యక గ్రంథాలనిచ్చి సహకరించిన **ఆచార్య రాచపాళెం చంద్రశేఖరరెడ్డిగారికి, ఆచార్య శ్రీనివాసరెడ్డి, ఆచార్య దేవకి** దంపతులకు,

ఆంధ్రభారతి శాఖాధ్యక్షులు, ఆచార్యవర్యులు పరిశోధనలోను, గ్రంథ ముద్రణలోను అడుగడుగున అవశ్యకసలహాలనిచ్చి తోడ్పడటమేకాక, బహుకార్యవ్యగ్రులై ఒక్కక్షణమైనా విరామం లభించని నిరంతర సాహితీవ్యాసాంగ నిర్మగ్న మానసులైనప్పటికీ నా అభ్యర్థనను మన్నించి, గ్రంథాన్ని అమూలాగ్రం పఠించి తమ అమూల్యమైన అభిప్రాయాన్ని అందించిన సహృదయులు,మాన్యులు ఆచార్య శలాక రఘునాథశర్మగారికి,

నా సిద్ధాంత వ్యాసానికి పరీక్షకులుగా వ్యవహరించిన ఆచార్య యార్లగడ్డ బాలగంగాధరరావు (నాగార్జున విశ్వవిద్యాలయం)గారికి, ఆచార్యఎస్.జి.డి. చంద్రశేఖర్ (శ్రీవేంకటేశ్వర విశ్వవిద్యాలయం)గారికి, ఆచార్య కోలవెన్ను మలయవాసిని (ఆంధ్రవిశ్వవిద్యాలయం)గారికి,

ముద్రణకు ఆర్థికసహాయాన్నందించిన పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం వారికి,

గాంధారి, కుంతి,ద్రౌపది చిత్రాలను చక్కగా చిత్రించియిచ్చిన కర్నూలుసెయింట్‌జోసఫ్స్ ఇంగ్లీషుపాఠశాల చిత్రలేఖనోపాధ్యాయులు శ్రీ ఏరువాక్షి గారికి,

పరిశోధనలోను గ్రంథముద్రణలోను నిరంతరం నాకు తన తోడ్పాటు

అందించి సహకరించిన నా జీవిత భాగస్వామి శ్రీ **పూర్ణచంద్రుడు** గారికి,

పరిశోధనకు, ముద్రణకు నాకు నైతిక బలాన్నిచ్చి ముందుకు నడిపించిన నా ప్రాణమిత్రురాలు కుమారి **శౌరీలు రెడ్డి**కి,

పరిశోధన, ముద్రణ సకాలంలోపూర్తి చేయడానికి తనవంతు సహాయాన్నందించిన నా ఆత్మీయనేస్తం శ్రీమతి **ప్రభావతీ అయ్యపురెడ్డి**కి,

అవ్యాజమైన ప్రేమతో, అనిర్వచనీయమైన ఆదరాభిమానాలతో అన్నిటా నాకాలంబనగా నిలిచి, తన మహోన్నత వ్యక్తిత్వంతో, కర్తవ్యదీక్షతోను, సేవాపరాయణతతోను, నిరాడంబరజీవనంతోను నాకు నిరంతరం స్ఫూర్తినిచ్చే అమృతహృదయిని,'పరిచయ' వాక్యాలువ్రాసి నా పట్ల తన అంతరంగాన్ని ఆవిష్కరించిన నాకు హితురాలు స్నేహితురాలు,పూజనీయురాలు, శ్రీమతి **రోజమ్మ** గారికి,

ఈగ్రంథాన్ని అందంగా ముద్రించి సకాలంలో అందించిన **శ్రీబాలాజీ గ్రాఫిక్స్** మరియు **శ్రీ శారదా ప్రింటర్స్**అధినేత శ్రీ **వారణాసి** సుబ్రహ్మణ్యం గారికి, (సీతంపేట, రాజమండ్రి) వారి సిబ్బందికి - నా హృదయపూర్వక కృతజ్ఞతాభివందనాలు.

రచయిత్రి

# ముందుమాట

మొదటిసారిగా ఆంధ్రమహాభారతాన్ని నేను సంపూర్ణంగా చదివినప్పుడు అందులోని స్త్రీ పాత్రల వైవిధ్యం, విశిష్టత నన్ను ఆకర్షించాయి. కుంతిని గూర్చి ఎం.ఫిల్ కోసం సిద్ధాంత వ్యాసాన్ని సమర్పించడానికై మహాభారతంలోని ఇతర స్త్రీ పాత్రలను గూర్చి కూడా అధ్యయనం చేయడం సంభవించింది. భారతంలోని స్త్రీ పాత్రలను కవిత్రయం చిత్రించిన తీరు, ఆయా పాత్రల విలక్షణత నాకు ఎంతో ప్రత్యేకమైనవిగా గోచరించాయి.

భారతంలోని ఎన్నో అంశాల గురించి అసంఖ్యాకమైన విమర్శలు, పరిశోధనా వ్యాసాలు వచ్చినా, మొత్తం స్త్రీ పాత్రలను వెలుగులోనికి తెచ్చే ప్రయత్నం ఇంతవరకూ జరగలేదు. కథాపరంగా ప్రాముఖ్యం కల్గిన గంగ, సత్యవతి, గాంధారి, కుంతి, మాద్రి, అంబ, ద్రౌపది, హిడింబ, సుభద్ర, సుదేష్ణ, ఉత్తర మొదలైన పాత్రలను ఉపాఖ్యానాలలో వచ్చినవి లేదా కథతో ప్రత్యక్ష సంబంధం లేనివే అయినా ఎంతో విశిష్టమైన శకుంతల, దమయంతి, సావిత్రి వంటి పతివ్రతల పాత్రలను మాత్రమే చాలమంది విమర్శకులు పరిశీలనా దృక్పథంతో వ్యాఖ్యానించడం జరిగింది. స్త్రీపాత్రలను గురించి ప్రత్యేకంగా అధ్యయనం చేసినవారు కూడా మొత్తం అన్ని పాత్రలను పరిచయం చేయలేదు. ఎంతో వైవిధ్యం కలిగిన మూడువందల అరవై స్త్రీ పాత్రలు భారతంలో ఉన్నాయి. పరస్పర భిన్నమైనవి, కథతో ఎలాంటి సంబంధం లేకపోయినా తమ ప్రత్యేకతతో పాఠకుల మనస్సులలో శాశ్వతస్థానం సంపాదించుకోగలిగినవి, పేరులేనివి, పేరు లేక పోయినా ప్రత్యేకత నిలబెట్టుకోగల్గినవి, దివ్యమానవ రాక్షస పాత్రలు, పశుపక్ష్యాదులైన పాత్రలు, స్త్రీలైన పురుషులు, పురుషులైన స్త్రీలు, నదులైన స్త్రీలు, స్త్రీలైన నదులు, మానవతా విలువలను ప్రబోధించే పాత్రలు, మానవ మనస్తత్వంలోని భిన్నకోణాలను ప్రదర్శించే పాత్రలు,భిన్నజీవన దృశ్యాలను ప్రతిబింబించే పాత్రలు, స్త్రీలోని దైవత్వాన్ని చాటిచెప్పే ఎన్నో పాత్రలు స్త్రీ విశ్వరూపాన్ని ప్రదర్శిస్తాయి. ఆయా పాత్రలన్నింటిని సమగ్రంగా పరిచయం చేయడమే ఈ సిద్ధాంత వ్యాసం ప్రధానలక్ష్యం. ఆయా పాత్రల చిత్రణ వెనుక ఉన్న చారిత్రక సత్యాలు, సామాజిక పరిస్థితులు, ఆయా పాత్రలను గూర్చి ఇంతవరకు వెలుగులోనికి రాని వాస్తవాలు వెలికి తీయాలన్న ఆకాంక్షే నా యీ చిన్న ప్రయత్నానికి ప్రేరణ.

కీర్తిశేషులు పెండ్యాల వేంకట సుబ్రహ్మణ్యశాస్త్రిగారు మహాభారత చరిత్రను త్రవ్వి తీసి, ఆయా పాత్రల చారిత్రక నేపథ్యాన్ని చర్చించారు. కుంతీ, ద్రౌపదులను,గూర్చి మాత్రమే వ్యాఖ్యానిస్తూ కుంతిని 'జారిణి' అని ధ్రువపరిచినారే గాని, ఏ విధంగా కుంతి సూర్యునికి లొంగిపోవలసి వచ్చిందో,వివాహమైన తర్వాత అపుత్రకుడైన భర్తచే ఏ విధంగా ఇతరుల వలన బిడ్డలను కనడానికి నిర్బంధించ బడిందో పరిగణన లోనికి తీసుకొనేలేదు. కుంతిని గూర్చి శ్రీ శాస్త్రిగారు 'తార్పుకత్తె' అని కూడా చాలా హేయంగా పేర్కొన్నారు.

'మహాభారతము- మానవ స్వభావచిత్రణ' అన్న తమ పరిశోధనా వ్యాసంలో డా.అప్పజోడు వేంకట సుబ్బయ్యగారు స్త్రీపాత్రలలో గాంధారి, కుంతి, మాద్రి, ద్రౌపది, సుదేష్ణ మొదలైన చాలా కొద్ది పాత్రలను గూర్చి మాత్రమే విమర్శించినారు. తన శీలాన్ని రక్షించుకోవడం కోసం, ఒక కన్యగా, కుమార్తెగా, తానూ, తన తల్లిదండ్రులు అపఖ్యాతి పొందకుండా ఉండడం కోసం కుంతి ఎంతో సాహసోపేతంగా సూర్యుని నిలువరించడానికి ప్రయత్నించింది అన్న అతి ముఖ్యమైన విషయాన్ని, కుంతి పాత్ర వైశిష్ట్యాన్ని ఆవిష్కరించే సంఘటనను అప్పజోడువారు వివరింపలేదు.

"మహాభారతము-విశ్వవిజ్ఞానకోశము" అన్న తమపరిశోధనా వ్యాసంలో డా.మూలంపల్లి చంద్రశేఖర శర్మగారు దాదాపుగా యాభై స్త్రీపాత్రలను స్థూలంగా పరిచయం చేశారు. కుంతి పాత్రను వీరు కూడా 'చపల'అని వ్యాఖ్యానించినారు. 'మహాభారతము -మహిళ' అన్న తమ పరిశోధనా వ్యాసంలో కీర్తిశేషులు జక్కా వేంకట రమణప్పగారు ద్రౌపది, కుంతి, మాద్రి, గాంధారి, సుదేష్ణ -అన్న అయిదు పాత్రలను మాత్రమే విమర్శించినారు.

"మహాభారతము - స్త్రీలమనస్తత్వ నిరూపణ" అన్న తమ పరిశోధనా వ్యాసంలో శ్రీమతి అయ్యగారి విజయలక్ష్మి యాభై ఎనిమిది పాత్రలను గూర్చి వ్యాఖ్యానించినారు. స్త్రీ మనస్తత్వ వైవిధ్యాన్ని విశిష్ట లక్షణాలు, సామాన్య లక్షణాలు అని రెండుగా వర్గీకరించుకొని, విశిష్టలక్షణాలుగా స్త్రీపాత్రల సహజ, విలక్షణ, తిర్యగాదిగతమైన మాతృత్వాన్ని, అతిథి సేవ, పతిసేవా తత్పరతలను, ధర్మనిష్ఠను, దైవభక్తిని, సహనశీలత, ధీరస్వభావాలను విశదీకరించారు. సామాన్య లక్షణాలుగా ఆయా పాత్రల కామానుభవము, మాత్సర్యం, ప్రతీకారవాంఛ, అహంకారం, అలంకార ప్రియత్వాలను పేర్కొన్నారు.

"ప్రాచీన తెలుగు కావ్యాలలో విఫలమనోరథలైన స్త్రీలు" అన్న తమ

పరిశోధనా వ్యాసంలో శ్రీమతి శ్రీదేవి భారతంలోని చాలకొద్ది పాత్రలను (పాత్రల పాక్షిక, సంపూర్ణ వైఫల్యాలను, వాటి పరిణామాలను పేర్కొనేందుకు) మాత్రమే ఉటంకించారు. "యుగ యుగాల్లో భారతీయ నారీత్వం" అన్న తమ వ్యాసంలో కుమారి నివేదిత భారతంలోని కుంతి, గాంధారి, ద్రౌపది, అంబ, మాధవి, - వీరిని గూర్చి మాత్రమే ప్రస్తావించారు.

"సంప్రదాయ సాహిత్యం - స్త్రీవాద దృక్పథం" అన్న తమ గ్రంథంలో శ్రీమతి కాత్యాయనీవిద్మహే జంటలుగా ఉన్న స్త్రీపురుషులను పేర్కొంటూ ముప్ఫయ్యేడు జంటలను పేర్కొన్నారు. సత్యవతి, గాంధారి, కుంతి, అంబ, ద్రౌపది, ప్రద్వేషిణి, సత్యభామ వంటి ప్రముఖ పాత్రలనే విశ్లేషించినారు.

పైన పేర్కొన్న విమర్శకులు, పండితులు భారతంలోని కొద్దో గొప్పో స్త్రీ పాత్రలను, ప్రముఖపాత్రలను మాత్రమే తమ రచనలలో స్వీకరించి వ్యాఖ్యానించడం, ఆ పాత్రలను కూడా సమగ్రంగా అన్ని కోణాల నుండి ఆవిష్కరించే ప్రయత్నం చేయకపోవడం భారతంలోని స్త్రీపాత్రలపై సమగ్రమైన అధ్యయనం జరగవలసి ఉందన్న సత్యాన్ని వెల్లడిస్తోంది.

భారతంలోని స్త్రీపాత్రలన్నింటిని సంపూర్ణంగా, క్షుణ్ణంగా అధ్యయనం చేయగా ఆనాటి సామాజిక పరిస్థితుల్లో స్త్రీల జీవితం ప్రతిబింబించిన తీరును పరిశీలించగా, భారత కాలంనాడు స్త్రీలు ఒకవైపు గౌరవాన్ని పొందుతూనే మరోవైపు అగౌరవాన్నీ చవిచూసినారని స్పష్టమవుతుంది. వ్యతిరేక పరిస్థితులతో పోరాడుతూ కూడా తమ లక్ష్యాలను సాధించుకొన్నారు. మహోదాత్తమైన మానవతా విలువలను అడుగడుగునా ప్రదర్శించారు. 'స్త్రీ' అన్న పదంలోని సకారం సహనానికి, తకారం త్యాగానికి, రకారం శారీరక మానసిక బౌద్ధిక రమ్యత్వానికి ప్రతీక అన్న అభిప్రాయాన్ని స్థిరపరిచారు. వారి జీవితలక్ష్యం ఐహికాముష్మిక సుఖాలకోసం ప్రాకులాటగాని, పట్టమహిషీత్వంగాని, కీర్తికాంక్షగాని, ప్రతీకారవాంఛగాని, విశృంఖల విహారంగాని కావు. మానవ స్వభావంలోని ఔన్నత్యాన్ని వ్యక్తీకరించే ప్రేమ, త్యాగం, సేవాభావం, సహనం, మాతృత్వం, పరోపకార పరాయణత, ధీరత్వం మొదలైన లక్షణాలతోబాటు పాతివ్రత్యం, దైవభక్తి, విదుషీత్వం, గురుజనశుశ్రూష, కుటుంబభార నిర్వహణా సామర్థ్యం - ఇంకా ఎన్నో విశిష్ట గుణాలతో శోభించే పాత్రలు తమ ఉనికితో, తమ సాహచర్యంతో పురుషుల ఔన్నత్యానికి ప్రేరకమూ, కారకములైన పాత్రలు అసంఖ్యాకంగా మనకు గోచరించుతాయి.

నాటికే వేళ్ళూనుకొన్న పితృస్వామ్య వ్యవస్థ, పురుషాహంకార ప్రవృత్తి

స్త్రీలను అణగార్చిన, అవమానించిన సంఘటనలు భారతంలో చిత్రించబడినా, ఆ పరిస్థితుల్లో కూడ తమ విశిష్ఠ వ్యక్తిత్వాన్ని చాటుకొని, ప్రత్యేకతను నిలబెట్టుకొని, తమను పరాభవించబూనిన పురుషులను సిగ్గిలజేసిన మహిమాన్వితలు, మహనీయ స్త్రీమూర్తులు భారత పాత్రలు. భారతీయ సంస్కృతీ వైభవానికి ఆధార స్తంభాలు. ఆదర్శ భారతనారీత్వానికి ఉదాహరణప్రాయాలు భారతంలోని స్త్రీపాత్రలు.

ఆధునిక యుగంలో స్త్రీవాదానికి సంబంధించిన సాహిత్యం గత దశాబ్ద కాలంగా అధికమైనా, ప్రాచీన సాహిత్యంలో కన్పించే స్త్రీపాత్రల అధ్యయన నేపథ్యంలో స్త్రీవాదాన్ని సమన్వయించిన గ్రంథాలు ఒకటి రెండు తప్ప కన్పించడం లేదు. భారతంలోని స్త్రీపాత్రల చిత్రణ వారి అణిచివేతకు, వారిపై జరిగిన దౌర్జన్యాలకు తార్కాణమన్న స్త్రీవాద రచయిత్రుల అభిప్రాయం సహేతుకమైనదే.

కాని, స్త్రీవాదుల లక్ష్యం ఏమిటి? యుగయుగాలుగా, తరతరాలుగా అణగార్చబడిన స్త్రీమూర్తి పురుషప్రపంచం పై తిరుగబడి, కుటుంబ వ్యవస్థను ధ్వంసం చేయటమా ? పురుషునికి కనువిప్పు కల్గించటమా? స్త్రీ పురుష సమానతా సంస్కృతిని ఆవిర్భవింపజేయటమా ?

"ప్రభూత సత్యం కతరోహ్యంగనానాం
దోషోస్తి యో నా చరితో మనుష్యైః"

"స్త్రీల విషయంలో మనుష్యులు (పురుషులు) ఆచరించని దోషం ఏదైనా ఉందా, నిజం చెప్పండి" అన్న వరాహమిహిరుడి ప్రశ్నకు 'లేదు' అనే భారత స్త్రీపాత్రలు సమాధానం చెబుతాయి.

అయినా, తమ పురుషాహంకార ప్రవృత్తిని పక్కన బెట్టి భారతంలోని మొత్తం స్త్రీపాత్రలను సావధానంగా అధ్యయనం చేస్తే స్త్రీలపట్ల పురుషుల దృక్పథం సంపూర్ణంగా మారగలదని విశ్వసిస్తున్నాను. మృత్యుదేవతగా తాను బ్రహ్మచే సృష్టించబడినా, మానవుల ప్రాణాలను హరించే పాపపుపని చేయజాలనని విలపించి, ప్రార్థించి, తపస్సుచేసి, తననా ఘోరకృత్యాన్నుండి తప్పించమని వేడుకొన్న స్త్రీమూర్తి కరుణాపూర్ణ అంతరంగం ముందు పురుష ప్రపంచం నతమస్తకం కాగలదని, స్త్రీపురుష సమానతా సంస్కృతికి బీజం వేయగలదని, స్త్రీలను గౌరవించడంతో బాటు కుటుంబ జీవనంలోను, సామాజిక జీవితంలోను అన్నిటా సమభాగినులుగా స్వీకరించి, సమాన ప్రాతినిధ్యం కల్పించే వ్యవస్థకు పునాది వేయగలదని ఆశించడం అత్యాశ కాబోదు.

రచయిత్రి

# విషయసూచిక





## 1. దేవశుని సరమ

కురుక్షేత్రంలో జనమేజయుడు దీర్ఘయాగం చేస్తూండగా సరమ అనే దేవశుని కుమారుడు సారమేయుడు ఆడుకొంటూ అక్కడకు వచ్చి తిరుగాడుతుండగా జనమేజయుని తమ్ములు శ్రుతసేనుడు, భీమసేనుడు, ఉగ్రసేనుడనే వాళ్ళు దాన్ని కొట్టగా ఆ కుక్క అరుస్తూ వెళ్ళి తన తల్లికి చెప్పగా సరమ కోపంతో జనమేజయుని వద్దకు వచ్చి నీ తమ్ములు వివేక శూన్యులై, దయారహితులై, కాస్తైనా ఆలోచన లేకుండా పసివాడు, నిరపరాధి అనైనా చూడకుండా నా చిన్న బిడ్డను కోపంతో చావబాదారు.

**"తగునిది తగదని యెదలో**
**వగవక సాధులకు బేదవారల కెగ్గుల్**
**మొగిజేయు దుర్వినీతుల**
**కగు ననిమిత్తాగమంబు లయిన భయంబుల్"**[1]

"ఇది తగును ఇది తగదు అన్న ఆలోచన లేకుండా కొంచెమైనా విచారించకుండా మంచివారికి, పేదవారికి హానిచేసే దురహంకారులకు కారణం లేకుండానే ఎన్నో భయాలు కల్గుతాయి." అని శపించి అదృశ్యమవుతుంది.

## 2. పైలపత్ని

పైలుని శిష్యుడు, మహా తపస్సంపన్నుడు, బ్రహ్మసమానుడైన ఉదంకుడు భక్తి శ్రద్ధలతో గురుకులంలో గురుశుశ్రూష చేసి, ఎంతో నిష్ఠతో అణిమాది అష్టసిద్ధులను, జ్ఞానాన్ని సంపాదించాడు.గురుపత్ని అతన్ని పౌష్యమహారాజు భార్యకుండలాలు తీసుకొని రమ్మని ఆజ్ఞాపిస్తుంది.తానాదేశించినట్లు నాల్గవ రోజుకు ఉదంకుడు కుండలాలు తీసుకొని రాగలడని ఆమె అభ్యంగన స్నానంచేసి, నూతనవస్త్రాలు ధరించి సిద్ధంగా ఉంటుంది.సమయానికి వచ్చిన శిష్యుని ఆగమనానికి సంతోషించి, ఆ రత్నకుండలాలను ధరించి,బ్రాహ్మణులను పూజించి, తాను సంకల్పించిన మహోత్సవాన్ని నెరవేర్చుకొంటుంది.

## 3. పౌష్యపత్ని

ఉదంకుడు పౌష్యుని వద్దకు వెళ్ళి, "నేను నా గురువు నిమిత్తమై అర్థిగా నీ వద్దకు వచ్చాను.నీ దేవి కుండలాలు నా కివ్వు"అని అడగగానే రాజు "ఇంతటి

[1] ఆం. భా. ఆది - 1వ ఆ. ప. 85

మహానుభావునకీయగల్గుతున్నాను. కృతార్థుడనయ్యా"ననుకొని సంతోషిస్తాడు. తన ధర్మపత్ని వాటిని ధరింపబోతున్నదని, తన మాటగాచెప్పి, వాటిని ఇప్పించు కొమ్మని అతణ్ణి అంతఃపురానికి పంపుతాడు.

అక్కడ ఉదంకునికి పౌష్యపత్ని కన్పించదు. తిరిగి వచ్చి "నాకు నీ దేవి కనపడలేదు.నీవే కుండలాలు తెప్పించి యి" మ్మంటాడు. తన భార్య పరమపతివ్రత, పవిత్రురాలు అశుచులకు కన్పించదని పౌష్యుడు చెప్పగా,తాను వస్తూండగా దారిలో ఒక పెద్ద ఎద్దు నెక్కిన దివ్యపురుషుడు కన్పించి,ఆ వృషభ గోమయాన్ని భక్షించమని చెప్పడం, తాను విధిగా చేయడం గుర్తుకువచ్చి, గోమయ భక్షణంవల్లనే తానుశుచి నయ్యానని తెలుసుకొని ఉదంకుడు ఆచమనం చేసి వెళ్తాడు.పౌష్యపత్ని అతనికి నమస్కరించి, కుండలాలిచ్చి"తక్షకుడీ కుండలాలను అపేక్షిస్తున్నాడు.అతడు మాయావి.అతని బారినుండి వీటిని జాగ్రత్తగా కాపాడుకొమ్మని"చెబుతుంది.

## 4,5 ధాత, విధాతలు

ఉదంకుడు నాగభవనంలో తెల్లని, నల్లని వస్త్రాలను నేస్తున్న యిద్దరు స్త్రీలను చూస్తాడు. ఎద్దునెక్కివచ్చి తనచేత గోమయం తిన్పించినవాడు యింద్రుడనీ, ఆ ఎద్దు ఐరావతమనీ, గోమయం అమృతమనీ, నాగలోకంలో అతడు చూసిన ఆ యిద్దరు స్త్రీలు ధాత, విధాతలనీ, వారు నేస్తున్న వస్త్రం అహోరాత్రాలనీ పౌష్యమహర్షి ఉదంకునికి వివరిస్తాడు.

## 6. పులోమ

భృగుడనే బ్రాహ్మణుని భార్య పులోమ. గర్భవతి. ఆమెను అగ్నిహోత్రానికి అగ్నులు సిద్ధంచేయమని చెప్పి, భర్త అభిషేచనంకోసం వెళతాడు.పులోముడనే వింత రాక్షసుడు ఆ అగ్నిహోత్రగృహానికి వచ్చి, ఆ యువతిని చూసి వెఱ్ఱిమోహంతో ఉన్మత్తుడై ఆమె యెవరని అగ్నిదేవుని అడుగుతాడు.ముందు చూస్తే నుయ్యి, వెనుక చూస్తే గొయ్యి అన్నట్లుగా అవుతుంది అగ్నిదేవుడిపని, నిజం చెబితే బ్రాహ్మణశాపం, అబద్ధం చెబితే అసత్యదోషం అంటుకుంటాయని భయపడి, ఆమె భృగుపత్ని అని నిజమే చెబుతాడు.ఈమెను నేనింతకు మునుపే వరించాను.తరువాత భృగుడు పెళ్ళి చేసుకొన్నాడని చెప్పి, భయకంపితురాలైన ఆమెను వరాహరూపంలో ఎత్తుకొని పారిపోతాడు. ఆమె గర్భస్థశిశువు అమిత క్రోధంతో కుక్షిగుండా బయటపడతాడు. అందుకే అతడు చ్యవనుడని

పిలువబడతాడు.

వేయిమంది సూర్యులొక్కసారి ఉదయించినట్లు దుస్సహమైన తేజస్సుతో విరాజిల్లుతున్న ఆ బాలుని అగ్ని వంటి దీప్తిని చూస్తూ రాక్షసుడు బూడిద అవుతాడు. పులోమ కొడుకునెత్తుకొని తన ఆశ్రమానికి వస్తుంది. మొదట రాక్షసుడు ఎత్తుకొని పోతున్నప్పుడు ఆమె ఏడుస్తూ వెళ్ళింది.వెళ్ళినంతమేరా మహానదియై ఆ ఆశ్రమ సమీపంలో ప్రవహిస్తుంది.దానికి బ్రహ్మ 'వధూసర' అని నామకరణం చేస్తాడు. స్నానానంతరం తిరిగి వచ్చిన భృగుడు బాలసూర్యునివంటి కొడుకు నెత్తుకొని యేడుస్తున్న భార్యవల్ల పులోముడు చేసిన దుర్మార్గాన్ని తెలుసుకొని "అతడు నిన్నెట్లా తెలుసుకొన్నాడని ప్రశ్నిస్తాడు.అగ్నిదేవుడు చెప్పాడని తెలుసుకొని మహాక్రోధంతో నీవు మహాక్రూరుడవు, సర్వభక్షకుడవు" కమ్మని శాపమిస్తాడు.

## 7.సుకన్య

ఈమె చ్యవనుని భార్య.

## 8. ఘృతాచి

సుకన్యా చ్యవనుల కుమారుడు ప్రమతి అతని భార్య అప్సరోద్భవయైన ఘృతాచి.

## 9. ప్రమద్వర

విశ్వావసుడనే గంధర్వరాజుకు,మేనకకు పుట్టి, స్థూలకేశుడనే ముని ఆశ్రమంలో పెరిగిన అపురూప లావణ్యవతి ప్రమద్వర. ఘృతాచి కుమారుడు రురుడు ఆమెను ప్రేమించి, వివాహం చేసుకోవాలనుకొంటాడు.ఒకనాడు తన స్నేహితురాళ్ళతో ఆడుకొంటున్న ప్రమద్వరను సర్పం కాటేయగా ఆమె తక్షణం మరణిస్తుంది.అక్కడ చేరిన మునులందరూ దుఃఖిస్తారు.

రురుడు శోకతప్త హృదయంతో ఒంటరిగా అరణ్యానికి వెళ్ళి,తాను నిరంతరం దేవబ్రాహ్మణ పూజలు, వ్రతపుణ్యకర్మలు చేసినట్లైతే, గురు బ్రాహ్మణ భక్తుడూ, తపస్వి అయినట్లైతే ప్రమద్వర పునర్జీవితురాలు కావాలని దేవతలను ప్రార్థిస్తాడు.విషహరణ విద్యనేర్చిన మహాపురుషులెవరైనా వచ్చి ప్రమద్వరను బ్రతికిస్తే తన తపః ఫలాన్ని, అధ్యయన, దానఫలాలను వారికిస్తానని దీనుడై ఆక్రోశిస్తాడు.

ఆకాశంనుండి ఒక దేవదూత "నీ ఆయుష్షులో సగం ఈమెకిస్తే బ్రతుకు

తుందని చెబుతాడు.రురుడు ఆ విధంగా చేయగానే ప్రమద్వర బ్రతుకుతుంది. అతడామెను వివాహమాడతాడు.

## 10,11 కద్రూవినతలు

కృతయుగంలో కశ్యప ప్రజాపతి భార్యలు కద్రూవినతలు.పుత్రార్థినులై ఎన్నోవేలయేండ్లు వారిద్దరూ భర్తను భక్తితో ఆరాధించగా ప్రసన్నుడై కోరిన వరాలిస్తాను అంటాడు.

అగ్నివంటి తేజస్సూ, దీర్ఘదేహం కల్గిన వేయిమంది పుత్రులు తనకు కావాలని కద్రువ కోరుతుంది.వారికంటే పరాక్రమవంతులైన పుత్రులిద్దరు తనకు కావాలని వినత కోరుకుంటుంది.కశ్యపుడా విధంగానే ప్రసాదించి గర్భాలను జాగ్రత్తగా రక్షించుకొమ్మంటాడు. గర్భాలు కొంతకాలానికి అండాలవుతాయి.వాటిని నేతి కుండలలో పెట్టి కాపాడుతూ ఉంటారు.అయిదువందల ఏండ్లకు కద్రువ గర్భాండాలు మెల్లమెల్లగా పగిలి, శేషుడు, వాసుకి మొదలైన వేయిమంది నాగ ప్రముఖులు ఉద్భవిస్తారు.

సవతికి వేయిమంది జన్మించినా తన గర్భాండాలనుండి పుత్రోదయం కాలేదన్న బాధతో వినత ఒక అండాన్ని చిదిమి వేస్తుంది.దానినుండి పూర్వార్థకాయం మాత్రమే కల్గిన అనూరుడు అరుణుడనే వాడు పుడతాడు. తన కటువంటి జన్మకల్గడానికి కారణమైన తల్లిపై కోపంతో తనకు సంపూర్ణ శరీరం కల్గేంతవరకు ఆగలేక బలవంతంగా అండాన్ని ఛిద్రం చేసినందుకు అయిదువందల యేండ్లు సవతికి దాసిగా ఉండమని తల్లికి శాపమిస్తాడు.దుఃఖిస్తూ ఉన్న తల్లితో రెండవ అండం తనంతట తానే పగిలే వరకూ ఉండనిమ్మని, దానినుండి పుట్టేపుత్రుడు మహాబలపరాక్రమ సంపన్నుడవుతాడని, ఆమె దాసీత్వాన్ని తొలగిస్తాడని చెప్పి, తాను సూర్యరథసారథిగా వెళ్ళిపోతాడు.

ఒకనాడు అమృత సహజాతమై దేవేంద్రయోగ్యమైన ఉచ్చైశ్రవమనే దివ్యాశ్వం క్షీరసాగర తీరంలో తిరుగాడుతుండగా వినోదంగా విహరిస్తూ అక్కడకు వచ్చిన వినతాకద్రువలు ఆ అశ్వాన్ని చూస్తారు.శ్వేతపద్మంలాగా, సముద్రపు నురుగులాగా ధవళకాంతులీనే దాన్ని చూపి, కద్రువ 'వినతతో' నిండు చంద్రునిలో మచ్చలాగా ఆ అశ్వవాలానికున్న మచ్చను చూశావా?" అని అడుగుతుంది.

వినత నవ్వి "అక్కా, నీవే కళ్ళతో చూశావు?మహాపురుషుని కీర్తిలాగా ఈ అశ్వరాజం ఎంతో నిర్మలంగా ఉంది" అంటుంది.

ఆ గుఱ్ఱానికి గనుక మచ్చ ఉన్నట్లయితే వినత తనకు దాసి కావాలని, లేకపోతే తానామెకు దాసి నవుతానని కద్రువ పందెం వేస్తుంది.అమాయకురాలైన వినతదాని దగ్గరకు వెళ్ళి చూద్దామంటుంది.పతిసేవా సమయమైనదన్న వంక పెట్టి మరునాడుదయాన్నే వచ్చిచూద్దామంటుంది కద్రువ.

ఆరాత్రి తన కుమారులందరికీ తన పందెం సంగతి వివరించి, "కామచారులైన మీరు ఎలాగైనా ఆ అశ్వవాలాన్ని నల్లగా కన్పించేటట్లు చేయండి" అని అడుగుతుంది. కాని నాగులందరూ ఆ అధర్మానికి యిష్టపడరు."యెరుక గలరె మగువ లెందు?" అని స్త్రీలు జ్ఞానం లేని వారనుకొంటారు.*కొడుకులు తనమాట విననందుకు కోపోద్రిక్తురాలై కద్రువ జనమేజయుడు చేసే సర్ప యాగంలో సర్పాలన్నీ నశించాలని శాపమిస్తుంది.

కర్కోటకుడనేవాడు మాత్రం తల్లిశాపానికి భయపడి ఆమె చెప్పిన ప్రకారం సూక్ష్మరూపంలో ఉచ్చైశ్రవం తోకకు నల్లగా వ్రేలాడతాడు.మరునాడు వచ్చి చూసిన వినత పందెం ప్రకారం కద్రువకు దాసి అవుతుంది.

ఈ విధంగా అయిదువందల యేండ్లు గడుస్తాయి.రెండవ గర్భాండం నుండి తన ఱెక్కల బలంతో కులపర్వతాలనే సంచలింపజేయగల్గిన మహా బలవంతుడు గరుత్మంతుడు జన్మించి తల్లికి మ్రొక్కి, పెద్దమ్మ వద్దకు వెళ్ళి నమస్కరిస్తాడు.అతని తేజస్సును, బలపరాక్రమాలను సహించలేని కద్రువ తన కుమారులను ఎత్తుకొని తిప్పుతూ ఉండమని, ఏ పని చెప్పినా వ్యతిరేకించక చేయమని, ఆజ్ఞాపిస్తుంది.

గరుడుడు తల్లి అనుమతితో వారిని తన వీపుపై మోస్తూ సమస్త ప్రదేశాలు చూపిస్తూ ఒకనాడు సప్తాశ్వమండలందాకా ఎగురుతాడు.సూర్యకిరణాల వేడికి గరుడుని వీపున ఉన్న నాగులు నేలపైబడి మూర్ఛపోగా చూసిన కద్రువ కోపంతో గరుడుని తీవ్రంగా నిందిస్తుంది.. ఇంద్రుణ్ణి ప్రసన్నుణ్ణి చేసుకొని కొడుకులపై కుంభవృష్టి కురిపించి, వారి పరితాపాన్ని పోగొట్టి,రెట్టించిన గర్వంతో తల్లికొడుకులతో దాస్యం చేయించుకుంటూ ఉంటుంది.

ఒకనాడు గరుడుడు తల్లితో "అమ్మా రెక్కల బలంతో కులపర్వతాలను నుగ్గుచేయగల శక్తీ, ప్రసిద్ధీ కల్గిన నేను హీనులైన యీ నాగులనిలా మోస్తూ వారికి దాస్యం చేయడానికి గల కారణమేమో వివరించు"అనగా వినత కద్రువ పందెం, అనూరుని శాపం వివరించి "నాయనా, నీ మూలంగా నాకు దాస్యం తొలగుతుందని అనూరుడు చెప్పినమాటలే నాకింతకాలం ఊరట కల్గించాయి.

సమర్థులైన కొడుకులు గల తల్లితండ్రుల కష్టాలు తొలిగిపోవడం లోకంలో ఉన్నదే గదా, నీ వంటి సత్పుత్రుడుండీ నేనిలా దాసిగా ఉండవలెనా? అని దుఃఖిస్తుంది.

"మీ కిష్టమైనదేదో చెప్పండి. దేవతల నెదిరించి సాధిస్తాను. నన్నాజ్ఞాపించండి. మా దాస్యం తొలగే ఉపాయం చెప్పండి" అని గరుడుడు నాగులను వేడగా వారు కరుణించి అమృతంతెచ్చి తమకిస్తే వారి దాస్యం తొలగిపోతుందని చెబుతారు. గరుడుడు సరేనని తల్లితో విషయం చెప్పి వెళ్ళడానికి అనుజ్ఞయిమ్మంటాడు.

వినత కుమారుని కౌగలించుకొని "నాయనా, వాయుదేవుడు నీ రెండు రెక్కలను, చంద్రుడు వీపును, అగ్ని నీ తలను, సూర్యుడు సమస్త దేహాన్ని ఎప్పుడూ రక్షింతురుగాక! నీ కోర్కెలు నెరవేర్తురు గాక!నీకు ఉన్నతీ, జయమూ కల్గుగాక!"అని దీవిస్తుంది.

అమృతం తేవడానికి తగిన శక్తినిచ్చే ఆహారాన్ని తనకు ప్రసాదించమని తల్లిని ప్రార్థిస్తాడు. సముద్రగర్భంలో అసంఖ్యాకంగా నిషాదగణముండి లోకంలోని ప్రజలకు ఎంతోకీడు చేస్తున్నారని, వారిని భక్షించమని, బ్రాహ్మణుని మాత్రం భక్షించవద్దనీ చెప్పి, వేగంగా మ్రింగినప్పుడు కంఠంక్రిందకి జారకుండా అగ్నిలాగా దహించేవాడిని బ్రాహ్మణుడిగా తెలుసు కొమ్మని బ్రాహ్మణ స్వరూపాన్ని వివరిస్తుంది.

మహాపరాక్రమవంతుడైన గరుడుడు నాగులకోరిక మేరకు అమృతాన్ని తెచ్చి, వారికిచ్చి తన తల్లిదాస్యాన్ని తొలగించి, ఆమెను తన వీపుపై కూర్చుండ బెట్టుకొని ఎగిరి వెళ్ళిపోతాడు.ఇంద్రుని మాయోపాయం మూలంగా అమృతం నాగులకు దక్కదు.

## 12. నిషాది.

గరుత్మంతుడు సముద్రగర్భంలో ఉన్న నిషాద గణాన్ని పాతాళంలాంటి తన నోరు తెరచి మ్రింగుతుండగా ఒక బ్రాహ్మణుడు కంఠంలో ఉండి నిప్పులాగా దహిస్తూ ఉంటాడు."నా కంఠబిలంలో బ్రాహ్మణుడుంటే బయటకు రావలసినదని" గరుడుడు చెప్పగా నేను విప్రుడనే కాని అపవిత్రురాలైన నిషాది నా భార్య.ఆమెను వదలి నేను రావడం ధర్మంకాదు " అంటాడు బ్రాహ్మణుడు.

"నిన్ను భర్తగాపొంది ఆమె పవిత్రురాలైంది.కాబట్టి ఆమెతో కూడా

బయటకిరా" అన్న గరుడుని మాటలకు నిషాదీసహితుడై బ్రాహ్మణుడు బయటపడి అతనిని దీవించి యథేచ్ఛగా వెళ్ళిపోతాడు.

## 13. జరత్కారువు.

జరత్కారుడనేముని తాను వివాహంచేసుకోని కారణంగా తన పితృ పితామహులు ఊర్ధ్వలోకాలకు వెళ్లలేకుండా ఉన్నారని తెలిసికొని తన పేరుకల్గిన కన్యను వివాహమాడాలని నిశ్చయించుకుంటాడు.

తల్లిశాపం మూలంగా తమకు కలుగబోతున్న మహోపద్రవాన్ని తలచుకొని క్షోభపడుతున్న వాసుకి మొదలైన నాగ ప్రముఖులకు వారి కనిష్టసోదరుడు యేలాపుత్రుడనేవాడు భవిష్యత్తులో జరత్కారుడనే ఋషి తమ చెల్లెలు జరత్కారువును వివాహమాడతాడని, వారి పుత్రుడైన ఆస్తీకుని మూలంగా జనమేజయుని సర్పయాగంలో నాగప్రముఖులు రక్షింపబడతారని, క్రూరులైన నాగులనుండి భూదేవిని రక్షించడంకోసమే కద్రువ శాపాన్నుండి వారిని తాము కాపాడలేదని బ్రహ్మదేవతలకు చెప్పడం తల్లిఒడిలో నుండి తాను విన్నానని చెబుతాడు.

చారుల వల్ల జరత్కారుని గూర్చి తెలుసుకొని, వాసుకి తన సోదరిని వివాహమాడమని అతనిని అర్థిస్తాడు. సనామయైన ఆమెను జరత్కారుడు వివాహమాడతాడు.తన కెన్నడైనా ఆమె అవమానం కల్గించితే ఆనాడు తానామెను వదలివేస్తానని ప్రథమ సమాగమం నాడే తెలియజేస్తాడు.ఆమె ఎంతోభయ భక్తులతో "వడవడ వడకుతూ" అతనికి పరిచర్యలు చేస్తుంది. భర్తప్రేమను పొంది గర్భవతి అవుతుంది

ఒకనాడు భర్తతన తొడపై తల పెట్టుకొని నిద్రిస్తుండగా సూర్యాస్తమయం కావడంచూసి, సంధ్యావందనాది క్రియలకు కాలం గడచిపోతే ధర్మలోపం కలుగు తుందని భయపడుతుంది.నిద్రాభంగం కల్గిస్తే కోపగించుతాడేమోనన్న భయం మరొకవైపు బాధించగా చివరకు నిద్రలేపుతుంది.

తనకు నిద్రాభంగం చేసి, అవమానించిందన్న కారణంతో జరత్కారుడు భార్యను పరిత్యజిస్తాడు ఆమె తన అన్న వాసుకి వద్దకు వచ్చి విషయమంతా వివరిస్తుంది. ఆస్తీకుడనే కుమారునికి జన్మనిస్తుంది. అతడు వేదవేదాంగాలు, సమస్త శాస్త్రాలు నేర్చి జనమేజయునిచే సర్పయాగం విరమింపజేస్తాడు.

## 14 శుక్తిమతి

చేదిదేశపురాజైన వసుమహారాజు రాజధాని సమీపంలో శుక్తిమతి అనే మహానది ప్రవహిస్తూ ఉంటుంది. కోలాహలమనే పర్వతం ఆ నదిని కామించి అడ్డగిస్తుంది. వసురాజు తనపాదంతో ఆపర్వతాన్ని తొలగదోస్తాడు. పర్వత సమాగమంతో గర్భవతియైన శుక్తిమతి గిరిక అనే పుత్రికకు వసుపదుడనే పుత్రునికి జన్మనిస్తుంది. ఆ యిద్దరినీ వసురాజుకు కానుకగా తెచ్చి యిస్తుంది.

## 15 గిరిక

తన కుమారులైదుగురునీ వేరువేరు దేశాలకు ప్రభువులుగా పట్టాభిషేకం చేసి తాను రాజర్షియై రాజ్యం చేస్తున్న వసుమహారాజు శుక్తిమతి గిరికను తెచ్చి ఇవ్వగానే ఆమెను ధర్మపత్నిగా చేసుకొంటాడు. ఋతుమతియైన గిరికకు మృగ మాంసం తెచ్చిపెట్టమని పితృదేవతలు ఆజ్ఞాపించగా వసురాజు వేటకు వెళతాడు.

అడవిలో గిరికాసౌందర్యాన్ని భావన చేసిన వసురాజుకు వీర్యస్ఖలన మవుతుంది. దాన్ని ఒక ఆకు దొన్నెలో సంగ్రహించి, గిరికకిమ్మని ఒక డేగ కాలికి కట్టి పంపుతాడు. దొన్నెలోది మాంసమని భావించి, వేరొక పక్షి ఆ డేగతో తలపడు తుంది. వసురాజు వీర్యం యమునా నదిలో పడుతుంది.

## 16 అద్రిక

బ్రహ్మశాపం మూలంగా అద్రిక అనే అప్సరస యమునా నదిలో చేపరూపంలో తిరుగాడుతూ ఉండి, వసురాజు వీర్యబిందుద్వయాన్ని మ్రింగుతుంది. గర్భందాల్చి, పదవనెలలో జాలరుల చేతికి చిక్కుతుంది. జాలరులు దాని పొట్టకోసి అందులో బాలికను,బాలుణ్ని చూసి తీసుకొని వచ్చి దాశరాజుకిస్తారు. మనుష్యులకు జన్మనివ్వగానే శాపమోక్షమవుతుందని బ్రహ్మ చెప్పి ఉంటాడు. ఆ విధంగా అద్రిక చేప శరీరం విడిచి దివ్యవనిత అయి దేవలోకానికి వెళ్లిపోతుంది.

## 17.మత్స్యగంధి.

చేప కడుపులో పుట్టినందున దాశరాజు ఆ బాలుడికి మత్స్యరాజని పేరుపెట్టిమత్స్యదేశానికి రాజును చేస్తాడు.బాలిక మత్స్యగంధి పేరుతో తండ్రి ఆజ్ఞానుసారం ఓడ నడుపుతూ ఉంటుంది.ఒకనాడు ఒంటరిగా యేకవస్త్రయై

ఓడరేవులో ప్రయాణీకులకోసం నిరీక్షిస్తున్న ఆమెను పరాశర మహర్షిచూస్తాడు. ఆమె అంగాంగ సౌందర్యాన్ని మనస్సులో భావించి మదన పరవశుడవుతాడు.

"ఎంత శాంతులయ్యు నెంత జితేంద్రియు,
లయ్యు గడు వివిక్తమయినచోట
సతుల గోష్ఠి జిత్తచలన మొందుదురెందు,
గాము శక్తినోర్వ గలరె జనులు."[1]

ఎంతో జితేంద్రియులైనా,శాంతులైనా ఏకాంతంలో స్త్రీల సహవాసంపురుషుల చిత్తచాంచల్యానికికారణమవుతుందని, కాముని శక్తిని మానవులోర్వలేరని నన్నయ యీ ఘట్టంలో వ్యాఖ్యానిస్తాడు. లజ్జావిహీనుడై ముని ఆమెకు తనకోర్కెతెలియజేస్తాడు.అతని కోర్కెతీర్చకపోతే శపిస్తాడేమోనని ఆమె భయపడుతుంది.అయినా ధైర్యంతెచ్చుకుని తాను జాలరిదాననని, శరీరమంతా చేపలకంపుకొడుతూ ఉన్నదనీ, కన్యాత్వం కోల్పోయి తాను తండ్రి యింటికి వెళ్ళలేననీ, తనకు దోషమంటని విధంగా చేయమనీ ప్రార్థిస్తుంది. ముని ఆమె తన యిష్టంతీరిస్తే ఆమె కన్యాత్వం దూషితం కాదని,భయపడవద్దని బుజ్జగించి, ఆమె వసురాజు వీర్యంవల్ల పుట్టినది కాని బెస్తకులంలో పుట్టినది కాదని తెలియజేసి,ఆమె శరీరం యోజనపర్యంతం సుగంధం వెదజల్లేటట్లు అనుగ్రహిస్తాడు. అప్పటి నుండి ఆమెకు 'గంధవతి' అనీ 'యోజనగంధి'అనీ పేర్లు. ముని అనుగ్రహం వల్ల ఆమె దివ్యవస్త్రాలు, దివ్యాభరణాలు పొంది, యమునానదిలోని ఒక ద్వీపానికి ఓడచేర్చి, అందరూ చూస్తూండగా తమ సంగమమెట్లా సంభవమని ప్రశ్నిస్తుంది.ముని తన దివ్యశక్తితో కనుచూపుమేర చీకట్లు కమ్మేటట్లుచేసి తన వాంఛతీర్చుకుంటాడు. అతని మహిమవల్ల ఆమెకు సద్యోగర్భంలో సూర్యసమానతేజుడు, వేదమయుడు, సమస్త మునీశ్వరుల కారాధ్యుడైన వేదవ్యాసుడుదయిస్తాడు.నల్లని రూపం కలవాడై నందున, ద్వీపంలో పుట్టినందున కృష్ణద్వైపాయన నామంతో విఖ్యాతుడవుతాడు. పరాశరుడు సత్యవతి కోరిన వరాలిచ్చి వెళ్ళిపోతాడు.కుమారుడు ముని వేషధారియై తల్లిముందు నిలచి ఆమెకు పనిపడినప్పుడు స్మరించిన తక్షణం రాగలనని చెప్పి, తపోవనానికి వెళ్ళిపోతాడు.

---

ఆం. భా. 1.వ. ప.3వ.ఆశ్వా.ప.40

శంతనుడొకనాడు సత్యవతిని చూసి వలచి, ఆమెను తనకిమ్మని దాశరాజు నడుగుతాడు.తన కుమార్తె సంతానానికి రాజ్యార్హత కల్పించి నట్లయితే అది సాధ్యమవుతుందంటాడు దాశరాజు. తండ్రికోరిక తెలుసుకొన్న భీష్ముడు అది నెరవేరడంకోసం ఆ జన్మబ్రహ్మచారిగా ఉండిపోతాడు. శంతనుని వలన సత్యవతి విచిత్రవీర్య చిత్రాంగదులను కంటుంది. వివాహం కాకుండానే చిత్రాంగదుడు, సంతానం లేకుండానే విచిత్రవీర్యుడు మరణిస్తారు. బ్రహ్మమొదలుకొని అవిచ్ఛిన్నంగా కొనసాగుతూ వచ్చిన వంశం నశించకూడదని మరదండ్ర సంయోగంతో వంశవృద్ధి గావించమని సత్యవతి భీష్ముని కోరుతుంది.

"ఇక్కురు వంశంబున నీ,
వొక్కరుడవ యున్నవాడ వుర్వీరాజ్యం
బెక్కటి సేకొని తేజము,
దిక్కుల వెలిగింపు సంతతియు బడయు మొగిన్"

"నిరతంబు బ్రహ్మమొదలుగ,
వరుసన ఎడతెగక యిట్లు వచ్చిన వంశం
బురుభుజ నీ వుండగనీ,
తరమున విచ్ఛిన్నమగుట ధర్మువె యనినన్."

తన ప్రతిజ్ఞా భంగానికి భీష్ముడు నిరాకరిస్తాడు.ఉత్తమ క్షత్రియుల భార్యలకు ధర్మమార్గంలో బ్రాహ్మణుల వలన పుట్టి వంశకరులైన క్షత్రయులు అనేకులున్నారని, శంతనుని వంశాన్ని ఆ విధంగా వృద్ధిచేయవచ్చునని,బలి అనే రాజర్షి వృత్తాంతం వివరిస్తాడు. సత్యవతి తనకు కన్యాత్వం దూషితం కాకుండా పరాశరుని వలన వేదవ్యాసుడు జన్మించిన వృత్తాంతం భీష్మునితో చెప్పి, అతని అనుమతితో వ్యాసుడు తన ఆజ్ఞప్రకారం విచిత్యవీర్యుని భార్యలకు సంతానాన్ని ప్రసాదించగలడని చెబుతుంది. సర్వజగాన్నుత్పాదించిన ఆదిమబ్రహ్మకు గల సామర్థ్యం గల వేదవ్యాసుడు కురువంశాన్ని ప్రతిష్ఠించడం అందరికీ అభిమతమే నంటాడు భీష్ముడు.

తల్లి తనను తలచుకొన్నంతనే వ్యాసుడు ఆమె ముందు సాక్షాత్కరిస్తాడు. చాలాకాలానికి వచ్చిన ఆ ప్రథమ పుత్రుణ్ని సత్యవతి అవిరళభాష్పధారలతో, పయోధారలతో ఆలింగనం చేసుకొంటుంది. భీష్మునిచే అర్ఘ్యాది పూజలుగైకొని

సుఖాసీనుడైన వ్యాసుని కుశలమడిగి సత్యవతి "రాజ్యార్హుడు, వంశాన్ని నిల్పగలిగిన వాడైన భీష్ముడు తండ్రికోసం బ్రహ్మచర్యాన్ని స్వీకరించాడు. ఇప్పుడీ వంశవిచ్ఛేదం జరగకుండా, దేవరన్యాయం ప్రకారం నీ తమ్ముని భార్యలవలన సంతానం పొంది వంశం నెగిడేటట్లుగాచేసి, ప్రజలకు, భీష్మునికి, నాకు మనన్సులకు ప్రియంకల్గేటట్లు చేయి'' అని ఆజ్ఞాపిస్తుంది. వ్యాసుడందుకంగీకరించి ఒక్క సంవత్సరం తాను చెప్పిన వ్రతం చేస్తే కాశీరాజ పుత్రికలు శుద్ధాత్మలవుతారని, సత్పుత్రులు జన్మించగలరని చెబుతాడు. రాజ్యం అరాజకం కాకూడదని, వెంటనే పుత్రులను పొందమని, అరాజకమైన రాజ్యంలో ప్రజలు ధర్మాన్ని వదలివేస్తారని, దేవతలు మునులు తొలగిపోతారని, వర్షాలు కురవవని, పూజలు తరిగిపోతాయని, కాబట్టి ఆలస్యం చేయవద్దని చెబుతుంది."నీ దయవలన పుట్టినపుత్రులు పెద్దవారయ్యేవరకు భీష్ముడు రాజ్యభారం వహించగలడు.'' అని వ్యాసుని ఒప్పించి కోడళ్ళకు అతనివల్ల సంతానం కలిగేటట్లు చేస్తుంది. వాళ్ళే ధృతరాష్ట్ర, పాండురాజులు.కోడళ్ళదోషంవల్ల ధృతరాష్ట్రుడు పుట్టుగ్రుడ్డిగా పాండురాజు పాండుదేహంతో జన్మించినందున బాధపడిన సత్యవతి రూపవంతుడైన పుత్రుని అంబికకు ప్రసాదించమని మరల వేదవ్యాసుని ప్రార్థిస్తుంది.

గాంధారికి దుర్యోధనాది నూర్గురు పుత్రులు కల్గినపుడు వ్యాసుడు వారు భవిష్యత్తులో మహాదుర్మార్గులవుతారని, వారి మూలంగా పాండవులకు బాధలు కల్గుతాయని చెప్పి, అవన్నీ చూడకుండా తపోవనానికి వెళ్ళమని తల్లికి సలహాయిన్నాడు.

ఆ విధంగా సత్యవతి తన కోడళ్లైన అంబిక, అంబాలికలతో కలసి అరణ్యానికి వెళ్ళి, అతిఘోరమైన తపస్సు చేసి, స్వర్గస్థురాలవుతుంది.

## 18. ధరణి

సకల జగదుద్భవ నిమిత్తమై మొదట బ్రహ్మ వామాంగుష్ఠం నుండి ధరణి అనే స్త్రీపుట్టిందని వైశంపాయనుడు జనమేజయునికి సృష్టి క్రమాన్ని వివరిస్తున్న సందర్భంలో చెబుతాడు.

## 19-68. దక్షప్రజాపతి కుమార్తెలు.

దక్షుడు బ్రహ్మ దక్షిణాంగుష్ఠం నుండి పుట్టినాడు. ఇతనికి ఏభైమంది

కుమార్తెలు పుడతారు. వీరిలో కీర్తి, లక్ష్మి, ధృతి, మేధ, పుష్టి, శ్రద్ధ, క్రియ, బుద్ధి, లజ్జ, మతి, -అనే పది మందిని మనువు కిస్తాడు.అశ్వని మొదలైన ఇరవయ్యేడు మందిని చంద్రునకిస్తాడు.

అదితి, దితి, దను, కాల, అనాయు, సింహిక, ముని, కపిల, వినత, క్రోధ, ప్రాధ, క్రూర, కద్రువ, -అనే పదముగ్గురిని కశ్యపున కిస్తాడు.

అదితికి ద్వాదశాదిత్యులు, దితికి మహాబలవంతుడైన హిరణ్యకశ్యపుడు జన్మిస్తారు.

దనువనే ఆమెకు విప్రచిత్తి, శంబర, నముచి, పులోమ, అసిలోమ, కేశి, దుర్జయుడు, -మొదలైన నలభైమంది రాక్షసులు పుడతారు.

కాలకు వినాశన క్రోధాదు లెనిమిది మంది, అనాయుకు విక్షర, బల, వీర, వృతులనే నలుగురు పుత్రులు జన్మిస్తారు.

సింహికకు రాహువు, మునికి భీమసేనుడు, ఉగ్రసేనుడు, మొదలైన గంధర్వులు పదహారుమంది జన్మిస్తారు. కపిలకు అమృతము, గోగణము, బ్రాహ్మణులు, ఘృతాచీమేనకాదులైన అప్సరసలు పుడతారు.

వినతకు అనూరుడు, గరుడుడు పుడతారు.అనూరుని భార్య శేనికి సంపాతి, జటాయువు జన్మిస్తారు.

క్రోధకు క్రోధవశగణము, ప్రాధకు సిద్ధాదులు క్రూరకు సుచంద్ర, చంద్ర, హంత్రాదులు, కద్రువకు శేష, వాసుకీ ప్రముఖులైన 'నాగులు పుడతారు.

## 69బ్రహ్మమానస పుత్రి.

గుణాశ్రయ సిద్ధియోగ బ్రహ్మమానసపుత్రిగా జన్మిస్తుంది.

## 70-76. ప్రజాపతి భార్యలు.

దేవుడనే మనువు కుమారుడైన ప్రజాపతికి ధూమ్ర, బ్రహ్మవిద్య, మనస్విని, రత, శ్వస, శాండిలి, ప్రభాత, అనే ఏడుగురు భార్యలవుతారు.

ధూమ్రకు ధరుడు, బ్రహ్మవిద్యకు ధృవుడు, మనస్వినికి సోముడు, రతకు నహుడు, శ్వసకు అనిలుడు, శాండిలికి అగ్ని, ప్రభాతకు ప్రత్యూత, ప్రభాసులనే ఎనిమిదిమంది వసువులు పుడతారు.

సోముడనే వసువు భార్య మనోహరకు వర్చసుడు, శిశిరుడు, ప్రాణుడు, రమణుడనే నల్గురు కొడుకులతో బాటు 'పృథ'అనే కూతురు జన్మిస్తుంది.ఆమెకు జ్యోతి అనే కుమార్తె పుడుతుంది.అనిలుడనే వసువు భార్య శివకు మనోజవుడు, అవిజ్ఞాతగతి పుడతాడు.బృహస్పతి చెల్లెలైన యోగసిద్ధికి విశ్వకర్మ పుడతాడు.

ధర్ముడనే మనువు కుమారులు శమ, కామ, హర్షులనేవారికి ప్రాప్తి, రతి, నందలు భార్యలవుతారు.సవితృనికి, బడబారూపధారిణియైన త్వాష్ట్రికి అశ్వినులు పుడతారు.

బ్రహ్మకు ధాతవిధాతలతోబాటు లక్ష్మి పుడుతుంది. ఆమెకు ఎంతోమంది మానసపుత్రులు కల్గుతారు.వరుణునికి సుర అనే కూతురు, ఆమెకు అధర్ముడనే పుత్రుడు కల్గుతారు.

తామ్ర అనే స్త్రీకి కాకి, శ్యేని, భాసి, ధృతరాష్ట్రి, శుకి,-అనే అయిదుగురు కన్యలు పుడతారు.కాకికి ఉలూకములు, శ్యేనికి శ్యేనాలు,భాసికి భాస గృధ్రాదులు, ధృతరాష్ట్రికి హంసచక్రవాకాలు, శుకికి శుకాలు జన్మిస్తారు.

క్రోధుడనే వానికి మృగి, మృగమంద, హరి,భద్రమనస, మాతంగి, శార్దూలి, శ్వేత, సురభి, సురస, -అనే తొమ్మిదిమంది పుడతారు.

మృగికి మృగాలు, మృగమందకు ఎలుగుబంట్లు, చమర మృగాలు, భద్రమనసకు ఐరావణము, హరికి వానరగణాలు, మాతంగికి గజాలు, శార్దూలికి సింహవ్యాఘ్రాలు, శ్వేతకు దిగ్గజాలు, సురభికి రోహిణి,గంధర్వ,అనల అనేవారు పుడతారు.

రోహిణికి పశుగణాలు, గంధర్వికి గుఱ్ఱాలు,అనలకు పర్వతాలు, వృక్షాదులు, సురసకు సర్పాదులు పుట్టాయని- ఈ విధంగా సకల భూతాలు జన్మించాయని వైశంపాయనుడు జనమేజయునికి వివరిస్తాడు.

## దేవ దానవాద్యంశలచే భూమియందు పుట్టిన స్త్రీలక్రమము.

77. విష్ణుదేవుని అంశతో యాదవ వంశంలో పుట్టిన శ్రీకృష్ణుని తల్లి దేవకి.

### 78.రోహిణి.

వసుదేవుని మరొకభార్య రోహిణి.బలరాముని తల్లి. అనంతుడే బలరామునిగా రోహిణీగర్భజనితుడై రాక్షస సంహారియైనాడు.

### 79.రుక్మిణి.

లక్ష్మి అంశతో రుక్మిణి జన్మించి శ్రీకృష్ణునికి భార్య అవుతుంది.

## పదహారువేలమంది శ్రీకృష్ణుని అంతఃపుర స్త్రీలు

వీరు అప్సరసల అంశతో జన్మించినవారు.

### 80.గాంధారి.

ఈమె మతి అనే వేల్పు అంశవల్ల జన్మించింది.

### 81,82 కుంతి, మాద్రి.

సిద్ధి, బుద్ధి అనే దేవతలు కుంతీమాద్రులుగా జన్మించారు.

### 83.యాజ్ఞసేని.

ఈమె శ్రీమూర్తి.

### 84,85 యమున, తపతి.

వైవస్వతుడనే మనువు కుమార్తెలు

### 86.ఊర్వశి.

అప్సరస, పురూరవుని భార్య.

### 87.స్వర్భానవి.

పురూరవుని కుమారుడైన ఆయువు భార్య.నహుషాదుల తల్లి.

### 88.ప్రియంవద.

నహుషుని భార్య.

### 89,90 శర్మిష్ఠా దేవయానులు

రాక్షసకుల గురువైన శుక్రాచార్యుని కుమార్తె దేవయాని.దేవతల ప్రార్థనచే మృతసంజీవనీ విద్యను శుక్రునినుండి పొందగోరి వచ్చిన బృహస్పతి పుత్రుడైన కచుని ప్రేమిస్తుంది. అతడు శుక్రుని ప్రియశిష్యుడు కావడం సహింపలేక రాక్షసులు అడవిలో హోమధేనువులు కాస్తున్న కచుని చంపి, ఒక తాటిచెట్టుకు కట్టివేస్తారు.

సాయంకాలమైనా కచుడింటికి రాకపోయేసరికి దేవయాని తండ్రివద్దకు వెళ్ళి "కచుడు అడవిలో ఏ క్రూరమృగాల చేతనో,రాక్షసలచేతనో లేక పాములచేతనో బాధింపబడినాడేమో,ఇంత ప్రొద్దుపోయినా యింటికి రాలేదు."అని బాధపడుతుంది.

శుక్రుడు తన దివ్యదృష్టితో రాక్షసులచే వధింపబడిన కచుని కన్గొని, అతణ్ణి తీసికొని రమ్మని మృతసంజీవనిని పంపుతాడు. పునర్జీవితుడై వచ్చిన కచుని చూసి దేవయాని సంతోషిస్తుంది.

ఇంకొకసారి అడవిలో పువ్వులు తేవడం కోసం వెళ్ళిన కచుని చంపి, దహించి, అతని బూడిదను సురలో కలిపి రాక్షసులు శుక్రునిచేత త్రాగిస్తారు.వెనుకటి వలెనే దేవయాని కచుడు రాలేదని దుఃఖిస్తుంది."నేను సంజీవనితో బ్రతికించినా రాక్షసులు పగతో అతణ్ణి చంపకమానరు.అతడు పుణ్యలోకానికి (స్వర్గానికి) వెళతాడు. నీకు విచారింపవలసిన పని ఏమి?"అంటాడు.

అంగిరసుని మనుమడు, మనకాశ్రితుడు, బృహస్పతి పుత్రుడు, మీ ప్రియశిష్యుడు, రూపసి, బ్రహ్మచర్యవ్రతసంపన్నుడైన కచుడు అకారణంగా రాక్షసులచే చంపబడితే నేను దుఃఖించకుండా ఎట్లా ఉండగలను?అతణ్ణి చూచి కాని భోజనం చేయను"అని యేడుస్తుంది.చాలాసేపటికి శుక్రుడు ప్రసన్నుడై తన యోగదృష్టితో జరిగినది తెలుసుకొని తన ఉదరంలోఉన్న కచుణ్ణి బ్రతికిస్తాడు."నీ వల్ల శరీరాన్ని, ప్రాణాన్ని, శక్తిని పొందగల్గినాను.నీ ఉదరం నుండి బయటపడేమార్గం ఉపదేశించు" అన్న కచుని ప్రార్థన విని,తన పొట్టచీల్చుకొని తప్ప కచుడు బయటపడ లేడని,తనను పునర్జీవితుణ్ణి చేయమని కచునికి మృతసంజీవనిని ఉపదేశిస్తాడు.

ఈ విధంగా మృతసంజీవనీ విద్యనుపొంది, చాలా కాలంశుక్రుని శుశ్రూష చేసి,అతని అనుజ్ఞతో దేవలోకానికి ప్రయాణమైన కచుడు దేవయానివద్ద వీడ్కోలు పొందడానికి వస్తాడు.అతని వియోగాన్ని సహింపలేని దేవయాని

"నీవును బ్రహ్మచారివి వినీతుడ వేనును గన్యకన్ మహీ,
దేవకులావతంస రవితేజ వివాహము నీకు నాకు మున్
భావజుశక్తి నైనయది పన్నుగ నన్ను బరిగ్రహింపుసం,
జీవనితోడ శుక్రుదయ జేయుము నాకు బ్రియంబునావుడున్"[1]

అని తనను వివాహంచేసికొమ్మని కోరుతుంది.గురుపుత్రియైన ఆమె తనకు సోదరితో సమానమని,లోక నింద్యమైన ఇటువంటి ప్రస్తావన తగదని కచుడు తనను మందలించి, తిరస్కరించగా ఆగ్రహించిన దేవయాని అతనికి

1. ఆది ప. 3వ. ఆ. ప 129

మృతసంజీవనీ విద్య పనిచేయదని శపిస్తుంది.

"ధర్మవిరోధంగా తలచినావు కాబట్టి నిన్ను బ్రాహ్మణుడు వివాహమాడ కుండుగాక!" అని కచుడు ఆమెకు ప్రతిశాపమిస్తాడు.

రాక్షసరాజు వృషపర్వుని కుమార్తె శర్మిష్ఠ.ఒకనాడు చెలికత్తెలతో దేవయానితో వన విహారానికి వెళ్తుంది. సరోవర తీరంలో తమతమ వస్త్రాలనుంచి, అందరూ జలక్రీడలాడతారు. తొందరలో శర్మిష్ఠ దేవయాని బట్టలు కట్టుకుంటుంది. శర్మిష్ఠ దుస్తులు ధరించడానికి దేవయాని అసహ్యించుకుంటుంది."లోకోత్తర చరితుడైన శుక్రుని కుమార్తెను. భూసురకన్యను-నీకారాధ్యను. నీవు కట్టినమైలబట్టలు నేనెలా ధరింపగలను?" అంటుంది.

"మాయయ్యకు బాయకపని,
సేయుచు దీవించి ప్రియము సేయుచు నుండున్
మీయయ్యయేటి మహిమలు,
నాయొద్దనె పలుక నీకు నానయులేదే"[2]

అని శర్మిష్ఠ ఎత్తిపొడుస్తుంది.పైగా "నేను కట్టిన బట్టలు నీవు కట్టడానికి పనికి రావా?" అని గర్వంతో ఎగ్గులాడి దేవయానిని ఒకనూతిలో త్రోసివేసి చెలులతో కలసి వెళ్ళిపోతుంది.

ఆ తర్వాత ఆదారిన వచ్చిన యయాతి మహారాజు నీటికోసం ఆబావి వద్దకువచ్చి, బావిలో కన్నీరునించుతూ వరుణుని దేవియా అన్నట్లున్న దేవయానిని "నీ వెవ్వరవు?ఈ అడవిలో ఇలా ఒంటరిగా బావిలో ఉండడానికి కారణం ఏమిటి?" అని ప్రశ్నిస్తాడు.

ఇంతకు ముందేతాను యయాతిని చూచి ఉండడంచేత దేవయాని అతనిని గుర్తించి "దేవదానవ యుద్ధంలో దేవతలచేత నిర్జింపబడిన రాక్షసులను తనవిద్యచేత పునర్జీవితులను చేసిన అమితశక్తిమంతుడైన శుక్రుని కుమార్తెను.ప్రమాదవశాత్తు ఈ బావిలో పడిన నన్ను ఉద్ధరించి కాపాడు" అని ప్రార్థిస్తుంది.

తన చేయూతతో ఆమెను బయటకులాగి, యయాతి తన పట్టణానికి వెళ్ళిపోతాడు. తనను వెదక వచ్చిన పరిచారికతో తానిక వృషపర్వుని పురంలో అడుగు పెట్టనని తండ్రికి చెప్పి పంపుతుంది.తక్షణమక్కడకి వచ్చిన శుక్రుడు

---

ఆది. ప. 3వ. ఆ. ప. 137

కుమార్తెకు హితవు చెప్పి, బుద్ధిమంతులకు క్రోధంతగదని, రాజకుమార్తెయైన శర్మిష్ఠ చేసినదాన్ని పట్టించుకోవద్దని అంటాడు.

వివేక శూన్యులైన వారివద్ద ఉండడంకంటే వేరొక కష్టం ఉండబోదని, తానింకెక్కడికైనా వెళ్ళిపోతానని దేవయాని మొండికేస్తుంది. తానూ ఆమెతోబాటు వస్తానంటాడు శుక్రుడు. సంగతి తెలిసిన వృషపర్వుడక్కడకి వచ్చి ఎంతో వినయంతో శుక్రుని ప్రార్థించి తన సమస్తమూ అతనిదేనని, దేవయానికేది ప్రియమో దాన్ని చేస్తానని అంటాడు. వేయిమంది కన్యలతో శర్మిష్ఠ తనకు దాసి కావాలని ఆమె కోరిందే తడవుగా కుమార్తెను కన్యకాసహస్రంతో దేవయానికి దాసిగా సమర్పించి శుక్రుని కానందంకల్గిస్తాడు. తండ్రి ఆజ్ఞకు ఎదురుచెప్పక శర్మిష్ఠ తక్కినవారితో కలసి నిత్యం దేవయానిని సేవిస్తూ ఉంటుంది.

ఒకరో దేవయాని వాళ్ళందరితో కలసి వనవిహారానికి వెళ్ళి,అక్కడ యయాతిని పుష్పాలతో అతనిని పూజిస్తుంది.అతడు దేవయానిని ఎఱిగిన వాడైనా అతిశయ రూపలావణ్యాలతొ ప్రకాశిస్తున్న శర్మిష్ఠను తెలుసుకొగోరి "మీరెవ్వరు? మీ కుల గోత్ర నామాలేమి?" అని ప్రశ్నిస్తాడు.

"నన్ను ఇంతకుముందే ఎఱుగుదువు.ఈమె నాకు దాసి,వృషపర్వుని కుమార్తె.శర్మిష్ఠ.నన్నెప్పుడూ విడువక సేవిస్తూ ఉంటుంది. నీ కుడి చేతితో నా దక్షిణ హస్తాన్ని పట్టి నన్ను బావినుండి బయటకు తీసినప్పుడే మన పాణిగ్రహణం జరిగి పోయింది. అది నీవు మరచిపోవడం న్యాయమా? నన్ను వివాహమాడి యీ కన్యలందరూ నిన్ను సేవిస్తూ ఉండగా దేవేంద్ర సమానమైప భోగాలనేకం అనుభవించు" అని దేవయాని పలుకగా "బ్రాహ్మణులు క్షత్రియ కన్యను వివాహం చేసుకోవడం లోకంలో జరుగుతున్నదే. కాని క్షత్రియులు బ్రాహ్మణ కన్యలను వివాహమాడడం ఎక్కడైనాఉందా ?వర్ణాశ్రమ ధర్మాలు సంకరం కాకుండా రక్షిస్తున్న నేనే ఇటువంటి అధర్మాని కొడిగట్టితే జగత్ప్రవృత్తి విపరీతం అవుతుంది"అంటాడు యయాతి.

. ధర్మాధర్మాలు నడుపుతూ నిఖిలలోక పూజ్యుడైన నా తండ్రి ఆజ్ఞాపిస్తే నన్ను పరిణయమాడతావా?అని దేవయాని అతని అంగీకారంతో తన తండ్రిని రప్పిస్తుంది.

"ఇతడు పట్టిన ఈ చేయి ఇతరుల కర్హమైనదికాదు.నాకీ జన్మకితడే భర్త. నీవనుగ్రహిస్తే నన్ను వివాహమాడగలడు. ధర్మవిరోధం లేకుండా చేయ"మన్న కుమార్తె ప్రార్థననుమన్నించి శుక్రుడు అపక్రమ దోషంలేకుండా వరమిచ్చి,వారి

వివాహం చేస్తాడు. శర్మిష్ఠను యయాతికి చూపి "వృషపర్వుని కుమార్తెయైన ఈమెను అన్నపానభూషణమాల్యాదులైన సమస్త విషయాలలో సంతోషపరచు. ఒక్క శయన విషయంలో పరిహరించు"అని కట్టడి చేస్తాడు.

దేవయాని యయాతితో ఇష్టోపభోగాలు అనుభవిస్తూ యదుతుర్వసులనే కొడుకులను కంటుంది.

యౌవనవతి, ఋతుమతి అయిన శర్మిష్ఠ "ఈ యౌవన సంపద అంతా దుర్గమారణ్యాలలో వికసించిన పుష్పసంపద వలె భర్తలేకపోవడంచేత వ్యర్థం కావలసిందేనా? ఏ తపస్సు చేసి దేవయాని భర్తను పొందిందో కదా? భర్తను పొంది అతనివల్ల సంతానం పొందాలని స్త్రీలు కాంక్షిస్తారు. తాను కోరిన పతిని పొంది, పుత్రవతియైన ఈ దేవయాని భాగ్యంసాటి లేనిది. నా హృదయం ఎప్పుడూ యీ యయాతి మీదేలగ్నమై ఉంటుంది.అతడూ నన్ను ప్రీతితో చూస్తూఉంటాడు.కోరి దేవయాని ఇతణ్ణి పతిగా చేసుకొన్నట్లు నేను ఈ నహుషాత్మజుణ్ణి భర్తగా పొందుతాను" అని నిశ్చయించుకొని, ఒకనాడు యయాతి అశోకవనం చూడటానికివచ్చి ఒంటరిగా ఉన్న సమయంచూచి, అతడు తన పట్లప్రసన్నంగా ఉండడం గమనించి, చేతులు జోడించి,

'నీలగళోపమాన కమనీయ గుణోన్నతి జెప్పజాలున,
న్నేలిన దేవయానికి నరేశ్వర భర్తవుగాన నాకునుం
బోలగ నీవ భర్తవిది భూనుత ధర్మపథంబు నిక్కువం,
బాలును దాసియున్ సుతుడు నన్నవి వాయని ధర్మముల్ మహిన్"[1]

"అద్దేవయానిం బరిగ్రహించినప్పుడ తద్ధనంబగుట నేనును భవత్పరిగ్రహంబ కావున నన్నుంగరుణించి నాకు ఋతుకాలోచితంబు ప్రసాదింపవలయును."

"నా యజమానురాలైన దేవయాని భర్తవైన నీవునాకూ భర్తవే.ఇది ధర్మమార్గం. కాబట్టి నన్ను పరిగ్రహించి ఋతుమతినైన నన్నునుగ్రహించు"[2] అన్న శర్మిష్ఠతో శుక్రుడు చేసిన నియమాన్ని యయాతి గుర్తుచేసి, వాగ్దానభంగం చేయజాలనంటాడు.

ప్రాణాలకు ఆపద కల్గినప్పుడు, సమస్త ధనం అపహరింపబడినప్పుడు, వధింపబడబోతున్న బ్రాహ్మణుని విషయంలో, వధూజన సంగమంలో, వివాహ

1. ఆది. తృతీయ. ఆ. ప.174.   2. ఆదే. ప. 175

సమాయాల్లో -ఈ అయిదు సందర్భాలలో బొంకినా అసత్యదోషంలేదని మునివచన ప్రమాణ మున్నది. నీవు వివాహసమయంలో ఒడబడినావు కాబట్టి అసత్యదోషం నిన్ను అంటదు" అని శర్మిష్ఠ యయాతి తనను స్వీకరించేటట్లు చేసుకొని అతని వలన పుత్రుని కంటుంది.

శర్మిష్ఠ పుత్రవతి అయిన విషయం తెలిసి దేవయాని ఆశ్చర్యంతో "ఎంతో శీలవంతురాలవు, వినయం, గౌరవం కల్గి నిర్వికారంగా ఉండే నీకు పుత్రుడు కల్గడం ఆశ్చర్యకరంగా ఉంది" అంటుంది. శర్మిష్ఠ సిగ్గుతో తలదించుకొని "వేద వేదాంగపారగుడైన ఒక మహాముని వచ్చినాకు పుత్రుని ప్రసాదించి"నాడంటుంది. దేవయాని నమ్ముతుంది.

యయాతి వలన శర్మిష్ఠ ద్రుహ్యానుపూరులనే ముగ్గురు పుత్రులను పొందుతుంది. అగ్నులలాగ ప్రకాశిస్తూ ముమ్మూర్తులా తండ్రినిపోలి, అతని వద్ద ఆడుకొ[illegible]న్న ఆ పసివాళ్ళను చూసి,దేవయాని "వీరెవరి కుమారులని యయాతి నడిగి జవాబురాక వారినే 'మీ తండ్రిఎవ్వ'రని ప్రశ్నిస్తుంది. వారి వలన నిజం తెలుసుకొని, తనకు తెలియకుండా యయాతి శర్మిష్ఠ వలన సంతానం పొందినందుకు కోపంతో, దుఃఖంతో కుమిలిపోతూ వెళ్ళి తండ్రిపాదాలను కన్నీటితో కడుగుతూ విషయం వివరిస్తుంది. యయాతి కూడా ఆమె వెనుకనే వెళ్ళి శుక్రునికి నమస్కరిస్తాడు. "గర్వంతో రాగాంధుడవై నీవు నా కుమార్తెకప్రియం చేసినావు కాబట్టి జరాభార పీడితుడవుక"మ్మని శుక్రుడు యయాతిని శపిస్తాడు.

తనకు దేవయాని వలన విషయోపభోగతృప్తి కలుగలేదని,తాను జరాభారం దాల్చలేనని యయాతి ప్రార్థించగా శుక్రుడు కరుణించి "నీ ముసలితనం నీ కొడుకులలో ఒకనికిచ్చి, వాని యౌవనాన్ని నీవు స్వీకరించి, నీకు విషయోపభోగతృప్తి కల్గినపిమ్మట నీ ముదిమి నీవు గ్రహించి, వాని యౌవనాన్ని వానికిచ్చివేయి.వాడే నీ రాజ్యానికర్హుడు. వంశకర్త అవుతాడు"అని అనుగ్రహిస్తాడు.

శర్మిష్ఠ పుత్రుడైన పూరుడు తండ్రికోరికను మన్నిస్తాడు. యయాతి నవయౌవనుడై వేయి సంవత్సరాలు ఇష్టసుఖాలననుభవించి, పూరుని యౌవనాన్ని తిరిగి ఇచ్చివేసి అతణ్ణి తన సామ్రాజ్యానికి చక్రవర్తిని చేస్తాడు.

శర్మిష్ఠా దేవయానుల తర్వాత ఆ వంశంలోని స్త్రీల పేర్లు మాత్రమే పేర్కొనబడినాయి.

**91.కౌసల్య**

పూరుని భార్య.జనమేజయుడనేవాని తల్లి.

**92.అనంత**

జనమేజయుని భార్య.ప్రాచిన్వంతుని తల్లి.ప్రాచీశుడని విఖ్యాతుడు.

**93.అశ్మకి**

ప్రాచీశుని భార్య.

**94.వరాంగి**

సంయాతి భార్య.

**95.భానుమతి**

అహంయాతి భార్య.

**96.సునంద.**

సార్వభౌముని భార్య.

**97.సుశ్రవస**

జయత్సేనుని భార్య.

**98.మర్యాద**

అవాచీనుని భార్య.

**99.ఆంగి**

అరిహుని భార్య.

**100 సుపుష్ట**

మహాభౌముని భార్య

**101.కామ**

అయుతానీకుని భార్య.

**102.రంభ**

అక్రోధనుని భార్య.

**103.మర్యాద**

దేవాతిథి భార్య

**104 సుదేవ**

ఋచీకుని భార్య

**105.జ్వాల**

ఋక్షుని భార్య

**106 సరస్వతి**

మతినారుని భార్య

**107కాళింది.**

త్రసుని భార్య

**108 రథంతరి**

ఇలలుని భార్య రథంతరి. దుష్యంతుని తల్లి

## 109 మేనక

అప్సరస,ఇంద్రుని కోరికపై తపోనిష్ఠలో ఉన్న విశ్వామిత్రుని తన హావభావ విలాసాలతో వశపరచుకొంటుంది.మొదట ఇంద్రుని ఆజ్ఞవినగానే మేనక భయపడు తుంది."నీవు మొదలుకొని దేవతలంతా ఆ ఉగ్రకోపస్వభావికి భయపడతారు. వశిష్ఠునికి పుత్రశోకం కల్గించినవాడతడు. అతడు కోపంతో చూస్తేచాలు భూమి, పర్వతాలు, బ్రద్దలవుతాయి.సప్తసముద్రాలింకిపోతాయి గాలి స్తంభించి పోతుంది. ముల్లోకాలు గిర్రునతిరుగుతాయి.అట్టి కోపస్వభావుని వద్దకుస్త్రీలు వెళ్ళడానికి భయపడరా? అయినా మీ ఆజ్ఞప్రకారం నా నేర్పుకొద్దీ ప్రయత్నిస్తాను.అని భయంతో వచ్చినే మేనక తన సౌందర్యంతో అనురాగంతో విశ్వామిత్రుని లోబరచుకొని అతనిని

తపోభ్రష్టుని చేసి, అతనితో కొంతకాలం కాపురం చేస్తుంది. వారిద్దరికీ ఒక బాలిక జన్మిస్తుంది. పుట్టిన శిశువును మాలినీ నదీతీరంలో ఉంచి మేనక దేవలోకానికి వెళ్ళిపోతుంది విశ్వామిత్రుడు తిరిగి తపోవనానికి వెళ్ళిపోతాడు.

## 110.శకుంతల

వేట నిమిత్తమై అరణ్యానికి వచ్చిన దుష్యంత మహారాజు కణ్వాశ్రమాన్ని చూచి, మునికి నమస్కరించి రావాలన్న తలంపుతో ఆశ్రమంలో ప్రవేశించి, అమిత సౌందర్యరాశియైన శకుంతలను చూచి, ఆమెచే అర్ఘ్యపాద్యాది విధులచే పూజింపబడి కుశలమడుగుతాడు.

తన తండ్రిపండ్లు తేవడానికై అరణ్యానికి వెళ్ళినాడని,ఆయన వచ్చేవరకు ముహూర్తకాలం విశ్రమించమని శకుంతల వినయంగా చెబుతుంది.ఆమె మృదు మధుర వచనాలకు, సర్వశుభలక్షణసంపన్నమైన ఆమె రూపలావణ్యాలకు ముగ్ధుడైన దుష్యంతుడు ఆమె పుట్టుపూర్వోత్తరాలడుగుతాడు.

ఆమె మునికన్యనని చెప్పగా "మహానిష్ఠాగరిష్ఠుడు, పరమ పవిత్రుడైన కణ్వునికి నీవు కుమార్తె వెట్లయితి"వని రాజు ప్రశ్నిస్తాడు. శకుంతల తన జన్మవృత్తాంతం వివరిస్తుంది.

మాలినీనదీతీరంలో మేనకచే వదలివేయబడిన శిశువును క్రూరమృగాలు భక్షించకుండా తమరెక్కలచే కప్పి,శకుంతపక్షులు సంరక్షించడంచూసిన కణ్వమహర్షి అత్యంత కాంతిమతియై భూలోకంలో అవతరించిన చంద్రరేఖయా అన్నట్లున్న ఆ పసిబిడ్డను తీసుకొనివచ్చి,శకుంతల అని పేరుపెట్టి, ఎంతోగారాబంగా పెంచినాడని, ఈ గాథ కణ్వుడు తోటిమునీంద్రులకు చెబుతుండగా తాను విన్నానని శకుంతల చెబుతుంది.

ఆమె క్షత్రియకన్య అని తెలియగానే దుష్యంతుడు మన్మథపరవశుడై "ఈ నారచీరలు, అడవిలోని కాయకసురులు ఈ పర్ణకుటీరాలు, నీ ఉజ్వలరూప కాంతులకు, నిర్మలగుణాలకు తగినవి కావు.ఈ ముని పల్లెలో నుండనేల? నాకు భార్యవై అంతులేని రాజ్యలక్ష్మీవైభవాన్ని అనుభవించు. స్వర్ణ సౌధాలలో విహరించు. బ్రాహ్మము,దైవము,అర్షము, ప్రాజావత్యము, రాక్షసము, ఆసురము, గాంధర్వము,పైశాచము-అనే అష్టవిధ వివాహాలలో గాంధర్వరాక్షసాలు సక్షత్రియులకు తగినవి ధర్మయుతంగానే నీకూ నాకూపరస్పర ప్రేమను మన్మథుడు

పెంపొంది వస్తున్నాడు.ఇంక ఆలస్యం దేనికి?నన్ను గాంధర్వవిధిన స్వీకరించు''అనగా శకుంతల లజ్జావరవశయై తలవంచుకొని "ధర్మస్వరూపుడు, కరుణానిరతుడైన నా తండ్రి త్వరలోనే వస్తారు. వారునన్ను నీకిచ్చినట్లయితే పాణిగ్రహణంచేయి"అంటుంది.

కన్యతానే తనకు చుట్టము, గతి, తనను యీయడానికి కర్తా కాబట్టి గాంధర్వం నిగూఢం అమంత్రకం అని చెప్పి దుష్యంతుడు శకుంతలను సమ్మతింప జేసినాడు. నీవల్ల నాకు కల్గిన కుమారునికి యౌవరాజ్యపట్టాభిషేకం చేస్తానంటేనే నీకు నాకూ సంగమ మవుతుం"దని నిక్కచ్చిగా చెబుతుంది శకుంతల.

సంతోషంగా ఆమె కోరినవరాలిచ్చి,ఆమెను గాంధర్వ వివాహంచేసుకొని, కోరిన సుఖాలనుభవించి వీడ్కోలు తీసుకొంటూ "నా ప్రధానుల వర్గాన్ని నిన్ను తీసుకొని రావడానికై కణ్వమహాముని వద్దకు పంపుతాను"అని పలికి ఆమె నూరడించి, దుష్యంతుడు తన రాజధానికి వెళ్ళిపోతాడు.తండ్రి వచ్చి తాను చేసినపనికి ఎంతో ఆగ్రహిస్తాడని భయపడుతున్న శకుంతల వాలకం లలితశృంగారభావంతో తలవంచుకున్న తీరు చూసి, కణ్వుడు తన దివ్యజ్ఞానంతో సర్వం తెలుసుకొంటాడు క్షత్రియురాలైన శకుంతలకు గాంధర్వం విధిచోదితమేనని సంతోషించి, "తల్లీ, నీ కులగోత్ర సౌందర్యాలకు తగిన పతినేవరించావు. నీకు గర్భమైనది. నీ గర్భంలో ఉన్నవాడు సకల భూమండల భారాన్ని భరించగల చక్రవర్తి సుమా! నీ ధర్మచరిత్రకు సంతోషించాను. నీ యిష్టంవచ్చిన వరంకోరుకో" అంటాడు.

"నా మనస్సెప్పుడూ ధర్మంమీదే నిలిచిఉండాలి.నాకు జన్మించే కుమారుడు దీర్ఘాయురారోగ్య ఐశ్వర్యబల సమన్వితుడు,వంశకర్త కావాలి"అని కోరిన శకుంతలను కణ్వుడట్లే అనుగ్రహించి,తగిన విధంగా గర్భకాలోచిత సంస్కారాలను జరిపిస్తాడు. మూడేండ్లు నిండగా శకుంతలకు కుమారుడు జన్మిస్తాడు. ఆ బాలునికి జాతకర్మాదులు నిర్వర్తించి,భరతుడని నామకరణంచేసి, కణ్వమహర్షి అల్లారుముద్దుగా పెంచుతూ ఉంటాడు.దీర్ఘబాహువులతో,చక్రవర్తి లక్షణాలతో శోభిస్తున్న భరతుడు మహాసత్త్వసంపన్నుడై క్రూరారణ్యాల్లో సంచరించే సింహ,శరభ,శార్దూలాదులను మదమత్తేభాలను తెచ్చి కణ్వాశ్రమ సమీపంలోని చెట్లకు కట్టివేస్తూ మదమత్తేభాలపై స్వారీచేస్తూ, వివిధ శైశవ క్రీడలతో విహరిస్తూ ఉంటాడు. ఆ బాలుని చూసి అక్కడ మునులందరూ ఆశ్చర్యపోయి సర్వదమనుడని పిలుస్తారు.

కణ్వుడు ఆ బాలుని "ఉదార తేజోరూప విక్రమ గుణంబులకు సంతసిల్లి, "వీడఖిల భువన యౌవరాజ్యాభిషేకంబునకు సమర్థుండగు సమయంబరుగుదెంచె" నని విచారించి శకుంతలతో

"ఎట్టి సాధ్వులకును బుట్టిన యిండ్లను
బెద్దకాల మునికి తద్ద తగదు
పతుల కడన యునికి సతులకు ధర్మువు
పతులకేడుగడయు బతులచూవె"

"అమ్మా,ఎంతటి పతివ్రతలైనా పుట్టినింట్లో చాలాకాలం ఉండకూడదు. భర్తవద్ద ఉండడమే భార్యకు ధర్మం.భర్తయే భార్యకు ఏడుగడ. (తల్లి,తండ్రి, గురువు, దైవం,సఖుడు, ప్రియుడు,ప్రభువు) కాబట్టి నీవు నీ కుమారునితో నీ భర్తవద్దకు వెళ్ళమని తపోధనులైన తన శిష్యులను తోడిచ్చి పంపుతాడు.

సకల సామంత మంత్రి పురోహిత పౌరజన పరివృతుడై ఉన్న దుష్యంతుని సభకు వెళ్ళిన శకుంతల అతడు తననెరుగని వానివలె చూడడంచూసి ఆశ్చర్య పోతుంది. నాడు ఆశ్రమంలో అపారమైన ప్రేమాదరాలను,కరుణను, అనుగ్రహాన్ని, సంభ్రమాన్ని,అనురాగాన్నిచూపిన భర్తతననావిధంగా అపరిచిత స్త్రీలాగా చూడడం చూసి నన్నెరుగడా? తెలిసీ తెలియనట్లు నటిస్తున్నాడా? చాలాకాలం కావడంచేత మరచిపోయినాడా, రాజులు ముగ్ధులు,బహుకార్యమగ్నులు కదా!

"తలపగనాడు వల్కినవిధం బెడదప్పగవీడెనొక్కొచూ
డ్కులువిరసంబులై కరముక్రూరములైన నిమిత్తమేమియో
కలియగ బల్కరించి రుపకారులు నైరని నమ్మియుండగా,
వలవదు బుద్ధిమంతులు నవప్రియులైన ధరాధినాథులన్"[1]

"మరచిన తలపింపగ నగు
నెఱుగని వాడెల్లపాట్ల నెఱిగింపనగున్
మఱి యెఱిగి యెఱుగనొల్లని
కరటిం దెలుపంగ గమలగర్భుని వశమే"[2]

ఆనాడు నాకుచేసిన వాగ్దానాన్ని పాటించడు కాబోలు! చూపులు చాలా

1. ఆది. చతు ఆ . ప. 69 2. అదే. ప. 70

విరసంగా, క్రూరంగా ఉన్నాయి. కారణమేమోతెలియదు. బుద్ధిమంతులు చక్కగా పల్కరించినారని, ఉపకారంచేసినారని, రాజులను నమ్మకూడదు. వారెప్పుడూ నూతనత్వాన్ని, కాంక్షిస్తారు.మరచిపోతే తెలియజేయవచ్చును.తెలిసీ తెలియని వాని వలె నటించే వానికి తెలియజెప్పడం బ్రహ్మదేవునికైనా సాధ్యంకాదు.అయినా వచ్చి ఊరికే వెళ్ళకూడదు.నా పూర్వవృత్తాంతం తెలియజేసి,నా కుమారుని చూపిస్తాను.అని నిశ్చయించుకొని శకుంతల దుష్యంతునితో "రాజా! వేట నెపంతో కణ్వాశ్రమానికి వచ్చి,సంతోషంతో నన్ను స్వీకరించి, నా కిచ్చిన వరాన్ని గుర్తుచేసికో. బాలసూర్యునితో సమానమైన తేజోరాశియైన యీ బాలుడు నీ కుమారుడు. పౌరవకులరత్నమైన వీణ్ణియువరాజుగా అభిషేకించు" అంటుంది.

ఆమె పలుకులు వాస్తవమని తెలిసీ దుష్యంతుడు తెలియని వానిలాగా "నిన్ను నేనెరుగను. ఎక్కడిదానవు? అనుచితాలైన మాటలు కట్టిపెట్టి వచ్చిన దారినే వెళ్ళు" అంటాడు. ఆ మాటలకు తెల్లబోయిన శకుంతల నిశ్చేష్టురాలై, కోపంతో ఎఱ్ఱబడిన కన్నుల నుండి బాష్పధారలు స్రవిస్తుండగా తలవంచుకొని,తన హృదయ తాపాన్ని ఎలాగో తనకు తానే ఉపశమింపజేసుకొని రాజును చూస్తూ ఇట్లా ఉపన్యసిస్తుంది-

"ఏమీ తెలియని యీ సభలోని వారిలాగా తెలిసీ నీ వెందుకిట్లా మాట్లాడుతున్నావు? నాకు తప్ప సత్యం ఇంకెవ్వరికి తెలియదు కదా అని ధార్మికులైనవారు తప్పుగా పలుక వచ్చునా, ఓ విమలయశోనిధీ! వేదాలు, పంచ భూతాలు, ధర్మము, సంధ్యలు, అంతరాత్మ, యముడు, సూర్యచంద్రులు, రాత్రింబవళ్ళు, - అనే యీ మహాపదార్థాలన్నీ పురుషుని వృత్తాంతాన్ని గమనిస్తూనే ఉంటాయి. మానవుడు వీటన్నిటి కన్నుగప్పి తనను తాను వంచించుకోజాలడు. నీవు నా కిచ్చిన వరం ఈ మహాపదార్థాలన్నీ ఎఱుగును. నన్ను తిరస్కరించ తగదు. పూర్వం లాగా నన్నునుగ్రహించు.

భార్య, గుణవతి, పుత్రవతి,తననే అనుసరించేది అయిన స్త్రీని తిరస్కరించే వాడికి ఇహపరలోకాలు రెండూ ఉండవు. అనుకూలవతియైన భార్యగలవాడు నిరంతరం గృహమేధి ఫలాన్ని పొందగలడు. క్రియావంతుడు,నిగ్రహపరుడు, పుత్రవంతుడు కాగలడు. అంతేకాదు, భార్య పురుషునికి ధర్మార్థకామసాధనకు ఉపకరణం. గృహనీతి విద్యకు నిలయం. స్వచ్ఛమైన నడవడిని గూర్చి శిక్షణనిచ్చే ఆచార్యురాలు.వంశస్థితికి మూలం.సద్గతికి ఆధారం.గౌరవానికి ఏకైక కారణం. ఉన్నతమైన స్థిరమైన,గుణరత్నాలకు నెలవు.భర్త హృదయానికి సంతోషం కల్గించేది

భార్య మాత్రమే. ఇతరములైనవేవీ అతనికి ప్రియాన్ని కల్గించలేవు.ఎంతటి క్లిష్టసమస్యలలో, ఆపదలలో చిక్కుకున్నా, భార్యాపుత్రులను చూడగానే పురుషుల చింతలన్నీ పటాపంచలవుతాయి.

భార్య పురుషునిలో సగభాగం.అందువల్ల భర్త కంటె ముందుగా మరణించిన పతివ్రత పరలోకంలో తన భర్తను కలుసుకోవడం కోసమై అతని రాకకై నిరీక్షిస్తూ ఉంటుంది. ఒకవేళ భర్త తనకంటే ముందుగా పరలోక గతుడైతే తానూ అతన్ని కలుసుకోవడం కోసమై సహగమనం చేస్తుంది. అట్టి భార్యను అవమానించడం తగదు. అది అధర్మం. పురుషుడు భార్య గర్భంలో తానే పుత్రుడుగా ఉద్భవిస్తాడు. "అంగాదంగాత్సంభవసి" అన్న వేదవచనం ప్రకారం తండ్రికీ కుమారునికీ భేదం లేదు. గార్హపత్యమనే అగ్నియే ఆహవనీయమై వెలుగునట్లుగా తండ్రే స్వీయకాంతితో పుత్రునిగా వెలుగొందుతున్నాడు.

నీళ్ళలో తన ప్రతిబింబాన్ని చూసినంత స్పష్టంగా తన కుమారుని చూసి తండ్రి మహదానందాన్ని అనుభవిస్తాడు ఇంకా "పున్నామ్నో నరకాత్త్రాయత ఇతి పుత్ర" అనే వేదవచనం ప్రకారం పుణ్యాచారుడైన పుత్రుడు తల్లిదండ్రులిద్దరి పక్షాలను ఉద్ధరిస్తాడు. ఒక దీపంనుండి వేరొకదీపం వెలుగొందునట్లుగా ఉజ్జ్వల కాంతులతో ప్రకాశించే ఈ బాలుడు నీ పవిత్ర దేహంనుండి పుట్టినవాడే.

రాజా! ఇంకా విపరీత వాదాలెందుకు? ఈ పుత్రుని కౌగలించుకొని పుత్రగాత్ర పరిష్వంగ సుఖం అనుభవించు. ముత్యాలహారాలు గాని,దట్టంగా కర్పూరపుపొడి చల్లుకోవడంగాని,చందనపుపూతలు గాని,చల్లని పండు వెన్నెలగాని పురుషునికి పుత్రుని శరీరపు కౌగిలింత వలె మిక్కిలి హృద్యమైనవి కావు,చల్లదనాన్ని యీయలేవు. ఈ బిడ్డడు వంశకర్తయై.నూరు అశ్వమేధయాగాలు చేయగలడని మునులందరూ వినేటట్లుగా ఆకాశవాణి నాకు తెలియబలికింది. గొప్పగుణాలు కలవాడు, వంశ విస్తారకుడు, ధర్మప్రియుడైన వాడిని కారణం లేకుండా తప్పుజూడడం తగదు.

శ్రేష్ఠమైన జలంతో నిండిన నూరు నూతులకంటె ఒక బావిమేలు. అట్టి నూరుబావులకంటే ఒక మంచి యజ్ఞంమేలు. అట్టి నూరుయజ్ఞాలకంటె ఒక పుత్రుడు మేలు.అటువంటి నూరుగురు కుమారులకంటె ఒక సత్యవాక్యముమేలు.వేయి అశ్వమేధ యాగాలను ఒక్క సత్యాన్ని త్రాసులో రెండువైపులా పెట్టి తూచగా ముల్లు సత్యంవైపే మొగ్గుతుంది.

సకల తీర్థాలు సేవించడంగాని, సర్వవేదాలను అధ[illegible]

122.వారి పుత్రుడు అనశ్వుడు.అతని భార్య అమృత.

123.వారి కుమారుడు పరీక్షిత్తు.అతని భార్య సుయశ.

124.వారి కుమారుడైన భీమసేనుని భార్య కుమారి.వారి కుమారుడు ప్రతిశ్రవసుడు అతని కుమారుడు

125. ప్రతీపుడు. అతని తల్లి పేరు పేర్కొనబడలేదు.

125.ప్రతీపుని భార్య సునంద. ఆమెకు దేవాపి, శంతను, బాహ్లికులను ముగ్గురు పుత్రులు.

## 126.గంగ.

నదీదేవతయైన గంగ స్త్రీరూపధారిణియై ఒకనాడు బ్రహ్మసభకు వస్తుంది. గాలి తాకిడికి ఆమె వలువలు తొలగగా దేవతలంతా ముఖం ప్రక్కకు తిప్పుకుంటారు. మహాభిషుడనేరాజు వేయిఅశ్వమేధయాగాలు,నూరు రాజసూయ యాగాలు చేసి దేవతలను సంతుష్టులను చేసి దేవలోకానికి వెళ్ళినవాడు బ్రహ్మకొలువులో ఉండి, ఆమెను సాభిలాషంగా చూస్తాడు.బ్రహ్మ ఆ దృశ్యం చూసి అతనిని మరల మానవజన్మఎత్తమని శపిస్తాడు.అతడు రాజర్షులలో పుణ్యచరిత్రుడైన ప్రతీపుని కుమారునిగా జన్మిస్తానని వేడుకొంటాడు. బ్రహ్మసరేనంటాడు.గంగ కూడ మహాభిషుని గొప్పతనం, రూపసౌందర్యాలు తన మనస్సును దోచుకోగా అతనికి తనపై గల అభిలాష పెరిగి, మానవలోకానికి వస్తూ వుంటుంది.

వశిష్ఠముని శాపప్రభావంవల్ల దేవలోకాన్ని వీడి వస్తూవున్న ఎనిమిదిమంది వసువులు ఆమె కంటబడతారు.ఆమె వారి స్థితికి కారణం అడుగుతుంది. తాము వశిష్ఠుని శాపంవల్ల మానవలోకంలో జన్మించబోతున్నామని తామామె కడుపున జన్మిస్తామని మహాభిషుడు ప్రతీపుని కుమారుడు శంతనుడిగా జన్మించబోతున్నాడని, తమజన్మకాతడు నిమిత్తమవుతాడని వసువులు పేర్కొంటారు.

గంగ సంతోషంగా తన కోరిక కూడ అదేనని,తాను వారికి ఉపకారం చేస్తానని కరుణతో పల్కుతుంది.అలాగయితే తాము పుట్టిన వెంటనే నీళ్ళలో వేస్తూ మానవ లోకంలో ఎక్కువకాలం ఉండకుండా చేయమని,తమకు వశిష్ఠుని

అనుజ్ఞ కూడ అలాంటిదే అని వసువులుచెబుతారు.తనకు దీర్ఘాయుష్మంతుడైన కొడుకొకడు కావాలంటుంది గంగ.తమలో ఒక్కొక్కరి అయుష్షులో నాల్గవవంతు పొంది, దీర్ఘాయువు, శుభచరిత్ర గల్గిన అష్టమవసువు ఆమె పుత్రుడై ఆమె కోరిక తీర్చగలడని వారు ఆమెకభయం ఇస్తారు.

ప్రతీపుడు గంగాతీరంలో తపస్సు చేస్తూ యమనియమ వ్రతపరాయణుడై ఉండగా గంగ దివ్యాంగనగా సాక్షాత్కరించి,మన్మథవశమైన చిత్తంతో అతని కుడి తొడపై విలాసంగా కూర్చుంటుంది.ప్రతీపుడాశ్చర్యపోయి ఆమె వృత్తాంతమడుగగా తాను జహ్నుముని కుమార్తెనని,తనను భార్యగా స్వీకరించమనీ కోరుతుంది.అగ్ని సాక్షిగా పెళ్ళాడిన స్త్రీని తప్ప అన్యస్త్రీని మనస్సులో సైతం తాను తలచననీ,పైగా కుమారుడు కూర్చుండవలసిన కుడి తొడపైకూర్చున్న ఆమె తన పుత్రునిభార్య కావాలని అభ్యర్థిస్తాడు. సరేనని గంగ అదృశ్యమవుతుంది.భార్యాసహితుడై సకల తీర్థాలు సేవించి వ్రతాలు సల్పిన ప్రతీపునికి శంతనుడు కల్గుతాడు.

శంతనుడు పెరిగి పెద్దవాడైన పిదప ప్రతీపుడు అతనిని రాజుగా అభిషేకించి గంగ వృత్తాంతం చెప్పి, ఆమెను భార్యగా స్వీకరించమంటాడు. అంతేగాక ఆమె కులగోత్రాలు,పేరు అడుగవద్దని,ఆమె ఇష్టప్రకారం నడుచుకోమని చెబుతాడు.

గంగాతీరంలోని వనంలో వేటాడుతున్న శంతనునికి గంగ అపూర్వ రూపవిలాసంతో సాక్షాత్కరిస్తుంది.ఇరువురు పరస్పర ఆకర్షణకు లోనవుతారు.ఆమె వృత్తాంతమడిగిన శంతనునితో తనను భార్యగా స్వీకరించడం ఇష్టమైతే తానేది చేసినా వారించకూడదని, తనతో అప్రియాలు పలుకకూడదనీ, షరతులు విధిస్తుంది. అప్రియాలు పల్కిన క్షణమే తానతణ్ణి వదలి వెళ్ళిపోతానని చెబుతుంది. శంతనుడంగీకరిస్తాడు. గంగ మనుష్య స్త్రీరూపధారిణియై అతనితో కాపురం చేస్తుంది. వరుణుడు మొదలైన వసువులేడుమందినీ పుట్టినవెంటనే నీటిపాలు చేస్తుండగా చూసిన శంతనుడు కారణం అడిగితే ఎక్కడ తనను వదలివేస్తుందోనని ఆమె నిర్దయాత్మక చర్యలను సహిస్తాడు.

కాని అష్టమవసువు జన్మించిన వెంటనే పుత్రవ్యామోహంతో శంతనుడా బాలుని చంపనీయక " ఇన్నాళ్ళూ కన్న బిడ్డలందరినీ ఏటిపాలు చేసిన పుత్రఘాతినివైనా సహించాను.సూర్యసమానతేజుడైన ఈ బిడ్డను నేను విడిచిపెట్టను."అని ఆమెను అప్రియాలు పల్కుతాడు.గంగ తమమధ్యగల ఒడంబడికను గుర్తుచేసి

"నీతో సాంగత్యం నాకింతవరకే. నేను పుణ్యజలప్రవాహపవిత్రతచే త్రిభువన పావనినైన గంగను. ఈ వసువులు వసిష్ఠుని శాపం చేత భూలోకంలో పుట్టవలసి ఉండి,మేము వేరొకచోట పుట్టము. నీయందు జన్మిస్తాము. భూలోకంలో మేమెక్కువకాలం ఉండకుండా మమ్ములను వెంటనే విముక్తులను చేయమని ప్రార్థించినందువలన దేవహితార్థమై మనుష్యస్త్రీరూపం దాల్చి, నీ వల్ల ఈ వసువులకు జన్మనిచ్చి, వారికి విముక్తి కల్గించాను. ఇందువల్ల నీ కక్షయమైన పుణ్యలోకాలు ప్రాప్తిస్తాయి.ఈ అష్టమపుత్రుడు వసువులో ఒక్కక్కరి నుండి నాల్గవ అంశాన్ని గ్రహించి సకలధర్మమూర్తియై పుట్టినాడు. లోకహితార్థమై వీడు మానవలోకంలో చిరకాలం ఉండగలడు అని చెబుతుంది.

"వసువులు దేవతలు. లోకంలో పూజనీయులు.వారికి వశిష్ఠుడెందుకు శాపం యివ్వవలసివచ్చింది? వారు భూమిపై పుట్టి స్వర్గానికి వెళ్ళినా యీ అష్టమ వసువు మానవలోకంలో చాలాకాలం ఉండడానికి కారణమేమి?"అని ప్రశ్నించిన శంతనునికి గంగ ఆ వృత్తాంతం వివరిస్తుంది.

దక్షప్రజాపతి పుత్రికయైన సురభికి,కశ్యపునికి పుట్టిన నందిని తనకు హోమధేనువై కోరిన వస్తువులనిస్తూండగా వసిష్ఠుడాశ్రమంలో తపస్సు చేస్తూఉంటాడు. అష్టవసువులు భార్యా సహితులై క్రీడార్థం అక్కడకి వచ్చి,నందినిని చూసి,దాని నడవడికి ఆశ్చర్యపోతారు. వారిలో అష్టమవసువు భార్య "మానవులు దీనిపాలు త్రాగితే పదివేల సంవత్సరాలు వృద్ధాప్యం,మరణంలేక దేవతలలాగ సుఖంగా జీవించ గల్గుతారట.దీనికి ప్రభువైవాడే అందరికన్న గొప్పవాడు.భూలోకంలో ఉశీనరభూపతి కూతురు జితవతి నా స్నేహితురాలు.నేనెప్పుడూ ఆమెకు మేలు చేయాలనుకుంటాను. కాబట్టి ఈ ఆవును ఆమెకిచ్చి వెళ్ళుదాము" అంటుంది.

భార్య మాటల ప్రభావంతో ప్రభాసుడు అన్నల సహాయంతో నందినిని పట్టుకుని తీసుకొని వెళ్తాడు.తన దివ్యదృష్టితో ఆ విషయం తెలుసుకొని వసిష్ఠుడు వారిని మానవజన్మ ఎత్తమని శపిస్తాడు.వారి ప్రార్థనపై అందరినీ క్షమించినా "ఈ ప్రభాసుడు నిర్దయగా గొప్ప అపరాధం చేశాడు. వీడు మానవలోకంలో అనపత్యుడిగా చాలాకాలం జీవిస్తాడు." అని శపించినాడని గంగ వివరించి,తన నిజరూపం చూపించి, బిడ్డడు తనవద్దనే కొంతకాలం పెరుగుతాడని శంతనుని ఒప్పించి,కొడుకుని తీసుకొని వెళ్ళుతుంది.

చాలాకాలం తర్వాత శంతనుడు గంగాతీరంలో వేటాడుతూ

ధనుర్విద్యాభ్యాసం చేస్తున్న యువకుణ్ణి చూస్తాడు.కాని తన కుమారుడని గుర్తింప లేడు. గంగ సాక్షాత్కరించి "వీడు నీ కుమారుడు.వసిష్ఠుని వద్ద సకలవేదాలు,శస్త్రాలు పరశురాముని వద్ద అస్త్రవిద్య నేర్చినాడు.ఆత్మవిజ్ఞానంలో సనత్కుమారాదుల వంటివాడు. స్వీకరించు "అని అప్పగించి వెళ్ళిపోతుంది.

అంబోపాఖ్యానంలో భీష్ముడు పరశురామునితో తలపడడానికై కురుక్షేత్రానికి వస్తూ ఉండగా గంగ స్త్రీరూపధారణియై వచ్చి భీష్ముని ప్రస్థానానికి కారణం తెలుసుకొని, కొడుకును కోప్పడుతుంది.తర్వాత పరశురాముని వద్దకు వెళ్ళి తన కుమారునిపై కోపింపవచ్చునా అని అడుగుతుంది.అతడు సమాధానమీయక పోగా తిరిగి కొడుకువద్దకు వస్తుంది.అతడు మెత్తబడకపోవడంతో నిస్పృహతో వెళ్ళిపోతుంది.

ఇరవైరెండు రోజులు మహాభయంకరంగా సాగిన భీష్మ పరశురాముల భీకరపోరాటాన్ని విరమింపజేయడానికి గంగ,మునులు అనేకవిధాలుగా చెప్పి, పరశురాముని కోపాన్ని విరమింపజేస్తారు.

యమునా నదీతీరంలో అంబ ఘోరతపస్సు చేస్తూండగా గంగ ప్రత్యక్షమై "స్త్రీలకు సాధ్యంకాని ఇటువంటి దుష్కర వ్రతాలు నీవు చేయడానికి కారణమేమి?అని అడుగుతుంది. భీష్ముని అంతమేతన లక్ష్యమన్న అంబతో గంగ "నీవు కుటిల ప్రచారం చేస్తున్నావు. కాబట్టి ఈ శరీరం విడిచి నదివై ప్రవహిస్తావు.అంతేకానీ ఇంకేమీ చేయలేవు" అని శపిస్తుంది.

"...........అనిన విని భాగీరథి నీవు కుటిల ప్రచారవగుట నీ తనువు విడిచి యేఱయి పాఱంగల వింతియగాని యొండుగా నేరవనిన"......[1]

భీష్ముడు ఊర్ధ్వలోక గతుడైన తరువాత విదుర ధృతరాష్ట్రులు,పాండవులు, అతని దేహానికి అగ్నిసంస్కారంచేసి గంగానదికి వెళ్ళి భార్యాసహితులై తిలోదక ప్రదానం చేస్తారు ఆ సమయంలో నీటినుండి పైకి వచ్చిన గంగాదేవి శోకవిహ్వలయై వికలమైన నడకతో ముఖాన్ని కన్నీటిబిందువులు తడిపి వేస్తూండగా వారి వద్దకు వచ్చి నిలిచి తన కొడుకును గూర్చి విలపిస్తుంది.

"నా పుత్రుడెటువంటివాడో, అతని చరిత్రయొక్క గొప్పతనమెట్టిదో మీరందరూ ఎరుగుదురు. అయినా నేను కొంత చెబుతాను, వినండి. ధృఢవ్రతాన్ని (బ్రహ్మచర్యాన్ని) పరమ నిష్ఠగా ఆచరించినవాడు,పవిత్రమైన బుద్ధి కలవాడు,రాజ వృత్తాఢ్యుడు ,గొప్పదయాగుణంకలవాడు ,పితృభక్తిధుర్యుడు, పెద్దలకనుకూలుడు,

1. ఉద్యో. చతు - ఆ. ప 364

విద్యాపరిశ్రమలోఘనుడు.కాశీరాజకన్యలపై యుద్ధంచేయగా అతనిచే ఎంతోమంది రాజులు పరాజితులైనారు.అంబకోసమై పూనుకొన్నా,అతని మహాబలాన్ని పరశురాముడు ఎదుర్కొనలేకపోయాడు.అంతటివాడు ఆ శిఖండిచే ఆ విధంగా కావడం చూచి నా గుండె బ్రద్దలు కావడం లేదంటే, అది వజ్రసదృశ కఠినమై ఉండాలి. అని శోకింపగా వ్యాసుడావెను "నీ కుమారుడు మోక్షం పొందినాడు.శాపవశాత్తు వసువు మానవుడై వర్తించినాడు.అతడు సాటిలేని మహానుభావుడు.శిఖండి కాదు,దేవేంద్రుడైనా అతన్ని ఏమీ చేయలేడు.తన ఇచ్ఛతో తాను అర్జునుని బాణాలకు దేహాన్ని అర్పించినాడు.తాను తలచినప్పుడే దేహాన్ని త్యజించినాడు'అని ఊరడిస్తాడు.

## 128,129 సత్యవతి కోడళ్ళు అంబిక, అంబాలికలు

కాశీరాజ పుత్రికలైన అంబ,అంబిక,అంబాలికలను భీష్ముడు తన తమ్ముడైన విచిత్రవీర్యునికోసం స్వయంవరంలో రాజులందరినీ జయించి తీసుకొని వస్తాడు. అంబ తాను సాళ్వరాజును వరించినానని చెప్పగా ఆమెను పంపించివేస్తాడు.మిగతా ఇద్దరినీ తమ్మునికిచ్చి వివాహంచేస్తాడు.అమిత కామాసక్తుడైన విచిత్రవీర్యుడు రోగగ్రస్తుడై మరణించగా సత్యవతి తమ వంశవృద్ధికోసమై వ్యాసుని వినియోగించి, అతన్ని సేవించి సుపుత్రుని పొందమని అంబిక నాదేశిస్తుంది.అంబిక కుమారుని జన్మను గూర్చి ఆలోచిస్తూండగా వ్యాసుడు వస్తాడు.అతని గడ్డం, ఆకారం చూసి భయపడి అంబిక కళ్ళుమూసుకొంటుంది.ఫలితంగా ఆమెకు గుడ్డివాడైన ధృతరాష్ట్రుడు జన్మిస్తాడు.

## 130. విదురుని తల్లి

సకల సద్గుణవంతుడు,రూపవంతుడైన ఇంకొక్క కొడుకును ప్రసాదించమని సత్యవతి వ్యాసుని ప్రార్థించి ఒప్పించి,అంబికను అతన్ని సేవించమని ఆజ్ఞాపిస్తుంది. ఆమె అతని వికృతరూప వేషాదులను అసహ్యించుకొని, తన దాసిని చక్కగా అలంకరించి,తన శయ్యపై ఉంచుతుంది.వ్యాసుడామె సేవలచే సంతృప్తుడవుతాడు. మాండవ్యముని శాపంవల్ల శూద్రవనిత యందు జన్మించవలసి ఉండిన యముడు ఆ దాసి యందు విదురునిగా జన్మిస్తాడు.

సద్బ్రాహ్మణుల వలన క్షత్రియస్త్రీలు వంశవృద్ధి గావించ వచ్చునని

చెబుతూన్న సందర్భంలో భీష్ముడు ప్రద్వేషిణి వృతాంతం వివరిస్తాడు.

## 130 మమత.

ఉచధ్యుడనే మునిపత్ని మమత.

## 131. ప్రద్వేషిణి

మమత గర్భవతియైయుండగా అభ్యాగతుడుగా వచ్చిన బృహస్పతి ఆమెను పొందగోరతాడు.అది 'దేవర న్యాయ'మంటాడు.ఆమె గర్భంలో ఉన్న శిశువు అది ధర్మవిరుద్ధమని ఆక్రోశిస్తాడు. బృహస్పతి వానిపై మండిపడుతూ "సకల జనులకు యిష్టమైన ఈ కార్యంలో నాకడ్డుపడినావు. కాబట్టి దీర్ఘతముడవవుతా"వని శాపం యిస్తాడు. పుట్టుగుడ్డిగా జన్మించిన ఆ బాలుడు దీర్ఘతముడనే పేరుతోనే సకల వేదవేదాంగాలను నేర్చి,తన విద్యాబలంతో చాలాకాలానికి ప్రద్వేషిణి అనే స్త్రీని వివాహమాడి, ఎంతో మంది పుత్రులను పొందుతాడు.భార్య తననెప్పుడూ మెచ్చక పోవడం చూసి కారణమడుగగా

"పతియ భరియుంచు గావున భర్త యయ్యె,
భామ భరియింప బడుగాన భార్యయయ్యె
బరగనవి మనయందు వీడ్వడియె నిన్ను,
నేన ఎల్లకాలము భరియింతుగాన"

"భరించేవాడు భర్త. భరింపబడేది భార్య. ఈ సంబంధం మనలో తారుమారైంది. నిన్నింక నేను భరింపలేను.ఎక్కడికైనా వెళ్ళిపొ"మ్మని చెబుతుంది. నిర్దయగా భార్యపల్కిన పల్కులకు దీర్ఘతముడు బాధపడి "స్త్రీలు దయలేనివారు. పతిహీనలైన స్త్రీలు ఎంత ధనవంతులైనా, ఉన్నతకులస్థులైనా,యీనాటి నుండి వారు మాంగల్యరహితలు,అలంకార విహీనలు అవుతారు" అని శాపమిస్తాడు.

## 133 సుదేష్ణ

శాపమిచ్చిన భర్తపై కోపంతో ప్రద్వేషిణి అతన్ని ఎక్కడికైనా తీసికొని వెళ్ళి పడవేయమని కుమారులకు ఆజ్ఞాపిస్తుంది. వృద్ధుడు, పుట్టుగుడ్డి అని కూడా చూడకుండా, వారతన్ని కట్టెలతో బంధించి, గంగలో వదులుతారు. ప్రవాహవేగంలో ఎన్నో దేశాలు గడచి,బంధనాల్లోఉండీ స్వరయుక్తంగా వేదాలు చదువుతున్న అతన్ని బలి అనేరాజు చూచి,తీరానికి చేర్చి,అతని వృత్తాంతం

తెలుసుకొని,తానపుత్రకుడనని, యే విధంగాను సంతానంపొందలేక పోయిన తనకు సంతానదానం చేయమని ప్రార్థించి, అంతఃపురానికి తీసికొని వెళ్ళి, ఋతుమతియైన తన భార్య సుదేష్ణను అప్పగిస్తాడు.

పండుముసలి, పుట్టుగుడ్డి, దుర్గంధభూయిష్టుడూ అయిన ఆ వేదజడుని సాంగత్యాని కిష్టపడక సుదేష్ణ తన దాసి కూతురును అతని వద్దకు పంపుతుంది.ఆమె దీర్ఘతముని వల్ల పదకొండుమంది పుత్రులను కంటుంది. బలి వారు తన పుత్రులే అనుకొంటాడు. (క్షేత్రజులు పుత్రులే అని శాస్త్రం)దీర్ఘతముడు వారు దాసీ పుత్రులని తెలియజేస్తాడు.

ఎట్టైనా సంతానం కావాలన్న కోరికతో ఉన్న బలి మునిని బ్రతిమాలి,తిరిగి సుదేష్ణను ముని వద్దకు పంపుతాడు. దీర్ఘతముడు "దాని యంగంబు లెల్లచూచి" వంశకరుడు, మహాసత్త్వుడైన కొడుకు నీకు పుడతా"డని ఆమె నను్గ్రహిస్తాడు. ఆమెకు అంగరాజనే రాజర్షి జన్మిస్తాడు.

ఈ విధంగా ఉత్తమ క్షత్రియుల భార్యలయందు ధర్మమార్గంలో బ్రాహ్మణుల వలన జన్మించి వంశకరులైన క్షత్రియులెందరో ఉన్నారని భీష్మడీ కథను సత్యవతికి చెబుతాడు.

## 134. సుదేష్ణ దాసి

దీర్ఘతముని సంయోగంవల్ల సంతానంపొందడం యిష్టంలేక సుదేష్ణ తనను పంపగా అతని వల్ల కాక్షీవదాదులైన పదకొండుమంది పుత్రులను పొందుతుంది.

## 135. కుంభీనసి

అంగార పర్ణుడనే గంధర్వుని భార్య.

## గాంధారి

భీష్ముడు ధృతరాష్ట్రునికి వివాహంచేయదలచి గాంధార రాజైనసుబలుని కుమార్తె గాంధారి రూపగుణశీలాదులను బ్రాహ్మణులవలన తెలుసుకొంటాడు. కురువంశం విచ్ఛేదం కానున్న సమయంలో సత్యవతీదేవి ఆజ్ఞప్రకారం సంతతి కలిగించి వ్యాసుడా వంశాన్ని నిలిపినాడని వంశవృద్ధి చేయడం తన అభిమతమేననీ గాంధారి ఈశ్వరుని వల్ల నూర్వురు పుత్రులు తనకు కలిగే వరం పొందిందనీ,

కాబట్టి ఆమెను ధృతరాష్ట్రున కిచ్చి వివాహం చేద్దామని విదురునితో ఆలోచిస్తాడు.వృద్ధ బ్రాహ్మణులను సుబలుని వద్దకు రాయబారం పంపుతాడు.సుబలుడంగీకరిస్తాడు.కళ్ళు లేని ధృతరాష్ట్రుని గూర్చి తన బంధువులు మాటలాడుకోవడం విన్న గాంధారి తండ్రి తనకు నిశ్చయించిన అతడే తన భర్తఅని ఆ క్షణమే నిర్ణయించుకొని,అప్పటి నుండి పరపురుషులను కనీసం చూడనైనా చూడదు.భర్తకు లేని దృష్టి తన కక్కరలేదని వివాహానికి పూర్వమే నేత్రపట్టం కట్టుకుంటుంది.కంటిచూపులేని జీవితాన్నికోరి వరిస్తుంది.

భీష్ముడామెతో బాటు ఆమె చెల్లెళ్ళు పదిమందినీ, "కులము, శీలము, రూపము గల నూరుగురు కన్యలను కూడ తెచ్చి ధృతరాష్ట్రున కిచ్చిపెండ్లి చేస్తాడు.

"వారి పలుకులువిన్న గాంధారి ధృతరాష్ట్రునకు బితృవచనదత్తగా దన్ను నిశ్చయించి నాకు బతి యమ్మహీపతియ కాని యొరుల నొల్లనని పరమపతివ్రత పరపురుష సందర్శనంబు పరిహరించి తనపతి కనుగుణంబుగా నేత్రపట్టంబు గట్టుకొనియుండె....... ధృతరాష్ట్రుడును బరమోత్సాహంబున గాంధారిని వివాహంబై దానితోడం బుట్టిన కన్యకల సత్యవ్రతయు, సత్యసేనయు, సుదేష్ణయు, సంహితయు, దేజశ్శ్రవయు, సుశ్రవయు, నికృతియు, శుభయు, సంభవయు, దశార్ణయు,నను పదుండ్ర నొక్కలగ్నంబున వివాహంబైమఱియును" [1]

**కులమును రూపము శీలము**
**గల కన్యల దెచ్చితెచ్చి గాంగేయుండీ**
**నలఘుడు ధృతరాష్ట్రుడు కుల**
**తిలకుండు వివాహమయ్యె దేవీ శతమున్ [2]**

గాంధారి కుంతి కన్న ముందుగా గర్భవతి అయ్యింది. కాని, తన కంటె ముందుగా కుంతి మాతృత్వం పొందిందని, ధర్మజుని కన్నదని తెలియగానే అసూయతో, కోపంతో తన కడుపును బాదుకున్నది. గర్భస్థపిండం నేలపాలయ్యింది. ఈ సంగతి తెలిసిన వ్యాసమహర్షి పరుగున వచ్చి, ఆ పిండాన్ని నూటొక్కశకలాలుగా విభజించినాడు. వాటిని నేతి కుండలలో పెట్టి,చన్నీళ్లతో తడుపుతూ సంరక్షించ మన్నాడు. ఒక్క సంవత్సరం ఆ విధంగా చెయ్యగా కుంతికి ద్వితీయ సంతానంగా వాయుదేవుని అనుగ్రహం వల్ల భీముడు జన్మించిన రోజునే గాంధారికి జ్యేష్ఠ పుత్రుడు దుర్యోధనుడు జన్మించినాడు. తరువాత రోజుకొకరుగా దుశ్శాసనాదులు తొంభై తొమ్మిది మంది కౌరవులు, చివరిగా దుస్సల అన్న కుమార్తె జన్మించినది.

1.ఆది. 1వ అ . ప. 12. 2. ఆదే. ప. 13.

మాయాద్యూతంలో పాండవులకు జరిగిన అన్యాయాన్ని,ద్రౌపది పరాభవాన్ని తెలుసుకొన్న గాంధారి విదురుని వెంటబెట్టుకుని ధృతరాష్ట్రుని వద్దకువెళ్ళి, అతనికి హితముపదేశించుతుంది. పాండవుల రాజ్యభాగం వారికీయమని చెబుతుంది.ద్రౌపదీ పరాభవం జరగగానే కౌరవుల అగ్నిహోత్రగృహంలో అగ్నులు శాంతించడం నక్కలు అరవడం ధృతరాష్ట్రపుత్రుల శయ్యాగారాల్లో కాకులు గుడ్లగూబలు ఘోరంగా అరవడం- మొదలైన దుర్నిమిత్తాలు కల్గినాయని ఆమె తెలియజేసిన తర్వాతనే ధృతరాష్ట్రుడు,ధుర్యోధనుని మందలించి,ద్రౌపదికి వరాలిస్తాడు.

శ్రీ కృష్ణరాయభారం విఫలమైనప్పుడు దుష్టచతుష్టయం అతని పట్ల చేసిన అపరాధాన్ని, శ్రీకృష్ణుడు పల్కిన క్రోధపూరితమైన మాటలను విని భయపడిన ధృతరాష్ట్రుడు దుర్యోధనునికి హితముపదేశించడానికై గాంధారిని పిలువ నంపుతాడు.

**"బుద్ధిమంతురాలు పొందగ పలుకంగ,**
**నేర్పువచ్చి కొడుకు దేర్పిపోవు**
**గాన వేగనీవు గాంధారి తోడి తె,**
**మ్మనుడునరిగి యతడు నట్లచేసె"** [3]

కొడుకు అవినీతిని భర్త అడ్డుకోక పోవడం సహించలేక గాంధారి ఆయనను మందలిస్తుంది.

**"నీ పుత్రుడవినీతుడగుట యెఱిఁగి,**
**యెఱిఁగి వాని వశంబున నేలపోయె**
**దీవు పాండవులకు నేమి యిచ్చితేని,**
**నడ్డపడ నెవ్వారికి వచ్చు నధిప చెపుమ"** [4]

గాంధారి కుమారునికి నయమున, భయమున, బుజ్జగించి, కినిసి, హెచ్చరించి -వివిధ రీతులుగా బుద్ధులు చెప్పింది.

".............సుయోధనుండు నిజాసీనుడై యున్న జూచి తల్లి చిత్తంబున, గర్వించుచు నతనికి ధర్మంబును, నీతియును, జుట్టరికంబును బ్రతుకుదెరువును, నిజశక్తియు, సహాయంబు గొలందియు, గులజనచిత్త ప్రకారంబును, బాండుపుత్రుల బలపరాక్రమంబులు దెలియునట్లుగా దెఱుంగువడం జెప్పి బుజ్జగించియు,గినిసియు ననేక విధంబులనాడిన....."

తన మాటలు పెడచెవిన పెట్టి యుద్ధానికి బయలుదేరుతూ దీవించమని

3.అదే. ప. 382 4.అదే.ప. 386

తన వద్దకు వచ్చిన దుర్యోధనుణ్ణి గాంధారి "కొడుక యెచ్చటనుండు ధర్మమచ్చటకు సేరు జయ"మని దీవించింది.

యుద్ధం ముగిసిన పిదప ధృతరాష్ట్రునితో బాటు యుద్ధరంగంలో ప్రవేశించిన గాంధారి వ్యాసభగవానుడు ప్రసాదించిన యోగదృష్టితో సర్వం చూడగల్గింది.తన సంతానం నూరుగురుయుద్ధరంగానికి ఆహుతికావడం, దుర్యోధన దుశ్శాసనులు భీముని చేతిలో పొందిన దారుణ మరణం, భీముడు చేసిన భీకరకృత్యాలు గాంధారి తట్టుకొనలేకపోయింది.కాని, భీముడు, దుర్యోధనుడు చేసిన దురాగతాలు ఒక్కొక్కటిగా వివరింపగా "ఆ చావు సావదగు నన్నిచునకున్" అన్నది.

అంతలోనే ఆమెకు దుర్యోధనుణ్ణి భీముడు అధర్మపద్ధతిగా చంపడం, దుశ్శాసనుని గుండెలు చీల్చడం గుర్తుకు వచ్చి కోపంతో,దుఃఖావేశంతో ధర్మరాజును, పాండవులను శపించబోయింది. ఇది గమనించిన వ్యాసమహర్షి పరుగెత్తుతూ వచ్చి "ఆగు తొందర పడకు.నీవు గురుసార ధీరబుద్ధివి.ఇటువంటి నీవు అసూయా గ్రస్తవుగావచ్చునా? శపించకు, శమించ" మన్నాడు.

"........ నీదు గురుసార ధీరబుద్ధిన్, నిను నతిశాంతచిత్తయని నిక్కమెను గందున్, మనమున నిట్టినీ కగునె మత్సరంబు వత్సా "[1]

తన కసూయలేదని, భీముని అధర్మపద్ధతే తనను బాధించిందని ఆమె వ్యాసునితో చెప్పుకొన్నది.నూరుమందిలో ఒక్కడైనా మీకుకీడుచేయనివాడు లేకపోయినాడా, గుడ్డివారమైన మాకు ఊతగా ఒక్కనినైనా వదలియుండకూడదా" అని దీనంగా పాండవులను ప్రశ్నిస్తుంది.తన కోపాన్ని ఎంతగా అణచుకొందామన్నా ఆమెకు సాధ్యంకాలేదు.ఆమె ఉష్ణమైన, దీర్ఘమైన, తీక్షణమైన ఒక్క ఊర్పును వదలినది. ఆమె ఊర్పువెంట ఆమె తీక్షణమైన దృష్టి నేత్రపట్టము సందునుండి ధర్మజుని కాలిగోళ్ళపై రవ్వంత ప్రసరింపగానే అవి ఎఱ్ఱగా కందిపోయినవి. అది చూసిన అర్జునుడు భయపడి శ్రీకృష్ణుని వెనుక దాగినాడు.భీముడు, నకుల, సహదేవులు 'తిరుగుడు' వడినారు.

"...........పట్టావృత నయనయగు నప్పతివ్రత దృష్టిపట్టంబు నంచు సందునం జని యజ్ఞనపతి పదనఖంబులం జెందిననవి గందినం జూచి సవ్యసాచి జనార్దను వెనుకకుంజనియె సమీరసుతుండు మాద్రీసుతులును తిరుగుడు వడిరప్పుడు........"[2]

కౌరవ పాండవుల యుద్ధాన్ని ఆపలేక పోయిన శ్రీకృష్ణుడు గాంధారి

1.భార. స్త్రీ. ఆ. 1. ప. 152 2. అదే.ప.176

శాపాగ్నికి గురియైనాడు.

"పూని పాతివ్రత్య పుణ్యఫలంబున,
సంపాదితంబైన సారతపము
బలిమి సాధనముగా బలికెద నుత్తమ,
జ్ఞాతులు దమలోన సంగరమున
బొలయ జేసితి గాన బొలియుదు రన్యోన్య,
ఘాతకులైన భవజ్ఞాతి జనులు
నీవును దప్పక నేడాదిగా ముప్ప,
దాఱువ నేడైన యద్దినమున
నరయ దిక్కెవ్వరును లేని యగ్గలంపు,
గుత్సితంపు దెఱంగున గూలువాడ
విట్లు మీ వధూజనములు నేడ్చువారు,
బతుల సుతులనుబంధులబనవి పనవి" [1]

గాంధారి శాపాన్ని విన్న శ్రీకృష్ణుడు చిరునవ్వుతో "నీ పుత్రుల అవినీతి ప్రవర్తనకు ఫలితమిది.దీనికై నన్నిట్లు మాటలాడ వచ్చునా? అనగా బదులు పలుకలేకపోయింది.చివరకు పాండవుల వినయవచనాలతో, ప్రవర్తనతో ఆమె కోపం శాంతించింది.ఆశ్రమ వాసానికి బయలుదేరిన ధృతరాష్ట్రుని గాంధారి కుంతీసమేతమై అనుగమించింది. భర్తతో పాటు దావాగ్నిలో దగ్ధమవుతుంది.

## కుంతి

ఆంధ్రమహాభారతంలోని స్త్రీపాత్రలలో అత్యంత ప్రధానమైనదీ, కథతో ప్రత్యక్ష సంబంధం కల్గి, ఆది నుండి దాదాపు అంతం దాకా ఉన్న కుంతిపాత్ర కవిత్రయంచే వైవిధ్యభరితంగా తీర్చదిద్దబడింది.

### నన్నయ చిత్రణలో కుంతి

యాదవరాజైన శూరుని కుమార్తెలలో పెద్దదయిన పృథ వసుదేవుని చెల్లెలు. సంతానహీనుడైన తన మేనత్తకుమారుడు కుంతిభోజునికి శూరుడామెను పెంపుడు కమార్తెగా యివ్వడంచేత ఆమె కుంతిగా ప్రసిద్ధురాలైంది. బాల్యం నుండి అతిథి బ్రాహ్మణ సేవలు చేస్తూ తండ్రి ఆజ్ఞప్రకారం ఎడతెగకుండా వచ్చే

1. భార. స్త్రీ. ఆ1. ప. 160

అతిథి అభ్యాగతులను మృష్టాన్నభోజనాలతో తృప్తిపరచేది.

ఒకనాడు దుర్వాసమహాముని భోజనవాంఛతో అతిథిగా రాగా కుంతి అతడు కోరిన ఆహారాన్ని పెట్టి సంతుష్టుణ్ణి చేస్తుంది. ఆమె సేవలకు సంతోషించి దుర్వాసుడు ఆమెకొక మంత్రాన్ని ఉపదేశిస్తాడు."ఈ మంత్రంతో నీవే వేల్పు నారాధించినా,అతడు నీవు కోరిన కుమారుల నిస్తాడని 'ఆపద్ధర్మంగా' ప్రసాదించినాడు.

ఆ మంత్రశక్తిని తెలుసుకొనగోరి కుంతి ఒకనాడు ఏకాంతంలో గంగనీళ్ళతో, కాళ్ళు, ముఖం కడుక్కుని,మంత్రాన్ని హృదయంలో నిల్పుకొని ఆదిత్యుని కర్ఘ్యమిచ్చి, అతని వంటి కొడుకును ప్రియమార తనకు ప్రసాదించమని ప్రార్థిస్తుంది. వెంటనే సూర్యుడు తన తీక్షణతనుపసంహరించుకొని యౌవనకాంతితో ఆకాశంనుండి దిగి కుంతివద్దకు వస్తాడు.అతని తేజోమయరూపాన్ని చూచి కుంతి భయవిస్మయ సంభ్రమాలతో గజగజ వణకిపోతుంది.సూర్యుడామెనోదార్చి, తానామె పట్ల ప్రసన్నుడ నైనానని,ఆమె కోరిన వరమీయడానికి వచ్చినానని చెప్పగానే కుంతిలజ్జతో ముఖంవంచుకొని "ఒక మహాముని కరుణతో నాకీ మంత్రం ప్రసాదించగా దానిశక్తి తెలుసుకోవాలని అజ్ఞానంతో త్రిలోకైకదీపకుడవు, త్రిపురుష మూర్తివి, త్రివేద మయుడైన నిన్ను రప్పించిన నా అజ్ఞానాన్ని మన్నించు. జ్ఞానహీనులవడం చేత స్త్రీలెప్పుడూ తప్పులు చేస్తూంటా" రని ( మొక్కుతుంది.

"నీకు దుర్వాసుడిచ్చిన వరాన్ని, మంత్రశక్తిని ఎఱుగుదును.నా దర్శనం వృధాకాకూడదు.నీ కోర్కెతీరుస్తానంటాడు. "మంత్రశక్తి తెలియక కోరాను.కన్యనైన నాకిది మేలుగాదు.నాకు గర్భమైతే నా తల్లితండ్రులు, బంధువులునన్ను చూసి నవ్వుతా"రంటుంది.

"నీకు సద్యోగర్భంలో పుత్రుడు పుడతాడు. నీ కన్యాత్వం దూషితం కాదని సూర్యుడు వరమిస్తాడు.తక్షణం సూర్యుని అంశతో సహజకవచకుండలాలతో సూర్యసమానమైన ఉజ్జ్వలతేజంతో కర్ణుడు జన్మిస్తాడు.సూర్యుడాకాశానికి వెళ్ళిపోయినాడు.కుంతి ఆశ్చర్యంతో ఏమీచేయలేక "ఆ ముని మంత్రాన్ని నా కెందుకు ప్రసాదించాలి? నేనెందుకా మంత్రశక్తిని తెలుసుకోవాలనుకోవాలి? ఎందుకు సూర్యుని తలచుకోవాలి? అతడు నాకు సద్యోగర్భాన్ని ఎందుకు ప్రసాదించాలి? అప్పుడే కొడుకెందుకు పుట్టాలి? ఇప్పుడేమి చేయాలి?ఈ లోకాపవాదాన్ని ఎట్లాబాపుకోవాలి? ప్రజల కిదంతా తెలిసిపోతుంది గదా, ఈ బాలుణ్ణి ఎత్తుకొని ఇంటికి వెళ్ళితే నా బంధువులందరూ పరిపరి విధాలతలచు

తారు. సూర్యసమానతేజుడైన ఈ బాలుణ్ణి యిక్కడనే వదలి వెళ్ళడానికి చేతులు రావడంలేదు.''అని పరిపరి విధాల చింతిస్తూ ఉండగా సూర్యప్రేరితమై అనర్ఘరత్నాలతోను, బంగారంతోను నిండిన ఒకపెట్టె నదీప్రవాహవేగంవల్ల ఆమె దగ్గరకు వస్తుంది.వెంటనే కుంతి వేగంగా కొడుకు నందులోఉంచి ఇంటికి వెళ్ళిపోతుంది.

ఆ తర్వాత రూపవతి,సకల సద్గుణవతి, పాతివ్రత్యమే అభరణంగా కల్గినది, సహనంలో భూదేవితో సమానమైనదీ అయిన కుంతిని పాండురాజు స్వయంవరంలో పొంది వివాహమాడినాడు. భీష్ముని కోరికపై మద్రరాజపుత్రి మాద్రిని కూడ వివాహమాడినాడు.

మృగయావ్యసనపరుడైన పాండురాజు కిందముడనే ముని భార్యతో హరిణరూపంలో క్రీడిస్తూండగా బాణంతో ఆ హరిణమిధునాన్ని పడగొడతాడు. మృగరూపంలో ఉన్న ముని అవసానదశలో మానవ వాక్కులతో తాను కిందముడనని తెల్పి, ప్రియాసంగమంతో నీవూ మరణిస్తావని శపిస్తాడు. మునివృత్తిలో ఉంటూ శరీరాన్ని త్యజించడమే యింకతన కర్తవ్యమని నిశ్చయించుకున్న పాండురాజును కుంతీమాద్రులనుసరిస్తారు.

ఒకనాడు దివ్యవిమానాలలో ఊర్ధ్వలోకాలకు వెళ్ళుతున్న మునులను భార్యాసహితుడై అనుసరించిన పాండురాజును వారు వారిస్తారు.అపుత్రకుడైన తాను స్వర్గద్వారంలో వెళ్ళడానికి అనర్హుడనైనానని అతడు విచారించగా మునులు యోగదృష్టితో భవిష్యత్తును తెలుసుకొని "నీ వపుత్రకుడవు కావు దైవాధిష్ఠితమైన సంతానం నీకు ధర్మానిల శక్రాశ్వినుల వలన కలుగుతారు.ప్రయత్నించు." అంటారు.

ఏకాంతంలో పాండురాజు కుంతిని సంతానోత్పత్తి యందశక్తుడైన కేకయరాజు శారదండాయని తన ధర్మపత్నిని ఋత్విజుల వల్ల సంతానం పొందు నట్లుగా చేసిన వృత్తాంతం చెప్పి, ధర్మమార్గాన ఆమెను సంతానంపొంద మంటాడు." కుంతి భరతశ్రేష్ఠులైన నీ ధర్మపత్నులము.మా మనస్సులోనైనా యితరమానవులను తలంచలేము.నీ వల్లనే మాకు పుత్రోత్పత్తి కలుగగలదు."అని చెప్పి వ్యుషితాశ్వుని వృత్తాంతం వివరిస్తుంది.

యజ్ఞాదులతో దేవతలను ప్రీతినొందించిన వ్యుషితాశ్వుడు తన భార్యలలో భద్రఅనే ఆమె యందమిత కామాసక్తుడై క్షయరోగంతో మరణిస్తాడు. సంతానహీను రాలైన భద్ర భర్త వియోగాన్ని సహింపక అతని శవాన్ని కౌగిలించుకొని

అతడు లేని జీవితం కంటె మరణం మేలని, లేదా తనకు పుత్రులను ప్రసాదించమని విలపిస్తుంది.భర్తశరీరం నుండి ఒక దివ్యవాణి "విచారింపకు నా వలన నీకు కుమారులు కల్గుతారు. ఋతుమతివైన ఎనిమిదవ దినమున గాని, పదునాల్గవ దినమునగాని, శుచివై పడక యందు నన్ను తలచుకో" అని వినిపిస్తుంది.ఆమె అట్లే చేసి సంతానాన్ని పొందిందని చెప్పి, తమ యందు దైవానుగ్రహం వల్ల సంతానాన్ని పొందమని పాండురాజును కుంతి వేడుకుంటుంది.

భర్త అజ్ఞాపించిన దేనినైనా చేయకపోవడం దోషమని,అజ్ఞాపించని దానిని చేయడం కూడ దోషమని మనువు చెప్పినాడని, కల్మాషపాదుడనే రాజర్షిభార్య మదయంతి భర్త ఆజ్ఞచే వసిష్ఠుని వల్ల పుత్రవతియైనదని,తాను కూడా కృష్ణద్వైపాయనుని వలన వంశవృద్ధి కోసమై జన్మించినానని సకల శాస్త్రములలో, పురాణాలలో సంతానం మేలని చెప్పబడిందికాబట్టి కీర్తిమంతులైన పుత్రులను పొందమని పాండురాజు ఆమె ముందు చేతులు జోడించి దీనవదనంతో ప్రార్థిస్తాడు.

అప్పుడు కుంతి తనకు దుర్వాసుడిచ్చిన మంత్రాన్నిగూర్చి చెబుతుంది. వేల్పులలో ధర్మానికి, సత్యానికి పెద్దయైన ధర్మదేవతను ఆరాధించమని, లోకాలన్నీ ధర్మమునందే నిలుస్తాయని పాండురాజు నియోగింపగా కుంతి భర్తకు ప్రదక్షిణం చేసి,మనస్సులో మంత్రాన్ని నిల్పుకొని, విధిపూర్వకంగా ధర్మదేవతను ఆరాధిస్తుంది. అతని ప్రసాదంవల్ల గర్భవతియై సంవత్సరం నిండినతరువాత కుమారుణ్ణి కంటుంది.

పాండురాజుతో బాటు శతశృంగంలోని మునులు, బ్రాహ్మణులు కూడా సంతోషిస్తారు. బ్రాహ్మణులు జాతకర్మ నిర్వర్తిస్తారు.ఆకాశవాణి "ఇతడు కురుకుల విభుడవుతాడు. ధర్మము నందు స్థిరమైన బుద్ధిగల ఇతడు యుధిష్ఠురుడు" అని జనులందనూ వినేటట్లు పల్కుతుంది. పాండురాజు కురుకుల రక్షకుడు, భుజబల విక్రమోన్నతి గలవాడైన కుమారుని వాయుదేవుని వరం వల్లకనమంటాడు.మునుపటి వలెనే కుంతి వాయుదేవునారాధించి,అతని ప్రసాదంవల్ల గర్భందాల్చి, సంవత్సరం తర్వాత మహాబలవంతుడైన కొడుకును కంటుంది. ఆకాశవాణి ఆ బాలునికి భీమసేనుడని పేరుపెడుతుంది.

తర్వాత త్రిలోక విజయుడైన కొడుకు కావాలని పాండురాజు ఇంద్రుని గూర్చి ఘోరతపస్సు చేస్తాడు. కుంతిచేత కూడా ఒక్క సంవత్సరం వ్రతం చేయిస్తాడు. ఇంద్రుడు ప్రత్యక్షమై శత్రువులను జయించేవాడు, బంధువులకు మిత్రుడైన కుమారుడు కల్గుతాడని వరమిస్తాడు.ఎప్పటిలాగానే కుంతి భర్త ఆజ్ఞచే ఇంద్రుణ్ణి

ఆరాధించి అతని ప్రసాదంవల్ల కొడుకును కంటుంది. ఆ సమయంలో ఆకాశవాణి ఇతడు కార్తవీర్యుని కంటె వీరుడవుతాడు.అర్జునుడనే పేరుతో ప్రసిద్ధుడవుతాడు. ఖాండవం దహిస్తాడు. రాజులందరినీ ఓడించి, ధర్మరాజుతో రాజసూయం చేయిస్తాడని విన్పిస్తుంది. మాద్రి ప్రార్థన వల్ల పాండురాజు ఆజ్ఞతో, కుంతి అశ్వినీదేవతల వలన మాద్రి నకుల సహదేవులనే పుత్రులను పొందేటట్లు చేస్తుంది.

ఎప్పుడూ ఏమారక మాద్రిని సంరక్షిస్తూ ఉండే కుంతి ఒకనాడు బ్రాహ్మణ భోజనానికి ఏర్పాట్లు చేస్తూ మాద్రీసంరక్షణ యందేమారుతుంది. వసంత ఋతు ప్రభావం వల్ల మాద్రీ సౌందర్యాన్ని మనస్సున భావించిన పాండురాజు బలవంతంగా ఆమెను సంగమించి విగతజీవుడవుతాడు.మాద్రి ఏడుపు విన్న కుంతి పరుగెత్తుకొని వచ్చి శోకవిస్మతురాలై

"నాకెడ యిమ్ము లెమ్ము కురునాథ మనఃప్రియపత్నియే,
నేతక మెట్టులుండదు మహీపతి తోడన పోదు పుత్రులం
జేకొని పెన్ను నా పసుపు సేయుము నావుడు మాద్రి దద్దయున్,
శోకపరీత చిత్త యగుచుం బృధకిట్లనియెం బ్రియంబునన్"

పాండురాజు ప్రియపత్నియైన తాను భర్తలేకుండా జీవింపజాలనని భర్తతోనే పోతానని, కొడుకులను సంరక్షించుకొమ్మని మాద్రిని కోరుతుంది.మృగశాప భయం తెలిసీ ప్రమత్తురాలైన తాను బిడ్డలను రక్షించజాలనని "భర్త అభీష్టం మేరకు ధర్మయుక్తిచే కొడుకులను పొంది అతని పుణ్యగతికి కారణమైన దానవు నీవు. పరలోకంలోనైనా అతన్ని సంతృప్తి పరుస్తా"నని మాద్రి భర్తతో సహగమనం చేస్తుంది. మునులు కుంతిని కొడుకులతో హస్తినాపురానికి తీసుకొని వస్తారు. ధృతరాష్ట్రుని నూర్గురు కుమారులు, మంత్రి పురోహితులు, బ్రాహ్మణులు జననీ సమేతులైన పాండవులను తోడ్కొని వచ్చి భీష్మ, విదుర, ధృతరాష్ట్ర, సత్యవతి, అంబిక, అంబాలికలకు మ్రొక్కిస్తారు. కుంతిని తీసుకొని వచ్చిన ఒక వృద్ధ తపస్వి పాండురాజు ఘోరతపస్సు చేసి ధర్మానిల శక్రాశ్వినుల వలన ఐదుగురు కుమారులను పొందాడని, నాటికి పదిహేను దినాల క్రిందట స్వర్గస్థుడైనాడని, కుంతికూడా భర్తతో పోవడానికి సిద్ధమైందని మునులందరూ చెప్పగా కుమారుల సంరక్షణార్థమై విరమించుకొన్నదని, దేవతలచే నామకరణం చేయబడి బ్రహ్మర్షులచే ఉపనయనం గావింపబడి, బ్రహ్మ జ్ఞాన సంపన్నులైన పాండవులను ధర్మబుద్ధితో రక్షించుకొమ్మని ధృతరాష్ట్రునితో చెబుతాడు. తమ్ముని బిడ్డలను ధృతరాష్ట్రుడు ప్రేమగా చూస్తూ వారికి శస్త్రాస్త్రవిద్యలు నేర్పించడం కోసం

గురువులను నియమిస్తాడు.

ఒకనాడు ధృతరాష్ట్రుడు కుమార విద్యాసందర్శనాన్ని ఏర్పాటు చేయిస్తాడు. గాంధారితో బాటు కుంతికూడా వచ్చి ఆమె ప్రక్కనే కన్నుల్లు మూసుకొని ఉంటుంది. సహజ కవచకుండలోద్భాసితుడైన కర్ణుడు మధ్యలో రంగ ప్రవేశంచేసి అర్జునుడు ప్రదర్శించిన విద్యలన్నీ అవలీలగా ప్రదర్శిస్తాడు.దుర్యోధనుడు సంతోషంతో అతని చెలిమిని వాంఛిస్తాడు. అర్జునుడు పిలవబడక వచ్చినవాడవని కర్ణుణ్ణి అవమానిస్తాడు. రంగభూమి అస్త్ర విద్యావిశారదులందరికీ సామాన్యమని కర్ణుడు బదులిస్తాడు. కర్ణార్జునుల ద్వంద్వయుద్ధం మొదలవుతుంది.కుంతి మూర్ఛపోతుంది.

దుర్యోధనుడు కర్ణుని అంగరాజ్యాని కభిషేకిస్తాడు.కర్ణుడు తన తండ్రి సూతునికి నమస్కరించడం చూసిన భీముడు “నీ కులానికి తగినట్లు రథం తోలుకో, ఉత్తమ క్షత్రియుల కర్హమైన అంగరాజ్యానికి నీ వర్హుడవు కావు”అంటాడు. కర్ణుడాకాశాన్ని చూస్తూ దీర్ఘంగా నిట్టూరుస్తాడు. కుంతి కర్ణుని గుర్తించి కూడ ఏమీ ఎరుగనట్లుంటుంది.

ధృతరాష్ట్రుని ఆజ్ఞమేరకు వారణావతానికి బయలుదేరిన పుత్రులతో కుంతి తానూ బయలుదేరుతుంది.అక్కడ దైవపూజలతో బ్రాహ్మణులను,పుణ్యాంగనలను సేవిస్తూ కాలం గడుపుతుంది. లక్కయింటిని తానే అగ్నికాహుతి చేసి భీముడు తల్లితో, సోదరులతో సొరంగమార్గంగుండా బయటపడతాడు.ఆ రాత్రి అరణ్యంలో నడచి నడచి అలసిపోయి మఱ్ఱిచెట్టు క్రింద నిద్రిస్తున్న తల్లిని చూసి భీమసేనుడు “కౌరవకుల విభూషణుడైన పాండురాజు పట్టమహిషి, పరమ ధర్మాత్ములైన కొడుకుల గన్న తల్లి, పుష్పసుకుమార శరీరమూర్తి, పరమశుచి, ఉత్కృష్టమైన శయ్యయందు కూడా నిద్రపోనిది నేడు కటిక నేలమీద నిద్రిస్తున్న”దని విచారిస్తాడు.

భీముని వలచిన హిడింబ వినయానికి సంతోషించి,భీముణ్ణి వివాహం చేసుకోమంటుంది కుంతి.తమను చూడవచ్చినవ్యాసుని చూచికన్నీరు పెట్టుకున్న కుంతిని ధర్మరాజు సార్వభౌముడై కురుకులాన్ని పవిత్రం చేస్తాడని చెప్పి, వ్యాసుడు ఓదారుస్తాడు.

ఏకచక్రపురంలో పాండవులు భిక్షాటనం చేసి జీవిస్తూఉంటారు.భిక్షాన్నాన్ని కుంతి రెండుభాగాలు చేసి ఒక భాగం భీమునికిపెట్టి రెండవభాగం మిగతా కుమారులకు పెట్టి తానూతినేది. ఒకనాడా బ్రాహ్మణుని ఇంట్లోనుండి పెద్దయెత్తున

శోకధ్వనులు వినబడగా కుంతి భీముని పంపి కారణం తెలుసుకొని రమ్మంటుంది. బకుడనే రాక్షసుడికి ఆహారమయ్యే వంతు ఆ బ్రాహ్మణకుటుంబానికి వచ్చిందని తెలుసుకున్న కుంతి "పరోపకారియైన యీ బ్రాహ్మణునికి మనం ప్రత్యుపకారం చేయాలి. ఇతని మూలంగానే మనం యితరులకు తెలియకుండా ఇక్కడ సుఖంగా ఉన్నాము. మేలును తెలుసుకోవడం పుణ్యం.దానికి సమంగా మేలు చేయడం మధ్యమం. దానికి రెండింతలుగా ఉపకారం చేయడం ఉత్తమ"మని చెబుతుంది.

బ్రాహ్మణుని వద్దకు వెళ్ళి తనకైదుగురు కొడుకులన్నారని వాళ్ళలో ఒకడు రాక్షసుని కాహారం తీసుకొని పోగలడని చెబుతుంది.చంపడానికి తానొప్పుకోనన్న బ్రాహ్మణునితో కుంతి భీముడు ఎందరో రాక్షసులను చంపినాడని చెప్పి, విప్రవధను సహించక తాను తన కుమారుని పంపడానికి పూనుకున్నానని, వందమంది కొడుకులున్నా, తల్లితండ్రుల కిష్టంలేని కొడుకులుండబోరని చెబుతుంది. భీముడు సంతోషంతో రాక్షసుని వద్దకు వెళ్ళడానికి సిద్ధపడతాడు.

ఇంతలో భిక్షార్థమై వెళ్ళిన ధర్మరాజాదులు తిరిగి వచ్చితల్లివలన విషయం తెలుసుకొంటారు. "ఇతరుల ఆనందంకోసం తమ కొడుకును విడిచిపెట్టే దురాత్ములుంటారా, భీముడు నీకు విడువదగిన కొడుకా, ఇది లోక విరుద్ధంకాదా, ఈ భీముని వల్లనే గదా! మనం రక్షింపబడినాము" అని ధర్మరాజు బాధపడతాడు. భీముడు పుట్టిన పదవనాడు ఒక రాతిబండపై బడగా ఆ బండ పిండియైన సంఘటన కుంతి ధర్మరాజుకు చెబుతుంది.

"ఉత్తమ క్షత్రియుం డొరుల దుఃఖంబులు దలగంగ బుట్టిన ధర్మశీలు,
డలయక మృత్యుభయంబైనచో విప్రుగాచి సత్పుణ్యలోకములు వడయు
ధన్యుడై క్షత్రియు దయగాచిబుధలోక కీర్తనీయంబగు కీర్తి వడయు,
వైశ్య శూద్రులం గాచి వసుధాస్థలి స్థిత సర్వప్రజానురంజనము వడయు

వనఘ సన్మునీంద్రుడయిన వేదవ్యాసు
వలన దీని విక్కువముగ వింటి
బ్రాహ్మణులకు బ్రియము పాయక చేయంగ
గాన్పచూపె పుణ్యకర్మ ఫలము"[1]

ఉత్తమ క్షత్రియుడు ఇతరుల దుఃఖాన్ని తొలగించాలి. మృత్యుభయం నుండి బ్రాహ్మణుని రక్షిస్తే సజ్జనులలో కీర్తనీయుడవుతాడు. వైశ్యశూద్రులను

1.భార. ఆది. ఆ.6. ప.226

రక్షించితే సర్వ ప్రజలకు కీర్తనీయుడవుతాడని, తానీ ధర్మాలను వేదవ్యాసుని వలన విన్నానని, బ్రాహ్మణ కార్యం నెరవేరుస్తే కుమారులందరికీ ఆయురైశ్వర్యాలు, సర్వసుఖాలు కల్గుతాయని వివరిస్తుంది.

భీముడు బకాసురుని చంపి తల్లికి, సోదరులకు ఆనందం కల్గిస్తాడు.ఆ తర్వాత అర్జునుడు ద్రౌపదీ స్వయంవరంలో మత్స్యయంత్రాన్ని కొట్టి ద్రౌపదిని గెల్చుకుంటాడు. ఆమెను వెంటబెట్టుకొని వచ్చి భీమార్జునులు తల్లితో తామొక భిక్షతెచ్చినామనగా దానిని ఐదుగురూ సమంగా ఉపయోగించుకొండని, ఆజ్ఞాపించి, వెనుదిరిగి చూచి,సిగ్గుపడి కుంతి అధర్మానికి భయపడుతుంది."నా మాట ఇంతవరకు వమ్ముగాలేదు. తెలియక ఆ విధంగా పల్కినాను. మీరు నా మాట తప్పి ఎరుగరు.ఇట్లా చేయడం లోక విరుద్ధం కాదా?" అని విచారిస్తుంది. వేదవ్యాసుని వాక్కును మనస్సులో తలచిన ధర్మరాజు తమ్ములతో కలసి ద్రౌపదిని వివాహమాడతాడు.

శకునితో రెండవసారి జూదంలో సర్వంకోల్పోయిన పాండవులు అరణ్య,అజ్ఞాత వాసాలకై బయలుదేరుతూ తల్లి వద్దకు వస్తారు. ఆభరణాలు, పట్టువస్త్రాలు కోల్పోయి, నారచీరలు ధరించి తలలు వంచుకొని తనకు నమస్కరించిన కొడుకులను చూసి కుంతి దుఃఖిస్తుంది.

**"సుతులార ఇట్టి దుర్వ్యసనోపహతులైన వారి మిమ్ముజూడక,**
**ముందర పరలోకమున కేగి పాండుభూపతి పుణ్యభాగి యయ్యే**
**భక్తి పతితోన పోవ దపంబు సేసె,మాద్రి యేనేల పోవక మందభాగ్య**
**నయితి నని విలపించుచునపుడు గుంతియేడ్చె దుఃఖితులగు చుండ నెల్లవారు."**[1]

అనాథల వలె వీరు మునివృత్తి నవలంబించవలెనా, కౌరవుల వంచనచే రాజ్యం కోల్పోవలెనా భీష్మద్రోణవిదురాదులుండగా ధృతరాష్ట్రుడు ధర్మం తప్పడం న్యాయమా? అన్నా సహదేవా! నీ వొక్కడవే యిక్కడున్నా కొడుకులందరూ యిక్కడున్నట్లుగా నా మనస్సుకు ఊరటగా ఉండేది. అని ద్రౌపదిని చూసి "నీ వలన ద్రుపద వంశం, పాండవ వంశం, పవిత్రమైనాయి.భర్తలతో వెళ్ళి పరిచర్యలు చేయడానికి నోచుకొన్న నీవు పుణ్యం చేసుకొన్నా"వని కౌగలించుకొంటుంది.

**"అన్న సహదేవ నీవును,**

1. సభా-ఆ2-ప.225

నన్నలతో నరిగెదయ్య యట యడవులకీ
వున్నను సుతులందరు నిం,
దున్నట్టుల నాకు జిత్త మూఱడి యుండున్." [1]

"ధవళాక్షి నీ కతంబున,
బవిత్రమై ద్రుపదకులము బాండు కులంబున్
భువనముల వెలిగె నీవు,
ధ్రువ మౌటను జొచ్చుటను శుభస్థితి తోడన్. [2]

ఇది నన్నయ చిత్రించిన కుంతి వృత్తాంతం.

## ఎఱ్ఱన చిత్రణలో కుంతి

అరణ్య పర్వశేషంలో ఎఱ్ఱనచే చిత్రించబడిన కుంతి మరింత విలక్షణమైనది. నన్నయ కంటె మరింత విస్తృతంగా, కర్ణజన్మ వృత్తాంతాన్ని మరింత భిన్నంగా మన ముందుంచాడు.

పూర్వం దుర్వాసుడు కుంతిభోజుని వద్ద కర్థియై వచ్చి, తాను కొంతకాలం అతని యింట ఉండగోరుతున్నానని, భక్తితో అంతకాలం తనకు సపర్యలు చేయాలని, అడుగుతాడు. కుంతిభోజుడు సమ్మతించి తన కూతురు పృథను పిలచి "ఈ బ్రాహ్మణుడు దైవ సమానుడు.నీవు మిక్కిలి ధీరురాలివి. బుద్ధి, వినయం, ఉపచారగుణం కల్గినదానివి. ఇతన్ని భక్తితో సేవించు.ఏవి కోరినా ప్రియంగా ఇచ్చి సంతృప్తి పరచు.ఇతడు కోపించకుండా చూడు దుర్వాసుడు అధిక తపః ప్రశస్తుడు. బ్రాహ్మణ పరాభవం చేతనే వాతాపి మెదలైనవారు మరణించారు.బ్రాహ్మణుల నాదరించడం వల్లనే లోకాలు బ్రతికి ఉన్నాయి.

నీవు పసిబిడ్డవైనా, గుణవంతురాలివి. గురువులు, పెద్దలు, బ్రాహ్మణుల పట్ల భక్తివినయాలు గలదానివి. బంధువులు, స్నేహితులు, అంతఃపురంలోని వారు, పట్టణంలోని వారు నిన్ను పొగడని వారు లేరు. నిన్నేమని వర్ణింపగలను.?యాదవ వంశంలో పుట్టి, ఎంతో సుఖంగా పెరిగినా కుమార్తెవైనావు.లోక సుందరమైన నీ రూపం, సచ్చరిత్ర ఏ స్త్రీకి లేదు.నీ గౌరవం తెలిసే నిన్ను మునిపరిచర్యకు నియమిస్తున్నాను. అహంకారం వదలి నీ పరిచర్యలతో ఇతన్ని సంతుష్టుణ్ణి చేసి కృతార్థురాలివి కా" అని చెబుతాడు. బ్రాహ్మణసేవను నేనెప్పుడూ కోరుతాను.నీవు

1. సభా- ఆ.2- ప.228 2. సభా- ఆ.2- ప.290

కోరినట్లు చేయడం నా భాగ్యం" అంటుంది కుంతి. కుమార్తెను కుంతిభోజుడు దుర్వాసునికి చూపి, ఆమె తెలియక తప్పు చేసినా మన్నించాలి. మెలుకువలు నేర్పి సేవలు గొనాలని చెప్పి అప్పగిస్తాడు.

కుంతి భక్తివినయాలకు దుర్వాసుడు సంతోషించినా ఆమె భావం తెలుసు కోవాలని రేపు వస్తానని,మాపు, రాత్రి వస్తానని ఉదయం-ఇలా ఎంతవేళ తప్పి వచ్చినా కుంతి అప్పటి కప్పుడు కొత్తగా వండిన వంటలతో ఆయన కాహారం పెట్టేది. అలసట గాని కోపం గాని ప్రదర్శించలేదు. ఈ విధంగా సంవత్సరం గడిచాక దుర్వాసుడు సంతోషించి కుంతిని వరమిస్తాను,కోరుకొమ్మంటాడు. " మీరు మాపట్ల ప్రసన్నులైనదే చాలును, వేరే వరం వద్దు" అంటుంది. "అలాగయితే నీకొక మంత్ర ఉపదేశిస్తాను దీనితో నీవే వేల్పు నారాధించినా, ఆహ్వానించినా, అతడు వచ్చి నీ ఆధీనంలో ఉంటాడు" అంటే కుంతి మారు పలకడానికి భయపడి మహా ప్రసాదమంటుంది.

ఒకనాడు ఋతుస్నాతయై తూర్పుదిక్కున ఉదయిస్తున్న బాలసూర్యుని చూసి మనస్సు రాగనరంజితం కాగా సహజ కవచకుండలాలతో శోభిల్లే నీ వంటి తేజోరాశిని, సుందరుని పుత్రునిగా యిమ్మని మనస్సులో కోరుతూ మంత్రాన్ని జపించింది. మారు రూపంలో వచ్చిన సూర్యుడు 'నీ మంత్ర బలం వల్ల వచ్చాను. నీ వాడనైనాను. నీ మనస్సుకు నచ్చేటట్టుగా నేనేమి చెయాలి? ' అని అడుగుతాడు. తాను కేవలం కుతూహలంతో జపించినంత మాత్రానరావలసిన పని లేదని, ఆకాశానికి తిరిగి వెళ్ళమని కుంతి ప్రార్థిస్తుంది.

" కార్యమొక్కటియు లేదు కౌతుకమున
నేను మంత్రంబు నొడివితి నింతమాత్ర
జేసి నీకు నిచ్చటికి విచ్చేయనేల
దివికి నేగుము క్రమ్మతీ దేవ నీవు" [1]

" వచ్చిన తర్వాత వెళ్ళక తప్పుతుందా? నన్ను గూర్చి మనసులో ఏమని భావించావో అది యిప్పుడు తప్పుకాదు. తేజంలో నాతో సమానుడైన, సహజ కవచకుండలభూషితుడైన కొడుకును కోరుకున్నావు కదా! కాబట్టి నా సమాగమానికి అంగీకరించు. నీవు కోరినట్లేకుమారుడు జన్మిస్తాడు లేదా నిన్ను నీ తల్లి తండ్రులను, నీ శీలస్వభావం తెలియక గర్వంతో నీకు మంత్రం ఉపదేశించిన మునిని ఈ క్షణమే దహిస్తాను. నీ మూలంగా ఇక్కడ చిక్కుపడిన

1. భార. అరణ్య. ఆ.7 ప.328

నన్ను చూసి ఇంద్రాది దేవతలు నవ్వుతున్నారు చూడు " అని దివ్య దృష్టినిస్తాడు. కుంతి చూసి మనస్సులో అంతులేని లజ్జాభారంతో" నన్నివ్వడానికి నా తల్లి తండ్రులు కర్తలు. నేను స్త్రీ ధర్మాన్ని విడువవచ్చునా? అది ధర్మహాని కాదా, మంత్ర బలాన్ని తెలుసుకోగోరి తప్పుచేశాను. దీన్ని అపరాధంగా భావించక నా బాల్యాన్ని తలచి కరుణించ"మని అనేక విధాల సూర్యుని ప్రార్థిస్తుంది.చివరకు విఫలురాలై తన మూలంగా కులానికి బంధుజనానికి, తల్లి దండ్రులకు అపాయం కలుగుతుందని భయపడి చాల తెగింపుతో మాట్లాడుతుంది.

" నన్ను నిచ్చుటకు కర్తలు
జననియుజనకుండు గాక చనునే నాకున్
వనితా ధర్మువు విడువగ
ననఘా యిట్లయిన ధర్మహానియు గాదే" [1]

" మంత్రబలమెఱుగమదిగోరి తప్పుచే
సితి మహాత్మ దీనిజెట్టకాగ
నవధరింప కెట్టులైన నా బాల్యంబు
గరుణసైపవలయు గమలమిత్ర" [2]

" అని మఱియు ననేక ప్రకారంబుల దివాకరుననునయించి యెట్లునుం గ్రమ్మఱింపనేరక తన కారణంబున గులంబునకును గురుజనంబునకును నపాయం బగునని యునుం దలపోసి భయంబు మిగుల దెగువచేసి యతని కిట్లనియె" [3]

తల్లిదండ్రులు, బంధువులు ధర్మమార్గంలో పెండ్లి చేసిన తర్వాత మదనకేళి తగినది గాని కులశీలాలు ఆలోచింపకుండా స్త్రీలిట్లా వేడుక సల్పవచ్చునా, దీని వల్ల నీకీర్తి మలినమవుతుంది గదా, బంధుమతినైన నన్ను ధర్మబాహ్యమైన తీరున ఇట్లా నిర్బంధింప వచ్చునా, లోకానికంతా సత్యానివి, ధర్మానివి నీవే గదా, దేవా! నీకు తెలియని న్యాయముందా? నీ బుద్ధికి పని తగినదని తోస్తే నేను బదులు పలుకను. ఏమైనాగానీ నీ యిష్టం వచ్చినట్లు చేయి. తర్వాత లోకనిందను నేనోర్చుకుంటాను" అని నిస్పృహతో పలుకుతుంది.

---

1. భార.అరణ్య.ఆ.7.ప.332 2. అదే. ప.333 3. అదే.ప.334

"జగములయందు ధర్మువును సత్యము నీ యదిగాదెదేవయే
తగవులు నీ యెఱుంగని విధంబులె యిట్టిది నీదు బుద్ధికిం
దగవగు నేని మార్పలుకు దాననెయేనగుగాక నీకు నిం
పగు తెఱగాచరింపుమిట యావలనయ్యెడు నిందకోర్చెదన్" [1]

అప్పుడు సూర్యుడు "నిన్నియ్యడానికి నీ తల్లి తండ్రులు బంధువులు కర్తలు గారు. నీకు నీవే అధికారివి. కామములన్నింటిని కామించి పొందడం చేతనే కన్యా శబ్దమైనది. కాబట్టి నీవు స్వతంత్రించి ప్రవర్తించడంలో దోషం లేదు. నా సమాగమంతో నీ కన్యాత్వం చెడదు అధిక తేజోమయుడైన కుమారుడు కల్గుతాడు. లోకనిందకూడా కలుగదు.' అని ఆమెను ఒప్పించి, గర్భవతిని చేసి, గగనానికేగినాడు. గర్భందినదినాభివృద్ధి నొందుతున్నా సూర్యుని మహిమవలన లోకానికి తెలియదు. పదినెలలు నిండిన తర్వాత ఒకనాటి రాత్రి అంతః పురంలో కుంతి సహజకవచకుండలాలచే శోభితుడు, సుందర దేహుడు, దీర్ఘ బాహుడు, అరుణభాస్కర తేజుడైన కుమారుణ్ణి కంటుంది, దాది కూతురొక్కదానికే ఈ రహస్యం తెలుసు. లోకాపవాద భీతితో కుంతి ఆ చెలికత్తెతో కలసి ఆ బాలుని పెట్టెలో పెట్టి దాన్ని బలంగా తెప్పలో బంధించి అశ్వనదీ ప్రవాహంలో వదులుతుంది. పుత్ర వియోగానికి అమితంగా దుఃఖిస్తూ" కొరనోములు నోచిన నేను నిన్ను కన్నానే గాని పెంచే అదృష్టానికి నోచుకోలేదు. పున్నమి చంద్రుని బోలిన నీ ముద్దు మోమున చిందులాడే చిరు నవ్వులు చూడక, నిన్ను గాఢంగా కౌగిలించుకోక, ఈ విధంగా ప్రవాహంలో వదులుతున్నాను. నా కిట్లాంటి పరిస్థితి కల్పించిన దైవాన్ని ఏమనగలను? నీవే పుణ్యవతికి చిక్కుతావో, ఏ పుణ్యాత్మురాలు నీ ముద్దు నడకలు అవ్యక్త మధురాలాపాలు కన్నుల పండువుగా , వీనుల విందుగా చూచి విని తరింపగలదో గదా! నిన్ను గుండెలకదుముకొని , ముద్దులాడి ఏ ధన్యాత్మురాలు ఆనందింపగలదో గదా! యౌవనవంతుడవైన తర్వాత నీ రూపవిలాసాలతో స్త్రీలపాలిట మన్మధుడవై, శత్రువుల పాలిట భయంకరుడవైన నిన్ను ఎక్కడున్నా ఎప్పుడైనా కన్నులారా చూడగలనా, నిన్నుగని సూర్యుడు ధన్యుడైనాడు. సూర్యుడరచేత దాగుతాడా? ఎప్పటికైనా నీ శరీర తేజము, చెవి కుండలాలు, సహజకవచము నిన్ను గుర్తించేటట్లు చేస్తాయి.

1.అరణ్య.ఆ.7.ప.337

"దివిభువి నంతరిక్షముల దిక్కున గాడ్పున నగ్నియందున
ర్ణవముల యందు ఘోరవిపినంబుల యందునునీకు నెల్లెడన్
శివమగుగాక దిక్పతులు సిద్ధులు సాధ్యులు రుద్రులాశ్వినుల్
పవనులు బుత్ర నిన్ను గృపబాయక యెప్పుడు గాచుచుండెడిన్"[1]

అని యేడ్చుచుం గుంతి యచ్చటం దడయ వెఱచి గూఢప్రకారంబున గన్యాంతఃపురంబునకు వచ్చి యెప్పటి యట్ల వర్తిల్లుచుండె" [2]

భూమ్యాకాశాలలోగాని దిక్కులలోగాని, గాలి,నీరు, అగ్నియందుగాని, ఘోరారణ్యాలలో గాని - అన్ని చోట్ల నీకు శుభమగుగాక! దిక్పాలకులు, సిద్ధులు, సాధ్యులు రుద్రులు , అశ్వినులు, దేవతలు, గాలులు నిన్నెప్పుడూ కాపాడుదురుగాక! అని దీవిస్తూ ఆలస్యం చేయకుండా రహస్యంగా కన్యాంతఃపురానికి వచ్చి ఎప్పటిలాగా ఉంటుంది.

ఇంత మనోహరంగా, హృదయ స్పర్శిగా ఎఱ్ఱన కుంతిని చిత్రించినాడు.

## తిక్కన చిత్రణలో కుంతి

పాండవరాయబారిగా కౌరవుల వద్దకు వచ్చిన శ్రీకృష్ణుడు విదురుని యింటికి వెళ్ళి కుంతిని చూడబోతాడు. అతణ్ణి చూడగానే ఆమె అతని తోడునీడగా ఉండిన తన కొడుకులను తలచుకొని దుఃఖాతిశయంతో అతని మెడ పట్టుకొని విలపిస్తుంది. ఎట్లో తన దుఃఖాన్ని అణచుకొని అతనికి తగిన ఉపచారాలు చేసి తగిన పీఠంలో కూర్చోబెట్టి తాను సమీపంలో కూర్చొని గద్గద స్వరంతో " నీ శిక్షణలో పెరగడం వల్ల పాండురాజు కుమారులు నీతిమంతులుగా పుణ్యాత్ములుగా శూరులుగా తయారైనారు. అందరూ తమను సేవిస్తూ ఉంటే సుఖంగా ఉండేవాళ్ళు. అరణ్యాలలో కష్టాలు పడుతూ ఎలా ఉన్నారు? నా శరీరాన్ని మాత్రమే ఇక్కడ ఉంచి" నా మనస్సును తమతోనే తీసుకొని పోయినారు. నేను వడ్డించగా కడుపార భుజించి, మెత్తని శయ్యపై నిద్రించి, వైతాళిక బృందాల ...తాలతో మేల్కొనేవారు. ఇపుడు పక్షులు జంతువులు అరుస్తుండగా ...ల్కొంటున్నారా? తండ్రిలేని నా బిడ్డలు తల్లిని కూడా వదిలి ఉన్నారు. ...తోకాలం దుఃఖాలు ఆపదలు అనుభవించినారు.

దానదయాపరుడైన ధర్మరాజు క్షేమమా? సింహబలుడు భీముడు భద్రమా, అస్త్రశస్త్ర విద్యావిశారదుడైన అర్జునుడు కుశలమా, వినయమే ఆభరణంగా గల

1. భార. అరణ్య. ఆ.7 ప.348 2. అదే. ప. 349

నకుల సహదేవులు సుఖంగా ఉన్నారా? సాధ్వి ద్రౌపది క్షేమంగా ఉందా? కొడుకులకంటే కోడలిపైనే నాకు ప్రేమ ఎక్కువ.నా కుమారుల కంటె కోటిరెట్లెక్కువ భక్తితో నాకు సేవలు చేసేది. పుణ్యచరిత. కులంలో పేరుగాంచినది. కొత్తకోడలైన ఆమెకు సభలో జరిగిన అవమానాన్ని ఓర్చుకొన్న నేను దేనికైనా, ఎంతైనా ఓర్చుకొన గలను. మేమనుభవించిన అంతులేని దుఃఖాలు లోకంలోని వారెవ్వరు అనుభవించినారు? విదురుడొక్కడు తప్ప ఇది ధర్మసంక్షోభమని సభలోని వారెవ్వరూ అడ్డుకొనలేదు. అతనిశీలమే యీలోకానికి రక్ష'' అని తన మనస్సులోని దుఃఖాన్ని తలచుకొని శోకాతిశయంతో'' ఇవన్నీ ఒక యెత్తు. ఈ పదమూడు సంవత్సరాలు బావకొడుకుచే నేను దయలేనికూడు కుడువడం ఒక యెత్తు.

" ఇదియెల్లను నొకతల యీ
పదమూడేడులు నాకు బావకొడుకుచే
నదయమగు కూడుగుడుచుట
యదియొక తలయయ్యె నేమియనగల దనఘా!"

దుర్యోధనుని నేను నాకన్నకొడుకు లాగానే చూచుకొన్నానుగాని, భేదంగా చూడలేదు. అందుకా దైవమే సాక్షి. ఇదే నిజమైతే చిట్టచివరకు పాండవులూ నీవూ పాపరహితులై సంతోషంగా ఉండడం చూడగలను. నా దుఃఖానికదే మందు. బావ అంగీకరింపడనడమెందుకు, అతని కొడుకును నిందించడం ఎందుకు? ఇటువంటి క్రూరుల యింటికి నన్నిచ్చిన మనవారిననుకోవాలి.

"బావ మెప్పండను పలుకుల నేమగు నాతని కొడుకు గీడాడనేల? కురువృద్ధులైన బాహ్లికుల దూఱనేటికి? భీష్మునిపై బ్రయివెట్టనగునే? యిట్టి క్రూరుల యింటికిచ్చిన మనవారి నందుగాక "

అర్జునుడు పుట్టినప్పుడు వీడు లోకాలన్నిటినీ గెలువగలడని ఆకాశవాణి పలికింది. అంతేగాదు, కౌరవులను యుద్ధంలో జయిస్తాడని, సోదరులతో కలసి గొప్ప రాజ్యాన్ని పొందుతాడని పలికింది. ధర్మమే ఉంటే అదంతా నిజమవుతుంది. దీన్నంతా నిర్వహింపగలవాడవు నీవున్నావు గదా! నీ నెచ్చెలులకు చెప్పవలసిన మాటలున్నాయి విను. రాజపుత్రులై ఉండి, హీనంగా వేడుకొవడం తగదు, దేహ ప్రతాపం తప్పితే వాళ్ళను చూసి జనులు భయపడరు, గౌరవింపరని యుధిష్ఠురునితో చెప్పు. ఏ పనికై రాజపుత్రి కొడుకుల గంటుందో దానికి తగిన సమయం ఆసన్న మైందని, ఇక ఆలశ్యం చేయకూడదని, అప్పుడుగాని ప్రజలు వారిని పురుషులనరని భీమార్జునులతో చెప్పు. భుజబలంతో జీవించడం

నిజధర్మమని, మెత్తబడడం నింద్యమని మాద్రి కొడుకులకు చెప్పు. చేయవలసిన దాన్ని గూర్చి ద్రౌపది నడగమని అందరితో చెప్పు.

రోషంతో పూనుకుంటే భీమార్జునుల కెదురులేదని నీకు తెలియదా? అన్ని కష్టాలు పడితిమి. వాటన్నిటిని తీర్చవద్దా? ఆ పనికి పాండుపుత్రులున్నారు. నీకు తోచినట్లు వాళ్ళకు కర్తవ్యం ఉపదేశించు. నాబాధను తొలగించి నన్ను కడతేర్చు." అని దుఖావేశంతో పలికింది.

శ్రీ కృష్ణుడామెను ఓదారుస్తూ" నీవు గుణవంతురాలవు. పుట్టినింటికి, మెట్టినింటికి కీర్తిని యినుమడింపజేసేటట్లు నడచుకొనేదానవు. నీ మనస్సులోని దుఃఖాలను నీవే అణచివేయక పోతే యింక లోకంలో ఎవరు దుఃఖాలను ఓర్చుకోలరు? దిగులు మానుకో నీ మనస్సులోని బాధలన్నీ తీరుస్తాను. నీ కొడుకులు, కోడలు క్షేమంగా ఉన్నారు. నీకు భక్తితో నమస్కరించినారు. మనస్సులో నిన్ను కౌగలించినారు. వేరే సుఖాలుగాక వీరులకు కలిగే సుఖాలే నీ కొడుకులు కోరుతున్నారు. ఉత్సాహంతో శత్రునాశనం చేసి, సామ్రాజ్యాన్ని పొందడం నీవు చూస్తావు" అనగానే కుంతి ముఖం విప్పారింది. "పాండవులకు తల్లి, తండ్రి, గురువు దైవం అన్నీ నీవే. నీ మనస్సులో ఏది ధర్మం ,హితమని ఆలోచిస్తావో దాన్నే వారు చేసేటట్లుగా చేసి వృద్ధి పొందేటట్లు చేయి. నిన్ను చేరితే ఆపదలు కల్గుతాయా? వాళ్ళకు, కౌరవులకే కాదు, లోకాలకు కూడా నీవే దిక్కు నీ పలుకే అందరికీ వేదం" అని పల్కుతుంది. శ్రీకృష్ణుడు ప్రసన్న వదనంతో ఆమెను వీడ్కొన్నాడు.

రాయభారం విఫలమైన తర్వాత శ్రీకృష్ణుడు మళ్ళీ కుంతీగృహానికి వెళ్ళి, ఆమెపాదాలకు మ్రొక్కి కౌరవ సభలో నడచిన వృత్తాంతాన్ని వివరించి,కౌరవులు కావరంతో భవిష్యత్తును తెలుసుకొనలేకుండా ఉన్నారని, యుద్ధం తప్పదని, అది తమకే మేలని, అర్జునుని బాణాలకు వారు ఆహూతి అవుతారని చెప్పి, పాండు పుత్రులకు తగిన మాటలు ఆనతిమ్మని అడుగుతాడు.

అప్పుడందరూ వినేటట్లుగా కుంతి " విక్రమోపజీవులైన ముచికుందుడు, సృంజయుడనే రాజు చరిత్ర యుధిష్ఠరుడెరుగడా? పరాక్రమంతో తప్ప వేరొక జీవన విధానం రాజులకు నిషిద్ధం కదా? అట్లనే మునులు చెప్పి యున్నారు. సన్మార్గులు వంశ ధర్మాన్ని ప్రశంసనీయంగా నిర్వర్తిస్తారు. బుద్ధి హీనులు దాన్ని విస్మరించి, నిస్తేజపు కూటి నంగీకరించి, దైన్యాన్ని పొందుతారు.సంధి తప్పిపోవడమే మేలయినది. తన వంశానికి ఉచితమైన వీరోచిత కార్యానికర్జునుడు పూనుకోకుంటే

దైన్యం కల్గుతుంది. భుజబలోపేతుడైన భీమునికీ సంధి తగినదా? జగములన్నిటికీ మాన్యుడవైన నీవు ఇట్లా సంధికోసం రావచ్చునా? దైవమే దాన్నీ విధంగా తప్పించినది.ద్రౌపదికి నాడు సభలో జరిగిన అవమానం మరచినారా? ధర్మమార్గాన్ని తప్పడాని కప్పుడు భయపడడం తగినదేమో గాని, ధర్మాన్ని పాడుచేస్తే శాశ్వతమైన కీర్తి పోగొట్టుకొనవలసి వస్తుంది." అని పలికి కృష్ణుని కౌగలించుకొని తానుసుఖంగా ఉన్నానని పాండవులతో చెప్పమని వీడ్కొల్పింది.

బంధుక్షయకారకమూ, కౌరవవంశనిర్మూలనకారణమూ అయిన యుద్ధాన్ని గూర్చి కుంతీదేవితో ముచ్చటిస్తూ విదురుడు కుంతితో పాండవులు సంధినే కోరుకున్నారని, తులువయైన దుర్యోధనుడు తోడబుట్టినందువల్ల వాళ్ళకిటువంటి ఆపద కలుగుతున్నదని, అనేక విధాల పాండవులకు కల్గబోయే కష్టాలను గూర్చి బాధపడతాడు.

మనస్సులో కుంతి "రాజ్యభాగం కోసమై తమవారిని చంపడం తగునా, యుద్ధం అందరికీ దుఃఖాన్ని కల్గింపక మానదు గదా, ద్రోణ భీష్మ కృపుల ఆటోపాలు తేలికగా తీరేవికావు. కర్ణుని మనస్సెప్పుడూ క్రోధదీప్తం. భీమార్జునుల మీద తప్ప అతనికి యితరులపై ఆసక్తిలేదు. అని పరిపరి విధాల తలపోస్తుంది. కర్ణుని పుట్టుకను గురించి తెలియజేస్తే అతడు సోదర స్నేహాన్ని పాటించి యుద్ధ ప్రయత్నాన్ని విరమించకుండా ఉంటాడా? అని వితర్కించుకొని, అతడు గంగాతీరానికి అనుష్ఠానార్థం వెళ్ళడం తెలుసుకొని, అక్కడికి వెళ్తుంది. అతడు జపం చేస్తున్నంతసేపూ వెనుకనే కూర్చుంటుంది. తర్వాత కర్ణుడు కుంతిని చూచి సంభ్రమాశ్చర్యాలతో తన గోత్రనామాలు చెప్పి, మ్రొక్కి, ఆమె వచ్చిన కారణమడుగుతాడు. ఆమె అతని జన్మ వృత్తాంతం చెప్పి "ధర్మ ప్రకారం నీవు పాండు నందనుడవే. ఇతరులను సేవింప వలసిన అవసరం నీకు లేదు. ధర్మజాదులైన నీ తమ్ములకు, కౌరవులకు,నీవే తగిన రాజువు. ఈ లోకాన్నంతటిని పాలించు. రాధకొడుకితడనే తక్కువతనం నీకెందుకు? అంటుంది. సూర్య బింబంలోనుండి "నాయనా, ఇది సత్యం ఈ ప్రకారమే చేసి వృద్ధి పొందు" అని వినబడుతుంది. అది విని కూడా కర్ణుడు ధృఢ మనస్కుడై "నీ మాట నిజమే అయినా క్షత్రియ సంస్కారానికి నేను తగినవాడనని నీవు పాటింపక పోయితివి. సూర్యానుగ్రహంచేత పుట్టడం వలన నాపుట్టుక నింద్యం గాకపోయినా రహస్యంగానే ఉంది. ఇప్పుడు బయల్పరచడం మనకెంతవరకు మేలు? అర్జునుని పరాక్రమం లోక ప్రసిద్ధమై ఉండగా నేను కుంతికుమారుడను సూర్యుని వరం

వలన పుట్టినానని అతనిని చేరబోతే నేనతనికి భయపడితిననుకొనరా? దుర్యోధనుని కోసమై నేను నీకొడుకులతో తప్పక యుద్ధం చేస్తాను. నానిర్ణయమిదే. కాని యీ పనికోసం నీవెంతో కష్టపడి వచ్చావు కాబట్టి ధర్మజాదులు చేజిక్కినా, చంపక వదిలి పెడతాను. అర్జునునిపై నాకు కోపం ఎక్కువ. వాడు దొరికిన వెంటనే తప్పక చంపుతాను. వానిచే నేను చచ్చినా నీకు కీర్తే. నేను చచ్చినా లేక అర్జునుడు మరణించినా నీకైదుగురు కొడుకులే. ఆరుగురు కొడుకులన్న ఆశ వదులుకో"అంటాడు.

హృదయంలో శోకం ఉప్పొంగగా కుంతి "దైవఘటనను తప్పించడం ఎవరికి సాధ్యం? ఆడిన మాట మరువకు. నీ తమ్ములు నల్గురినీ చంపక వదిలిపెట్టు అర్జునుని 'జేత'కు సమ్మతింతు"నని కర్ణుని గాఢంగా కౌగలించు కొంటుంది."అట్లే యగుగాక" అని కర్ణుడు ప్రియమార నమస్కరింపగా కుంతి అక్కడినుండి నిష్క్రమిస్తుంది.

యుద్ధానంతరం పాండవులు గాంధారీదర్శనం చేస్తారు. ఆమె పంపగావచ్చి తల్లిని దర్శించుతారు శోకతప్తయైన కుంతీదేవి చాలాసేపు బాష్పధారలతో వారిని చూసి దుఃఖిస్తుంది అస్త్రశస్త్రాల వల్ల వ్రణాలైన వాళ్ళ శరీర భాగాలను చూసి కుములుతూ, మెల్లగా అక్కడ చేతులతో నిమురుతూ"వచ్చారా నాన్నలారా!" అని ఎలుగెత్తి ఏడుస్తుంది.

**"తచ్చరణంబుల మీద వ్రాలి**
**ఏడ్వనందరిపై జేతులిడచు బెలుచ**
**నేడ్చి యద్దేవి వారలనెత్తి వేఱు**
**వేఱమేనులునివురుచు వివిధదారు**
**ణాస్త్ర శస్త్ర వ్రణ ప్రచయములు గాంచి"** [1]

"అచ్చోటు లనంటి చూచుచూ
వెచ్చని యూర్పులునిగుడ్చు వేగుచు బొగులుం,
గ్రుచ్చి కవుగింట జేర్చును
వచ్చితిరే నృపకుమార వరులార యనున్ " [2]

ప్రక్కనే యున్న ద్రౌపది దైన్యదేవతలాగున"నీ మనుమలైన సౌభద్రాదు లెక్కడికి వెళ్ళారు? నన్ను చూడటానికిప్పుడెందుకు రాలేదని నేలమీదబడి రోదిస్తుంది.

---

1. భార. స్త్రీ. ఆ1. ప. 178 2. భార. స్త్రీ.ఆ.1.ప.179

ఆమెను చూచి కుంతి తానూ బిగ్గరగా యేడుస్తుంది.

యుద్ధంలో చనిపోయిన బంధుమిత్రులకు, పుత్రులకు ధర్మరాజు అగ్ని సంస్కారం చేస్తాడు. ఆ సమయంలో అడలుతున్న మనస్సుతో కన్నీరు ముఖాన్ని కప్పివేయగా కుంతి అందరూ వినేటట్లుగా " ప్రజలందరూ కర్ణుని రాధేయుడంటూ ఉంటే మీరు కూడా ఆ విధంగానే అనుకొన్నారు. కాని అతడు నా కుమారుడు. మీ అగ్రజుడు. భాస్కరుని దయవలన జన్మించినాడు. అతనికి కూడా మీరు తిలోదకాలు వదలవలె"నంటుంది.

"మీకు నగ్రజుండు నాకు భాస్కరుని దయ
లలిత కవచకుండలముల తోడ
బుట్టినాడు గాన బోయంగ వలయు ది
లోదకంబు లమ్మహోన్నతునకు " [1]

అని అతని జన్మవృత్తాంతం, సూర్యునిప్రసాదభావం తెల్పుతుంది. ధర్మజాదులు నివ్వెరపోయినారు. మహా పరాక్రమవంతుడైనకర్ణుడు తమ అన్న అని తెలిసినధర్మరాజు " అగ్నిని కొంగున దాచినట్లుగా ఈ నిజం నీ వెందుకు దాచినావు? ఎట్లా దాచగలిగినావు? సర్వానర్థాలకు కారణమైన ఈ రహస్య గోపనం మూలంగా కురువంశ నాశనం జరిగిం"దని బాధపడతాడు.

కొంతకాలానికి ధర్మరాజు కర్ణుని తలచుకొని దుఃఖిస్తూ ఉంటే "దుర్యోధనుని చేరిన కర్ణుని కోసం నీ వెందుకు బాధపడుతున్నా"వని కుంతి ప్రశ్నిస్తుంది. ఆ మాటలు ధర్మరాజుకు సహింపలేనివి అయినాయి. లోకంలోని స్త్రీలందరికీ రహస్యగోపన శక్తి లేకుండా ఉండాలని శపించాడు.

యుద్ధానంతరం మహాసామ్రాజ్యాన్ని పాలిస్తూ ఉండిన ధర్మరాజు తమ్ములతో కలసి నిరంతరం గాంధారీ ధృతరాష్ట్రుల యోగక్షేమాలు విచారిస్తూ ఉండినాడు. కుంతి కూడా ద్రౌపదీసుభద్రలతో కలిసి వచ్చి ఎంతో గౌరవంతో గాంధారిని సేవించేది. గొప్పగొప్ప కానుకలు తెచ్చి సమర్పించేది.

ధృతరాష్ట్రుడు గాంధారీ సమేతుడై వనవాసానికి బయలుదేరగా కుంతి కూడా కౌరవ స్త్రీలతో కలసి దుఃఖిస్తూ బయలుదేరింది. పురద్వారంనుండి నిర్గమిస్తూ ధృతరాష్ట్రుడు వారిని వెనుకకు మరలమని కోరినాడు. ధర్మరాజు తాను ధృతరాష్ట్రునితో అరణ్యానికి వెళ్తానని, ఆ స్త్రీలతో కలసి వెనుకకు వెళ్లమని తల్లిని ప్రార్థించాడు. గాంధారీ ధృతరాష్ట్రులే తన అత్తమామలని, వాళ్లను సేవించడం తనకు శ్రేష్ఠత్వం

1.అదే.ఆ.2.ప.176

కల్గిస్తుందని, వారికి శుశ్రూష చేయవలసింది కూడ తానేనని, కాబట్టి తానే వెళ్తానని అన్నది.

"అనుటయు గొంతి యక్కురు కులాగ్రణి కిట్లను నీవు తోడుగా
వనమున కేగు దెంచుట జనస్తవనీయ చరిత్రు డీవ్విభుం
డనుమతి చేయునే యుడుగు మాపని యయ్యామ యత్తనాకునీ
మనుజవిభుండు మామ గరిమంబుగ వీరల గొల్చిపోయెదన్." [1]

"ఇతని కియ్యమకును వినుమేన చువ్వే
వలతి శుశ్రూష సేయంగ వత్స మీర
లా పనికి నేర్తురే వారలడవి కరుగ
నింట నుండంగ నామనసియ్యకొనునె" [2]

వాళ్లడవిలో ఉండగా రాజభవనంలో ఉండడానికి తన మనస్సు అంగీకరించదనీ, వారి శుశ్రూషే తన వ్రతమని అన్నది. అందరినీ అతనికి అప్పగింతలు పెట్టింది. "నీవు సహదేవుని ఏమీ అనవద్దు. కర్ణుని ఏమారక తలచుకో. నేను కపటంతో ఆ దైవసమానుడైన పుత్రుని పుట్టుకను దాచినాను. ఆ పాపం తొలగడం కోసం మంచిమంచి పదార్థాలను దానం చేయి." అని ధర్మజుని కోరుతుంది. కర్ణుడు లోకంతో ఆరడి పడుతున్నా తన హృదయం ముక్కలు కాలేదు, రాతితో చేయబడిందేమో నని తన్ను తాను నిందించుకొన్నది.

"అవ్విధముగ గర్ణుడారడి బోయిన
నాదు మానసంబు పోదు నూఱు
పఱియలై తలంప బలుఱాత జేసిన
యదియ కాగవలయు నధిపవర్య"[3]

ద్రౌపదిని దృఢ సంభావనతో మన్నించమని, భీమార్జున నకుల సహదేవుల కోరికలు తెలుసుకొని మన్నించమని, ధర్మం ఏమారవద్దని, అప్పగింతలు పెట్టి, తన నిశ్చయం మారదని వీడ్కోలు పలికింది.

ధర్మరాజు బేలగా తల్లిని "ఎప్పుడూ మమ్ములను ఆజ్ఞాపించి పనులు చేయించుకొన్న విధంగా, సామ్రాజ్యనిర్వహణలో ఎప్పటికప్పుడు మాకు తగిన సలహాలనిస్తూ నీవు నడిపించకపోతే ఎట్లాగ? మమ్ములను, ద్రౌపదిని విడిచి

1. ఆశ్రమ.ఆ. 1. ప.147 2.అదే.ప.148 3.అదే.ప.154

అడవిలో ఎట్లా ఉండగలవు?" అని దీనంగా అడిగినాడు. భీముడు "నీ యాజ్ఞచేతనే గదా ధర్మజుడు రాజులతో యుద్ధం చేసి వారిని సంహరించినాడు. ఇప్పుడీ రాజ్యసంపద ననుభవించక పోవడం న్యాయమా?" అని ప్రశ్నించినాడు.

ద్రౌపది, పాండవులు దుఃఖిస్తూ ఉంటే, ఇంక తాను కఠినంగా మాటలాడకపోతే వాళ్లు వెనుకకు మరలరని కుంతి"మాయాజూదంలో మీరు ఓడిపోవటం, ఆ సభలో అపకీర్తి పొందడం నేను సహించలేకపోయాను. శత్రువులు పరిహసించేటట్లు కౌరవులతో వర్తించడం ఎందుకని కృష్ణునితో ఆవిధంగా పల్కినాను. పూజనీయుడైన ఈ ధర్మనందనుడు, మదమత్తేభంతో సమానుడైన భీమసేనుడు, శత్రుభయంకరుడగు యీ పార్థుడు, శౌర్యలోలురైన నకులసహదేవులు, దైన్యం పొందడం నేను చూడలేక పోయాను. ఎంతో గౌరవం, సుకుమారత్వం గల యీ ద్రౌపదిని జుట్టుపట్టి యీడ్చి దుశ్శాసనుడవమానింపగా కౌరవసభలోని పెద్దలెవ్వరూ వారింపలేకపోయారు. ఆ అవమాన మట్లా సహింపవలసి వచ్చింది. నీ తేజం నీరై పోయింది. నీ తండ్రి పాండురాజు వంశం గురించి చెప్పడానికి, చూపడానికి లేకపోయింది. కాబట్టే కదా నేను శ్రీకృష్ణునితో ఆ విధంగా మాటలాడినాను. మీరే విధంగానైనా తేజరిల్ల వలెనన్నదే నా తలంపు. ఇప్పుడు భీముడీ విధంగా ఎత్తి చూపుతున్నాడు." అనగా ధర్మజుడు, భీముడు సిగ్గుపడినారు.

తన మనస్సులో వేరే తలంపు లేదని, ధర్మజుని రాజ్యసంపద మూలంగా ఉత్తమదానాలు చేయగల్గినానని, అశ్వమేధయాగం చూచి సంతోషించినానని, తనకే కొరతా లేదని, రాజ్యఫలం గాక సమగ్రతపఃఫలమైన ఉత్తమగతిని, ప్రసిద్ధిని తాను కోరుకుంటున్నానని, అది లభించాలంటే తన కటువంటితోడు మరింక దొరకదని, గాంధారీ ధృతరాష్ట్రులకు పరిచర్యలు చేస్తూ తపోవృత్తిలో శరీరాన్ని కృశింపజేస్తూ కాలం గడుపుతానని అన్నది.

**"రాజ్యఫలముకామింప బుత్త్రాసమగ్ర**
**తపమునకుఫలమైనయుత్తమగతి ప్ర**
**సిద్ధిగోరుదు నది గల్గజేత కిట్టి**
**తోడు మఱి నాకు గలుగునే దురితదూర"** [1]

**"కురురాజునకును దేవికి**
**బరిచర్య లొనర్చుచుం దపంబున గృశతం**

1. భార. ఆశ్రమ.ఆ1.ప.171

బొరయు తనువుతో గడిపెద
గరమునియతి నింక గలుగు గాలము వత్సా" [1]

శతయూమహర్షి ఆశ్రమంలో గాంధారీ ధృతరాష్ట్రులు తపస్సు చేస్తుండగా మూడు సంవత్సరాల పాటు కుంతి వారికి పరమభక్తితో శుశ్రూష చేసింది. వనవాసంలో ఉన్న తల్లిని చూడటానికి వెళ్లాలని సహదేవుడు అన్నలకు జ్ఞాపకం చేసినాడు. కుంతి కోడళ్లందరూ ఆమెను చూడగోరుతున్నారన్నాడు. పాండవులందరూ మాతృదర్శనార్థం బయలుదేరినారు. తల్లిని చూడగానే సహదేవుడు పరుగెత్తుతూ వెళ్లి, ఆమె కాళ్ళపై బడి యేడ్చినాడు. కుంతి అతన్ని కౌగిలించుకొని యేడ్చింది. అందరినీ కౌగిలించుకొని, కన్నీరు తుడిచి దీవెన లిచ్చింది. అలసట లేక ఆమె తమకు సేవలు చేస్తున్నదని ధృతరాష్ట్రుడు ధర్మజునితో పల్కినాడు. పాండవులు దుఃఖభారంతో తల్లి వద్ద వీడ్కోలు పొంది వెనుకకు మరలినారు.

తమను చూడవచ్చిన వేదవ్యాసునితో కూడ ధృతరాష్ట్రుడు కుంతితీరు, శుశ్రూష అద్భుతంగా ఉన్నాయని, తమకెంతో సంతోషం కల్గిస్తున్నాయని ప్రశంసించినాడు.

"................కొంతి తెఱగు శుశ్రూషయు
నద్భుతంబు ముదము నావహించు......." [2]

వ్యాసుడు వరం కోరుకోమంటే ధృతరాష్ట్రుడు యుద్ధంలో మరణించిన తన కుమారు లేమైనారో తెలిసికొనగోరినాడు. వాడిన ముఖంతో కుంతి తన మనస్సులో కర్ణుని తలచుకొన్నది. తపోనిధియైన వ్యాసుడు అది తెలుసుకొని "నీ కోర్కె తీర్చెద కోరుకొమ్మ"న్నాడు. సిగ్గుపడుతున్న అంతరంగంతో కుంతి కర్ణుని జన్మవృత్తాంతం వ్యాసునికి వివరించింది.

".......... అత్తాపస వరుండు వరం బెల్ల భంగి నొసంగక పావనడుగమనుటయు వెఱచియు నాడు వేడ్క తెఱంగ యగుటను బుత్రుం గోరితి గోరిన నమ్మునిపతి యొక్క మంత్రం బనుగ్రహించి దీన నీ వావహించిన దేవతలు భవద్వశగతులై సుత జన్మంబు గల్గింతురు విశేషించి ధర్మువునకు తల్లివి కాగలవని పలికి యంతర్ధానంబు చేసిన......." [3]

ఒకనాడు ఉదయిస్తున్న సూర్యునిజూచి అజ్ఞానంచే ఆహ్వానించగా సూర్యుడు ప్రత్యక్షమై వరమిస్తాననగా తాను చేతులు జోడించి వెనుకకు వెళ్ళమని ప్రార్థించినా వినకుండా తనను వ్యర్థంగా ఆహ్వానించడం తప్పని తనకు

1. భార - ఆశ్రమ- ఆ1.ప.172 2. 3. భార.ఆశ్రమ. ఆ2. ప97

మంత్రమిచ్చిన మునిని, తనను శపిస్తాననగా భయపడి అతనివంటి కొడుకు నీయమని కోరినానని అతడు తన తేజస్సుతో తన యింద్రియాలను,మనస్సును, చూపులను సమ్మోహితం చేయగా కుమారుడు పుట్టినాడని , తన కన్యాత్వం వికలం కాదని వరమిచ్చినాడని కుంతి చెబుతుంది.

"అడుగుమిచ్చెద వరంబనిన వడంకుచు
గేలుమోడ్చి పొండేల యిచట
ననిన వృథాహ్వాన మాచరించుట తప్పు
నిన్నును నెవ్వడు నీకు మంత్ర
మిచ్చెనాతని శపియింతు జుమ్మాయని
పలికె నయ్యర్కుడే నలికి గురుని
నిరపరాధుని శాపనిహతునిగా జేయుట
కోర్వక పుత్రకు నొసగు దేవ
కృపభవత్సముని ననిన నయ్యపరిమేయ
తేజుడాత్మ తేజమున నాదృఙ్ముఖేంద్రి
యములు మనసును సమ్మోహితము జేసి
యపుడు తనయుండు పుట్టెడు మనియె బిదప" [1]

"తల్లితండ్రులకు, బంధువులకు తెలియకుండ గూఢంగా వర్తించి కొడుకును గని యేటిపాలు చేసినాను. ఇప్పటికీ యిది కలలో జరిగినట్లు నాకు తోస్తూ ఉంటుంది. ఆ పాపపు పనికి యిప్పటికీ భయపడుతూ ఉంటా"నని కుంతి వ్యాసునికి నివేదించుకొన్నది. "నీ యందు దోషం లేదు. కర్ణునికావిధంగా జరుగవలసి ఉంది. కాబట్టి నీవతన్ని యేటిలో వదిలావు. కన్యాత్వహాని లేకపోవడం చేత కులాగ్రగణ్యావైనావు" అని వ్యాసుడామె నోదార్చినాడు.

ధృతరాష్ట్రుడు శతయూపమహర్షిఆశ్రమం విడచి గంగాద్వార పరిసర ప్రాంతాలలో కేవలం గాలిని మాత్రమే స్వీకరిస్తూ తపస్సు చేయసాగినాడు. గాంధారి నీటిని మాత్రమే గ్రహిస్తూ తానూ తపస్సు చేస్తుంది. కుంతి తానే వారిద్దరికీ రెండు కన్నుల్లా నడచుకొంది.

ఒకనాడు వారు గంగాస్నానం చేసి తిరిగి వస్తుండగా దావాగ్ని వారిని చుట్టుముట్టింది. ఆ దావానలంలో వారు ముగ్గురూ దగ్ధులైనారని నారదుడు తరువాత ధర్మరాజుకు తెల్పుతాడు.

ఇదీ తిక్కన చిత్రించిన కుంతి కథ.

1. భార-ఆశ్రమ-అ.2. ప.101

## 136. రాధ

కర్ణుని పెంచిన తల్లి. కన్యగా ఉండి, తల్లియైన కుంతిచే నదిలో వదలబడిన శిశువుతో గూడిన పెట్టె అతిరథుడనే సూతునికి దొరుకుతుంది. సంతాన హీనుడైన అతడు మహాసంతోషంతో ఆ శిశువును తీసుకొని వెళ్లి తన భార్యరాధ కందిస్తాడు. ఆమె ఆబిడ్డ నెత్తుకోగానే చనుబాలు కురుస్తాయి. రాధ కన్నతల్లికన్నా మిన్నగా కర్ణుని పెంచుతుంది.

అందుకే కుంతి వచ్చి కర్ణ జన్మరహస్యం తెల్పి తానతని తల్లినని, పాండవ పక్షానికి రమ్మని "రాధ కొడుకుననే తక్కువతనం నీకేల?" అన్నప్పుడు కర్ణుడు "పసిపాపనైన నన్ను కన్నతల్లివైన నీవు గంగపాలు చేసినావు. నా మూత్ర పురీషాదులు భరించి, విద్యాబుద్ధులు చెప్పించి నన్ను పెంచిన రాధా అతిరథులే నా తల్లి తండ్రులు. నేను కౌంతేయుడను కాను. రాధేయుడనే" అంటాడు.

"మూత్ర పురీషాదులు దమ
గాత్రములందింకవారు గౌరవ మొసగం
బుత్త్రుండని సంవర్ధిత
గాత్రునిగ జేసి రింతకాలము గూర్మిన్" [1]

రాధ కన్న తల్లికన్న మిన్నయైన ప్రేమతో కర్ణుని పెంచి, అతని ప్రేమను చూరగొన్న మాతృమూర్తి.

## మాద్రి

ముని శాపగ్రస్తుడైన పాండురాజు తాను వనవాసంలోతపో వృత్తితో కాలం గడుపుతానన్నప్పుడు కుంతితోబాటు మాద్రి కూడా భర్తను అనుగమించింది. తమను విడిచి వెళ్ళినట్లయితే ప్రాణాలు వదులుతామన్నది.

తోడికోడలు గాంధారికి, సవతి కుంతికి సంతానం ఉంది తనకు మాత్రం లేకపోవడం మాద్రికి అమితమైన దుఃఖాన్ని కల్గించింది.

"కోరిన కోర్కెకుం దగగ కుంతి సుతత్రయంబు గాంచె గాం
ధారియునక్కడను సుత శతంబు ముదంబొనరంగ గాంచెనే
బోరచి యాడు పుట్టువున బుట్టి నిరర్థక జీవనైతి సం
సార సుఖావహం బయిన సత్సుత జన్మము గాన బోలమిన్ " [2]

అని చింతిస్తూ ఒకనాడేకాంతంలో భర్తకు తన మనసులోని కోరికను

---

1. భార. ఉద్యోగ - ఆ.4.ప.34. 2. భార.ఆది.ఆ5.ప.129

చెప్పింది". కుంతీదేవి అనుగ్రహం కల్గితే నేను పుత్రులను పొంద గల్గుతాను అప్పుడు నీకు, నాకు, లోకానికి, మేలు కల్గుతుంది. కాబట్టి నాకు పుత్రులను కల్గింపుమని కుంతికి ఆనతీయు" మని వేడుకొన్నది. పాండురాజు అంగీకరించినాడు. తానూ మనస్సులో ఆమెలాగే ఆలోచిస్తూ ఉంటానని చెప్పి, కుంతిని బిల్చి, మాద్రి కోరికను తెల్పి, సకలలోక కళ్యాణకారు లశ్వినులు కాబట్టి వారి నారాధించి మాద్రికి సంతానం కల్గించమన్నాడు. ఆ విధంగా మాద్రికి అశ్వినుల వలన కల్గిన కవలలకు ఆకాశవాణి నకుల సహదేవులని పేరుపెట్టింది.

ఒకనాడేకాంతంలో మాద్రిపుష్పాభరణాలంకృతయై అపూర్వ శృంగారలీలతో మగని ముందు నిల్చింది. తన సౌందర్యంతో మదనతాపవివశుడైన పాండురాజుని చూచిన మాద్రికప్పుడు మునిశాపం గుర్తుకు వచ్చింది. భర్తను వారించప్రయత్నించింది. పాండురాజు బలవంతంగా ఆమె ననుభవించి వెంటనే విగతజీవుడైనాడు. భర్త శవాన్ని కౌగలించుకొని మాద్రి ఆక్రందించసాగింది. ఆమె ఆక్రందనలను విన్న కుంతి పరుగెత్తుకొని వచ్చి తాను భర్తతో సహగమనం చేస్తానని మాద్రిని అభ్యర్థిస్తుంది.

కాని మునిశాపం తెలిసి కూడా భర్త చావుకు కారణమైన తాను బిడ్డలను కాపాడుకోజాలనని, తనను వారించ వద్దని చెప్పి భర్తతో సహగమనం చేస్తుంది.

## 137 శ్వేతకేతుని తల్లి

ఉద్దాలకుని భార్య, శ్వేతకేతుని తల్లి మహాసాధ్వి.ఒక వృద్ధ బ్రాహ్మణుడతిథిగా వచ్చి, ఆమెను కామిస్తాడు. శ్వేతకేతుడు అది ధర్మ విరుద్ధమని ఆక్రోశిస్తాడు. ఆనాటినుండి స్త్రీలు పరపురుషాసక్తలు కారాదని వివాహితలకు కట్టడి చేస్తాడు.

## 138 జానపది

శరద్వంతుడనే మహాముని ధనుర్వేదం మహానిష్ఠతో చదువుతూ ఉండగా ఇంద్రుడతని నిష్ఠను పాడుచేయ దలచి జానపది అనే యువతిని నియోగిస్తాడు. ఆమె హావ భావ విలాసాలవల్ల చంచలమనస్కుడైన శరద్వంతునికి రేతః పతన మవుతుంది. శరద్వంతుడా ఆశ్రమం విడచి వేరొకచోటికి వెళ్తాడు. ఆ వీర్యం రెల్లు దుబ్బు మీదపడి రెండు బిందువులయి ఒక బాలుడు, బాలిక జన్మిస్తారు. వేటకు వెళ్ళిన శంతనుని సేనాపతి వారిని చూచి సమీపంలో విల్లమ్ములు, కృష్ణాజినం చూసి, శంతనునికి చూపి ఆ శిశువులు ధనుర్విద్యా

పారంగతుడైన బ్రాహ్మణుని సంతానమని నిర్ధారిస్తాడు. శంతనుడు కృపతోవారిని తీసుకొని వచ్చి పెంచడం చేత వారు కృపి, కృపులుగా పెరుగుతారు.

## 139 కృపి

కృపాచార్యుని చెల్లెలు. ద్రోణుని భార్య. అశ్వత్థామ తల్లి.

## 140 ఘృతాచి

భరద్వాజుడనేముని ఒకనాడు గంగాస్నానం చేస్తూ అక్కడ జలక్రీడలు ఆడుతూ గాలికి ఒంటిమీది వలువలు ఎగిరిపోయి నగ్నంగా ఉన్న ఘృతాచి అనే అప్సరసను చూచి ఆ క్షణంలో మోహం వల్ల తనకు శుక్లపాతం కాగా దాన్ని ఒక దొన్నెలో సంగ్రహిస్తాడు. దానినుండి పుట్టినవాడే ద్రోణుడు.

## 141 మేనక

పృషతుడనే పాంచాల రాజు ఘోరతపస్సు చేస్తూ మేనక అనే అప్సరస తనకు సమీపంలో పూలు కోసుకుంటూ ఉండగా చూచి మదనరాగ పరవశుడై రేతఃపతనం కాగా దానిని తన పాదంతో దాచివేస్తాడు. దానినుండి మరుత్తు అంశతో ద్రుపదుడు జన్మిస్తాడు.

## 142 నిషాద వనిత

ఈమె వారణావతంలో పాండవులకు, కుంతికి అడవిలోనుండి పండ్లు దుంపలు తెచ్చి యిస్తూ వారిని సేవించేది. లాక్షాగృహదహనంనాటి రాత్రి తన అయిదుగురు కొడుకులతో సహా అధికంగా మద్యం సేవించి, లక్కయింటి ప్రక్కనే నిద్రపోయింది. భీముడా లక్కయింటిని దహించినపుడు కొడుకులతోపాటు సజీవదహనమైంది. ఆమెది, ఆమె కొడుకులవి అస్థిపంజరాలు చూసి పాండవులు దగ్ధమైనారని అందరూ భావిస్తారు.

## 143 హిడింబ

లక్క యింటినుండి బయటపడిన పాండవులు నడచి,నడచి ఒక సరోవర ప్రాంతంలో ఉన్న ఒక వటవృక్షం క్రింద విశ్రమిస్తారు. రాత్రి కాగా నిద్రిస్తున్న తల్లికి సోదరులకు కాపలాగా భీముడప్రమత్తుడై ఉంటాడు. ఆ వనంలో ఉన్న హిడింబుడనే రాక్షసుడు వారిని దూరంనుండే చూసి, వారిని చంపి, ఆమాంసాన్ని వండి పెట్టమని తన చెల్లెలు హిడింబను పంపుతాడు. ఆమె వారిసమీపంలోనికి

వెళ్ళడానికి శంకించి ఒక చెట్టుచాటున నిలచి భీముని మనోహరసమున్నతరూప సౌందర్యాలకు మోహితురాలై మానవస్త్రీ వేషంతో భీముని వద్దకు వస్తుంది. అన్న ఆజ్ఞ మరచిపోతుంది.

"........... పతి స్నేహము కామినులకు బలవం తము పెర నెయ్యములు వేయు దత్సదృశములే"

భీముడామెను అవమాన పూర్వకంగా "నీవెవ్వతెవు, ఇంతరాత్రివేళ ఇక్కడికెందుకు వచ్చినావు. ఎక్కడికి వెళ్తున్నావో శీఘ్రంగా అక్కడికి వెళ్లిపో" అని వెళ్ళగొట్టబోతాడు. తానతనిపై మరులుగొన్నానని,తనను వివాహమాడితే దేవేంద్రునైనా లక్ష్యపెట్టని బలంగల తన అన్న హిడింబుడనే రాక్షసుడు వారికే హానీ చేయడని, అది హిడింబునివనమనీ దానిలో ప్రవేవించినవారు యముని కుత్తుకలో ప్రవేశించినట్లే అనీ తనకు భర్తయై ప్రాణాలు రక్షించుకోమనీ, తాను కామచారిణి కాబట్టి అతని కిష్టం వచ్చిన చోటికి తీసుకొని పోగలనని చెబుతుంది తల్లినీ, సోదరులనూ విడిచి ఎంతటి పాపాత్ముడైనా చపలమైన స్త్రీ సుఖానికి ఆశింపడని భీముడంటాడు. అట్లయితే తానువారందరినీ ఆ రాక్షసుడు రాక ముందే ఎత్తుకొని పోతానంటుంది. వారిని నిద్రలేపమంటుంది. తాను వారికి నిద్రాభంగం కలిగింపజాలనని,ఆ హిడింబుణ్ణి పిలుచుకొని రమ్మని చెబుతుండగానే వాడు వచ్చి, తన ఆజ్ఞ పాటింపక నీచమానవుల సాంగత్యానికిష్టపడతావా అని చెల్లెలిని అదలిస్తాడు. ఆమె భయపడి భీముని వెనుక దాగుకొంటుంది. భీముడు వారిని దూరంగా ఈడ్చుకొని పోయి, ఘోర యుద్ధం చేసి వధిస్తాడు. వారి పోరాటానికి మెలకువ వచ్చిన కుంతి, పాండవులు అతి మానుషమైన రూపసంపదతొ ఉన్నహిడింబను చూసి విస్మయపడతారు. తాను హిడింబాసురుని చెల్లెలినని, భీమునిపై మరులుగొన్నాని ఆమె కుంతితో చెబుతుంది. అక్కడినుండి వెళ్ళిపోతున్న పాండవులను ఆమె అనుసరిస్తుంది. భీముడది ఇష్టపడక " రాక్షసులు మాయలు చేస్తారు. నిన్ను నమ్మము. మాతో రావద్దు. మీ యన్న పోయిన దారినే నీవూ వెళ్లు" అని పరుషంగా పలికేసరికి హిడింబ వణికిపోతుంది. ధర్మరాజు స్త్రీయైన ఆమె పట్ల కోపించవద్దని వారిస్తాడు. హిడింబ ధర్మరాజు, కుంతీదేవులకు మ్రొక్కి ఏకాంతంగా కుంతితో అమ్మా, మన్మథ వికారం సర్వప్రాణిసహజమే అయినా స్త్రీలలో అది మిక్కుటము, సహింపరానిది, తీవ్రమూ అవుతుంది. నేనీ భీముని కొరకు నా బంధువులను,స్నేహితులను విడిచి పెట్టినాను. ఇప్పుడు నా ఇష్టం నెరవేర్చకపోతే ప్రాణత్యాగం చేస్తాను. నన్ను రక్షిస్తే మీకిష్టమైనవన్ని మీరు

చెప్పకుండానే చేస్తాను. ఇక్కడినుండి మిమ్మందరినీ ఎత్తుకొని మీకిష్టమైన చోటికి పోగలను.నా మాటలు నమ్మండి. నేను భూత భవిష్యద్వర్తమానాలన్నీ క్షుణ్ణంగా ఎఱుగుదును. కావాలంటే ఒక్క భవిష్యద్విషయం చెబుతాను. ముందర ఒక సరోవరం, ఒక వృక్షం కనిపిస్తాయి అవి శాలిహోత్రుడనే మహాముని తపః ప్రభావం చేత పొందినవి. ఆ కొలని నీళ్ళు త్రాగినవారికి ఎన్నడూ ఆకలిదప్పులుండవు. ఆ వృక్షం చలినుండి, ఎండావానలనుండి మిమ్మ్ము కాపాడుతుంది. మీరక్కడ ఉండగా వేదవ్యాసుడక్కడికి వచ్చి హితోపదేశం చేస్తాడు అని చెబుతుంది.

ఆ మాటలకు వారెంతో విస్మయపడి, కరుణతో ఆమె నాదరిస్తారు. పాండవ హితం కోరి ఆమెను పరిగ్రహించమని కుంతి భీమునికి చెబుతుంది. పుత్ర జన్మమయ్యేంతవరకు మాత్రమే తానామెతో కాపురం చేస్తానంటాడు భీముడు.

ప్రభాతసమయానికి వ్యాసుడక్కడికి వచ్చి వారికి హితోపదేశం చేస్తాడు. హిడింబను చూసి ఆమె పేరు కమలపాలిక అని భీముడామె వలన మహా బలవంతుడైన పుత్రుని పొందుతాడని, అతడు ఆపదలో వారందరిననీ రక్షించగలడని చెబుతాడు.

కొంతకాలం భీముడామెతో మనోహర ప్రదేశాలలో విహరిస్తూ సుఖంగా కాపురం చేస్తాడు. సద్యోగర్భంలో ఆమెకు ఘటోత్కచుడు జన్మించి, తక్షణమే యౌవనవంతుడై అనేక పిశాచరాక్షసగణ పరివృతుడై కొంతకాలమక్కడ ఉండి తలచి నపుడు రాగలవాడనని చెప్పి, తల్లిని తీసుకొని వెళ్ళిపోతాడు.

## 144 ఏకచక్రపురంలోని బ్రాహ్మణుని భార్య

ఏకచక్రపురంలో పాండవుల కాశ్రయమిచ్చిన బ్రాహ్మణునికి బకాసురునికి ఆహారం కావలసిన వంతు వస్తుంది. కారణ మడిగిన కుంతితో ఆ బ్రాహ్మణుడు నాడు వంతు తమ కుటుంబానికి వచ్చిందని, ధర్మపత్ని, అనుకూలవతి, పుత్రవతి, సహధర్మచారిణి అయిన తన భార్యనుగాని, తన మనుమలకు తల్లి కావలసిన కూతురినిగాని, తనకు పిండోదక విధులు నిర్వర్తించ వలసిన కొడుకును గాని రాక్షసునికి ఆహారంగా పంపజాలనని, తానే వెళ్ళటానికి ఉద్యుక్తుడవుతాడు.

అప్పుడా బ్రాహ్మణుని భార్య " మీరరాని ఆపద వచ్చి మీద పడినపుడు సంతాపం చెంద వచ్చునా, నేనా రాక్షసునికి ఆహారమవుతాను.మీరు

విచారించకండి. భార్యవల్ల పొందవలసిన సంతానాన్ని నా వల్ల మీరు పొందినారు. నేను ఋణవిముక్తు రాలనయినాను ప్రాణత్యాగం చేసి అయినా భార్య భర్తకు మేలు చేయాలి. అంతేకాదు భర్తకంటే ముందు పరలోకమేగిన భార్యయే ఉత్తమురాలైన సతి. భర్తను కోల్పోయిన స్త్రీ ఎంత పతివ్రతయైనా లోకంతో నిందపడుతుంది. నేలమీదపడిన మాంసాన్ని పక్షులపేక్షించినట్లుగా పురుషహీనురాలైన యువతిని ఇది పాపం అనుకోకుండా నీచబుద్ధులు కోరుకుంటారు. భార్య చనిపోతే భర్త పునర్వివాహం చేసుకోవడం శాస్త్ర సమ్మతం భర్తృమరణం తర్వాత భార్యమరల వివాహం చేసుకొంటే అది లోకనింద్యం. మీరు లేకుండా నేనొక్క నిముషమైనా జీవింపలేను. శూద్రులీ బిడ్డను కోరితే ఏ విధంగా రక్షింపగలను? ఎట్లా ప్రతీకారం చేయగలను? ఈ కొడుకును గుణవంతునిగా ఎట్లా పెంచగలను? కాబట్టి నేను మరణించిన పిదప మరొక వివాహం చేసుకొని, గృహస్థ ధర్మాన్ని, అగ్నిహోత్రాన్ని, పుత్త్రులను రక్షించుకోండి" అని వెళ్ళడానికి ఉద్యుక్తురాలవుతుంది.

## 145 బ్రాహ్మణి కుమార్తె

తల్లి ఉపన్యాసమంతా విన్న కుమార్తె ఎంతకాలం నేను మీతో ఉన్నా మీదానను గాను. పరాయిధనం కావలసిన దాననే. ఇతరులకిచ్చే బదులు ఇప్పుడీ రాక్షసునికి భోజనంగా పంపండి. కుమార్తె పరలోకగతురాలయితే తండ్రిచేసే తిలోదకదానాలను పరలోకంలో పొందగల్గుతుంది. కానీ కుమార్తె చేసిన విధులు ఆమె భర్తకేగాని తల్లి తండ్రులకు చెందవు. మీకు నావల్ల కలిగే మనుమల లాభంకంటే, మీరిద్దరూ జీవించి ఉంటే ఎంతోమంది పుత్రులను, మనుమలను పొందగల్గుతారు. దానివల్ల వంశం నిలుస్తుంది. కాబట్టి నన్ను పంపండి. అని స్థిర నిశ్చయంతో అంటుంది.

## 146 కోకిలా దేవి

ద్రుపదుని పత్ని

## 147 అదృశ్యంతి

వశిష్ఠుని కోడలు. శక్తి భార్య. కల్మాషపాదుని మూలంగా తన కుమారుడు మరణింపగా తానూ మరణోన్ముఖుడైన వశిష్ఠుడు తన కోడలి గర్భంనుండి

వేద ధ్వని మనోహరంగా వినబడటం, గమనించి ఆశ్చర్యపోయి, శక్తి చదువులాగా అది తన చెవులకు అమృతప్రాయంగా విన్పించగా తన ప్రయత్నం మానుకొంటాడు. పన్నెండేండ్లు ఆమె గర్భంలో ఉండి ఆ శిశువు సకలవేదాలు నేర్చి ఉంటాడు. అతడే పరాశరుడు, వ్యాసుని తండ్రి.

## 148 మదయంతి

వశిష్టుని వలన శాప విముక్తుడైనకల్మాషపాదుడు భార్యమదయంతీ సమేతుడై అరణ్యంలో సంచరిస్తూ తాను రాక్షసునిగా ఉండి మనుష్యభక్షణ చేస్తూ ఉండిన రోజులలో ఒక బ్రాహ్మణులజంట మన్మథక్రీడా వ్యాసంగంలో ఉండగా ఆకలి బాధతో బ్రాహ్మణుని పట్టుకొని భక్షిస్తాడు.

## 149 ఆంగిరసి

ఆంగీరసి అనే ఆ పరమపతివ్రత భర్త మరణంతో తనకు పుత్రజన్మభాగ్యం లేకుండా పోయినందున "వనితా సంభోగంతో నీవూ మరణిస్తావని" శపిస్తుంది. మదయంతి వల్ల ఇది తెలుసుకొన్న కల్మాషపాదుడు తనకు పుత్రోత్పాదన సామర్థ్యం లేదని తెలిసి, తనకు పుత్రలాభం కల్గించమని ఋతుమతియైన మదయంతిని వసిష్ఠునికి సమర్పిస్తాడు. ఆమె వసిష్ఠుని వలన గర్భవతియై పన్నెండేండ్లు గర్భాన్ని మోసి, విసిగి గర్భతాడనం చేసుకోగా అశ్మకుడనే రాజర్షి జన్మించినాడు.

## 147 భృగుపత్ని

కృతవీర్యుడనే రాజు వంశంవారు ధనలోభంతో అతని ధనాన్ని దాచివారని బ్రాహ్మణులను నిందిస్తారు. ఒకనాడు క్షత్రియులొక బ్రాహ్మణుని ఇంటిలో చొరబడి అపారమైన సంపదను చూసి, రాజధనాన్ని వంచించినారని బ్రాహ్మణులందరిని గర్భాలలో ఉన్న శిశువులందరితో సహా విడువకుండా వధిస్తారు. బ్రాహ్మణుల భార్యలందరూ భయపడి హిమవంతానికి పారిపోతారు ఒక బ్రాహ్మణుని భార్య భయంతో తన గర్భాన్ని తొడలో దాస్తుంది.

అది తెలిసి క్షత్రియులు ఆ గర్భాన్ని విచ్ఛిన్నం చేయాలని వస్తారు. అంతలోనే మహాతేజస్వియై ఔర్వుడుద్భవిస్తాడు. అతని తేజస్సుతో వారందరూ దృష్టి కోల్పోతారు తమకు దృష్టిదానం చేయమని ఆ బ్రాహ్మణిని వేడుకొంటారు. "నేను మీ చూపులు పరిహరించలేదు. ఈ బాలుడు నూరు సంవత్సరాలు నా ఊరుగర్భంలో ఉండి, సకల వేదాలు, వేదాంగాలు నేర్చినవాడు, మహాతపోనిధి.

ఇతన్ని ప్రార్థించండి. ఇతడే మిమ్మల్ని కరుణింపగలడు'' అని వారికి హితముపదేశిస్తుంది.

## 151 జటిలుడనే ఋషికుమార్తె

ఈమె తన తపః ప్రభావంతో ఏడుగురు ఋషులకు తానొక్కతే భార్య అయింది.

## 152 దాక్షాయణి

ఈమె ప్రచేతసులు అని ఒకే పేరుతో పిలువబడిన పదిమందికి తానొక్కతే భార్య అయింది.

ద్రౌపదిని తామైదుగురికి ఇవ్వడానికి సందేహించిన ద్రుపదునికి ధర్మరాజు పై ఇద్దరి వృత్తాంతం చెబుతాడు.

## 153 అజిత

ఇతంతుడనే రాజర్షి కొడుకులనంత బలపరాక్రమములు, సాల్వేయ, శూరసేన, శ్రుతసేన,బిందుసార, అతిసారులనే అయిదుగురు పరస్పర స్నేహంతో ప్రసిద్ధులైన అన్నదమ్ములు ఔశీవరుని కన్యక అజిత అనే దానిని స్వయంవరంలో పొంది వివాహమాడి, ఆమె వల్ల ఆ అయిదుగురు వేరువేరుగా సంతానాన్ని పొందుతారు. ఇంతకు పూర్వము ఇలాంటి చరిత్రలున్నాయి కాబట్టి పాండవు లయిదుగురికి ద్రౌపదిని క్రమంగా వివాహం చేయమని వ్యాసుడు ద్రుపదునితో చెప్పి, ఒప్పించుతాడు.

## 151 తిలోత్తమ

ఇతరులచేత వధింపబడకుండా బ్రహ్మచేత వరంపొందిన సుందోప సుందులనే రాక్షసులు బలగర్వంతో వేల్పులను, మునులను బాధిస్తూ ఉపద్రవాలు కల్గిస్తూ ఉంటారు. వారందరూ వెళ్లి బ్రహ్మకు నివేదిస్తారు. బ్రహ్మ వారు పరస్పర యుద్ధం వల్లనే నిహతులు కాగలరని ఆలోచించి, విశ్వకర్మను పిలిచి అపురూప లావణ్యవతియైన యువతిని సృష్టించమంటాడు. తిలలవలె సూక్ష్మమైన మణుల సమూహంచేత సంఘటితమైనదా అన్నట్లున్న దివ్యదేహంగల తిలోత్తమను విశ్వకర్మ సృష్టిస్తాడు.

బ్రహ్మ సుందోపసుందులిరువురి వృత్తాంతం ఆమెకు చెప్పి, నీ కారణంగా వారు పొడుచుకు చచ్చేటట్లు చేయమని చెబుతాడు.ఆమెసరేనని బయలు దేరుతుంది.

వింధ్యపర్వతవనాలలో ఆమె సంచరిస్తూండగా చూసి అన్నదమ్ములు ఇరువురూ పరస్పర స్నేహం చెడగా మదనతాపం చెందుతారు. అంతవరకు ఒకేకంచం, ఒకే మంచం అన్నట్లుగా భేదంలేకుండా సంచరించిన ఆ అన్నదమ్ములు ఒకే స్త్రీపై వలపు నిలిపి, ఆమె తనకే కావాలని వేర్వేరుగా భావిస్తారు. ఇద్దరూ ఆమె చెరొక చేయి పట్టుకొని ఆమె తన భార్య అంటే తన భార్యఅని వాదులాడు కొంటారు. ఆమె తమలో ఎవరిని ప్రేమిస్తున్నదో చెప్పమంటారు.వారిలో ఎవడు అవతలి వాడిని పొడిచి ఓడిస్తాడో వాడినే తాను ప్రేమిస్తానని తిలోత్తమ చెబుతుంది. ఆమె ప్రేమకోసం ఆ ఇద్దరూ పరస్పరం పొడుచుకొని చస్తారు.

## 155,156 ఉలూచి,చిత్రాంగదలు

ద్రౌపది ధర్మరాజసహితయై ఉన్న గృహానికి అయుధాల నిమిత్తం వెళ్లిన అర్జునుడు నిబంధన మేరకు తీర్థయాత్రలకు వెళ్లుతాడు. గంగాతీరంలో పితృ తర్పణాలు వదులుతున్న అర్జునుని చూచి ఉలూచి అనే నాగకన్య కామపరవశయై అతన్ని తమ పురానికి తీసుకొని వెళ్లుతుంది. ఆమె వివరాలడిగిన అర్జునునితో తాను ఉలూచి అనే నాగకన్యనని, ఐరావత కులసంభవుడైన కౌరవ్యుని కూతురునని, అతనిని వలచినాననీ, తన కోరిక నెరవేర్చుమని వేడుకొంటుంది.

బ్రహ్మచర్యవ్రతంలో ఉంటూ సకలతీర్థాలు సేవిస్తున్న తాను ఆమె కోరికనెలా తీర్చగలనన్న అర్జునునితో "సర్వతీర్థసేవనంబును, సర్వవ్రతంబులు సల్పుటయును, సర్వదాన క్రియలును బ్రాణదానంబుతో సమానంబులు కావు.నా మనోరథంబువిఫలమైన మనోజానలంబున బ్రాణపరిత్యాగంబగును. గావున నన్ను రక్షింపుము"అని వేడుకోగా అర్జునుడారాత్రి ఆమెతో గడిపి, ఆమె వలన సద్యోగర్భంలో ఇలావంతుడనే కొడుకును పొందుతాడు.

తీర్థయాత్రలు చేస్తూ మణిపురానికరిగిన అర్జునుడు రాజు చిత్రవాహనుని కుమార్తె చిత్రాంగదను వివాహమాడగోరుతాడు. "మా కులంలో ప్రభాకరుడనే రాజుకు సంతానం లేకపోగా, శివుని గూర్చి తపస్సు చేయగా "నీకొక పుత్రుడు కలుగుతాడు. నీ వంశంలోని వారందరికి ఒక్కొక్క పుత్రుడే కలుగుతా"డని వరమిచ్చినాడు. ఇప్పుడు నాకీ పుత్రిక కల్గినది. ఆమెకు పుట్టబోయే కుమారుణ్ణి మా వంశ విస్తారకుడిగా ఈయగల్గితే నీకు చిత్రాంగదతో వివాహమవుతుంది. అదే చిత్రాంగదకు 'ఉంకువ' (కన్యాశుల్కం) అంటాడు రాజు.

సరేనని అర్జునుడు చిత్రాంగదను పరిణయమాడుతాడు. బభ్రువాహనుడు అనే పుత్రుని పొంది, ఆ బాలుని చిత్రాంగద తండ్రికి వంశకర్తగా ఇస్తాడు.

ఆతర్వాత చాలాకాలానికి అశ్వమేధయాగ సందర్భంగా యాగాశ్వంతో మణిపురరాజ్యాన్ని ప్రవేశించిన అర్జునునికి చిత్రాంగద కుమారుడైన బభ్రువాహనుడు ఆ పట్టణాన్నేలే రాజుతోను, ఇతర పెద్దలతోను కలిసివచ్చి వినయంగా పాదాలకు మ్రొక్కుతాడు. కొడుకును అర్జునుడు ఆదరింపడు. పైగా విచారంలో ఉన్న కొడుకుతో "యాగవిముక్తమైన అశ్వాన్ని పట్టి బంధించకుండా మెత్తబడడం రాజధర్మమా? యుద్ధమంటే భయపడే రాజూ ఒక రాజేనా,ఛీ,ఛీ!" అని ఈసడించి పల్కుతాడు.

తండ్రికి బదులీయకుండా బభ్రువాహనుడు పట్టణ వీధులలో మెల్లగా నడుస్తూపోతుంటే తనదివ్యజ్ఞానంతో అర్జునుడు కొడుకుతో పల్కిన పల్కులన్నీ తెలుసుకొన్న ఉలూపి (ఉలూచి) పాతాళం నుండి వచ్చి అతనితో "నాయనా! నేను నీ తల్లి ఉలూపిని. నాగకుమార్తెను. నీకు హితం చెప్పడానికి వచ్చాను. నీ తండ్రి ఆజ్ఞ తలదాల్చు. రాజధర్మమైన యుద్ధం చేయి. నీవతనితో యుద్ధం చేయడం నీ తండ్రికి ఎంతో ప్రియమైనది." అని ప్రబోధిస్తుంది.

బభ్రువాహనుడు ఆమెకు భక్తితో ప్రణామం చేసి " అమ్మా! కొడుకు తండ్రితో యుద్ధం చేయకూడదని ఆ పనికి పూనుకోకుండా మరలి వచ్చాను. నీ వింత తెల్పినావు. ఆ మహానుభావుడు నన్ను యుద్ధం చేయమనే అనుజ్ఞ ఇచ్చినాడు.మీ ఇద్దరి మాటలు పాటించి, మీకు అంతులేని ప్రీతి, కలుగజేస్తాను అని ఆమెను సగౌరవంగా తన మందిరానికి సాగనంపి, అర్జునునితో ఘోరయుద్ధం చేసి,తన బాణాలతో అతన్ని నిర్జించి,తానూ అర్జునుని బాణాలతో నేలకూలుతాడు.

భర్తా, పుత్రుడూ యుద్ధంలో మరణించినారని తెలిసి చిత్రాంగద శోక విహ్వలయై ఉలూపితో కూడా అక్కడికి వచ్చి ఆ యిద్దరినీ చూసి, మనస్సు వికలమై మూర్ఛపోతుంది. కొంత సేపటికి తెలివి తెచ్చుకొని ఉలూపినిచూసి "నీ మూలంగా నాభర్త నాకుమారుని చేతిలో మరణించినాడు. నీవు పవిత్రవు, ధర్మజ్ఞురాలివి కదా! ఏ కారణం చేత ఈ పసివానికి ఇది తగిన కార్యమని పురిగొల్పినావు? ఇతడు నీపట్ల ఏమైనా తప్పుచేసి ఉన్నా దయార్ద్రచిత్తవై ఇతణ్ణి పునర్జీవితుణ్ణి చేయి. అయ్యో నాథుని చంపమని ఆజ్ఞాపించి అతని చావు చూచి కూడా దుఃఖింపవు నీ సాహసానికి కొదువలేదు. నిన్నేమనగలను?" అని ఏడుస్తూ అర్జునుని సమీపించి " ఓ ప్రాణనాథా! ఇతరులప్రాణాలు కాపాడగల నీవిట్లా ఎందుకు ప్రాణాలు కోల్పోయినావు?నన్నెప్పుడూ నీవు మన్నిస్తావు గదా! నాథా,కళ్ళువిప్పి నన్ను ఒక్కసారైనా చూడకుండా ఉండడం నీకు తగునా,

ఇంతవరకు యాగాశ్వాన్ని ఎవ్వరూ అడ్డుకోకుండా చూసినావు, అన్నగారి యాగం వమ్ము అయిపోకుండా చూడు.లే. లేచి ఈ అశ్వాన్ని వెంబడించు." అని దీనాతి దీనంగా ప్రలాపిస్తూ ఉలూపిని చూచి "కుమారుడెలా ఉన్నా భర్తను బ్రతికించు. అనేకమంది భార్యలను చేసుకోవడం పురుషునికి దోషమా, ఎందరో ఇలాగ చేసినవారే గదా, ఈ మాత్రం తెలియక భర్తను ఇలా చంపించుతావా?

"కొడుకుచేత జచ్చిపడియున్న యక్కురు
కులవరేణ్యు గరుణ కూరి నీవు
బ్రతుక జేయకున్న బ్రాయోపవేశన
మాచరింతు నహికులాగ్రగణ్యా"

అని విలపిస్తూ భర్త పాదాలను శిరస్సున చేర్చి ప్రణమిల్లి కూర్చుండిపోతుంది.

అప్పుడు బభ్రువాహనుడు లేచి తల్లిని చూసి " ఎన్నడూ దుఃఖింపని నా తల్లి నేడు నా వల్ల చనిపోయిన భర్తను చూచి దుఃఖించడం చూస్తున్నాను. పాపాత్ముడనైన నా వంటివానికీ పాపమొకలెక్కా? మంచును సూర్యునిలాగా ఎందరినో పరిమార్చే నా తండ్రికి ముద్దుల కుమారుడినై ఉండీ ఇలా నేలకూల్చాను. అయ్యో, ఈ పాపానికి ప్రాయశ్చిత్తంగా తండ్రి కపాలంలో పన్నెండేండ్లు బిచ్చమెత్తడం గాక నాకు వేరే ప్రాయశ్చిత్తం ఉంటుందా?" అని దుఃఖిస్తూ ఉలూపిని చూసి, "అమ్మా నీ ఆజ్ఞను నెరవేర్చినాను. నా తండ్రిని చంపాను. ఇంక సంతోషించు" అని" తండ్రిని చంపిన నేరానికి ప్రాయోపవేశమే నాకు తగిన శిక్ష". అతడు నిజంగా చనిపోయి ఉంటే నాకు ఇంతకు మించి వేరే నిష్కృతి లేదు" అని తల్లి వద్ద కూర్చుండిపోతాడు.

అప్పుడులూపిసంజీవమణిని తలచుకొని అది తన చేతిలో ప్రత్యక్షం కాగానే బభ్రువాహనుని ముఖం చూసి "మూర్ఖులారా! విజయుడు ఇంద్రునిచేనైనా చనిపోతాడా?ఇతనికి నేనొక హితం చేయదలచి, నీ పరాక్రమాన్ని తెలుసుకోవడానికి నీతో యుద్ధం చేయాలన్న అతని కోరికను నెరవేర్పదలచి, ఈ మాయాప్రయోగం నడిపాను. నరుడు, నారాయణుడు మహత్తరులు సుమా, ఇతని తేజస్సు ఎవ్వరికీ ఉండదు దానిని ఆర్పివేయడం సాధ్యమా మీ దుఃఖాలన్నీ పోయేటట్లుగా ఇప్పుడే ఈ కౌరవోత్తముడు లేస్తాడు.కేవలం నా మాయా ప్రయోగం తప్ప ఇదంతా వేరేమీకాదు. నీకు నీ తండ్రితో యుద్ధం చేసే బుద్ధి పుట్టించావంతే" అని ఆ మణిని బభ్రువాహనుని అరచేత బెట్టి , నీ తండ్రి హృదయంపై దీనిని ఉంచు" అంటుంది.

అతడా విధంగా చేయగానే అర్జునుడు పునర్జీవితుడై లేచి కూర్చుని చిరునవ్వు నవ్వుతూ కొడుకును చూసి "రాజా క్షేమమా?" అని అడిగి, అక్కడ ఉలూపిని, చిత్రాంగదను చూసి, అక్కడివారి ముఖాలలో విచారం, ఆశ్చర్యం, హర్షం గమనించి "ఇదంతా ఏమిటి? ఇక్కడికి చిత్రాంగదా, ఉలూపీ ఎందుకు వచ్చారు?" అని అడుగుతాడు. బభ్రువాహనుడు ఎంతో వినయంతో తండ్రికి సాష్టాంగంగా మ్రొక్కి, ఉలూపిని చూపి, "అంతా ఈ మహానుభావురాలిని అడుగ"మంటాడు.

అర్జునుడామెను చూసి " నీ రాకకు కారణమేమి? ఈ మణిపురరాజు పట్ల, నాపట్ల నీ హృదయం ప్రసన్నంగా ఉంది గదా? ఇతడు గాని, నేనుగాని, చిత్రాంగద గాని నీ పట్ల ఏమీ అపరాధం చేయలేదు గదా? " అని ప్రశ్నిస్తాడు.

ఆమె నవ్వుతూ నాథా! నీ వల్ల ఏనాడూ ఏ దోషమూలేదు. నా కొడుకు వల్లగాని, చిత్రాంగద వల్లగాని నేను కోపించను. నీవు కోపం తెచ్చుకోకుండా నేను మనవి చేసేది విను. నీ కొడుకు మూలంగా నీకు శుభం కలిగింది. భీష్ముని నీవు శిఖండి నెపంగా పడగొట్టిన పాపానికి నిష్కృతి చేయకుండా ప్రాణాలు వదిలితే నరకానికి పోతావు కాబట్టి నేను నిష్కృతి చేశాను. నేనొకరోజు సఖులతో కలిసి గంగా స్నానం కోసం వచ్చి ఉండగా వసువులు అక్కడికి వచ్చి స్నానం చేసి, సమీపంలో ఉన్న గంగను చూసి " గాండీవి శిఖండిని ముందుంచుకొని గాంగేయుడు వేయకపోయినా బాణాలు వేసి అతనిని కూల్చినాడు. కపటంగా జయం పొందిన ఆ అర్జునుని మేము శపిస్తాము" అన్నారు. గంగ అందుకు అంగీకరించింది.

నేనదంతా పరుగున వచ్చి నాతండ్రికి చెప్పాను ఆయన వెంటనే వచ్చి, ఎన్నో విధాల ప్రియంగా మాటలాడి ప్రార్థించగా వారు కోపం మాని " ఇతన్ని తన కుమారుడైన బభ్రువాహనుడు బాణాలతో కూల్చితేపాపం పోతుంది అని అనుగ్రహించినారు. ఆ సంగతి నా తండ్రి నాకు చెప్పగా నేనిట్లా చేసినా"నని అర్జునునితో చెప్పి, బభ్రువాహనుని చూపి " నీతో ఇతడు యుద్ధం చేయడానికిష్టపడక వెళ్తుంటే నాకర్తవ్యానికిది తగిన అదను అని తెలిసికొని ఇతన్ని ప్రబోధించి వసువులు చెప్పిన విధంగా జరిగేటట్లు ఇతనికి విశేష పరాక్రమము కలిగేటట్లు ఆవహించాను" అని వివరిస్తుంది.

అర్జునుడు సంతోషంతో "దేవీ! నీ పవిత్ర చరిత్ర ఎప్పుడు మా వంశ వర్ధనకారి గదా, అది ఎప్పుడూ చూచినదే గదా! అని ప్రియమారపల్కి భార్యలిద్దరినీ,

కుమారుణ్ణీ హస్తినాపురికి వచ్చి, ధర్మజుని గౌరవాన్ని స్వీకరింపవలసిందిగా కోరి వారిచే అనుజ్ఞ పొంది యాగాశ్వాన్ననుసరించి ముందుకు సాగుతాడు.

## 154-158 పంచనారీ తీర్థాలు - దివ్యభామనులు

చిత్రాంగదను వివాహమాడిన తర్వాత అర్జునుడు అక్కడి సముద్రతీరం లోని పంచ తీర్థాలు చూచి, సౌభద్రతీర్థంలో మునగ బోతాడు. భయంకరమైన మొసళ్లతో ఆ సౌభద్ర, పౌలోమ, కారంధమ, ప్రసన్న భారధ్వాజాలనే తీర్థాలు స్నానయోగ్యాలు కాకుండా ఉన్నాయని అక్కడి మునులు చెబుతారు.

అర్జునుడు సాహసంతో సౌభద్ర తీర్థంలో దిగి,తనను పట్టుకొన్న మొసలిని అవలీలగా బయటకి విసరివేస్తాడు. ఆ మొసలి మరుక్షణమే దివ్య భామినిగా మారిపోతుంది. తన పేరు నంద అనీ, తానప్సరసననీ, కుబేరుని అనుంగు సఖిననీ తన చెలులు సౌరభేయి, సమీచి, బుద్బుద, లత అనే మిగతా నలుగురినీ అదే విధంగా శాపవిముక్తలను చేయమని ప్రార్థిస్తుంది. అర్జునుడు శాప కారణమడుగగా ఒకబ్రాహ్మణునికి తపోభంగం గావించిన నేరానికి తమకీ శాపం లభించిందనీ, తాము ప్రార్థింపగా నూరేండ్ల తరువాత అర్జునుని వల్ల తమకీ శాపం తొలగిపోతుందని అతడు అనుగ్రహించినాడనీ చెబుతుంది. అర్జునుడు మిగతా నలుగురినీ అదేవిధంగా శాపవిముక్తలను చేస్తాడు. వారతన్ని దీవించి వెళ్ళిపోతారు. నాటినుండి ఆ పంచతీర్థాలు, నారీతీర్థాలుగా ప్రఖ్యాతమవుతాయి.

## 162 సుభద్ర

శ్రీ కృష్ణుని చెల్లెలు సుభద్ర. ఆమె అపురూపమైన సౌందర్యాన్ని గూర్చివిని, అర్జునుడామె పట్లప్రేమను పెంచుకొని, యాదవులు యతుల పట్ల ఎంతో భయభక్తులు గలవారని తెలిసికొని కపటముని వేషంలో ప్రభాసతీర్థంలో ఉంటాడు. శ్రీ కృష్ణుడు అర్జునుని అంతర్యాన్ని తెలుసుకొని, ద్వారకకు తీసుకొని వచ్చి, రైవతక పర్వతోద్యానవనంలో ఉంచుతాడు. యాదవులా పర్వతానికి ఉత్సవం చేస్తారు. సుభద్ర తక్కిన యాదవస్త్రీలతో అక్కడికి వచ్చి, అర్జునుని తన భర్తగా భావించి, పర్వతానికి పూజలు, నమస్కారాలు చేస్తుంది. ఆమెను సుభద్రగా గుర్తించిన అర్జునుడు మన్మథ వికారానికి లోనవుతాడు. శ్రీకృష్ణుడు దేవకీ వసుదేవులతో చెప్పి వారికోరిక సఫలం చేస్తానంటాడు.

బలదేవుడు అర్జునుని యతిగా భావించి, వర్షాకాలం గడిచేవరకు అక్కడే ఉండి చాతుర్మాస్యం చేయమంటాడు. తమను కృతార్థులను చేయమని ప్రార్థించి,

సుభద్రను అతని సేవకై నియోగిస్తాడు. ఆ యతి అర్జునుడే అని శ్రీకృష్ణుడు సత్యా రుక్మిణులతో రహస్యంగా చెబుతాడు.

సుభద్ర అర్జునునిలక్షణాలు ముందే వినిఉండటంచేత యతిని అర్జునునిగా సందేహించి, "మునీంద్రా మీరు చూడని పురాలు, తెలియని రాజులు ఉండరు గదా, ఇంద్రప్రస్థపురంలో మా మేనత్త కుంతీదేవికి క్షేమమా, మహావీరుడర్జునుడు క్షేమమా, తీర్థయాత్రలకై వెళ్ళినవాడు తిరిగి వచ్చినాడా, తెలిస్తే చెప్పండి" అని అడుగుతుంది.

తానే అర్జునుడనని, ఆమెకోసమే తానావిధంగా అక్కడ ఉన్నానని, తనను గాంధర్వ వివాహం చేసుకోమని, అర్జునుడు సుభద్రను కోరుతాడు. సుభద్ర సిగ్గుతో తననీయవలసినవారు అక్కడే ఉన్నారని, వారే తమ వివాహం చేయగలరని చెప్పి, అంతఃపురానికి వెళ్లుతుంది.

బలరామునికి తెలియకుండా శ్రీకృష్ణుడు వారి వివాహం చేస్తాడు. ఆమెతో యింద్రప్రస్థానికి వెళ్లుతూ ఉన్న అర్జునుణ్ణి యాదవవీరులు అడ్డుకొంటారు. అర్జునుడు వారితో యుద్ధం చేసి ఓడిస్తాడు. సుభద్ర రథం నడుపుతుంది.

ఇంద్రప్రస్థం చేరబోతుండగా అర్జునుడు సుభద్రతో "మనమీ విధంగా కలసి వెళ్ళితే ద్రౌపది అప్రియాలు పల్కుతుందేమో, ఆ పతివ్రత మాటలు నిజమవుతాయి. కాబట్టి నీవు ఈ గోపస్త్రీలతో కలసి వెళ్ళి, ఆమెను దర్శించు" అని పంపుతాడు.

ఆ విధంగా వెళ్ళి తనకు మ్రొక్కిన సుభద్రను ద్రౌపది " నీ భర్త శత్రుంజయుడవుతాడు. నీవు వీరపుత్రజనని వవుతావు" అని దీవిస్తుంది. సుభద్ర కుంతి వద్ద ఉండగా శ్రీకృష్ణుడు బలరామ వసుదేవాది యాదవప్రముఖులతో ఇంద్ర ప్రస్థానికి వస్తాడు. వేలకొలది ఏనుగులు, గుఱ్ఱాలు, రథాలు, స్త్రీలకు బంగారు పల్లకీలను, గోవులను, గాడిదలను, పదిలక్షల దాశార్హ వీరులను కట్నంగా శ్రీకృష్ణుడు అర్జునునికిస్తాడు.

సుభద్రకు అర్జునుని వలన అభిమన్యుడు జన్మిస్తాడు.

మహావీరుడైన అభిమన్యుడు పద్మవ్యూహంలో ప్రవేశించి దుర్మరణం పాలుకావడం సుభద్ర మాతృహృదయాన్ని తల్లడిల్ల చేస్తుంది. "నాయనా, నిన్ను కన్నంతవరకే నాపుణ్యం. నీవెంతో భక్తితో చూస్తుండగా నీబిడ్డలను లాలించే భాగ్యానికి నేను నోచుకొనలేదు. బాలుడవైనా అరుదైన పరాక్రమంతో, ప్రౌఢులైన వీర మహారాజులను, ద్రోణాదులను సమీపించి, తరగని సాహసంతో వారిని

నేలపై పడవేసి, బాధించినావు. అట్టినీవీస్థితిని పొందడాన్ని లోకం వెఱగుపడి చూస్తూ విచారిస్తుంది. సగంశరీరం నామీద ,తక్కినసగం మెత్తని శయ్యపై చేర్చి ముద్దుగా నిద్రించే నీవీ కటికనేలపై నీ శరీరం పడిఉండటాన్ని ఎలా ఓర్చుకున్నావు. వంధిమాగధులస్తోత్రాలతో మేల్కొందే నీవు ఇప్పుడు నీ సమీపంలో తిరిగే క్రూరజంతువుల ధ్వనులనెట్లా సహింపగలుగుతున్నావు. మహాబలవంతుడు భీముడు, శౌర్యవంతుడు సాత్యకి, యుద్ధనిపుణుడు ద్రుపదుడు, విక్రమోన్నతుడైన మాత్స్యుడు- ఇందరుండీ నిన్ను రక్షింపలేకపోయినారు. నీవులేని యీ లోకం పాడుపడినట్లున్నది నీ పరాక్రమంతో బంధువులకు ప్రీతి కలిగించడం కలలో జరిగిన విషయంలా కనిపిస్తున్నది. విజయుని కుమారుడవు, కృష్ణుని మేనల్లుడవైన నీవీ మానవులచే వధింపబడటం చోద్యం కాదా? నీ అందమైన దేహం, ముద్దు ముఖం నాకింక ఎప్పుడు కనిపిస్తాయి? అయ్యో, ఎంతో మెత్తని మనస్సుగల ఉత్తర వచ్చింది. నాయనా వచ్చి నీ తియ్యని మాటలతో ఆమె విచారం తొలగించు" అని పరిపరి విధాల విలపించిన సుభద్ర" గొప్ప తపస్సు చేసినవారు యజ్ఞాలు వ్రతాలు నల్పినవారు, మహత్తరమైన దానాలు చేసినవారు, పుణ్యచరిత్రగల మహాత్ములేసద్గతులు చెందుతారో అట్టి ఉజ్వలమైన సద్గతులు నీవు పొందుదువు గాక ! " అని కుమారుని ఆశీర్వదిస్తుంది.

అశ్వత్థామ అస్త్రంచే ఉత్తరాగర్భస్థశిశువు మరణించగా మృతశిశువును బ్రతికించి వంశం రక్షించమని సుభద్ర శ్రీకృష్ణుని వేడుకొంటుంది.

"శిరఃప్రణతి నేనువేడెద
గరుణ నిక్కులముగాచికొనుము"[1] అని ప్రార్థిస్తుంది.

### 163 జరిత

మందపాలుడనే ఋషి సంతానహీనులకు పుణ్యలోకాలుండవని తెలుసుకొని, పక్షులలో త్వరగా అనేకమంది సంతానాన్ని కనే విధమున్నదని తాను మగపక్షియై జరిత అనే లావుకపెంటిని రమించి, దానివలన జరితారి, సారిసృక్క, స్తంబమిత్ర, ద్రోణులనే నలుగురు కొడుకులను పొందుతాడు. వారిని ఖాండవ వనంలోనే పెట్టి, తాను తన పూర్వభార్య అయిన లపితతో విహరిస్తుంటాడు. ఖాండవాన్ని అగ్నిదేవుడు దహిస్తూ ఉండగా మందపాలుడు అగ్నిసూక్తాలతో స్తుతిస్తూ తన నలుగురు కుమారులను కాపాడమని అగ్నిని ప్రార్థిస్తాడు.

1. భార- ఆశ్రమ- తృతీయ ఆ. ప.174

జరిత ఇంకా రెక్కలురాని తన నలుగురు పుత్రులను, అగ్నిభయంతో సంచలిస్తున్న వారిని చూచి, దుఃఖంతో “నేను వీళ్ళను తీసుకొని పోనూలేను, తండ్రిలాగా నిర్దయగా వదలి వేయనూలేను. ఏం చేయను? ” అని విచారిస్తూ ఒక బిలంలో దూరి, అగ్నిబారినుండి రక్షణ పొందమని కుమారులకు చెబుతుంది.

పుత్రులలో పెద్దవాడైన జరితారి“ అమ్మా బిలంలో చొరబడితే మూషిక బాధనుండి తప్పించుకోలేము.ఎలుకవల్ల చావడం కంటే ఈ అగ్నిజ్వాలలవల్ల చనిపోతే పుణ్యలోకాలైనా కలుగుతాయి. పైగా ఇక్కడే ఉంటే గాలి తాకిడివల్ల అగ్ని జ్వాలలు మమ్మ్మ తాకకుండా పోయే అవకాశం ఉంది.మామీద మోహం వదిలి పెట్టి నీవెక్కడికైనా ఎగిరిపో. మేము మరణించినా, నీవు జీవించి పుత్రులను పొంద గలుగుతావు. నీ పుణ్యంవల్ల మాకు అగ్ని భయం తొలగిపోతే మా వద్దకు వచ్చి, ఎప్పటిలాగా మమ్మల్ని కాపాడగలవు” అంటాడు. తల్లికి కొడుకులందరు మ్రొక్కుతారు. సమీపిస్తున్న అగ్నిని చూసి, కన్నీళ్ళతో జరిత ప్రాణభయంతో ఆకాశానికి ఎగిరిపోతుంది. మందపాలుని ప్రార్థన స్మరించి, బ్రహ్మ నాలుగు ముఖాలలాగా తనను స్తుతిస్తూ అభయమని వేడుకుంటున్న ఆ నలుగురున్న వృక్షాన్ని దహించక వదిలివేస్తాడు. జరిత అది గమనించి కొడుకుల వద్దకు వచ్చి సుఖంగా ఉంటుంది.

## 164 లపిత

ఖాండవం అగ్నిచేత దహింపబడటం విని మందపాలుడు అక్కడ ఉండిన జరితను, కుమారులను తలచుకొని “రెక్కలురాని పిల్లలను ఎట్లా జరిత రక్షించ గలుగుతుంది? మరచిపోతుందేమో, ఏమారుతుందేమో, క్రూరాత్మలైన స్త్రీలను నమ్మరాదు గదా” అని దుఃఖిస్తూ ఉంటే లపిత “ అగ్ని నీ పుత్రులను రక్షిస్తానని వాగ్దానం చేసినాడు గదా భార్యపై ప్రేమతో దాని యోగక్షేమాలు విచారిస్తున్నావు. అది పక్షి. అది ఎక్కడికైనా ఎగిరి వెళ్లగలుగుతుంది. విచారించకు” అంటుంది.

మందపాలుడు చిరునవ్వుతో“ వశిష్ఠుని వంటి పురుషుని కూడా అరుంధతి వంటి స్త్రీయైనా స్త్రీనిమిత్తంగా కారణం లేకుండానే సంశయిస్తుంది. ఇది స్త్రీలకు నైజగుణం.” అని ఖాండవానికి వచ్చి జరితను, కుమారులను చూసి సంతోషంగా తిరిగి వెళ్లిపోతాడు.

## 165-167 జరా సంధుని తల్లులు, జర అనే రాక్షసి

మగధరాజు బృహద్రథునికి భార్యలిద్దరు. సంతానంలేక అతడు చండ కౌశికుడనే మహామునిని సేవించుతాడు. అయన ఒక దివ్యమైన మామిడిపండు ఇచ్చి "దీనివల్ల నీకొక పుత్రుడు కలుగుతాడు" అని చెప్పగా సంతోషంతో ఆ పండును తన యిద్దరు భార్యలకు పంచియిస్తాడు.ఫలితంగా వారిద్దరూ గర్భవతులై పదవనెలలో ఒక చెవి, ఒక కన్ను, -ఇలా సగం శరీరం కల్గిన మాంస శకలాలను ప్రసవిస్తారు. వాళ్ళు భయపడి "ఈ మాంసశకలాలను మీ సంతానమని భర్తకెట్లా చూపాలి?" అని ఎవ్వరికి తెలియకుండా బయట పారవేయమని తమ దాదులను ఆజ్ఞాపిస్తారు.

రాజగృహద్వారం వద్ద పడి ఉన్న ఆ రెండుశకలాలను జర అనే రాక్షసి సంధిస్తుంది. ఆ రెండు కలిసి మహాకఠినశరీరం గల బాలుడు రూపొంది ఏడుస్తాడు. పసిపాపరోదనధ్వని విని స్త్రీలతో బృహద్రథుడక్కడికి వచ్చి బిడ్డను చూచి, సంతోషిస్తాడు జర మనుష్యరూపధారిణియై ఆరాజుతో దాదులు మాంస శకలాలను పారవేయగా తాను సంధించిన విధం తెల్పుతుంది. రాజామెను స్తుతించి జరచే సంధింపబడిన వాడు కాబట్టి జరాసంధుడని బాలునికి నామకరణం చేస్తాడు.

## 165 మాహిష్మతీ పట్టణంలోని స్త్రీలు

నీలుని వంశంలోని నిషధుడనే రాజు రాజ్యంలో అగ్ని బ్రాహ్మణుని వేషంలో పారబాటున పరదారసంగ్రహం చేస్తాడు. శిక్షించబోయిన రాజుకు అగ్ని తన నిజ రూపం చూపగా రాజు క్షమించమంటాడు. సరేనని అగ్ని రాజును వరం వేడుకో మంటాడు. తన రాజ్యంమీదకి వచ్చిన శత్రువులు అగ్నికి ఆహుతి కావాలని రాజు కోరతాడు. బదులుగా అగ్ని మాహిష్మతీపట్టణంలోని స్త్రీలు మనోజ రాగిణులు కాబట్టి వారి స్వైరిణీత్వాన్ని సహించాలని అడుగుతాడు.

అగ్నిదేవుని వరంవల్ల ఆపట్టణంలోనిస్త్రీలకు స్వైరిణీత్వం దోషరహితమవుతుంది.

## 166 సాత్వతి

శిశుపాలుని తల్లి సాత్వతి. అతడు నాలుగు చేతులు, నుదుట కన్ను కలిగి, పుట్టిన వెంటనే గార్ధభస్వరంతో ఏడుస్తాడు. తల్లిదండ్రులు భయపడిపోతారు. ఒక అశరీరవాణి "వీడిని ఎవరు ఎత్తుకున్నప్పుడు అదనంగా ఉన్న అవయవాలు

తొలగిపోతాయో అతడే వీడి చావుకి కారణమవుతాడు" అని విన్నిస్తుంది.

చూడవచ్చినవారందరికీ సాత్వతి బిడ్డను ఎత్తుకోమని ఇస్తుంది. తమ మేనత్తయైన సాత్వతిని, ఆ బిడ్డను చూడటానికి బలరామకృష్ణులు చేదిదేశానికి వస్తారు. శ్రీకృష్ణుడు ఎత్తుకోగానే ఆ బిడ్డని రెండుచేతులు,నుదుట కన్ను మాయమవుతాయి. అశరీరవాణి మాటలు తలచుకొని సాత్వతి శ్రీకృష్ణునితో తన కుమారుడు దుర్మార్గుడై నూరుతప్పులు చేసినా క్షమించమని ప్రార్థిస్తుంది. శ్రీకృష్ణుడట్లే అని ఆమెకు మాట ఇస్తాడు.

## 167 భానుమతి

దుర్యోధనుని భార్య

## 168 ఉత్తర

విరాటుని కుమార్తె ఉత్తర. బృహన్నల వద్ద నాట్యం నేర్చుకుంటుంది. ఉత్తర గోగ్రహణం సందర్భంలో తన అన్న కురుసైన్యాన్ని ఎదుర్కొన గోరుతున్నాడని సైరంధ్రి చెప్పగా ఆమెవలననే తన అన్నకు తగిన సారథి బృహన్నల అని తెలుసుకొని అన్నకు సారథ్యం చేయమని అతనిని కోరుతుంది. కురువీరుల తలపాగాలు తనకు బొమ్మ పొత్తిళ్ళుగా తెమ్మని ఉత్తరుని, బృహన్నలను కోరుతుంది. అజ్ఞాతవాసం ముగిసి పాండవులు తమను తాము ప్రకటించుకొన్న పిదప విరాటుడు కృతజ్ఞతతో తన కుమార్తె ఉత్తరను అర్జునునికిచ్చి వివాహం చేస్తానంటాడు. శిష్యురాలు పుత్రికా సమానం కాబట్టి అభిమన్యునికి వధువుగా స్వీకరిస్తానంటాడు అర్జునుడు.ఆ విధంగా ఉత్తర అభిమన్యుని ఇల్లాలవుతుంది. పద్మవ్యూహంలో అభిమన్యుడు మరణించే నాటికి ఉత్తర గర్భవతి. అశ్వత్థామ క్రూరాస్త్రానికి తన గర్భస్థ శిశువుమృతినొంది జన్మించగా అమితమైన దుఃఖాన్ని ,నిర్వేదాన్నిపొందిన ఉత్తర అత్త సుభద్ర ప్రార్థనపై శ్రీకృష్ణుడు మృతజాతశిశువును పునర్జీవితుని చేయగా కృతజ్ఞతతో ఆ శిశువును అతని పాదాల మ్రోలబెట్టి తన ఫాలం అతని పాదాలకు చేర్చి నమస్కరించి తన కృతజ్ఞతలు తెల్పుకొంటుంది.

## 172 దమయంతి

విదర్భరాజైన భీముడు దమనుడనే ముని వరం వల్ల దమయంతి అనే పుత్రికను పొందుతాడు. నిషధదేశాధిపతియైన వీరసేనునికొడుకు నలుడు, నిరంతర జూదప్రియుడు.మహాతేజంతో సమస్తరాజలోకాన్ని జయించి, జనరంజకంగా రాజ్యాన్ని పాలిస్తూ ఉంటాడు.

పరస్పరం వలచి, వలపించుకొని, హంసదౌత్యంతో బద్ధానురాగులైన నలదమయంతుల పరిణయానికి ఇంద్రాదిదిక్పాలకులు ఆటంకమవుతారు. తమలో ఒకరిని వరించమని వారు నలునిద్వారానే రాయబారం పంపినా, దమయంతి స్వయంవరంలో ఇంద్రాదులు నల్గురూ నలుని వేషంలోనే కన్పించినా ప్రయోజనం ఉండదు. తన పాతివ్రత్యం వల్ల దమయంతి నలుని వేషంలో ఉన్న దేవతలను ప్రార్థించి వారి అనుగ్రహం పొంది, అసలు నలుని మెడలోనే పూలమాల వేస్తుంది.

దేవతల ఆశీర్వాదంతో నల దమయంతుల వివాహం జరుగుతుంది. తిరిగి వెళ్లుతున్న దేవతలకు కలి ఎదురవుతాడు. తాను దమయంతీస్వయంవరానికి పోతున్నానని అతడు చెప్పగా దమయంతి నలుని వరించిన విషయం దేవతలతనికి చెబుతారు. కలి నలునిపై కోపంతో అతనియందావేశించి పుష్కరుడనేవాని వద్దకు వెళ్ళి, నలునితో జూదమాడి నలుని సర్వస్వం గెలుచుకోమంటాడు.

కలిప్రభావం వల్ల ఎన్నో నెలలు జూదమాడి నలుడు సర్వం కోల్పోతాడు. పౌరులు, బ్రాహ్మణులు, ప్రధానులు దమయంతిని వెంటబెట్టుకొని వచ్చి వారించినా కూడప్రయోజనం లేకనాయింది.

పాచికలు పుష్కరుని అధీనంలో ఉన్నాయని, నలునికి వ్యతిరేకంగా ఉన్నాయని తెలిసి దమయంతి భర్తకపజయం తప్ప, జయంలేదని తెలుసుకొని భర్త అజ్ఞపొంది తన కుమార్తెను కొడుకును బంధువుల వద్దకు పంపుతుంది.

సర్వం కోల్పోయిన నలుడు"ఎవ్వరి వలనను సత్కారంబు గానక" నీరే ఆహారంగా తన పట్టణ సమీపంలోనే దమయంతీ సహితుడై ఉండి, ఆకలి బాధకు తాళలేక తమముందు సంచరిస్తున్న పక్షులను పట్టుకొందామని తన పై బట్టను వాటిపై విసిరివేస్తాడు. అవి ఆవస్త్రంతో ఎగిరిపోతూ" నీ ధనాన్ని రాజ్యాన్ని కాజేసిన పాచికలం మేము. నీ వస్త్రాలు కూడా అపహరించాలని పక్షులరూపంలో వచ్చా"మని చెబుతాయి.

వివస్త్రుడైన నలుడు దమయంతి చెరగుతో తన దేహాన్ని కప్పుకొంటాడు. అడవులలో తనతో కష్టపడకుండా బంధువుల వద్దకామెను వెళ్లమంటాడు. తన పుట్టినింటికి వెళదామంటుంది దమయంతి. సర్వంకోల్పోయాక దైన్యస్థితిలో తాను రాలేనంటాడు నలుడు. ఆమె అతనినోదారుస్తూ

"అధికరోగార్తునకౌషధంబు
సురుచిరంబుగభార్యయచూవెయెందు

నొనర భార్యా సమేతుడై యున్నవాని
కెంతలయ్యును నాపదలెరుకపడవు" [1]

అలసినెడ డస్సినెడనా
కలి తృష్ణయు నైనయెడల గడుకొని ధరణీ
తలనాథ పురుషునకు ని
మ్ములభార్యయ పాచుజిత్తమున దుఃఖంబున్" [2]

భార్యాసహితుడై ఉన్న వానిని ఆకలిదప్పులు, ఆపదలు,రోగాలు బాధింప జాలవని, కాబట్టి తనను అతనిననుసరించనీయమని, వేడుకొంటుంది. "ప్రాణసమానురాలివైననిన్ను నేనెందుకు వదులుతా"నని నలుడామెనాశ్వాసిస్తాడు.

అలసట వల్ల, శ్రమవల్ల దమయంతి నిదురిస్తుంది. తనకు భార్యయై ఆమె యింతటి కష్టాలు అనుభవిస్తున్నదని, తానామెను వదిలిపెడితే బంధువుల వద్దకు వెళ్లగలదని నలుడాలోచిస్తాడు. మనస్సంగీకరించదు. చివరకు ఆమె వస్త్రం సగం చింపుకుని మెల్లగా నిష్క్రమిస్తాడు.

మేలుకొన్న దమయంతి తన చీర సగం చింపబడి ఉండటం చూచి, నలునికై అతి దయనీయంగా విలపిస్తుంది. చెట్లూ పుట్టలూ వెదుకుతూ, పడుతూ లేస్తూ, క్రూరమృగాల భయంతో ఆకలిదప్పుల బాధతో తూలుతూ అడుగువేయలేని స్థితిలో ఉన్న ఆమెను ఒక కొండచిలువ కాటువేస్తుంది. చుట్టుకొంటుంది. ఆమె ఆర్తనాదం విన్న ఒక కిరాతుడామెను రక్షించి, దగ్గరలోని కొలను వద్దకు తీసుకొని వెళ్లి స్నానపాన ఆహారాదులచే సేదతీర్చి, ఆమె వృత్తాంతమడుగుతాడు.

ఆమె విషయమంతా విని కూడా ఆ కిరాతుడామెను కామిస్తాడు. ఆమె తాను పతివ్రతయైతే మరుక్షణం వాడు చావాలని శపిస్తుంది. వాడు మొదలు నరకిన చెట్టులాగ విగతజీవుడై పడిపోతాడు.

భర్తనే మనసులో నిలుపుకొని దమయంతి ధైర్యం తెచ్చుకొంటుంది. అడవిలో తారసపడిన వశిష్ఠాది మునులను తన భర్తజాడ అడుగుతుంది. ఆమె వృత్తాంతం విన్న మునులు రోదిస్తున్న ఆమెనోదార్చికొన్ని దినాలలోనే ఎప్పటి వలె తన పట్టణంలో రాజ్యవైభవంతో అలరారే నలుని చూడగలవని ఆశ్వాసించి అదృశ్యులవుతారు.

అడవిలో ఒక వ్యాపారులసమూహాన్ని చూసి చేరబోయిన దమయంతి వాలకాన్ని, మలినమైన దేహంతో మాసి చినిగి పేలికలైపోయిన సగం చీరతో,

అట్టలు గట్టిన జుట్టుతో, పిచ్చిదానిలాగా ఉన్న ఆమెను చూచి, ఆ బిడారులోని వారు భయపడతారు. కొందరామెను పిశాచమంటారు. కొందరు పరిహసిస్తారు. తాను నలుని భార్యనని,దురదృష్టవశాత్తు అతన్ని ఎడబాసి వెదకుతున్నానని ఆమె వారికి చెబుతుంది. వారు సుబాహుని పట్టణానికి వెళ్ళుతున్నారని తెలిసి,తానూ వారిననుసరిస్తుంది.

రాత్రి ఒక చెరువువద్ద వారంతా విశ్రమించి ఉండగా ఏనుగులగుంపొకటి వారిపై దాడి చేస్తుంది. చాలామంది చనిపోతారు. తాను చావకుండా మిగిలి ఉన్నందుకు దమయంతి విధిని నిందిస్తుంది. స్వయంవరంలో తాను నలుని వరించినందుకు దేవతలు తనపై యీవిధంగా పగతీర్చుకుంటున్నారేమోనని భావిస్తుంది. ఎన్నో రాత్రులు, పగళ్ల ప్రయాణాలు చేసి చివరకు సుబాహుని పట్టణం చేరుకొంటుంది.

ఆమెను దూరంనుండేచూసిన రాజమాత ఆమె వేషం వాలకం చూసి లక్ష్మీదేవి ఉన్మత్తవేషం ధరించినట్లుందని, తనకామెపై అవ్యాజమైన స్నేహం కల్గిందని తనవద్దకామెను పిలిపించుకొంటుంది. భర్తపేరు చెప్పక జూదంలో సర్వంకోల్పోయిన తన భర్త నిద్రిస్తున్న తనను పరిత్యజించి వెళ్లినాడని, అతన్ని వెదుకుతూ తాను సైరంధ్రీ వేషంలో తిరుగుతూ ఉన్నానని దమయంతి చెబుతుంది. రాజమాత ఆమెను తన వద్ద ఉండమంటుంది. ఆమె భర్తను వెదకడానికి బ్రాహ్మణులను పంపుతానంటుంది.

తాను సైరంధ్రియైనా ఎంగిళ్ళు తిననని పాదాలు ఒత్తననీ,పరపురుషులతో మాటలాడననీ, భర్తను వెదకడానికివెళ్ళే బ్రాహ్మణునితో మాత్రమే మాట్లాడుతానని ఆ విధంగా అయితేనే తానక్కడ ఉంటాననీ దమయంతి చెప్పగా రాజమాత అందుకు అంగీకరించి తన కుమార్తె సునందను ఆమెకప్పగిస్తుంది. నిరంతరం పుణ్యవ్రతాలు చేస్తూ దమయంతి అక్కడ ఉంటుంది.

అరణ్యంలో తిరుగుతున్న నలుడు కర్కోటకుడనే నాగకుమారుని దావానలం బారినుండి రక్షిస్తాడు. సరోవర తీరంలో తనను దించమన్న అతన్ని నలుడెత్తుకొని వస్తుండగా నీకు మేలుచేస్తానని అతణ్ణి కరుస్తాడు. విషపీడితుడై వికృతరూపుడైన నలునితో "నిన్ను యితరులు తెలుసుకొనకుండా ఉండటం కోసమే యీవిధంగా చేశాను. నా విషం నీ శరీరంలో ఉన్నంతకాలం నీకు పాము వలనగాని, రాక్షస పిశాచాదుల వలనగాని భయంలేదు. యుద్ధవిజయం భార్యాసంగమం, ఎప్పటి రాజ్యవైభవం ప్రాప్తిస్తాయి. నీకు నీ నిజరూపం

ఎప్పుడుకావాలనుకొంటే అప్పుడు నన్ను తలచుకో. ఈ వస్త్రంనీ వద్దకు వస్తుంది. దాన్ని ధరిస్తే నీ నిజరూపం నీకు ప్రాప్తిస్తుంది." అని చెప్పి "ఋతుపర్ణుడనే రాజును నీవు సేవిస్తూ అతనికి అశ్వహృదయ విద్యనిచ్చిఅక్షహృదయవిద్య స్వీకరించు. బాహుకుడనే పేరుతో సూతుడుగా ఉండు అని హితోపదేశం చేస్తాడు.

ఆ విధంగా ఋతుపర్ణుని వద్దచేరి అతని అశ్వాధ్యక్షుడిగా ఉంటూ రుచిగా వంటలు చేస్తూ ఉంటాడు. వార్ష్ణేయుడు, జీవలుడు, అతనికి సహాయకులుగా ఉంటారు.

రాత్రులు దమయంతిని తలచుకొని విలపిస్తూ, నిద్రలేక నిట్టూర్పులు వదులుతూ ఉన్న అతని ప్రలాపాలు విని జీవలుడు వికృతరూపుడైన నలుడా విధంగా దుఃఖించడం చూసి ఆశ్చర్యపోయి, భార్యావియోగానికి కారణమేమని ప్రశ్నిస్తాడు.

"నన్ను చూసి స్త్రీలు నవ్వరా? స్త్రీలు నాకెందుకు? మందప్రజ్ఞుడనే భటుడొకడు, తన భార్యను కోల్పోయి ప్రలాపించడం విని నేనావిధంగా అనుకరించాను" అని నలుడు బొంకుతాడు.

దమయంతి తండ్రి కూతురిని, అల్లుని వెదకడానికి పంపిన సుదేవుడనే బ్రాహ్మణుడు సుబాహుని అంతఃపురంలో దమయంతిని ఆమెనుదుటనున్న అదృష్టపు గుర్తునుబట్టి గుర్తిస్తాడు. తనను గూర్చి చెప్పి ఆమె తల్లితండ్రుల క్షేమం తెలిపి వారు పంపగా తానామెను వెదుకుతూ వచ్చిన వైనం వివరిస్తాడు. దమయంతి తన బిడ్డలను తల్లి తండ్రులను తలచి దుఃఖించడం విన్న రాజమాత బ్రాహ్మణుని వలన దమయంతి ఎవరో తెలుసుకొంటుంది. ఆనందంతో తానామె తల్లికి సోదరినని చెప్పి ప్రేమతో కౌగిలించుకొంటుంది. శుభ్రమైన నీటితో దమయంతి లలాటాన్ని కడుగగా అదృష్టపు గుర్తు అందరికీ గోచరిస్తుంది.

రాజమాత దమయంతిని సగౌరవంగా తల్లిదండ్రులవద్దకు పంపిస్తుంది. అక్కడ ఉంటూ దమయంతి దుర్భరమైన భర్తృవియోగాన్ని సహింపలేక భర్తను వెదికించమని తండ్రికి చెబుతుంది. బ్రాహ్మణులను పిలిచి, రాజసభలలో "సత్యవ్రతుడవైన నీవు భార్యను వంచించి, చీరను చింపుకొని, నీకు వస్త్రంగా చేసుకొని విడిచి వెళ్లడం న్యాయమా? భార్య భరింపబడేదన్న ధర్మం నీయందు కల్లయైనది. నీకింత నిర్దయయేల? ఆ సాధ్విని కరుణతో స్వీకరించు" అని పలుకమనీ, ఎవడు ఆమాటలకు జవాబిస్తాడో అతడే నలుడని తెలిసికొనమని చెప్పి పంపుతుంది.

పర్ణాదుడనే బ్రాహ్మణుడావిధంగా వెదకి వచ్చి, ఋతుపర్ణునివద్ద శీఘ్రయాన కుశలుడు, వంటలలో నేర్పరి, వికృతరూపుడైన బాహుకుడనే అశ్వశిక్షకుడు నన్ను ఏకాంతంలో కలుసుకొని "పురుషునిలో తప్పులున్నా మనసులో సహించే భార్య పురుషునివల్లకోరిన సుఖాన్ని, మరుజన్మలో ధర్మాసక్తిని పొందుతుంది." అని యింకేమీ చెప్పకుండా వెళ్లినాడని దమయంతితో చెబుతాడు. అతడు నిశ్చయంగా నలుడే. అని దమయంతి నిశ్చయించుకొంటుంది. తన సోదరుని స్నేహితుడైన సుదేవుని రప్పించి దమయంతి తండ్రి నలుని వెదికించి, నిరాశతో ఆమెకు ద్వితీయ స్వయంవరం చాటించినాడని భూలోకంలోని రాజులందరూ ఆ స్వయంవరానికి వెళ్లుతున్నారని, అతి వేగంగా వెళ్లి ఋతుపర్ణునికి చెప్పమంటుంది. అతడావిధంగానే వెళ్లి మరునాడే స్వయంవరమని చెబుతాడు.

ఋతుపర్ణుడు బాహుకునితో "ఒక్క రోజులోవిదర్భకు వెళ్లాలి. నీ అశ్వవిద్యా నైపుణ్యం చూపించు దమయంతీస్వయంవర సమయానికి చేరుకోవాలి" అంటాడు. సరేనని నలుడు మనస్సులో "నేనడవిలో తనను వదలి వచ్చినానని అలిగి ఇట్లాచేస్తున్నదేమో. స్త్రీలను నమ్మేవారు బుద్ధిహీనులు. ఎంతో పతివ్రత. నాకు ప్రియమైన సంతానం కలది, ఇలా ఎందుకు చేస్తున్నదో? నేనుకూడా ఋతుపర్ణునితో వెళ్లి తెలుసుకొంటాను" అని నిశ్చయించుకొంటాడు.

మనోవేగంతో వెళుతున్న రథాన్ని చూసి, ఋతుపర్ణుడాశ్చర్యపోతాడు. అతనికి అక్షహృదయ విద్యనుపదేశించి సమయం వచ్చినపుడు తాననతని నుండి అశ్వహృదయ విద్యను స్వీకరిస్తానని, అక్షహృదయం పొందినవాడు పాపాలనుండి, కళంకం నుండి విషంనుండి విముక్తుడవుతాడని చెబుతాడు. నలుని ఆక్రమించిన కలి కర్కోట విషం క్రక్కుతూ బయటికి వచ్చి నలునికి మ్రొక్కి, తనను శపించవద్దని యింతకాలం కర్కోటక విషదగ్ధుడైనదే తనకు శిక్ష అని వేడుకుంటాడు.

ఒక్క వికృత రూపం తప్ప నలుని దుష్కృతాలన్నీ తొలగిపోతాయి. సాయంసమయానికి రథం విదర్భ చేరుకొంటుంది. ఆ రథ ధ్వని విన్న దమయంతి అది నలుని రథధ్వనియే యని ఆనందం చెందుతుంది. కానీ నలుడు గాక ఋతుపర్ణుడుకనపడేసరికి దుఃఖిస్తుంది.

ఋతుపర్ణుడక్కడ స్వయంవర చిహ్నాలు కన్పించక ఆశ్చర్యపోతాడు.

దమయంతి నిరాశ చెందక కేశిని అనేదాసిని పిలిచి బాహుకుడెవ్వరో కనుగొని రమ్మంటుంది. దమయంతి ద్వితీయ స్వయంవరానికి ఒక్కరోజులోనే శతయోజనాలు ప్రయాణించి విదర్భచేరాలని ఋతుపర్ణుడు చెప్పగా తాననతనితో

మనోవేగంతో పయనించి వచ్చానని అతడు కేశినితో చెబుతాడు. వార్ష్ణేయుడు తాను నలునెరుగనంటాడు.

అడవిలో నిర్దయగా భర్త తనను వదలి వెళ్లినది మొదలు ఆనాటి వస్త్ర విశేషమే పరిధానంగా, మలిన దేహంతో, నిరలంకారంగా, భూశయనమే వ్రతంగా, జడలుగట్టిన కేశపాశంతో, దమయంతి దుర్భర శోకతప్తయై ఉన్నదని కేశిని చెప్పగా నీళ్ళునిండిన కన్నులామెకు కనబడకుండా నలుడు తల వంచుకొని ముఖం ప్రక్కకు తిప్పుకొంటాడు.కేశిని వెళ్లిఅతని మాటలు,ఆకారం వర్ణిస్తుంది. దమయంతి ఇంకా అతన్ని పరీక్షింపగోరి,మళ్ళీ కేశినిని పంపి,అతన్ని నిశితంగా పరిశీలించ మంటుంది. ఆమె అతడు వంటచేసేటప్పుడు అగ్నులు తమంతతామే మండటం, నీరు తనంతతానే ప్రవహించడం, చేతులతో నలిపినా, పువ్వులు సువాసనవీడక పోవడం చెబుతుంది. దమయంతి తన బిడ్డలను అతని వద్దకు పంపుతుంది. అతడు చేసిన వంటలు తెప్పించుకొని, రుచిచూసి, అతడు నలుడే అని నిశ్చయించుకొంటుంది.

నలుడు బిడ్డలనెత్తుకొని తన తొడపై కూర్చుండబెట్టుకొని " ఈ పిల్లలు నాబిడ్డలవలె ఉండటం చేత దుఃఖించినా"నని కేశినితో చెబుతాడు. పైగా మాటిమాటికీ రావద్దని, లోకం వేరేవిధంగాఅనుకొంటుందని ఆమెను హెచ్చరిస్తాడు.

సందేహం లేకుండా అతడు నలుడే అని దమయంతి తన తండ్రి అనుమతితో అతన్ని రప్పిస్తుంది. దమయంతి దయనీయమైన స్థితిని, కృశించిన దేహాన్ని, తపస్వినిలాగ ఉన్న తీరును చూసి, ఉబుకుతున్న కన్నీటితో తలవంచుకొన్న ఆమెను నలుడు చూస్తాడు. అతని వికృత రూపము చూసికూడా దమయంతి అతడు అన్యుడనుకోదు. " నిర్మానుష్యమైన వనంలో అలసి నిద్రపోయిన భార్యను, అబలను, సహధర్మచారిణిని, విడిచి వెళ్లిన నలుని వంటి నిర్దయాత్ములింకెవరైనా ఉన్నారా? దేవతలను కాదని తననే వరించానే, పుత్రవతినే, నేనతనికేమి అపకారం చేశాను? నన్ను విడువనని పలికి ఆ మాటనెట్లా మరచిపోయినాడు?" అని దుఃఖిస్తుంది.

"కలిచే ఆకర్షించబడి ఆ విధంగా చేయవలసి వచ్చింది. నా తపస్సువల్ల, నీ దుఃఖాగ్నివల్ల ఇప్పుడు కలి నన్ను విడిచి వెళ్లిపోయినాడు. నీకోసమే ఇక్కడికి వచ్చినాను. నీయందనురక్తుడనైన నన్ను తలంచకుండా ఇతరుని కొరకై ద్వితీయ స్వయంవరం ఏర్పాటు చేసినావే? ఇది కులస్త్రీ ధర్మమా? " అని నలుడామెను ప్రశ్నిస్తాడు.

" కేవలం నిన్ను రప్పించడం కోసమే ఈ అసత్యపు ద్వితీయ స్వయంవరం. నీవు పర్ణాదునకిచ్చిన సమాధానం వల్ల నీ జాడ తెలుసుకొని, నీవు తప్ప ఒక్కరోజులో శతయోజనాలెవ్వరూ ప్రయాణించలేరని, ఆ విధంగా రేపే స్వయంవరమని చెప్పవలసి వచ్చింది. నాలో ఎట్టి పాపభావం లేదు." అని దమయంతి వివరిస్తుంది. "దమయంతి మహాపతివ్రత. పవిత్ర చరిత్ర. ఈమె శీలాన్ని ఎఱిగి చంద్రుడు, సూర్యుడు, నేను మూడు సంవత్సరాలు ఈమెను కాపాడినాము. ఈమె నీయందను రక్తురాలు. స్వీకరించు" అని ఆకాశంనుండి వాయుదేవుడు పలుకుతాడు. దేవతలు పుష్పవృష్టి కురిపిస్తారు. దేవదుందుభులు ఆగకుండా మ్రోగుతాయి. వాయుదేవుడు ప్రసన్నంగా వీస్తాడు.

నలుడు తక్షణం కర్కోటకుని తలచి నిజరూపం పొందుతాడు.నల దమయంతుల కలయికతో సంతోషించిన భీముడు ఆనందంతో పట్టణమంతా వేడుకలు, దేవాలయాలలో పూజలు జరిపిస్తాడు.

దమయంతి నక్కడనే వదలి నలుడు తాను ఒక రథాన్ని, పదహారు ఏనుగులను, ఏభై గుఱ్ఱాలను, ఆరువందల కాల్బలాన్ని తనకు తోడుగా తీసుకొని నిషధ పురానికి వెళ్లి పుష్కరునితో " దమయంతి పందెంగా జూదమాడుదాము. నీవు గెలిస్తే దమయంతి నీది.నేను గెలిస్తే నిషధ రాజ్యం నాది. లేదా ఇద్దరం ద్వంద్వ యుద్ధం చేద్దాము. ఈ రెండింటిలో నీకేది ఇష్టం? " అని అడుగుతాడు. యుద్ధంలొ నలునిచే ఓడి, జూదంలో గెలుచుకొన్నవాడు కాబట్టి ఈసారి జూదంలో దమయంతిని కూడా గెలుచుకోవచ్చని పుష్కరుడు జూదానికే సిద్ధపడి ఓడిపోతాడు.

నలుడు తన రాజ్యాన్ని తిరిగి పొంది" ఇంతకు మునుపు మాయాజూదం వల్ల బలవంతంగా ఓడిపోయాను. అది నీ గెలుపుగా గర్వించకు. అది కలి ప్రభావం. నీవు నాతండ్రిసోదరుని కుమారుడవు.నిన్నేమీ చేయను " అని అతన్ని విడిచిపెడతాడు.

## 173,174 వేశ్యమాత,వేశ్యాపుత్రి

రోమపాదుని రాజ్యంలో అనావృష్టి కలుగగా విభాండకుని పుత్రుడైన ఋష్యశృంగుడున్నచోట సంతత వర్షమని, అందువలన అతని పిలిపించమని, తండ్రి ఆశ్రమాన్ని తప్ప అతడింకేది ఎరుగడని, బ్రాహ్మణులు చెప్పగా రోమపాదుడు నిపుణులైన వేశ్యలనాపనికి నియోగిస్తాడు.

విభాండకుడాశ్రమంలో లేని సమయంలో ఒక వేశ్య తన పుత్రికను అతని వద్దకు పంపుతుంది. ఋష్యశృంగుడు. ఋషికుమారుడనుకొని

అర్ఘ్యపాద్యాలతో అతిథిపూజచేస్తాడు. ఆ వేశ్య ఆశ్రమమక్కడికి మూడుయోజనాల దూరంలో ఉందని అక్కడికి వస్తే తానతని స్నేహం చేయగలనని చెప్పి, తాను తెచ్చిన దివ్యగంధ మాల్యాదులు, మధుర పదార్థాలు ఇచ్చి బంతి ఆడి, నృత్యగానాదులలో తన నైపుణ్యం చూపి, అతన్ని కౌగిలించుకొని రెచ్చగొడుతుంది.

ఋష్యశృంగుడు అగ్నిహోత్రానికి వేళైనా గుర్తింపక అన్యమనస్కంగా ఉంటాడు. తండ్రి వచ్చి అడుగగా ఆ వేశ్యావర్ణనం చేస్తాడు. విభాండకుడది రాక్షసమాయగా తలచి ఎవరైనా అటువంటివారు వచ్చి ఇస్తే ఏమీ స్వీకరింపరాదని చెబుతాడు.

విభాండకుని పరోక్షంలో ఆ వేశ్యాపుత్రి మళ్ళీ వచ్చి అతని మనస్సు నాకర్షించి తన వెంట రోమపాదుని రాజ్యానికి,రాజభవనానికి తీసుకొని వెళుతుంది.

అతడడుగు పెట్టగానే అనావృష్టి తొలగి ఆరాజ్యంలో కుంభవృష్టి కురుస్తుంది.

## 175 శాంత

రోమపాదుడు తన కుమార్తె శాంతను ఋష్యశృంగునకిచ్చి వివాహం చేస్తాడు. వసిష్ఠుని అరుంధతిలాగ, ముద్గలుని ఇంద్రసేనలాగ, శాంత ఋష్యశృంగుని సేవిస్తుంది.

## 176 సత్యవతి

గాధిరాజు కూతురు. ఋచీకుడామెను వివాహమాడగోరగా ఒక చెవి నీలోత్పలంలాగా నల్లగా ఉండి తక్కిన దేహమంతా తెల్లగా ఉన్న వెయ్యి అశ్వాలనిస్తేనే కన్యనిస్తానని, కన్యాశుల్కం తమ కులధర్మమని గాధి చెబుతాడు. వరుణుని సహాయంతో అటువంటి అశ్వాలను తెచ్చి యిచ్చి ఋచీకుడామెను వివాహమాడతాడు. ఋచీకుని తండ్రి భృగుడు కొడుకును కోడలిని చూచి సంతోషించి సత్యవతిని వరం కోరుకోమంటాడు. ఆమె తనకొక కొడుకు తన తల్లి కొక కొడుకు కావాలని కోరుతుంది. భృగుడామెతో "మీరిద్దరూ శుచిగా స్నామాచరించి నీవు మేడిచెట్టును, నీ తల్లి అశ్వత్థ వృక్షాన్ని కౌగలించుకొనండి" అని చెబుతాడు. వారు దానికి వ్యతిరేకంగా చేస్తారు. భృగుడది తెలిసి "నీకు బ్రహ్మకుల పూజ్యుడైన కొడుకు పుట్టి, క్షత్ర తేజంతో వెలుగుతాడు. నీ తల్లికి క్షత్రియుడు పుట్టి బ్రాహ్మణ భావం,తేజం పొందుతాడు" అని వివరిస్తాడు.

సత్యవతికి జమదగ్ని కలుగుతాడు.

## 177 రేణుక

జమదగ్ని ప్రశేనజితుడనే రాజుకూతురు రేణుక అనే ఆమెను వివాహమాడుతాడు. మరి నలుగురితో పాటు పరశురాముడు రేణుకకు జన్మిస్తాడు. ఒకనాడు రేణుక కొడుకుల వెంట అరణ్యానికి పోయి ఒక సరోవరంలో భార్యాసహితుడై జలక్రీడలాడుతున్న చిత్రరథుడనే రాజును చూసి,కామమోహితయై వ్యభిచరిస్తుంది.

ఆమె దుశ్చరిత్ర తెలిసికొన్న జమదగ్ని ఆమెను వధించమని కొడుకులు నలుగురికీ చెప్పగా మాతృవధ పాపమని వారు మారు పల్కరు. పరశురాముడు తండ్రి అజ్ఞప్రకారం తక్షణం వధిస్తాడు. సంతోషించిన తండ్రి వరంకోరుకోమనగా తిరిగి తన తల్లిని బ్రతికించమంటాడు.

## 178 సుకన్య

శర్యాతి అనే రాజు కుమార్తె. చ్యవనుని భార్య. భృగు పుత్రుడైన చ్యవనుడు అనేక వేల సంవత్సరాలు తపస్సు చేస్తాడు అతని చుట్టూ పుట్ట పెరిగి అతడా పుట్టచే కప్పబడతాడు. శర్యాతి తన చతుస్సహస్రదేవీ నివహంతో సరస్సులో జలవిహారం చేస్తూ ఉంటాడు. సుకన్య తన సఖులతో వన విహారం చేస్తూ పుట్టలో నుండి ముని కన్నులు తేజస్సుతో మెరవడం చూసి మిణుగురులని వాటిని పొడుస్తుంది. చ్యవనుడు కోపంతో శర్యాతి సైన్యానికి మూత్రపురీషనిరోధం చేస్తాడు. తన సైన్యం ఏదైనా అపరాధం చేసిందేమోనని చింతిస్తూఉండగా సుకన్య తండ్రితో తాను చేసిన పని చెబుతుంది. శర్యాతి పుట్టవద్దకు వచ్చి తపోబలం వల్ల ఎముకల పోగుగా ఉన్న వృద్ధ మునికి నమస్కరించి, తన కుమార్తె తెలియక చేసిన అపరాధం మన్నించమంటాడు.

'అతిశయ రూపయౌవనగర్వంతో' ప్రవర్తించిన కన్యను పరిగ్రహించి కాని క్షమించనంటాడు చ్యవనుడు. శర్వాతి ఆ వృద్ధునికి తన కుమార్తెనిచ్చి తన సైన్యానికి కల్గిన ఆపద బాపుకొని వెళ్లిపోతాడు.

ఎంతో భక్తితో భర్తకు సేవలు చేస్తూ ఉంటుంది సుకన్య. అశ్వినీ దేవతలొకసారి ఆమె వద్దకు వచ్చి ఎవరి భార్యవని అడుగుతారు. చ్యవనుని భార్య అని తెలిసికొని, "ఇంత అద్భుతసౌందర్యవతివి, కామభోగాలకు పనికిరాని యీ పండుముసలివి చేపట్టి నీ యౌవనమంతా వృథా చేసుకొన్నావు. నీ రూప

యౌవనాలకు తగిన వరుని వరించు." అంటారు.

"నాకు నా భర్తయందు నిరంతరం అంతులేని ప్రేమ ఉంది. మీరిట్లా పలుకరాదు" అని తన భర్తతో వారి మాటలు చెబుతుంది. చ్యవనుడామె పాతివ్రత్యానికి సంతోషించి వారి పల్కులకు సమ్మతించమంటాడు. భర్తచేత అనుజ్ఞ పొంది తనకు నవయౌవనుడైన'వరుని' కావింపుమంటుంది సుకన్య.

అశ్వినీ దేవతలిర్వురితో బాటు చ్యవనుడు ఆ కొలనులో మునుగుతాడు. ముగ్గురూ నవయౌవనులై బయటికి వస్తారు. వారు "నీ యిష్టం వచ్చిన వారిని వరించ"మంటే ఆమె తన భర్తనే వరిస్తుంది.

## 179 సుజాత

ఏకపాదుని భార్య. అష్టావక్రుని తల్లి, పెళ్లయిన చాలాకాలానికి గర్భవతి అవుతుంది. ఏకపాదుడు భార్యతో అరణ్యంలో ఉంటూ, ఘోరమైన తపస్సు చేస్తూ రాత్రింబవళ్ళు శిష్యులతో వేదాలు చదివిస్తూ ఉండగా సుజాత గర్భంలోని శిశువు తండ్రితో " రాత్రింబవళ్ళు యీ విధంగా నిద్ర లేకుండా శిష్యులను చదివిస్తే వారు నిద్రలేమివల్ల తప్పులు చదువుతారు. జడమతులవుతారు" అంటాడు. "అధ్యయనానికి నీవు వక్రభాష్యం చెప్పావు కాబట్టి ఎనిమిది వంకరలుగల శరీరంతో పుట్ట"మని తండ్రి శపిస్తాడు.

అగ్నివంటి శిశువును గర్భంలో మోస్తున్న సుజాతకునెలలు నిండి ప్రసవకాలం సమీపిస్తుంది. ఆమె భర్తతో "ఎంతటి పేదవాళ్ళైనా ప్రసూతి సమయానికి నెయ్యి, నూనె, ధాన్యం మొదలైనవి ముందుగానే సమకూర్చుకొంటారు. దారిద్ర్యం వల్ల మనకవి దుర్లభాలు. నేనేం చేయాలి? ఈ ప్రసవక్లేశం నుండి ఎలా విముక్తురాలిని కావాలి? " అని విచారిస్తుంది. ఏకపాదుడు జనకుడనే రాజు వద్దకు ధనార్థియై వెళ్లి అక్కడ యజ్ఞంలో వంది అనే వానితో వివాదం చేసి, ఓడిపోయి, జలమగ్నుడై ఉంటాడు.

సుజాత వదిన (ఉద్దాలకుని భార్య ) శ్వేతకేతువును, సుజాత అష్టావక్రుణ్ణి ఏకకాలంలో ప్రసవిస్తారు. ఇద్దరూ ఉద్దాలకుని వద్ద చక్కగా పెరుగుతూ విద్య నేరుస్తూ ఉంటారు. ఒకనాడు అష్టావక్రుడు తన మేనమామ తొడ పై కూర్చుని ఉండగా బాలుడైన శ్వేతకేతుడు " మా నాన్న తొడపై ఎందుకెక్కావు ? వెళ్లి, నీ తండ్రి తొడపై కూర్చో "అని చెయ్యి పట్టి క్రిందకీడుస్తాడు. అష్టావక్రుడు ఏడుస్తూ తల్లి వద్దకు వెళ్లి తన తండ్రి ఎక్కడకు వెళ్లాడో ఆమె నడిగి తెలుసుకొని శ్వేతకేతుని

వెంట బెట్టుకొని జనకుని ఆస్థానానికి వెళ్లి వందిని ఓడించి తండ్రితో తిరిగి వస్తాడు.
సరస్వతీ నది యీ శ్వేతకేతువునే మనుష్య రూపధారిణియై సేవిస్తుంది.

## 180 కృష్ణ

రైభ్యుని కోడలు. పరావసుడనే వాని భార్య.యవక్రీతుడనే ముని ఆమెను చూచి మదనావేశంతో తన కోర్కెను వెల్లడిస్తాడు. శాపభయంతో ఆమె అప్పటి కొప్పుకొన్నట్టే నటించి ఆగ్రహంతో మునికి చెబుతుంది. రైభ్యుడు తన జటను పెకిలించి అగ్ని యందు వేల్చి తన కోడలికంటే రూపవతిని, వేరొక జటను వేల్చి శూలపాణి యైన రాక్షసుణ్ణి తపోబలంతో సృషిస్తాడు.

ఆ యువతి రైభ్యుని ఆజ్ఞ మేరకు మన్మథ వికారంతో వికృతచిత్తుడైన యవక్రీతుని కమండలాన్ని ప్రేమ నటిస్తూ తీసుకొంటుంది. కమండలం లేక అపవిత్రుడైన అతన్ని రాక్షసుడు సంహరిస్తాడు.

## 181 అత్రి భార్య

అత్రి అనే ముని తపస్సు చేసుకోవడానికి వెళ్తూ భార్యను తన వెంట వస్తుందో, లేక కొడుకుల వద్ద ఉంటుందోనని అడుగుతాడు. ఆమె "కుమారులు కుటుంబ భారాన్ని వహించే ఆర్థికస్థితి ఏర్పరచకుండా మనం వానప్రస్థం స్వీకరించడం సమంజసం కాదు. కాబట్టి వైన్యభూపతి నడిగి తగిన సంపద తీసికొని రమ్మని భర్తను ప్రేరేపిస్తుంది.

## 182 సరస్వతీ దేవి

తార్క్ష్యుడనే ముని చదువుల తల్లి సరస్వతి నారాధించి ఆయెను ప్రత్యక్షం చేసుకొంటాడు. పురుషునకేది ధర్మమో ఏ విధంగా చేస్తే పురుషుడు పుణ్యాత్ముడై పుణ్యలోకాలు పొందుతాడో సెలవీయమని వేడుకొంటాడు. ఆమె యీ విధంగా తెల్పుతుంది.

" చతుర్వేదాలు చదివి, నిరంతరం యజ్ఞయగాలు చేసే బ్రాహ్మణుడు స్వర్గ లోక ప్రాప్తి చెందుతాడు. దండిగా పాలిచ్చే తొలిచూలు ఆవును యోగ్యుడైన శ్రోత్రియునికి దానమిచ్చే దాత ఆ ఆవు శరీరంలో ఎన్ని రోమాలుంటాయో అన్ని వేల యేండ్లు స్వర్గలోకస్థితిని పొందుతాడు.మంచి బలం గల యెద్దును బ్రాహ్మణునికి దానం చేసే మానవుడు పదిఆవులను దానం చేసిన పుణ్యం పొందుతాడు. మంచి వస్త్రాలు దానం చేసినవాడు చంద్ర లోకానికి వెళ్తాడు. బంగారం దానం చేస్తే ఏడు సంవత్సరాలు స్వర్గంలో ఉంటాడు. అగ్నిహోత్రుని

ఆజ్యంతో సంతృప్తిపరచినవాడు పదునాల్గుతరాల పితృదేవతలతో స్వర్గానికి వెళ్తాడు. అగ్నిహోత్రంలో నేనుంటాను. సకల యజ్ఞాలలో సమర్పించే విశిష్ట పదార్థాలన్నీ నావే. వాటిని నేను నాదైన అగ్నిహోత్ర ముఖంతో అనుభవిస్తాను. ఆత్మజ్ఞులైన మహాత్ముల సంశయాలు తొలగిస్తాను. నిరంతరం తపస్సుతో, స్వాధ్యాయంతో దాన వ్రత పరాయణులై తపోధనులు ఎక్కడ దుఃఖరహితులై నివసిస్తారో, అదే నా పరమపదము. యజ్ఞాలు చేసేవారు తేనె, పాలు, నీరు, చక్కర, మాంసాలు, పిండి వంటలు, పాయసాలు కుప్పలుగా, యేరులుగా సమర్పించి యింద్రాగ్ని ప్రముఖులైన దేవతలకు తృప్తి కల్గించి, నా పరమపదాన్ని పొందుతారు."

తార్క్ష్యుడు సరస్వతీ దేవి ఉపదేశంతో ధన్యుడై

"అంబ నవాంబు జోజ్వల శారద చంద్ర చంద్రికా
డంబర చారుమూర్తి ప్రకటస్ఫుట భూషణ రత్నరోచిరా
చుంబిత దిగ్విభాగ శ్రుతి సూక్త వివిక్త నిజప్రభావ భా
వాంబర వీథి విశ్రుత విహార ననుం గృప జూడు భారతీ !"

అని ఆమెను స్తుతించి కృతార్థుడవుతాడు.

## 183 బృహద్భాస

భానుడనే అగ్ని భార్య. సోమపుత్రి

## 184 నిశ

మనువు భార్య. ఈ మనువే ప్రాజాపత్యుడని బ్రాహ్మణులచే పూజింపబడినాడు.

## 185 ముదిత

అపుడనే అగ్ని ముదిత అనే మహాసౌందర్యవతియైన భార్య వల్ల 'అగ్ని'ని కంటాడు.

### 186 శివ

ఆంగీరసుని భార్య. భానుమతి,రాక,సినీవాలీ,గుహువు,నర్చిష్మతి, మహిష్మతి, మహామతి-శివ కుమార్తెలు. 187-193

## 194 సత్య

శంయుని భార్య.

## 195 భారతి

భరద్వాజుని కుమార్తె

## 196 వీర

భరద్వాజుని భార్య వీర.

## 197 సరయువు

వీరుని భార్య

## 198 స్వాహా

రసుని కుమార్తె

## 199, 200 దేవసేన, దైత్యసేన

రాక్షసులతో యుద్ధం చేసి ఓడిపోయి దేవేంద్రుడు వాళ్ల నోడించే సేనాపతి తనకెట్లా లభిస్తాడా అని ఆలోచిస్తూ ఉంటే ఒక రాక్షసునిచే చెరపట్టబడిన అబల ఆర్తనాదం విన్పిస్తుంది.కేశి అనే ఆ రాక్షసుడు ఇంద్రుని వజ్రాయుధపు దెబ్బకు ఆ కన్య నక్కడే వదలి పారిపోతాడు.ఆమె తాను అరిష్టనేమి కూతురు దేవసేననని, తన అక్క దైత్యసేన అనీ, తాము వనవిహారం చేస్తూ ఉంటే కేశి పలుమార్లు వచ్చి తన దుష్టచేష్టలు ప్రదర్శించినాడని, అవన్నీ తన అక్క దైత్యసేనకు నచ్చినాయి కాని తనకు భరించరానివిగా ఉన్నాయని, వాడు తన అక్కను ఆశలు కల్గించి వశపరచుకొని వెళ్లి, యిప్పుడు యీ విధంగా తన వెంటపడినాడని చెబుతుంది.

ఇంద్రుడామెతో "మీ తల్లీ, మా తల్లీ దక్షప్రజాపతి కూతుళ్లు. నీవు నాకు చెల్లెలివి. నీకేదైనా వరమిస్తాను కోరుకో" అంటాడు. ఆమె "మీ తండ్రి ఒకనాడు నాతో మహాపరాక్రమవంతుని భార్య వవుతావని దీవించినాడు. దేవదానవుల కజేయుడు, ఉగ్రశత్రుంజయుడు, ముల్లోకాలను రక్షించేవాడు,నీకాత్మీయ మిత్రుడు, గొప్ప గుణాలు కలవాడు నాకు భర్తగా సంఘటించు" అని కోరుకొంటుంది. ఇంద్రుడు బ్రహ్మ వద్దకామెను పిలుచుకొని వెళ్లి ఆమెకు తగిన వరుని ప్రసాదించమంటాడు.

ముల్లోకాలను రక్షించేవాడు, మహాపరాక్రమవంతుడు, కీర్తిమంతుడామెకు

త్వరలోనే భర్త అవుతాడని బ్రహ్మ చెబుతాడు.

తారకాసుర సంహార నిమిత్తమై శరవణోద్భవుడైన, రుద్రవీర్యజనితుడైన. కుమారుని వద్దకు ఇంద్రుడామెను తీపుకొనిపోయి "ఈమె బ్రహ్మ వల్ల నీ కోసం సృషింపబడిన కన్య. ఈమెను పరిణయమాడు" మంటాడు. బృహస్పతి పౌరోహిత్యంలో దేవసేనాకుమారుల వివాహం జరుగుతుంది.

## 201-206 ఆరుగురు కృత్తికలు

సప్తర్షులు అగ్నులు వేలుస్తూ ఉండగా వారి భార్యలు చక్కగా స్నానం చేసి మంచి వస్త్రాలు, ఆభరణాలు ధరించి భర్తలకు పరిచర్యలు చేయడం చూసిన అగ్నిదేవుడు వారిపై మరులుగొంటాడు.

**"..... మెలతల వాలిక మెఱుగు గన్నుల**
**యొప్పు దెలినవ్వు మొగముల విలసనంబునడ బెడంగుల నడుము లంద**
**వెలయు వళుల భావంబులు వలుదచన్ను**
**గవల నిక్కును నేర్పడగని కరంగిమదన మార్గణ విదళిత హృదయుడయ్యె"[1]**

"ఇట్లు వికలేంద్రియుడై వైశ్వానరుండమ్మౌని పత్నుల యందు దగిలిన డెందంబు మగిడింప నేరక వారలంగదియ నప్పళించి గార్హపత్య కుండంబు నందావేశించి "[2]

**" అతివలు తన్ను జేరుటకు నాసపడుం బొరి చేరుచోట నా**
**యత విలసచ్ఛిఖాగ్రముల నల్లన వారల నంటు గౌతుకం**
**బతిశయమై తదంగలత లాదట గౌగిట జేర్పగోరుగం**
**పిత ధృతియై కలంగు గడు బెల్లగు రాగరసంబు ముంపగాన్"[3]**

మునీంద్రుల హోమవిధి సమాప్తం కాగానే అగ్నికి మన్మథ బాధ దుర్భరమైనది. మునిపత్నీసమాగమం దుర్లభమనుకొని శరీరపరిత్యాగానికి సంసిద్ధమవుతాడు.

అగ్ని భార్య స్వాహాదేవి భర్త మనస్సు నెఱిగి అతనికి ప్రియం చేయాలనుకొని సప్తర్షులలో అంగీరసుడనే ఋషి భార్య శివ అనే ఆమెరూపాన్ని ధరించి ఒంటరిగా అగ్నిని కలుసుకొని తనకు, తక్కిన మునిపత్నులకు అతని పై మక్కువ కల్గిందని, అతనికి వారి పై కల్గిన కామం వారి కర్థమయిందని, అందరూ క్రమంగా అతని పొందు కోరుతున్నారని, ముందుగా తనను పంపగా తాను వచ్చినదనీ ఆలస్యం చేయకుండా తనను అనంగసుఖాల తేలించమనీ అంటుంది.

1. భార.-అరణ్య -ఆ5 - ప195 2. ఆదే.ప. 196 3. ఆదే.ప. 197

అగ్ని సంతోషంతో ఆమెతో క్రీడిస్తాడు. ఆమె అతన్ని సంతృప్తి పరిచి, అక్కడ నుండి బయటపడి గరుడపక్షిరూపంలో ఎగిరి, శ్వేతపర్వతంలో ఒక తెల్లు దుబ్బు కాడలచే చుట్టబడిన సంపెంగ పొదలో అగ్ని వీర్యాన్ని భద్రపరుస్తుంది. ఈ విధంగా ఆరుగురుమునిపత్నుల రూపాలను ధరిస్తుంది కాని పతివ్రతా శిరోమణి యైన అరుంధతి రూపాన్ని (వశిష్టుని పత్ని ) మాత్రం ధరింపలేక పోతుంది.

ఆ విధంగా ఆరు మార్లు స్ఖలింపబడిన అగ్ని వీర్యంతో ఆరు ముఖాలు, పన్నెండు చేతులు కల్గి ఆదిత్య సమాన తేజుడై కుమార స్వామి జన్మిస్తాడు.

ఆ బాలుని చూసి అక్కడి ప్రజలు మునీంద్రుల భార్యలకు అగ్ని వల్ల జన్మించినవాడని అనుకొంటారు. ఆ మాటలు విన్న ఋషులు (వశిష్ఠుడు తప్ప) తమ భార్యలను పరిత్యజిస్తారు. కొందరు ప్రజలు "ముని పత్నుల దోషం లేదు. అగ్ని భార్యయే ఇన్ని వేషాలు వేసింది" అంటారు.

స్వాహాదేవి మునుల వద్దకు వచ్చి తాను అగ్ని వలన కనిన కుమారుడే ఆ బాలుడని. ఋషి పత్నులు నిర్దోషులని చెబుతుంది. అయినా వారు భార్యలను స్వీకరించరు.

కుమారస్వామి దేవసేనానియైన పిదప ఋషిపత్నులైన కృత్తిక లార్గురు తాము నిష్కారణముగా లోకనిందపడి అతని తల్లులుగా పేర్కొనబడుతున్నందున పుత్రభావంతో తమను రక్షింపమంటారు. తాను వారి పుత్రుడనేయని, వారు తనను కన్న తల్లులని కుమారుడు వినయంతో చెప్పి, దేవేంద్రునితో వారికి తగిన పదవి నీయమంటాడు.

"దక్ష ప్రజాపతి పుత్రికలలో అభిజిత్తు అనే చుక్క రోహిణి ప్రక్కనే ఉండేది. తాను అందరి కంటే ఎక్కువగా చంద్రునికి ప్రియభార్య కావాలని తపస్సు చేయడానికి వెళ్లింది.ఆ స్థానం ఖాళీగా ఉంది. కాబట్టి వీరిని అక్కడికి పంపు" అని ఇంద్రుడు చెబుతాడు.

ఆనాటినుండి కృత్తిక లారుగురు "అగ్ని దైవత్యం" అనే నక్షత్రంగా ఆకాశంలో వెలుగొందుతూ ఉన్నారు.

## 207-213 సప్త మాతృకలు

కుమారస్వామి క్రమంగా దేవేంద్ర పదవిని స్వాధీనం చేసుకొంటాడని, అందు వల్ల అతన్ని వధించమని, దేవతలు ఇంద్రుని ప్రేరేపించగా అతడు హవిష, కాళి,కేశిక, ఉద్ధత, శీర్య, ఆర్య, వైధాత్రి అనబడే సప్తమాతృకలను పిలిచి

కుమారుని వధించి తనకు హితం చేయమంటాడు. వారు కుమారుని పైకి ఉగ్రంగా వెళ్ళి, అతని తేజస్సుకు భయపడి,తాము లోకమాతలమని,తమను మాతృభావంతో చూడమని అంటారు. కుమారుడు సరేనని వారిని మాతలుగా స్వీకరిస్తాడు.

మాతృగణం యొక్క క్రోధంనుండి పుట్టిన లోహితాస్య అనే స్త్రీకుమారునికి దాదిగా పరిచర్యలు చేస్తూ ఉంటుంది.

స్వాహాదేవి కుమారుని వద్దకు వచ్చి " నేను నీతల్లిని. నాకు నిరంతరం నీ వద్దనే ఉండాలని ఉంది."అంటుంది" అతాగే నీవు నా వద్దనే ఉంటూ,నీకోడలు, నేను చేసే సేవలు స్వీకరించు." అని కుమారస్వామి అంటాడు.

అప్పుడు సప్తమాతృకలు "మమ్ములను ముల్లోకాలకు మాతలుగా చేయి.ఇంతకు ముందున్న ఆరుగురు మాతృకల కంటె (సప్తర్షులలో ఆర్గురి భార్యలైన కృత్తికలు) మేమధికులంకావాలి. అని కోరుతారు."వాళ్ళ గొప్పతనం మాన్పడ మెందుకు? మీకు వేరే వరంఇస్తా." అంటాడు కుమారుడు?"అయితే మేము ఈ ప్రపంచంలోని శిశువులకు ఎప్పుడూ పీడలు కల్గిస్తూ నెగిడేటట్లు వరమీయ" మంటారు వారు.

" అయ్యో, కీడు తలిచారా, ఇది న్యాయమా, అయినా ఈ వరం మీ కిస్తాను. కాని మ్రొక్కినా, వేడినా,కొలిచినా శిశువులను కరుణతో కాపాడండి.తల్లులారా, పదహారేళ్ళ ప్రాయందాకా మాత్రమే మానవులను బాధించండి. నాఅంశతో పుట్టిన వాడొకడు మీకు రక్షగా ఉంటాడు." అని చెబుతాడు.

కుమారుడు తన దేహంనుండి బంగారు వర్ణంగల మానవునొకణ్ణి సృష్టించగా అతడు పుట్టీపుట్టడంతోనే ఆకలిబాధతో గిరున తిరుగుతూ మూర్ఛపోతాడు. కుమారుడు వానికి చైతన్యం కల్గిస్తాడు.వాడు "స్కందాపస్మార"మనే పేరుతో మాతృగణాన్ని రక్షిస్తూ ఉంటాడు.

## 214-220 శకుని తల్లి వినత,దైత్యుల తల్లి దితి,గోమాత సురభి,శునకమాత సరమ, వృక్షమాత కరంజ,సర్పమాత కద్రువ,కుమారుని దాది లోహితాస్య

వీరంతా మాతృగణంతో కలసి గర్భపీడనం,శిశుపీడనం చేసస్తూ మనుష్యులు బలులు, మంత్రాలు,కానుకలు దానాలు,తర్పణాలు సమర్పిస్తే తృప్తిచెంది, పిల్లలకు ఆయురారోగ్యాలనిస్తూ ఉంటారు.

## 221 స్వాహాదేవి

స్వాహాదేవి కుమారునితో "నాయనా,దక్షపుత్రినైన నన్ను నా తండ్రి చిన్నతనంలోనే అగ్నికిచ్చి పెండ్లిచేసినాడు.నేను ఇప్పుడతనికి ఇష్టురాలినికాను.నన్ను అక్కరలేదన్నాడు.నీవు నాకు,నా భర్తకు ఎడబాటులేనట్లుగాచేయి." అని విన్నవించు కొంటుంది.

"అమ్మా, యజ్ఞంలో బ్రాహ్మణులకు హవ్యాలు 'స్వాహా' అన్న మాటతో కూడిన మంత్రాలతో సమర్పిస్తారు. దానితో నీకునీభర్తతో నిత్యసహవాసం కల్గుతుంది" అంటాడు.

నాటినుండి యజ్ఞాలలో సమర్పించే ప్రతిద్రవ్యాన్ని 'స్వాహా' అని చేర్చి సమర్పించడం ఆచారమైంది.

## 222 ఊర్వశి

ఇంద్రుని ఆహ్వానంపై స్వర్గానికి అతిథిగా వెళ్ళిన అర్జునుని అప్సరసయైన ఊర్వశి మోహిస్తుంది.తనను తల్లిగా సంబోధించిన అతనితో ఈ వక్రభాష్యాలెందుకు? నీకు నేనేనాటి తల్లిని? దేవవేశ్యలమైన మాకెటువంటి న్యాయాలు లేవు.ఈ లోకంలో పురుషులు విచ్చలవిడిగా క్రీడిస్తారు. అది ఇక్కడ నిందనీయంకాదు.నీవు స్వర్గానికి వచ్చినప్పుడే దివ్యపురుషుడవైనావు.నన్ను స్వీకరించి మన్మథ సౌఖ్యాంబుధిలో ఓలలాడించు "అని అతన్ని కవ్విస్తుంది.

ధీరుడైన అర్జునుడు చలింపక "అమ్మా , నీవు మా వంశ కర్తయైన పురూరవుని పత్నివి.ఇంద్రుని ప్రేయసివి.కాబట్టి నాకు తల్లివి. నన్ను పుత్ర వాత్సల్యంతో చూడ" మని చేతులు జోడిస్తాడు.మదనబాణవివశయైన ఊర్వశి అతని తిరస్కారాన్ని సహింపక అతణ్ణి స్త్రీలమధ్యన నపుంసకుడవై సంచరించమని శపిస్తుంది.ఇంద్రుడది తెలుసుకొని, అజ్ఞాతవాస సమయంలో ఊర్వశిశాపం ఉపయోగపడుతుందని, అజ్ఞాత వాసాంతంలో శాపవిముక్తి కల్గుతుందని అనుగ్రహిస్తాడు.

## 223 లోపాముద్ర

మహామునియైన అగస్త్యుడు తల్లితండ్రుల కోరికపై తాను వివాహం చేసుకోవాలన్న కోరికతో విదర్భరాజు కొక బాలిక జన్మించేటట్లు అనుగ్రహిస్తాడు.ఆమె పెరిగిపెద్దదైన తర్వాత రాజువద్దకు వెళ్ళి,ఆమెను తనకిచ్చి వివాహం చేయమంటాడు

నారచీరలు ధరించి, అడవిలో కాయకసురులుతినే మునికి భోగాలనుభవింపదగిన తనకూతుర్నిస్తాననలేక శాపభయంతో తిరస్కరించనూ లేక రాజు భార్యకు విషయం చెప్పి, విచారిస్తూ ఉంటాడు.లోపాముద్ర అంతావిని విచారింపవలసినపని లేదని,తన నతనికిచ్చి వివాహం చేయమని అంటుంది. సరేనని తండ్రి ఎంతో వైభవంతో కుమార్తెను అగస్త్యునికిచ్చి వివాహం చేస్తాడు.

గంగాద్వారంలో తపస్సు చేసుకుంటున్న అగస్త్యుడొకనాడు భార్య సౌందర్యానికి మనస్సు చలించి ఆమెను చేరబోతాడు.భర్త కోరిక తెలుసుకున్న లోపాముద్ర సిగ్గుతో చేతులుజోడించి "సంతానార్థమై భర్త భార్యను పొందడం లోకంలో ఉన్నదే. అయినా నన్ను మనోహరమైన వస్త్రాభరణాలంకృతను చేసి,నీవు కూడ గంధమాల్య విభూషితుడవై ఋతుకాలంలో నన్ను పుత్రవతిని చేయి" అని వివరిస్తుంది.

ఆమె కోరిక నెరవేర్చడంకోసం అగస్త్యుడు భిక్షార్థియై శ్రుతపర్వుడనే రాజు వద్దకు వెళ్ళి అతడు పోషింపవలసిన వారిపోషణకు పోగా మిగిలిన ధనాన్ని తన కీయమంటాడు. తనవద్ద మిగిలినధనంలేని కారణంగా ఆ రాజు అగస్త్యునితో కలసి ప్రధ్నశ్వుడనే రాజు వద్దకు వెళ్తాడు. అతడు కూడ తనకాదాయవ్యయాలు సమానంగా ఉన్నాయని,వారిని తీసుకొని త్రసదస్యుడనే రాజు వద్దకు వెళ్తాడు. అతడూ వాళ్ళలాగే చెప్పి, ఇల్వలుడనేవాడు ఈ ప్రపంచంలో అందరికంటే ధనవంతుడని, అతడే అగస్త్యుని కోరికతీర్చగలడని, వారిరువురిని అగస్త్యుని వెంటబెట్టుకుని ఇల్వలుని వద్దకు వెళ్తాడు. అతడు వారికాథిత్యమిచ్చి, ఎప్పటిలాగే తన తమ్ముని వాతాపిని వండి, అగస్త్యునికి భోజనంగా సమర్పిస్తాడు.ఇది గ్రహించిన ఆ రాజులు అగస్త్యునికి వాతాపి వృత్తాంతంచెప్పి, అతడు బ్రాహ్మణులకు తాను భోజనమై, వారి పొట్టలు చీల్చి, వారిని చంపి బయటకు వస్తాడని,కాబట్టి భోజనం చేయవద్దని ప్రార్థిస్తారు. భయంలేదని చెప్పి, అగస్త్యుడు వాతాపిని జీర్ణం చేసుకుంటాడు. ఇల్వలుడు భయపడతాడు.తానేమి చేయాలని అగస్త్యుణ్ణి వినయంగా ప్రశ్నిస్తాడు.ఆ ముగ్గురు రాజుల కొక్కక్కరికి పదివేల ఆవులు,పదివేల సింహాసనాల బంగారం, తనకు అంతకు రెట్టింపు గోవులు, ధనం, ఒక బంగారు రథం, సమర్పించమంటాడు. ఇల్వలుడు అగస్త్యుని అభీష్టం నెరవేరుస్తాడు.

ఆ విధంగా భార్య కోరిక తీర్చిన అగస్త్యుడు పదిమందితో సమానమైన నూర్గురు కొడుకులు కావలెనా, నూర్గురితో సమానమైన పదిమంది కొడుకులు కావలెనా, వేయి మంది పుత్రులు కావలెనా లేక ఉత్తముడైన పుత్రడొక్కడ

చాలునా? అని ఆమెనడుగుతాడు. తనకతని వంటివాడు, మహాబలవంతుడు. గుణవంతుడైన కొడుకొక్కడు చాలునంటుంది లోపాముద్ర. ఏడేండ్లు గర్భం దాల్చి, రహస్యాలతో కూడిన వేదాలను జపంచేస్తూ, సూర్య తేజంతో వెల్గుతూ ఉన్న దృఢస్యుడనే కుమారునికి జన్మనిస్తుంది.

## 224 పతివ్రత

కౌశికుడనే బ్రాహ్మణుడు ధర్మతపశ్శీలుడు.నిరంతరాధ్యయన పంపన్నుడు. ఒకనాడు ఒకచెట్టు క్రింద కూర్చొని వేదాలను వల్లె వేస్తూండగా ఒక కొంగ అతనిపై రెట్టవేస్తుంది. అతడు కోపంతో చూడగా అది ప్రాణాలు వదులుతుంది. జరిగిన దానికతడు బాధ పడతాడు. మధ్యాహ్నం కావడం చేత ఒక బ్రాహ్మణ గృహానికి వెళ్ళి "భిక్షాం దేహి" అని యాచిస్తాడు.ఆ యింటి ఇల్లాలు అతనికి భిక్షనీయడం కోసం పాత్ర చేతికితీసుకుంటూ ఉండగానే ఆకలిగొన్న ఆమె భర్త తూలుతూ వస్తాడు. ఆమె ఎంతో శ్రద్ధతో అతనికి స్నానాది పరిచర్యలు చేసి ప్రియంగా మాట్లాడుతూ భోజనం పెట్టి, శయ్యపరచి,తాంబూలమిచ్చి,పాదాలు ఒత్తి,అప్పుడు బయటికి భిక్షతీసుకుని వస్తుంది. కౌశికుడు కోపించగా తన భర్త ఆకలితో రాగా, అతనిసేవలో కౌశికుని సంగతి మరచిపోయినానని,మన్నించమని వేడుకొంటుంది. "బ్రాహ్మణుల కంటె నీకు భర్త అంత ఎక్కువా? అవమానంతో వారు ముల్లోకాలను శపించగలరు" అంటాడు కౌశికుడు.

ఆమె తనకాసంగతి తెలుసునని, సముద్రజలాలు త్రాగడానికి అనర్హములని శపించినదీ, దండకారణ్యాన్ని దహించినదీ, వాతాపి అనే రాక్షసుణ్ణి జీర్ణం చేసుకున్నదీ బ్రాహ్మణులేననీ,తన భర్తయే తనకు పరమదైవమని,తన పాతివ్రత్యం చేత కౌశికుని క్రోధాన్ని, కొంగను చంపిన వైనాన్ని ఎరుగుదునని చెబుతుంది.బ్రాహ్మణ ధర్మాలతనికి బోధిస్తుంది."నీవు స్వాధ్యాయపరుడవేగాని ధర్మసూక్ష్మత నెరుగవు. ధర్మవ్యాధుడనే కిరాతకుని వద్దకు వెళ్ళు. అతడు మిధిలానగర నివాసి. సత్యవాదీ, మాతాపితృభక్తుడూ అయిన అతన్ని అడిగి ధర్మసంశయాలు తీర్చుకో, వనితలకు పరిజ్ఞానంలేకపోవడం చేత వాళ్ళెలాంటి తప్పు చేసినా క్షమించాలిగదా, అందువలన నన్ను క్షమించు" అంటుంది. కౌశికుడు తన తప్పు తెలుసుకొని ఆమె నాశీర్వదించి వెళ్ళిపోతాడు.

## 225 సోమకుని నూర్గురు భార్యలు

సోమకుడనే రాజర్షి కురుక్షేత్రంలో యజ్ఞం చేసి నూర్గురు కొడుకులను

పొందినాడని రోమశ మహర్షి ధర్మరాజుకు అతని వృత్తాంతం వివరిస్తాడు.

సోమకుడు యజ్ఞంచేసి జంతుడనే కుమారుని పొందుతాడు. అతని నూర్గురు భార్యలూ లోకం లోని ప్రజలందరూ అబ్బురపోయేటట్లు ఆ పిల్లవాడిని ఎంతో గారాబంగా పెంచుతూ ఉంటారు.ఒకనాడు ఆపసివాడికి చీమకుట్టి, బాధతో ఏడుస్తాడు.తల్లులందరూ బిడ్డ వద్దకు వచ్చి బిగ్గరగా రోదిస్తారు.ఆ ఆక్రందన ధ్వనులు విన్న సోమకుడు సంభ్రమంగా అంతః పురానికి వచ్చి, కొడుకునోదార్చి, సభలో మంత్రులతో, ఋత్విజులతో ఈ విధంగా అంటాడు.

"కోరి ఒక్కగానొక్క పుత్రుని పొందినాను. ఈ ఒక్కని నేనెట్లా నమ్మి ఉండగలను? నాకు నూర్గురు భార్యలుండీ అల్ప సంతానం కల్గి ఉండడం ఉచితంగా ఉందా?" ఆ మాటలు విన్న ఋత్విజుడతనితో "ఈ జంతును యజ్ఞపశువుగా వధించి అతని వపను(బొడ్డు క్రింద కొవ్వును)హవ్యంగా అగ్నికి సమర్పించి తృప్తి పరుస్తే నీ నూర్గురు భార్యలకు నూర్గురు కొడుకులు పుడతారు. వారిలో అగ్రజుడైన జంతుడు "సౌవర్ణలక్షణ లక్షిత పార్శ్వుడై పుడతాడు." అని సోమకునిచే అనుజ్ఞపొంది ఆ బిడ్డను యజ్ఞపశువుగా వధించి అతని వపను హవ్యంగా వేలుస్తూ ఉండగా చూచిన ఆ నూర్గురు తల్లులు పుత్రప్రేమతో ఆడుగొత్తెలలాగా ఆక్రందిస్తారు.

ఆ యజ్ఞ ధూమఘ్రాణం చేసి,గర్భవతులై నూరుగురూ నవమాసాలు నిండగా జంతుడు మొదలైన నూరుగురు కొడుకులను కంటారు.వారిలో జంతుని పట్ల తల్లులందరూ ఎప్పటివలె సమానమైన ప్రేమతో ఉంటారు.

## 226 సత్యభామ

అరణ్యావాసం చేస్తూన్న పాండవుల వద్దకు సత్యాసహితుడై శ్రీకృష్ణుడు వస్తాడు. సత్యభామ ఒకనాడు ఏకాంతంలో ద్రౌపదితో సరససంభాషణ చేస్తూ "నీవు అయిదుగురు భర్తల ప్రేమను ఏవిధంగా పొందగల్గుతున్నావు?వాళ్ళందరూ నిన్ను ఒకరిని మించి మరొకరు ప్రేమిస్తున్నారు.నిన్నెప్పుడూ చిరునవ్వుతో కాని, చిడిముడిపాటుతో చూడరు.ఇది చాలా ఆశ్చర్యకరమైన విషయం. ఇందుకు నీవేమైనా వ్రతాలు,పూజలు చేస్తున్నావా? లేక మాయలు మంత్రాలు ఏమైనా ఉన్నాయా? నీ అలంకార చాతుర్యమా,లేక నీ విభ్రమోల్లాసాల ఫలితమా, ఏమిటి నీ సౌభాగ్యరహస్యం

"వ్రతము పెంపొ మంత్రౌషధ వైభవంబో,

సరస నైపథ్య కర్మ కౌశలమొ చతుర
విభ్రమోల్లాస రేఖయో వెలది నీ వి
శేష సౌభాగ్యహేతువు చెపుమ నాకు"[1]

నీ వల్ల ఆ విశేషమేమో తెలుసుకొని శ్రీకృష్ణుని వశపరచుకొంటాను.సాటి లేని స్నేహ,ప్రేమానుభవాలను పొంది, పంచి ఇస్తాను అంటుంది.సత్యభామ మాటలు ద్రౌపదికి మనస్తాపం కల్గిస్తాయి.అయినా పైకి ఏమీ కన్పించనీయకుండా మృదువుగా నవ్వుతూ నిర్వికారంగా యిలా అంటుంది.

"లోకం లోని దుష్టస్త్రీలలాగ నన్ను నీవు భావించడం తగినదా? నీ మనస్సెట్లా ఒప్పింది? నీవు పురుషోత్తముడైన శ్రీకృష్ణుని ఇల్లాలివి కాదగినదానవు కాదు సుమా!"

"నను నిట్లు దుష్టవనితా
జనము నటులుగా దలంపజనునే నీకున్
మనసొప్పదు పురుషోత్తము
వనితవు గాదగవు నీవు వనరుహనయనా"[2]

"మంత్రాలు మాయలతో భర్త తన వశమవుతాడనుకోవడం స్త్రీ అమాయకత్వం. ఉన్న ప్రేమనశించడమేగాక, అట్టి స్త్రీలతో పాందు సర్పంతో సహవాస మనుకుంటాడు మగవాడు. పైగా స్త్రీవశీకరణ మందులు వాడితే అవి భర్తకు జడత్వమో, మూగతనమో కల్గజేస్తాయి. తుదకు తాను చేసిన పాపాలకు లోకనింద పొందడమే గాకుండా, ఆమెకు ఉత్తమగతులు ప్రాప్తించవు. పాండవుల వద్ద నేనెట్లా మెలగుతూ యీ సౌభాగ్యాన్ని పొందానో వివరిస్తాను, విను.

"నా భర్తలు వేరొక స్త్రీసాంగత్యం పొందినా, నేను వారిపై కోపించను. ఎన్నడూ గర్వపడను. అహంకారము,ఏమరుపాటు లేకుండా మనస్సు కేంద్రీకరించి ఎప్పుడూ వారికి సేవలు చేస్తాను. చూపుల్లోగాని, మాటల్లోగాని, కోర్కెల్లోగాని విడ్డూరాలేమీ చూపను. పరపురుషుడు ఎంతటి ఉన్నతుడైనా,దేవతలైనా, యక్షగంధర్వాదులైనా గడ్డిపరకతో సమానంగా భావిస్తాను.స్నానభోజనశయనాదులు భర్తలకు ముందెప్పుడూ ఆచరించను. భర్తలు రాగానే వారికి ఆసనం మొదలుకొని అన్నపానాది పరిచర్యలన్నీ భక్తితో నేనే చేస్తాను.ఆ పనులు ఇతరులకు అప్పగించను.

ఆ యా సమయాల్లో వేళ ప్రకారం వారి స్నానభోజన సౌకర్యాలు స్వయంగా సమకూరుస్తాను.భర్తల ధనధాన్యాదులు వ్యర్థంగా ఖర్చు కావడం

1. భార. అరణ్య. ఆ5. ప. 291 2.భార. అరణ్య. ఆ5.ప. 294

సహింపను. ఇంటినీ, ఆవరణను, భాండాగారాన్నీ జాగ్రత్తగా ఏమరుపాటు లేకుండా సంరక్షించుకుంటాను. బంధువులను ఆదరిస్తాను. మాటిమాటికీ తలవాకిట్లో సంచరించడం, కులటలతో స్నేహం,జగడాలకు పూనుకోవడం,ఊరికే నవ్వుతూ మాట్లాడి చులకన గావడం నాకు సరిపడని విషయాలు.

భర్తలు ఊళ్ళో లేనప్పుడు పుష్పగంధ, ఆభరణాలతో అలంకరించుకోవడం గాని,మంచి వస్త్రాలు ధరించడంగాని చేయను. వాళ్ళరాక కోసం ఎదురు చూస్తూ ఉంటాను. వాళ్ళ మీదే మనస్సు నిల్పుకొని ఉంటాను. భక్తితో అత్తకు సేవలు చేస్తాను. ఆమె చెప్పిన పనులన్నీ చేస్తాను. పెద్దలకు, అతిథులకు ఎంతో భక్తితో స్వయంగా సేవలు చేస్తాను.ఎప్పుడూ అందరికీ ప్రియంగా సహనంతో, మార్దవంతో, మంచి బుద్ధితో నడచుకొంటాను. భర్తలు చాలా మృదుస్వభావులని భయం లేకుండా నడచుకొంటాను. వాళ్ళకు కోపం వస్తే క్రూర సర్పాలవంటివారన్న భయంతో నిరంతరం వారికి సేవలు చేస్తాను. మా అత్త కుంతీదేవికి ప్రతిరోజు స్నానభోజనాది పరిచర్యలన్నీ దాసీల కప్పజెప్పక నా చేతులతో నేనే చేసి,ఆమెకు తృప్తి కల్గిస్తాను.

ధర్మతనయుని భోజనపంక్తిలో బంగారు పళ్ళెరాలలో భోజనం చేసే బ్రాహ్మణులు ఎనిమిది వేలమంది, మునులు పదివేలు.వాళ్ళందరి అన్నపానాది వ్యవహారాలలో నేనే తగిన సహాయం చేస్తూఉంటాను.ధర్మరాజు అంతఃపురంలో స్వర్ణమణిమయభూషణాలతో అలంకరించుకొని ఉండే లక్షమంది పరిచారికలు రాత్రింబవళ్ళు పాత్రహస్తులై అభ్యాగతులకు భోజనాదికాలు సమర్పిస్తూ ఉంటారు. వాళ్ళందరి ప్రవర్తనా, తప్పొప్పులు నే నెరుగుదును.లక్ష మదపుటేనుగులు, లక్ష ఉత్తమాశ్వాలు ఉన్నాయి.వాటన్నిటినీ చూసుకొనేందుకు తగిన వాళ్ళను నేనే నియమిస్తాను.కోశాగారంలోని అంతులేని సంపద, మణిమయాది వస్తువులు, ప్రతిదిన ఆదాయవ్యయాలు నాకు తెలియనివి లేవు.చివరకు గోవులు కాచే వారితో సహా సమస్త పరిచారికల జీతభత్యాలు నేనే నడుపుతూ ఉంటాను.

పాండురాజపుత్రులు కుటుంబభారమంతా నాకే అప్పగించి నిశ్చింతగా తమ పనులు చూసుకొంటూ ఉంటారు. అన్ని విషయాలలో నేనే అప్రమత్తురాలినై ఉంటాను. ఎప్పుడో తెల్లవారుజామున కాస్త కునుకు తీస్తానేగాని, ఈ పనులన్నిటి వల్లనాకు నిద్రాహారాలకు కూడ సమయముండదు.

ఇటువంటి ప్రవర్తనవల్ల నేను నా భర్తల ప్రేమను పొందగల్గానే గాని నీవు చెప్పిన మందులు, మాయలు.ఇంద్రజాలాల వల్లకాదు.

ద్రౌపది మాటలు విన్న సత్యభామ ఎంతో పశ్చాత్తాపపడి, తెలియక అడిగిన తన నేరాన్ని క్షమించమంటుంది.ద్రౌపది చరిత్రఅందరికీ గౌరవార్హమంటుంది. ద్రౌపది నవ్వి "భర్త మనస్సు దోచుకొనే చతురోపాయాలు చెబుతాను విను.భర్తకు మించిన దైవం లేదు.భర్త మన పట్ల ప్రేమతో కరుణిస్తే వస్త్రాభరణాలు, ధనధాన్యాలు, గౌరవం, సంతానం, సత్కీర్తి ,సద్గతి కల్గుతాయి. వేరే విధంగా యివన్నీ ఎలా లభిస్తాయి.?

కాబట్టి నిత్యం నీ భర్త పట్ల ప్రేమతో భక్తియుక్తులతో,సమ్యగ్భావంతో ప్రియంగా నడచుకో. అతడు నీ పట్ల తప్పక అత్యంత ప్రేమాదరాలు కురిపిస్తాడు. భర్త నీ వాకిట్లోకి వచ్చినాడనగానే సంభ్రమంతో లేచి, ఎదురొచ్చి,తీసుకొని వెళ్ళి అభ్యంతర మందిరంలో స్వయంగా ఆసనాదిసౌకర్యాలు సమకూర్చు. చెలికత్తెలను నియోగించకు. తగినట్లు ప్రేమగా మెలగు.

శ్రీకృష్ణుడు నీతో పల్కిన మధురసల్లాపాలను నీ కెంతో దగ్గరవారైన చెలులకు కూడా చెప్పకు.దానికేవో కారణాలు కల్పించి నీ సవతులు నీ పట్లకృష్ణుని మనస్సు విరిగేటట్లు చేయగలరు.నీ భర్తకాత్మీయులైన బంధువులు, మిత్రులు మొదలైన వారిని విందులు,భోజనాలు వగైరాలతో, కపటం లేని భావంతో ఆదరించు. ఆయన శత్రువులు నీ కెంతో దగ్గరవారైనా దూరంగా ఉంచు.

ప్రద్యుమ్నుడు మొదలైన నీ కుమారులతో నైనా ఒంటరిగా ఒకే ఆసనంలో ఉండడం తగదు."సతుల చరితలతి దుష్కరములు. సుమా! సద్వంశజలు, పతివ్రతలు, నిర్మలమైన బుద్ధిగల స్త్రీలతోనే చెలిమిచేయి.దుష్టస్త్రీల స్నేహం మానుకో. ఇవన్నీ నీకు పరమ సౌభాగ్యాన్ని ప్రాప్తింపజేసే ఉపాయాలు."

సుదీర్ఘంగా ద్రౌపది చెప్పినహితోక్తులన్నీ విన్న సత్యభామ "నీ వెంతో ధర్మజ్ఞురాలివి. నీ భర్తలు దైవసమానులు. గొప్పకీర్తిమంతులు. ధైర్యము, బలము, తేజస్సు కలవారు.వాళ్ళకు తప్పకుండా రాజ్యం వెంటనే లభిస్తుంది.మీకుకీడు చేసిన దుర్యోధనుని స్త్రీలు దిక్కులేక విలపించడం చూసి నీవు సంతోషించగలవు. ఎంతో బుద్ధిమంతులు,శౌర్యవంతులైన పుత్రుల గన్న ఉత్తమురాలవు. మనస్సులో దుఃఖం పెట్టుకోకు. నీ కొడుకులు ప్రతివింధ్యుడు, శ్రుతసేనుడు మొదలైన అయిదుగురు ఇప్పుడు ద్వారకలో ఉన్నారు. రుక్మిణీ, సుభద్రలు, తక్కినవాళ్ళు ఏ కొరతా లేకుండా వాళ్ళను తమ కొడుకుల కంటె మిన్నగా చూసుకొంటున్నారు. వాళ్ళను గూర్చి నీవు నిశ్చింతగా ఉండు" అని ఆశ్వాసిస్తుంది.

శ్రీకృష్ణుని నిర్యాణాంతరం సత్యభామ తపస్సు చేయడానికి తపోవనానికి వెళ్తుంది.

## 227-29 దశరథుని భార్యలు

కౌసల్య, కైకేయి, సుమిత్ర దశరథుని భార్యలు. కౌసల్యా కుమారుడు శ్రీరాముడు. కైకేయి కుమారుడు భరతుడు. లక్ష్మణ శత్రుఘ్నులు సుమిత్రా నందనులు

## 230 మంధర

కైకేయి దాసి. భరతుని పట్టాభిషేకానికై ఆమెను ప్రేరేపిస్తుంది.

### కైకేయి.

దశరథుడు శ్రీరామునికి పట్టాభిషేకం జరుపబోతున్నాడని మంధర మూలంగా తెలుసుకొన్న కైకేయి భర్త తనకు ఎప్పుడో ఇచ్చిన రెండు వరాలు, తన కవసరమైనప్పుడు కోరుకుంటానన్నవి తక్షణమే కావాలని, శ్రీరాముని పధ్నాలుగేండ్లు అరణ్యవాసానికి పంపమనీ, భరతుని రాజును చేయమనీ అడుగుతుంది. పట్టినపట్టు విడువక భర్తమరణానికి కారణమవుతుంది. ఇచ్చిమాట తప్పలేని దశరథుడు ఆమెకా రెండు వరాలనుగ్రహించి, పుత్రవియోగదుఃఖంతో మరణిస్తాడు. తల్లి చేసిన పనిని గర్హించిన భరతుడామెను "పరమ పాపాత్మురాలివి. మహా ధర్మాత్ముడైన దశరథుని పొట్టన బెట్టుకున్నదానవు. శ్రీరాముని అడవులకు పంపినదానవు, తొలగించుకోలేని అపకీర్తిని తలపై మోపుకున్న దుర్మార్గురాలివి. నీవింకేమి పాపాలు చేయగలవో!" అని తీవ్రంగా నిందిస్తాడు. అన్నపాదుకలకు పట్టంగట్టి, అయోధ్యకు వెళ్ళకుండా నందిగ్రామంలోనె పదునాల్గేండ్లు నివసిస్తాడు.

## 231 సీత

శూర్పణఖ వలన సీతాసౌందర్యాన్ని గూర్చి విన్న రావణుడు మారీచుణ్ణి పంపగా అతడు మాయా మృగంగా సీతనాకర్షిస్తాడు. సీత ముచ్చట తీర్చడంకోసం దాన్ని పట్టి తేవడానికి వెళ్ళిన రాముని చేతిలో హతుడవుతూ "హా సీతా! హా లక్ష్మణా! అని మారీచుడు అరచిన అరుపులకు సీత రామునికి అపాయాన్ని శంకించి,లక్ష్మణుని రాముని వద్దకు వెళ్ళమంటుంది. రామునికే ఆపదారాదని తానామెను రక్షించుతూ ఉండాలని పల్కిన లక్ష్మణుని సీత తూలనాడుతుంది. తనను పొందాలన్న పాపపు ఆలోచనతోనే అతడా విధంగా మాటలాడుతున్నాడని, ప్రాణాలైనా వదులు కుంటుంది గాని తానతన్ని వరింపనని సీత పల్కిన

పాపపుమాటలు వినజాలక లక్ష్మణుడు నిర్గమించగా రావణుడు మాయామునియై వచ్చి భిక్ష వేడుతాడు.భిక్ష తెచ్చిన సీతను రావణుడు మదనపరవశుడై రాముని కించపరచి మాటలాడి తనను చేపట్టమంటాడు. సీత భయకంపితురాలై కూడ "నీవిట్లా పల్కడం తగదు. ఆకాశం నేల వ్రాలినా సముద్రాలింకినా, సూర్యచంద్రులు తేజం తప్పినా నేను పరపురుషుని కామించను" అని ధైర్యంగా చెబుతుంది. బలవంతంగా తనను ఎత్తుకుపోతున్న రావణుని బారి నుండి రక్షించమని ఏడుస్తూ దేవతలను, భూదేవతలను వేడుకొంటుంది.

రావణుని చెరలో ఉన్న సీతను రాక్షసస్త్రీలు పరిపరివిధాల బాధించినా "అమ్మలారా, నన్ను ఎందుకిట్లా బాధిస్తారు.?మీ యిష్టం వచ్చినట్లు చేసుకోండి. నేను రాముని తప్ప అన్యపురుషుని కామించను.అంటుంది.రావణునితో మాట్లాడ వలసి వచ్చినప్పుడు తనను స్వీకరించి తన జీవితానికి అధీశ్వరియై సుఖాలు భోగింపమన్న రావణునితో గడ్డి పరకను అడ్డంగా పెట్టుకుని దాన్ని చూస్తూ "నేను మానవకాంతను. నీవు రాక్షసుడవు.రాగమన్నది కొంచమైనా లేని సంగమంలో కలిగే సౌఖ్యమెంత? కుబేరుని సోదరునని నీ ప్రభావం చెప్పిన నీవు ధర్మం తెలుసుకొని పాపపు ప్రవర్తన విడచిపెట్టు.సిగ్గులేకుండా ఇటువంటి దుర్భాషణలను పలుకవచ్చునా?" అని పలికి ఎంతో కరుణాపూర్ణంగా ఉత్తరీయంతో ముఖం కప్పుకొని ఏడుస్తుంది.నిరంతరం రామనామమే స్మరిస్తూ, ఆహార, విహార అలంకారాదులను సర్వాన్ని పరిత్యజించి రామనామస్మరణే సర్వస్వంగా జీవించిన సీతను రావణవధానంతరం అవింధ్యుడు విభీషణునితో కలసి తీసుకొని వచ్చి, పరిగ్రహించమని రామునికి విన్నవిస్తాడు.

మలినమైన దేహంతో,మలిన జీర్ణాంబరాలతో,జడలు గట్టిన కేశపాశంతో, దుఃఖభారంతో కృశించి, శల్యావశిష్టమైన సీతను చూసి రాముడు నిర్దయగా, అప్రియంగా "ఇంతకాలం రావణుని చెరలో ఉన్న నిన్నుచేపడితే నా చరిత్రకు హాని కల్గదా? పరాభవానికి ప్రతీకారంగా రావణుని చంపానేగాని నిన్ను నిజంగా స్వీకరింపనొల్లను.నీ తీరు కుక్కవాత బడిన హవ్యమైనది."అంటాడు.

రాముని నిర్దయాత్మకమైన మాటలకు సీత మొదలు తెగిన అరటిలాగ నేలకూలుతుంది.తిరిగి స్పృహ వచ్చిన తర్వాత దీనస్వరంతో చేతులు జోడించి "నీకు కీడు కల్గకుండా ప్రజలు నిజం తెలుసుకొనేటట్లు అగ్ని ప్రవేశం చేస్తాను.నీ చరణ స్మరణ తప్ప నా మనస్సు వేరేదైనా స్మరిస్తే ఈ క్షణమే అగ్ని కాని, వాయువుగాని, సూర్యచంద్రులుగాని నన్ను దహింపరా?" అని దీనాతిదీనంగా

వేడుకొంటుంది. పంచభూతాలు సీత పతివ్రత అని ఘోషిస్తాయి. సకలదేవతలతో బ్రహ్మదేవుడు సాక్షాత్కరించి సీత పాతివ్రత్యాన్ని రావణునికి గల నలకూబరుని శాపాన్ని తెలియజేసి మహాపతివ్రతయైన సీతను నిర్విచారంగా స్వీకరించ మంటాడు.ఆ తర్వాతే రాముడు సీతను స్వీకరిస్తాడు.

## 232-234 పుష్పోత్కట, మాలిని,పాబకలు

బ్రహ్మమానస పుత్రుడైన పులస్త్యుని కుమారుడు వైశ్రవణుడు. అతడు తండ్రి పులస్త్యుని వదలి తాత బ్రహ్మనుగూర్చి తపస్సు చేసి నలకూబరుడనే కొడుకును ధనాధిపత్యాన్ని,లోకపాలకత్వాన్ని లంకఅనే పట్టణాన్ని శంకరునితో స్నేహాన్ని వరంగాపొంది మహదైశ్వర్యంతో వెలుగొందడం చూసి తండ్రి పులస్త్యుడే సహించలేక తన శరీరంలోని అర్ధభాగంతో విశ్రవసుడనే వాణ్ణి సృష్టించి వైశ్రవణునికి కీడు చేయమని పంపుతాడు.అది తెలిసి వైశ్రవణుడు విశ్రవసుని వద్దకు వెళ్ళి తానతనికి పుత్రుడనవుతానని తనను కరుణించమని వేడుకొని అతణ్ణి ప్రసన్నుణ్ణి చేసుకొని సంగీత నాట్య విశారదలైన రాక్షసస్త్రీలు పుష్పోత్కట, మాలిని,పాబక అనే ముగ్గురిని అతనికి పరిచారికలుగా సమర్పిస్తాడు.

వారు ఒకరిని మించి ఒకరు తమ నృత్యగానవిలాసాలతో,ఉపచారాలతో అతణ్ణి తృప్తి పరిచి, అతని వల్ల సంతానాన్ని పొందుతారు.

పుష్పోత్కటకు రావణ కుంభకర్ణులు, మాలినికి విభీషణుడు,పాబకకు ఖరుడు,శూర్పణఖ కవలలు గాను జన్మిస్తారు.

## 235 శూర్పణఖ

రావణుని సవతి చెల్లెలు. దుష్ట చరిత. ధర్మకర్మాలకు దూరంగా ఉండేది. రావణ కుంభకర్ణ విభీషణులు బ్రహ్మను గూర్చి తపస్సు చేసిన కాలంలో సోదరునితో కలిసి శూర్పణఖ వారికి తగిన పరిచర్యలు చేస్తూ ఉండేది.

తండ్రి ఆజ్ఞ ప్రకారం సీతాలక్ష్మణ సమేతుడై వనవాసం చేస్తున్న రామలక్ష్మణులను మోహించిన శూర్పణఖ వారి చేత ముక్కు చెవులు కోయబడి, వికృతాకారం పొందుతుంది. రావణుని వద్దకు వెళ్లి తన పరాభవానికి, ఖరదూషణాది రాక్షస సంహారానికి రాముడే కారణమని చెబుతుంది.

## 236 తార

వాలి భార్య తార. తొలుత వాలి వల్ల భార్యను, రాజ్యాన్ని కోల్పోయిన

సుగ్రీవుడు రాముని శరణు పొంది వాలి గృహద్వారం వద్దకు వచ్చి తనతో యుద్ధానికి రమ్మని వాలిని రెచ్చగొట్టే మాటలంటూ భుజాలు చరుస్తాడు. రోషంతో వాలి అతన్ని ఎదుర్కోవడానికి సన్నద్ధుడవుతాడు.

తార అతన్ని వారించి "ఈ రోజు సుగ్రీవుని వాలకం చూస్తూ ఉంటే బలవంతుని శరణు పొంది వచ్చినట్లు కనబడుతూ ఉంది. రావణుడు తన భార్య నపహరించుకొని పోగా దశరథుని కుమారుడైన రాముడు ఆమెను వెదకడం కోసం సుగ్రీవుని సహాయం కోరి ఫలితంగా అతని కార్యం తీర్చడానికి పూనుకొన్నాడని విన్నాను. అంతేగాదు, అతిలోక పౌరుషవంతుడైన హనుమంతుడు, మహాబలవంతులైన మైందద్వివిదులు, మహాబుద్ధిశాలి యని ప్రసిద్ధిబడసిన జాంబవంతుడు ఆ సుగ్రీవుని మంత్రులై ఉంటారు. కాబట్టి నీవిప్పుడు కయ్యానికి పూనుకోవడం నాకు సమ్మతం కాదు " అంటుంది.

ఆమెమాటలు సుగ్రీవునిపట్ల పక్షపాతంతో కృత్రిమంగా మాటలాడుతున్నవిగా భావించి, లెక్క చేయకుండా మహా బాహుదర్పంతో వాలి బయలు దేరుతాడు.

"ఆ వనిత వచనములు సు
గ్రీవ విషయ పక్షపాత కృత్రిమములుగా
భావించి యాదరింపక ;
తావెడలె ననూన బాహు దర్పం బెసగన్ "

చివరకు శ్రీరామ సహాయుడైన సుగ్రీవుని చేతిలో హతుడవుతాడు.

## 237-243 సీతకు కాపలా ఉన్న రాక్షస స్త్రీలు

త్ర్యక్షి, లలాటాక్షి, త్రిస్తని, ఏకపాద, దీర్ఘజిహ్వ, అజిహ్వ, ఏకలోచన- వీరందరూ రావణునిచే చెరపట్టబడి అశోక వనంలో ఉంచబడిన సీతకు కాపలాగా నియమించబడిన రాక్షస స్త్రీలు. వాళ్ల పేర్లు వాళ్ల ఆకారానికి తగినట్లుగా వికృతంగా ఉంటాయి.

వాళ్ల చేష్టలు కూడ పరమ భయంకరంగా ఉంటాయి. రాత్రింబవళ్లు ఆ రాక్షస స్త్రీలు సీతను ఏమారక కాపలా కాస్తుంటారు. అదలిస్తూ ఉంటారు. క్రూరంగా తిడుతూ ఉంటారు. గాడిదల లాగా, ఒంటెల లాగా వికృత ధ్వనులు చేస్తూ, భయపెడుతూ ఉంటారు" ముల్లోకాధిపతి మైన మన రావణుని ఒల్లని యీ దుష్ట మానవ స్త్రీని చీల్చి చెండాడి కండలు తిందాము " అని అంటూ ఉంటారు.

## 244 త్రిజట

ఆ రాక్షస స్త్రీలలో త్రిజట మాత్రం సీతతో ఎప్పుడూ ప్రియంగా మాటలాడేది. ధర్మజ్ఞురాలు. ఆమె ఒక రోజు ఏకాంతంగా సీతను చూసి తనకు వచ్చిన కలను ఇలా వివరిస్తుంది.

" అమ్మా! నీకొక సంతోష వార్త విన్పిస్తాను. నా మాట సత్యమని నమ్మి నిశ్చింతగా ఉండు. అవింధ్యుడనే వృద్ధరాక్షసుడు పాపరహితుడు. శ్రీరామునికి మేలు చేయగోరుతున్నాడు.నిన్నోదార్చడానికి నన్ను పంపించినాడు. నిన్ను కోల్పోయిన తర్వాత రాముడు లక్ష్మణునితో కలిసి సుగ్రీవునితో చెలిమి చేసినాడు. అతి శీఘ్రంగా నిన్ను విడిపించేందుకు ఉత్సహిస్తూ ఉన్నాడు.

రావణునికి రంభ కారణంగా పర స్త్రీని తాకితే శిరస్సు వేయి ముక్కలవుతుందన్న శాపం ఉంది. కాబట్టి నిన్ను బలాత్కరించ లేడు. నీకతనివల్ల భయం లేదు. ఆ దుర్మార్గునికి చేటు మూడిందన్న విషయం తెలిపే ఒక కల నాకు వచ్చింది.

గాడిదలు పూన్చిన రథంలో విరబోసుకొన్న వెంట్రుకలు వ్రేలాడుతుండగా రావణుడు ఒంటి నిండా నూనె పూసుకొని దక్షిణ దిశగా వెళ్లినట్లు కల గన్నాను.

ఎఱ్ఱనిదండలు, ఎఱ్ఱనిగంధం పూసుకొన్న కుంభకర్ణాదులందరూ విరబోసుకొన్న తెల్లని వెంట్రుకలు గలవారై, దిగంబరులై దక్షిణ దిక్కుకు వెళ్తున్నట్లు నాకు కన్పించింది.

చక్కటి తెల్లటి గొడుగు, ప్రకాశించే తెల్లని దండ, తెల్లని మైపూత గలవాడైన మహాబుద్ధిమంతుడు ,ధైర్యశాలియైన విభీషణుడు ప్రకాశిస్తూ ఉన్న హిమాద్రి శిఖరం పై నల్గురు మంత్రులతో కూడి "రమణీయ లక్ష్మి బొలు పారగ" ఉండటం కన్పించింది.

తన స్వచ్ఛమైన కీర్తి భూమ్యాకాశాల పర్యంతం వ్యాపించగా ఆజానుబాహు వైన శ్రీరామచంద్రుడు లక్ష్మణునితో కూడి ఎత్తైన ఏనుగు మెడపై కూర్చుని మధువుతో కూడిన పాయసాన్ని భుజించడం చూశాను. నీవు పులి చేతగాయపడి నెత్తురోడుతున్న శరీరంతో ఉత్తరదిశగా పరుగెత్తడం చూశాను.

అమ్మా, నా కలనిజమవుతుంది. నీవింక విచారించకు. పుణ్యచరితుడు, మహా వివేకవంతుడైన శ్రీరాముని నీవు త్వరలో పొంద గలవు." అని తన స్వప్నవృత్తాంతం చెప్పి సీతకు రాక్షసస్త్రీల ఉపద్రవాల మధ్య ఊరట కల్గిస్తుంది.

## 245 ప్రభావతి

సీతాన్వేషణలో బయలుదేరిన హనుమంతుడు మొదలైనవానరికి ఒకచోట అతివిశాలమైన సొరంగం కన్పిస్తుంది. ఎంతో చీకటిగా నానావిధ కీటకాలతో నిండి ఉన్న ఆ సొరంగంలో ఎన్నో యోజనాలు ముందుకువెళ్ళితే సూర్యతేజంతో వెలుగొందుతున్న ఒక పట్టణంకన్పిస్తుంది. అక్కడ ప్రభావతి అనే ఒక తాపస స్త్రీ తారసపడి అది యముని పట్టణమని చెప్పి, తమకు భోజనం పెట్టిందని, ఆమె చెప్పిన మార్గంలోనే తాము ముందుకు సాగినామని హనుమంతుడు రామునితో చెబుతాడు.

## 246 సావిత్రి

మద్రదేశాధీశుడైన అశ్వపతి సంతానకాంక్షతో పద్దెనిమిది సంవత్సరాలు సావిత్రీమాతను కొలిచి ఆమెను ప్రసన్నం చేసుకొని, ఆమె ప్రత్యక్షం కాగా తనకు పుత్ర సంతానం వరంగా కోరుకొంటాడు." నేను నీ కోరిక తెలిసి ముందే బ్రహ్మకు తెలియజేశాను.ఆయన నీకు కుమార్తెను సంతానంగా నిర్ణయించాడు.భగవంతుని ఆనతి అమోఘమైనది.నీకా పుత్రిక మూలంగా శతపుత్రలాభం కల్గుతుంది. అని ఆమెననుగ్రహిస్తాడు.

మాళవీఅశ్వపతులకు సావిత్రీ వరప్రసాదంగా జన్మించిన ఆ బాలికకు సావిత్రి అని పేరు పెట్టి పెంచుతూ ఉంటారు. అపురూప సౌందర్యరాశి, సుగుణాల ప్రోగు అయిన తన కుమార్తెకు తగిన వరుని సంపాదించడ మెలాగన్న దిగులుతో ఉంటాడు అశ్వపతి.సావిత్రి సాళ్వరాజైన ద్యుమత్సేనుని కొడుకు సత్యవంతునిపై మనస్సు నిల్పి, సిగ్గువల్ల ఎవరికీ తెలియజేయకుండా ఉంటుంది.

ఒకనాడు నారదుడు మద్రభూపతి వద్దకు వచ్చిన సమయంలోనే సావిత్రి తండ్రి వద్దకు వస్తుంది. తనకు నమస్కరించి చెంతనిల్చిన కుమార్తెను వాత్సల్యంతో తండ్రి ముద్దుచేస్తుండగా నారదుడు "ఈమెను తగిన వరునకిచ్చి వివాహంచేయక ఎందుకింకా కన్యగా ఉంచినా?"వని ప్రశ్నిస్తాడు. తండ్రి సావిత్రితో " నీ రూపలావణ్యాలకు తగిన వరుని నేను వెదకలేక పోయాను.నీ వెవ్వరినైనా యిష్టపడి ఉంటే అతణ్ణే వరించు. నాకు అది సమ్మతమే"అంటాడు.

సావిత్రి సిగ్గుపడుతూనే సత్యవంతుని తాను భర్తగా కోరుకొంటున్న విషయం చెప్పి తననతనికే ఇచ్చి వివాహంచేయమని,దైవయోగంవల్ల సత్యవంతుని తండ్రి ద్యుమత్సేనుడు అంధుడైనాడని, శత్రువులవల్ల రాజ్యం కోల్పోయి,

భార్యాపుత్రులతో కలసి అడవులలో ఉంటున్నాడని అయినా తాను సత్యవంతునే వరిస్తానని అంటుంది.

అశ్వపతి అడుగగా నారదుడు సత్యవంతుడు సత్యశీలుడు, సూర్యసమాన తేజస్వి,బృహస్పతి వంటి బుద్ధిమంతుడు,ఇంద్రునివంటి శూరుడు, ఓర్పులో భూదేవి వంటివాడు,చంద్రుని వంటికాంతి, అశ్వినుల వంటి రూపసంపద గలవాడు, తపస్సు, శాంతము, ఇంద్రియనిగ్రహము, దానము, బ్రాహ్మణభక్తి గల ప్రభావశాలి -అని చెప్పి అయువు మాత్రంనాటి కొక్కసంవత్సరం మిగిలి ఉందనీ, సంవత్సరం తర్వాత మృతినొందుతాడని చెబుతాడు. "నారదుని వచనం అమోఘం. అట్టి అల్పాయుష్కుడు నీకెందుకు,ఇంకొక వరుణ్ణి వెదుక్కో" మంటాడు అశ్వపతి. "మనోవాక్కాయాలనబడే త్రికరణాల్లో మనస్సు అత్యంత ప్రధానం. అందువలన నేనితరుల వరింప"నంటుంది సావిత్రి.

"సుగుణాలరాశియైన నీ కూతురితలంపు మాన్పడం సాధ్యం కాదు. అనుమానం లేకుండా వారి వివాహం చేయి. ఆమె పుణ్యం వల్లనైనా అతడు దీర్ఘాయుష్మంతుడవుతాడు" అని నారదుడు చెప్పిన మాటలు పాటించి ఒక మంచి ముహూర్తాన ద్యుమత్సేనుని వద్దకు వెళ్ళి, సావిత్రిని సత్యవంతుని ఇల్లాలిగా స్వీకరించమంటాడు అశ్వపతి. రాజ్యంకోల్పోయి, ఘోరారణ్యాలలో తపస్సుతో కాలం గడుపుతున్న తమతో ఉండి సావిత్రి కష్టాలనోర్చుకో గల్గుతుందా అని ద్యుమత్సేనుడు సందేహిస్తాడు.

తన కుమార్తె కలిమిలేములను సంతోషంగా స్వీకరించే ధీరమతి అని పేర్కొని అశ్వపతి అతన్ని ఒప్పించుతాడు. శుభలగ్నంలో వారి వివాహం చేసి,చీని చీనాంబరాలు,మణిమయభూషణాలు, వస్తువిశేషాలు కూతురికి, అల్లునికి కానుకగా యిచ్చి అశ్వపతి తన పట్టణానికి మరలి వెళ్ళిపోతాడు.

సావిత్రి ఆభరణాలు, విలువైన వస్త్రాలు త్యజించి వనవాసులకు తగినట్లు నారచీరలు ధరించి, ఎంతో భక్తితో అత్తమామలకు సేవలు చేస్తూఉంటుంది. ఆమె వినయానికి, మంచిమాటలకు,మృదుగంభీర స్వభావానికి అత్తమామలు మనస్సులో సంతోషిస్తూ ఉంటారు. నారదుడు చెప్పిన రోజునుండి సావిత్రి భర్త అయుర్దాయాన్ని లెక్కిస్తూ ఉంటుంది.సంవత్సరానికిఇంక నాలుగు దినాలే తక్కువగా ఉంది. నాల్గవ రోజున భర్తమృతిచెందుతాడని తెలిసి సావిత్రి ఎంతో నిష్ఠతో మూడు రాత్రుల ఉపవాస వ్రతాన్ని ఆచరిస్తుంది. మామ ఆశ్చర్యంతో కారణమడుగగా తన వ్రతభారానికి వారు చింతించవలసిన పనిలేదని, ఎంతో

గొప్ప శుభాన్ని కోరి తానీ వ్రతంచేస్తున్నానని, కారణం వారికి తర్వాత తెలుస్తుందని చెబుతుంది.

నాల్గవరోజు భర్తకు మరణదినమని తెలిసీ దుఃఖాన్ని మనస్సులోనే దాచుకొని ప్రాతఃకాలకృత్యాలన్నీ యధావిధిగా నెరవేర్చి అక్కడున్న విప్రులకు, అత్తమామలకు, నమస్కరించి,వారు తనకు "సౌభాగ్యవతిగా వర్ధిల్లమని" దీవనలీయగా ఆ దీవనలను మనసారా స్వీకరిస్తుంది.

ప్రొద్దు బారెడెక్కగా మామ పిలచి," అమ్మా మూడు రాత్రుల ఉపవాస వ్రతంతో చాలా నీరసించినావు. వ్రతం ముగిసింది. ఇక ఆలస్యం చేయకుండా పారణ చేయి" అంటాడు.

ప్రొద్దుక్రుంకేవరకు తాను భుజింపకూడదని,ఆ విధంగా వ్రతప్రారంభం లోనే నిశ్చయించుకొన్నానని చెప్పి, దర్భలు, కట్టెలు, పండ్లు తేవడం కోసం అడవికి వెళ్తున్న తన భర్తతో తానూ వెళ్ళివస్తానంటుంది. నీరసంగా ఉన్నావని భర్త ఆమెను వారిస్తాడు.

ఉపవాసశ్రమ కొంచమైనా తనకు లేదని ఆ అరణ్యం మంచిమంచి పుష్పాలు, ఫలాలతో, లతలు వృక్షాలతో శోభించేదని విని చూడాలని కుతూహల పడుతున్నాని తనను వారింపవద్దని,తన కోరిక నెరవేర్చమని సావిత్రి భర్తను వేడుకొంటుంది.అత్తమామలకు చెప్పి అనుజ్ఞ పొందుతుంది.ఎన్నడూ తననేమీ కోరని కోడలి కోర్కెను మామ అమోదిస్తాడు. మనస్సులోనే విచారాన్ని అదిమి పట్టి,ముఖంలో చిరునవ్వుతో భర్తకు ప్రీతి కల్గిస్తూ సావిత్రి అతని వెంట అడవికి వెళ్తుంది.

భర్త ఎంతో ప్రేమతో అడవిలోని సరస్సులలో విహరించే రాజహంసలను, పూలతో, చిగురుటాకులతో శోభించే లతలను, మకరందసేవనంతో మదించి ఝంకారాలు చేస్తున్న తుమ్మెదలను, తనకు చూపిస్తూ, వర్ణిస్తూ ఉంటే సావిత్రి వింటూ కంటూ అతన్నే జాగ్రత్తగా గమనిస్తూ ఉంటుంది.

సత్యవంతుడు ఒక బుట్టనిండా పళ్లు కోసి ఒక చోటపెట్టి, కట్టెలు కొట్టాలని గొడ్డలి పైకెత్తి, చేతకాక అలసటతో, ఎడతెగని సెట్టుర్పుతో ముఖం వివర్ణమవుతూ ఉండగా భార్యతో "నా శరీరం స్వాధీనం తప్పుతున్నది. మనస్సేదో భ్రమకు లోనైనట్లున్నది. బల్లెపు పోట్లకు గురైనట్లు విపరీతంగా తలనొప్పిగా ఉంది. నిలువలేక పోతున్నాను" అంటాడు.

సావిత్రి సంభ్రమంతో తన తొడపై అతని శిరస్సు వాల్చి పడుకో బెట్టగా

అతడు సోలిపోయి నిశ్చేతనంగా పడి ఉంటాడు. అప్పుడు కాటుక వంటి నల్లని ఆకారంతో, వాడియై ఒత్తైన కోరపండ్లతో, ఎఱ్ఱగా మెరుస్తూన్న కండ్లతో, పచ్చని పట్టువస్త్రంతో, ప్రచండమైన తేజస్సుతో, చేతిలో పాశంతో, ఒక దివ్యపురుషుడు సాక్షాత్కరించి సత్యవంతుని సమీపించడం చూసి భయంతో భర్త శిరస్సును మెల్లగా క్రింద పెట్టి లేచి నిలబడి చేతులు జోడించి, "స్వామీ, మీరెవరు? ఇక్కడ కేపనికై వచ్చినా" రని వినయంగా ప్రశ్నిస్తుంది. నేను యముడను. నీ పాతివ్రత్యం చేత నన్ను చూడగల్గినావు. ఇతరులకు నేను కనబడను. నీ భర్తకు కాలం తీరిపోవడం చేత మహాపుణ్యనిధియైన అతని ప్రాణాలు స్వయంగా తీసికొని వెళ్ళాలని ఇతరులను పంపకుండా నేనే వచ్చా" నని చెప్పి యముడు సత్యవంతుని దేహం నుండి బెత్తెడంత ఆకారంగల జీవుణ్ణి బయటకు తీసి, పాశంతో బంధించి, దక్షిణ దిశగా వేగంగా నిర్గమిస్తాడు. మనస్సంతా శోక విహ్వలంకాగా సావిత్రి భర్త దేహాన్ని ఒకచోట రహస్యంగా దాచి, తొట్రుపడుతున్న పాదాలతో తానూ అతన్ని అనుసరిస్తుంది.

ఆమెను చూసి యముడు ఎంతో కరుణతో "నీవెందుకు వెంట వస్తున్నావు? ఈ దారి ఇక మీద మానవులు చొరరానిది. ఆగి పో" అంటాడు. "భర్తలు ఎక్కడికి వెళ్తే భార్యలు అక్కడికి వెళ్ళాలిగదా, నీ దయవల్ల నా పతిభక్తి వల్ల నాకు పోకూడని చోట్లులేవు. అన్ని మార్గాలలో ధర్మ మార్గం ప్రధానం.అట్టి ధర్మానికి ఆధారం సజ్జనులే అంటారు. అట్టి సజ్జన దర్శనం ఎప్పుడూ వృథాకాదు. సజ్జనోత్తముడవైన నీ సందర్శనం వల్ల పరమ శుభాలు పొందకుండా వ్యర్థమానవుల తీరున నేనెట్లా మరలి పోగలను స్వామీ? " అన్న సావిత్రి ప్రతిభావంతమైన మాటలకు యముడు ముగ్ధుడై " అమ్మా, నీ చక్కని మాట తీరు నన్నాకర్షించింది. నీ భర్త ప్రాణాలు తప్ప ఏదైనా వరం కోరుకో"మంటాడు. సావిత్రి శత్రువుల చేతిలో ఓడిపోయి అడవిలో తలదాచుకొన్న తన మామకు చూపునీయమని వేడుకొంటుంది. "అలాగే, కానీ, ఇంక నా వెంట రావద్దు" అని యముడు ముందుకు సాగగా సావిత్రి మళ్లీ అతని వెనువెంటనే వెళ్తుంది.

అంతే గాక, " మనస్సులో గాని, వాక్కులో గాని, చేతల్లో గాని, ఎవ్వరికీ, ఎన్నడూ కీడు చేయరని, దీనులను కరుణతో కాపాడుతారని, యివ్వడం మొదలు పెడితే ఎదుటి వాళ్ల కోర్కెలు తుద ముట్టేదాకా ఇస్తారని, తమ నాశ్రయించిన వారి మనస్సుకు సంతోషం కల్గ జేస్తారని, ఇవన్నీ ఆర్య ధర్మా"లని పేర్కొంటుంది.

"స్వామీ, నీకు తెలియని ధర్మమున్నదా? ధర్మాలన్నీ నీ అధీనంలో

ఉండటం వల్లనే నిన్ను ధర్మదేవత వంటారు. సకల ప్రాణి కోటికి వారివారి కర్మలకు తగిన ఫలాన్ని సమకూర్చడం చేత నిన్ను సమవర్తి వంటారు.సకల భూతాలను అణచి వేసే వాడవు కాబట్టి నిన్ను యముడంటారు. పాపాలు తొలగించేవాడవు కాబట్టి ఓ సూర్యనందనా, నీవు శమనుడ వైనావు"అని తనను స్తుతించిన సావిత్రితో యముడు "దప్పిగొన్న వానికి చల్లని నీటిధారలు తృప్తి కల్గించినట్లుగా పాపహరణాలైన నీ చక్కని మాటలు నా మనస్సును తృప్తిపరచినాయి. సత్యవంతుని ప్రాణాలు తప్ప నీ కోర్కె యేదైనా సరే నెరవేరుస్తాను. కోరుకో" అంటాడు. శత్రువుల చేత అపహరింపబడిన తన మామ రాజ్యం తిరిగి అతనికి ప్రాప్తించాలని కోరుకొంటుంది సావిత్రి. "అలాగే.ఇంక ఇక్కడే నిలిచిపో. నీ పతిభక్తికి సంతోషిస్తున్నాను. కాని యీ దారి దుర్గమమైనది. మానవులిక్కడి నుండి ముందుకు రాకూడదు. ఇదే చివరి సరిహద్దు" అంటాడు యముడు.

"మహానుభావా! ధర్మాత్ములు తాము చేసే ధర్మాన్ని ఎట్టి స్థితిలోను తప్పరు. మోహపరంపర గాని, తాపం గాని ధార్మికులైన వారి మనస్సులలో పుట్టవు. అందువలన భర్తను అనుసరింపకుండ నేనెలా ఆగగలను? నిశ్చలమైన మనస్సుతో మోహావేశం చెందకుండా ధర్మాన్ని అనుసరించాలి గదా," అంటుంది. ధర్మదేవత ముగ్ధుడై " తల్లీ, నీవు మహా ధర్మజ్ఞురాలివి. కాబట్టి యింకొక్క వరమిస్తాను. కాని నీ పతి ప్రాణాలు మాత్రం కాదు సుమా!" అంటాడు.

సావిత్రి చేతులు జోడించి తన తండ్రికి నూర్గురు కొడుకులు కలిగేటట్లు ప్రసాదించమంటుంది. యముడు సంతోషంతో ఆమె కావరమిచ్చి" చాలా దూరం వచ్చి అలసిపోయినావు. ఇంక తిరిగి వెళ్లడం మంచిది" అంటాడు.

" నాకు అలసట యెక్కడిది? నా మనస్సు నా భర్త పాదధూళి పైనే ఆసక్తమై ఉంది. భక్తితో నిండి ఉంది. భర్తను ఆశ్రయించడం తప్ప భార్యలకు వేరే ధర్మమేదీ లేదు గదా స్వామి! ఇంకొక్క విన్నపం చేస్తాను. తమ ధర్మాన్ని నెరవేర్చడంలో ఆసక్త గల్గిన పుణ్యాత్ములీ లోకంలో లభించరు. అటువంటి వారి సహవాసంతో సమస్త పాపాలు నశించుతాయి. వారు మానవలోకంలో పుణ్యక్షేత్రాల వంటివారు. వారి పుణ్యం వల్లనే సూర్యచంద్రులు గతులు తప్పకుండా ఉన్నారు. సముద్రాలు చెలియలి కట్ట దాటకుండా ఉన్నాయి. ప్రాణి కోటి నశించకుండా వృద్ధినొందుతున్నది. సకల పర్వతాలు కదలకుండా నిశ్చలంగా ఉన్నాయి. ఏడు మాటలు మాటలాడితే ఎలాంటి వారైనా సజ్జనులకు మిత్రులవుతారంటారు గదా! ఇంత సేపు కలిసి నడుస్తూ నీతో మాటలాడటం చేత నేను నీకు బంధువునని

వేరే చెప్పవలసిన పని యేమున్నది? కాబట్టి "మిత్ర మనోరథంబు నీకవశ్య కర్తవ్యంబుగా చిత్తగించు" మంటుంది సావిత్రి

మహానుభావుడు యముడామెమాటలకు హర్ష పరవశుడై " అమ్మా,నీ పట్ల నేను ప్రసన్నుడనైనాను. నీ యిష్టం వచ్చిన ఒక్క వరంకోరుకో." అంటాడు.

"తండ్రీ ! ఇంతవరకు సత్యవంతుని ప్రాణాలుతప్ప ఇతరవరాలు ఇస్తానంటూవచ్చావు. ఇప్పుడట్లా అనలేదు.కాబట్టి నా కిష్టమైన వరంకోరుకుంటాను. భర్తలేకుండా జీవించడం దుర్భరం, భర్తలేని స్త్రీ సమస్త శుభకార్యాల్లో బహిష్కృతు రాలవుతుంది.కాబట్టి పరమపుణ్యాత్ముడైన నా భర్తను నాకు ప్రసాదించు" అని ప్రార్థిస్తుంది. యముడు సరేనని సత్యవంతుని పాశవిముక్తుని చేసి " అమ్మా ఇదిగో నీ భర్త. ఇతడు నాల్గువందల సంవత్సరాలు జీవిస్తాడు. నూర్గురు పుత్రులను పొందుతాడు. మహాకీర్తిమంతుడై నిరంతర యాగాలతో దేవతలను తృప్తిపరుస్తాడు.తన వంశానికంతా మకుటాయమానుడవుతాడు అని ఆశీర్వదించి అంతర్ధానమవుతాడు. సావిత్రి భర్త తలను ఎప్పటిలాగ తన తొడపై ఉంచుకొని కూర్చుంటుంది.

నిద్రలోనుండి మేల్కొన్నట్లుగా లేచి "చాలా సేపు నిద్రపోయాను. నన్ను మేల్కొల్పకూడదా, ఒక మహాబలవంతుడు నన్ను పట్టుకొని, లాక్కొని వెళ్ళినట్లుగా కల గన్నాను. అది కలలాగ లేదు.నిజమే అయినట్లుగా నాకు చాలా భయంవేసింది." అంటాడు."అంతా వివరంగా ఉదయం చెబుతాను.రాత్రి కాబోతున్నది. మనమిక్కడ ఆలస్యం చేస్తే మీ తల్లి తండ్రులు చాలా దిగులు పడతారు. వేగంగా వెళ్ళి వారికి సంతోషం కల్గించుదాము" అని చెప్పి అతని విషాదవైఖరి గమనించి " చీకటులు దట్టంగా కమ్ముకున్నాయి. మన ఆశ్రమం చాలాదూరం అలసట తగ్గలేదంటే ఈ రాత్రి ఇక్కడే ఉండి రేపు ఉదయం వెళదామా, ఏం చేద్దాము? అని అడుగుతుంది.

"తలనొప్పి తగ్గిపోయింది. ఒంట్లోకి కొత్త శక్తి వచ్చింది. మెల్లగా నడువగలను. తల్లిదండ్రులను చూడకుండా యీ అరణ్యంలో ఎలా ఉండగలను? ఇంతకు ముందెప్పుడూ ఇంతసేపు వారిని విడచి ఎక్కడా ఉండలేదు.ఈనాడు అర్ధరాత్రి దాకా ఆలస్యం చేసినందుకు వారెంతగా విచారిస్తున్నారో, యేమైనారో, ఎట్లున్నారో! సంధ్యవేళ ఎన్నడూ నన్ను నాతల్లి యిల్లువిడచి బయటకు రానీయదు. నేడీ అరణ్యంలో మధ్యరాత్రి దాకా ఉండిపోయినందుకాతల్లి ఎంతగా కుమిలిపోతున్నదో? ఏ పాట్లు పడుతున్నదో! నన్ను కౌగిట అదుముకొని శిరస్సు

ఆఘ్రాణిస్తూ కన్నీరు స్రవిస్తూఉండగా “ నాయనా, మాదేహ మనః ప్రాణాలు నీవే. మా తండ్రివి నీవు.నీవు కడతేర్చక సంసారతీరం చేరలేము. తండ్రీ కళ్ళు లేని మాకు కళ్ళు, కాళ్ళు నీవే కదా! మా సమస్త వంశాన్ని సముద్ధరించే భారం నీమీదే ఉంది కదా! అని అంతులేని ప్రేమతో నా తల్లిదండ్రులు నాతో ముచ్చటించేవారు. ఏమైనారో! పళ్ళు దుంపలు తీసికొని వెంటనే వెళ్ళకుండా దైవోపహతుడనై ఇలా చిక్కుకుని పోయాను. నేనేం చేయను? నేనున్న చోటు తెలియక ఎంతో దుఃఖంతో మా తండ్రి మాటిమాటికీ నన్ను గూర్చి భయంతో ఆశ్రమవాసులందరిని విచారిస్తూ ఉంటాడు. నా వార్త వినకపోతే వారిప్రాణాలు పోతాయి. నేనింక అచటికి వెళ్ళి ప్రయోజనం ఉండదు. నేనూ ప్రాణాలు వదులుతాను.”

అని ఎన్నో విధాలుగా దుఃఖిస్తున్న భర్తను తానూ దుఃఖిస్తూ ఉండికూడ ఓదారుస్తూ, మెల్లగా లేపి,తన భుజాలు ఆసరాఇచ్చి మెల్లగా నడిపిస్తుంది. పళ్ళబుట్ట బరువనిపించగా ఒక చెట్టుకొమ్మకు దాన్ని తగిలించి తన భర్త ఎడమ చేతిని తన ఎడమ భుజం మిద పెట్టుకొని కుడిచేత్తో అతన్ని కౌగలించి పట్టుకొని మెల్లగా ఆశ్రమానికి తీసికొని వస్తుంది. అంతకు ముందే కంటిచూపు వచ్చిన అశ్వపతి అంతటా కలయజూచి, తన ముద్దుల కొడుకునుగానక భార్యాసహితుడై రోదిస్తూ కొడుకు అలస్యానికి కారణం తెలియక ఇక్కడా అక్కడా వెదుకుతూ, అతని సుగుణాలు కీర్తిస్తూ అతనిజాడను గూర్చి అక్కడి మునులను ప్రశ్నిస్తూ ఉంటాడు. మునులు అతనికి చూపు వచ్చినందు కాశ్చర్యపోతూ తగు మాటలతో ఓదారుస్తూ ఉంటారు.

సావిత్రీ సహితుడైన సత్యవంతుని చూడగానే తల్లిదండ్రులు సంతోషంగా కౌగిలించు కొంటారు. తండ్రి కుమారుని అలస్యానికి కారణమడుగుతాడు. సత్యవంతుడు తవ కలను గూర్చి చెబుతాడు.అప్పుడు సావిత్రి “ ఇతనికీ దినం మరణమని నారదుడు ముందే చెప్పినాడు. అతని వాక్కు అమోఘం. అందువల్ల నేను ఏ మారక ఇతనితో యీ దినం అడవికి వెళ్లాను. అతడు నిద్రిస్తూ ఉండగా యముడు వచ్చి నా భర్త ప్రాణాలు తినికొని వెళ్తూండగా నెను వెంబడించి, సత్యధర్మయుతంగా అతన్ని స్తుతించినాను. నాపై కరుణతో నాకు యముడు నాల్గు వరాల నిచ్చినాడు. అందులో ఒక వరంతో ఇతడు పునర్జీవితుడైనాడు. మీకు దృష్టి లాభం, రాజ్యలాభం నా తండ్రికి శతపుత్రలాభం -తక్కిన మూడు వరాలు” అని వివరిస్తుంది.అత్తమామలు, ఆశ్రమంలో మునులందరూ సావిత్రిని స్తుతిస్తారు.

"ఆ పత్సముద్ర మగ్నం;
బై పోయెడు నస్మదన్వయము పెంపెసగన్
దేప యయి కడవ బెట్టిన;
నీ పుణ్య చరిత్ర కీర్తనీయము తల్లీ"[1]

యముని వరం వల్ల కొద్దికోజులకే ద్యుమత్సేనునికి రాజ్యప్రాప్తి కల్గుతుంది. సావిత్రిలాగే ద్రౌపది పాండవులను, వారి వంశాన్ని ఉద్ధరించగలదని మార్కండేయ మహర్షి ధర్మరాజుకు చెబుతాడు.

## 247 శచీదేవి

వృత్రాసుర వధానంతరం బ్రహ్మహత్యాపాతకం చేసినావని భూతసంఘం నిందింపగా ఇంద్రుడు దేవపతిత్వం కోల్పోయి, నీచదశకు వచ్చి, నిషధాచలంలో రహస్యంగా ఉంటాడు.

దేవతలు నహుషుడనే రాజుకు ఇంద్రపదవి కట్టబెట్టిన ప్రారంభంలో అతడు ధర్మమార్గంలోనే సంచరించినా రానురాను దేవేంద్రపదవి వల్ల గర్వాతిరేకంతో, రంభాది అప్సరసల నృత్యగాన వినోదాదులతో, భోగలాలసత్వంతో విర్రవీగుతూ ఉంటాడు.

అసమాన లావణ్యరాశియైన ఇంద్రపత్ని శచీదేవిని చూసి నహుషుడు మన్మథావేశంతో ఆమెను తన వద్దకు రమ్మని పిలుస్తాడు. ఆమె భయకంపితురాలై దేవగురువు బృహస్పతిని శరణు వేడుతుంది.

ఇంద్రాణిని తన వద్దకు పంపకుండా ఉన్న బృహస్పతిపై నహుషుడు కోపించగా దేవతలు"పరుని భార్యను కోరడం నీకు తగినది కాదు" అంటారు. "ఇంద్రుడు గౌతముని భార్య అహల్యను కోరినప్పుడు మీరతనికి నీతిపాఠాలు చెప్పిఉండకూడదా?" అని నహుషుడు వాళ్లని ఎద్దేవా చేస్తాడు.అతని కోపానికి భయపడి దేవతలు బృహస్పతి వద్దకు వెళ్లి " నహుషుడు మహేంద్రపదవిలో ఉన్నాడు. అతడు శచిని వరించడం సబబే. లోకహితం కోసం, అతని కోపంశాంతించడం కోసం శచిని వెంటనే అతని వద్దకు పంపించ" మంటారు.

శచీదేవి దుఃఖంతో మీరు నన్నిట్లా పంపవచ్చునా? శుచినని నన్ను మీరు కొనియాడటం కల్లగాదా?" అని అడుగుతుంది. బృహస్పతి ఆమెనాశ్వాసించి "నీవు నహుషునితో సమయోచితంగా మాటలాడి, సమాగమానికి కొంత వ్యవధి కావాలని

1. భార. అరణ్య. ఆ.7 ప.274

అడుగు. ఈ లోపున దేవేంద్రుని జాడతెలుసుకొని తగిన విధానాన్ని అనుసరిద్దాము" అంటాడు. శచిబృహస్పతి చెప్పినట్లుగా నహుషుని వద్దకు వెళ్తుంది. ఆమెను చూడగానే అతడు కామాతురుడై మన్మథచేష్టలు చేస్తూ వలపు తెలిపే మాటలాడుతాడు.

ఆమె తగిన మాటలతో యుక్తిగా "ఇంద్రుడు లేడన్న సంగతి పూర్తిగా నిర్ధారించుకుంటే నా మనసుకు అనుమానం ఉండదు. అప్పుడు నీ దాననవుతాను. అంతవరకు ఆగుదాము." అని ఒప్పించుతుంది.

అశ్వమేధయాగం చేస్తే ఇంద్రునికి బ్రహ్మహత్యా దోషం తొలగిపోతుందని విష్ణువు దేవతలకు చెప్పగా వారు ఇంద్రునికీ విషయం తెలియజేస్తారు. ఇంద్రుడు అశ్వమేధం చేసి తన పట్టణానికి వెళ్లి నహుషుని తేజస్సుముందు నిలువజాలక తనకు నహుషుని చంపేంత బలం లేదని తెలుసుకొని ఎవ్వరికి తెలియని చోటికి వెళ్లిపోతాడు.

శచీదేవి భర్తజాడ తెలియక 'ఉపశృతి'ని రాత్రివేళలో ఆరాధిస్తుంది.ఆమె ప్రత్యక్షం కాగానే నీవెవరవని అడుగుతుంది." నీ పాతివ్రత్యానికి, సత్యశౌచాలకు మెచ్చివచ్చిన ఉపశృతిని అని చెప్పి "నీ భర్తను చూపిస్తాను ర"మ్మని హిమాలయ పర్వతాల కుత్తర భాగంలో మంజువంతమనే మహాపర్వతంమీద నూరు యోజనాలు విస్తీర్ణంగల ఒక సరస్సులోని పంచవర్ణశోభితాలైన తామరలలో ఒకదాని నాళాన్ని చీల్చి, తాను ముందు ప్రవేశిస్తుంది. శచి ఆమెను అనుసరిస్తుంది.ఉపశృతి అదృశ్యమవుతుంది.అక్కడ భర్తను చూసి శచి సంభ్రమాశ్చర్యాలకు లోనవుతుంది. ఇంద్రుడామె అక్కడి కెట్లా వచ్చిందో తెలుసుకొంటాడు.నహుషుడు తనను కామించిన వృత్తాంతం, తాను సాకుతో కాలయాపన చేస్తున్న విషయం చెప్పి, ఇంక ఆలసిస్తే అతని వల్లతనకాపద కల్గుతుందని చెబుతుంది.ఇంద్రుడతన్ని ఎదుర్కొనే పరాక్రమం తనకు లేదని, ఉపాయంతో అతని పతనాన్ని ఆలోచించాలని చెప్పి, అతడు ముని వర్గవాహనుడై తన వద్దకు వచ్చినట్లయితే తనకు సమ్మతమేనని నహుషునితో చెప్పమని, తర్వాత అంతా సానుకూలమవుతుందని చెప్పి పంపుతాడు.

శచీదేవి ఆ విధంగానే చేయనిశ్చయించుకొని బృహస్పతికీ విషయం తెల్పుతుంది. బృహస్పతి ఇంద్రుని వెదకడానికి అగ్నిని పంపుతానని, మునివాహనత వల్ల నహుషునికి చేటుకాలం ప్రాప్తిస్తుందని చెబుతాడు.శచీ సందేశాన్నందుకున్న నహుషుడు మహా సంతోషంతో మునులను తన వాహనంగా చేసుకొని శచి వద్దకు బయలుదేరుతాడు. అంతరంగంలో క్రోధంతో బుసలు కొడుతూ ఉన్నా, మునులు

చేసేదేమీ లేక పైకి మామూలుగా ఉండి, అతనితో బ్రాహ్మణ మంత్రాల ప్రామాణి కతను చర్చిస్తూ ఉంటారు. అతడు గర్వంతో వారి మాటలను వ్యతిరేకిస్తాడు. అగస్త్యుడు నహుషుని నిందించగా నహుషుడతని తలను తన కాలితో తంతాడు.

అగస్త్యుడు "నీ విం్రదపదవీభ్రష్టుడవై భూలోకంలో పామువై పడి ఉందువు గాక!" అని శాపమిస్తాడు.

ఆ విధంగా శచీదేవికి నహుషుని వల్ల విముక్తి లభిస్తుంది.

## 248,249 వైదర్భి, శైబ్య

సగరుని భార్యలు. ఈశ్వరుడు తన వరం వల్ల వైదర్భికి అరవైవేలమంది కొడుకులు కల్గి దర్పోద్ధతులై ఒక్కసారే మరణిస్తారని, శైబ్యకు ఒక కుమారుడు కల్గి వంశకర్త అవుతాడని అనుగ్రహిస్తాడు.ఇద్దరూ గర్భవతులవుతారు. వైదర్భికి సొరపండు, శైబ్యకు అసమంజసుడనే కొడుకు కల్గుతారు. 'ఆ పండును' పడవేయబోతున్న రాజుతో ఆకాశవాణి "దీన్ని పడవేయవద్దు. దీని విత్తనాలు నేతి కుండలలో బెట్టి రక్షించుకొ" మ్మంటుంది. రెండు నెలలకా పండు నుండి అరవైవేలమంది పుత్రులు జన్మిస్తారు. బలోద్ధతులై కపిల మహాముని కోపాగ్నిలో భస్మమవుతారు.

## 250 ఇంద్రసేన

మౌద్గల్యుని భార్య. పరమ పతివ్రత. కర్మవశాత్తు మౌద్గల్యుడు కుష్ఠువ్యాధి పీడితుడవుతాడు. వృద్ధుడు, వ్యాధి చేత ఎముకలు, చర్మం మాత్రమే మిగిలిన శరీరం కలవాడు,జుట్టు తెల్లబడి ముడతలు బడిన శరీరం,దుర్గంధ భూయిష్ఠమయిన వదనం కలవాడు, దుఃఖ జీవీ, అతికోప స్వభావుడు, శిథిలమైపోయిన గోళ్లు, వ్రేళ్లు కలవాడూ అయిన మౌద్గల్యుని ఆ పతివ్రత ఎంతో భక్తితో సేవిస్తూ ఆయన ఉచ్ఛిష్టాన్ని భుజిస్తూ ఉంటుంది.

ఒకనాడు ఆమె భుజిస్తూ అన్నంలో భర్తవ్రేలు తెగిపడి ఉండడం చూసికూడ అసహ్యించుకోక, పక్కకు త్రోసి ఆ ఎంగిలి కూడు ఇష్టంగా తింటూ ఉంటుంది. ఆమె నా విధంగా చూసిన భర్త ఆమె పతి భక్తికి మెచ్చుకొని "నీ యిష్టమేదో వేడుకో. ఇస్తా"నంటాడు. ఆమె "మునీంద్రా, నాకు కామభోగేచ్ఛ చాలా తీవ్రంగా ఉంది. నీవు కామరూపధారుడవై, ఈ బీభత్సమైన అకారం విడిచి, మనోహరమైన అయిదు రూపాలతో నన్ను రమించి, కామభోగాలలో తృప్తిని కల్గించు" అని కోరుకుంటుంది.

ఆ ముని ఆ విధంగానే ఆమె కిష్టమైన అయిదు దేహాలు ధరించి ఆమెను అనేక వేల సంవత్సరాలు, అనేక మనోహర ప్రదేశాలలో భోగించి, తృప్తి చెంది ఘోరమైన తపస్సు చేసి బ్రహ్మలోకం పొందుతాడు. ఇంద్రసేనకు కామతృప్తి కల్గదు. కాలవశాత్తు శరీరం విడిచి, కాశీరాజు అనే రాజర్షికి పుట్టి, పెరుగుతూ ఆ జన్మలో కూడ కన్యగానే చాలా కాలం ఉండి, తన దౌర్భాగ్యానికి చింతిస్తూ భర్తను కోరి ఈశ్వరునికై ఘోరతపస్సు చేస్తుంది.

ధర్మ, వాయు, వాసవ, అశ్వినులు ఆమె పట్ల ప్రీతి గలవారై ఆమె వద్దకు వచ్చి, తమ దేహాంశ వల్ల పుట్టిన వారికి ఆమె భార్య కావాలని కోరుకుంటారు.

ఆమె కొంత కాలం జలాహారం, మరి కొంత కాలం నిరాహారం, కొన్ని సంవత్సరాలు ఒంటికాలిపై, మరికొన్ని ఏళ్లు పంచాగ్ని మధ్యంలో - ఈ విధంగా అతి భయంకరమైన తపస్సు చేయగా ఈశ్వరుడు ప్రసన్నుడై ప్రత్యక్షమై వరం వేడుకోమంటాడు. ఆమె " నాకు పతి దానం చేయ"మని అయిదు సార్లడుగుతుంది. నీకు దేహాంతరంలో అయిదుగురు భర్తలవుతారని ఈశ్వరుడు వరమీయగా

"సతికి నొక్కరుండ పతి గాక యెందును;
బతులు పలువురవుట కతల గలదె
లోకనాథ యిట్టి లోక విరుద్ధంపు;
వరము వడయ నమర వరద యొల్ల "[1]

అని లోక విరుద్ధమైన ఆ వరం తనకు వద్దని, తాను అయిదు మందికి భార్య కాజాలనంటుంది. "నా వరం వల్ల నీకా అయిదుగురి పట్ల ధర్మం తొలగకుండా ఉంటుంది" అంటాడు. "అయితే నాకు ఆ అయిదు భర్తలయందు ప్రత్యేక సంగమంలో కౌమారం, పతి శుశ్రూషసిద్ధి, కామ భోగేచ్ఛ, సౌభాగ్యం ప్రసాదించు" అని కోరుకుంటుంది. రుద్రుడామె కోరిన వరాలన్నీ యిచ్చి, గంగా తీరంలో ఉన్న ఇంద్రుని తన వద్దకు తోడ్కొని రమ్మని ఆజ్ఞాపిస్తాడు.

ఆమె సరేనని శివునికి ప్రదక్షిణ పూర్వకంగా నమస్కారం చేసి, గంగా తీరంలో ఇంద్రుని కొఱకు నిరీక్షిస్తూ ఉంటుంది.

అక్కడ వైవస్వంతుడు నైమిశారణ్యంలో సత్ర యాగం చేస్తూ ప్రాణిహింస చేయకుండా ఉంటాడు. అందువలన మానవులకు మరణం ఉండదు. అది

1. భార. ఆది. ఆ7.ప. 262

సహింపలేని దేవతలు బ్రహ్మ వద్దకు వెళ్లి తమకూ, మానవులకూ భేదమేమని అడుగుతూ దుఃఖిస్తారు.

"పూర్వం లాగానే అంతకుడు మానవుల నంత మొందించగలడు. మీరు విచారించకండి. ఆ వైవస్వంతుని వీర్యం, మీ వీర్యం ధరించి సూర్యసమాన తేజస్కులైన అయిదుగురు జన్మించి అందుకు కారణం కాగలరు" అంటాడు.

**"ఆ వైవస్వతు వీర్యము;**
**మీ వీర్యము దాల్చి సూర్యమిత తేజులుదా**
**రేవురుదయింతు రాతని;**
**కావించు విధానములకు గారణమగుచున్"[1]**

దేవతలతో కలిసి ఇంద్రుడు తిరిగి వెళ్ళుతూ దేవగంగా సమీపానికి రాగా అక్కడ నీళ్ళ మధ్యలో ఒక కన్య యేడుస్తూ కనపడుతుంది. ఆమె కన్నీళ్ళు బంగారు కమలాలు కావడం చూచి వేల్పులు, ఇంద్రుడు ఆశ్చర్యపోతారు. "నీవెవ్వరు ఎందుకేడుస్తున్నావని ఇంద్రుడడుగగా ఆమె "నేనెవరో తెలుసుకోవాలనుకొంటే నా వెనుక ర"మ్మని ముందుకు సాగుతుంది.

ఇలా వెళుతుండగా హిమవత్పర్వత కందక ప్రాంతంలో ఒక వేదికపై సింహాసనం మీద వరుణుని రూపంలో కూర్చుని ఒక తరుణితో జూదమాడుతున్న ఆదిదేవుని చూసి వరుణుడే అనుకొని కోపంతో "ముల్లోకాల కధిపతినైన నాముందు నన్ను లెక్కజేయక సింహాసనమెక్కి కూర్చుని జూదమాడుతావా?" అని అధిక్షేపిస్తాడు. రుద్రుడు రౌద్రంగా అతనిని చూసి నా క్రీడకు భంగం కల్గించిన ఈ దుర్మార్గుని పట్టి తీసికొని ర"మ్మని ఆ కన్యనాజ్ఞాపిస్తాడు. ఆమె చేయి తగలగానే ఇంద్రుడు చేష్టలు దక్కి భూమిపై పడతాడు.

ఇంద్రుని చూసి రుద్రుడు "చాలా గర్వంతో నీ ప్రతాపాన్ని గూర్చి పలికినావు. ఏదీ, ఈపర్వతరంధ్రాన్ని చీల్చు చూద్దా"మంటాడు ఈశ్వరుని ఆజ్ఞ ప్రకారం రెండువిధాలుగా పర్వత వివరాన్ని చీల్చి సూర్యుని తేజోవంతమైన కిరణాలా అన్నట్టున్న ఆ కాంతివంతమైన ప్రదేశంలో తనలాంటి దేహమే కల్గిన నలుగురిని చూచి తానైదురూపాలు చెందినాడెందుకో అని విస్మయ పడతాడు. అయిదుగురు ఇంద్రులను మానవహితం చేయదలచి మనుష్యయోనియందు జన్మించమని ఈశ్వరుడాజ్ఞాపిస్తాడు. వారే ధర్మానిలశక్రాశ్వినులు తమకు ఆధార కర్తలుగా ధర్మజ భీమార్జున నకులసహదేవులుగా జన్మిస్తారు.

---

1. భార. అది. ఆ7. ప.269

## ద్రౌపది

రణరంగంలో ద్రోణుని వధించునట్టి కొడుకు అర్జునునికి దేవియగునట్టి కుమార్తె కావాలని ద్రుపదమహారాజు యాజోపయాజుల యాజకత్వంలో పుత్రకామేష్ఠి యజ్ఞంచేయగా ఆ మంత్రాహుతుల చేత తృప్తిచెందిన అగ్నిదేవుని వలన కరవాల చాపధరుడు,కిరీటకవచాదులను ధరించినవాడు, రథారూఢుడై అగ్నిజ్వాలవలె తేజరిల్లుతున్న కుమారుని, మహా సౌందర్యంతో దివ్యతేజంతో విరాజిల్లుతున్న ఒక కుమార్తెను పొందుతాడు.

యజ్ఞకుండంలో అయోనిజులుగా జన్మించిన వారిరువురికి ధృష్ట ద్యుమ్నుడని, కృష్ణ అని ఆకాశవాణి ప్రజలు వినేటట్లుగా నామకరణం చేస్తుంది. యజ్ఞకుండంలో పుట్టినందున యాజ్ఞసేనిగా, ద్రుపదపుత్రి గనుక ద్రౌపదిగా విఖ్యాతురాలైన ఆ కన్యకు ద్రుపదుడు వివాహవయస్సురాగానే స్వయంవరం ఏర్పాటు చేస్తాడు. మత్స్యయంత్రాన్ని ఏర్పాటు చేసి దానిని ఛేదించిన వానికే తన కుమార్తె నిస్తానని ప్రకటిస్తాడు.

ఆ స్వయంవరాన్ని గూర్చి విన్న పాండవులు ఏకచక్రపురంనుండి బ్రాహ్మణవేషాలతో బయలుదేరుతారు. మార్గమధ్యంలో వ్యాసుడెదురై ద్రౌపది పూర్వజన్మ వృత్తాంతం వివరిస్తాడు. ఒక ముని కన్య కర్మవశాత్తు భర్తను పొందజాలక శివుని గూర్చి ఘోరమైన తపస్సుచేయగా అతడు ప్రత్యక్షమైనాడని ఆమె పతిదానమని అయిదుసార్లు వేడినందున ఆమెకు దేహాంతరములో అయిదుగురు భర్తలవుతారని వరమీయగా ఆ ముని కన్యయే కృష్ణ అనే పేరుతో ద్రుపదుని కుమార్తెగా పెరుగుతున్నదని చెబుతాడు.

మత్స్యయంత్రాన్ని ఛేదించిన అర్జునుని మెడలో ద్రౌపది పుష్పమాల వేయగానే దుర్యోధనుడు మొదలైన రాజులు ద్రుపదుడు బ్రాహ్మణునికి కన్యనిచ్చి తమనవమానించినాడని, ద్రుపదునిపై యుద్ధానికి పూనుకోవాలని అనుకోగా బ్రాహ్మణులందరు ఏకమవుతారు. అర్జునుడందరినీ వారించి కర్ణునితో యుద్ధం చేసి జయిస్తాడు. రాజులందరు వెనుదిరుగుతారు.

భీమార్జునులు ద్రౌపదిని వెంటబెట్టుకొని ఇంటికి వచ్చి తల్లితో తామొక భిక్ష తెచ్చినామనగా ఆమె అందరు సమానంగా ఉపయోగించుకొనండి అని చెప్పి వెనుతిరిగి ద్రౌపదినిచూచి, తన వాక్కు అమోఘమని, ఏమిచేయవలెనో అని విచారిస్తుంది. ధర్మరాజు తల్లినోదార్చి పార్థునితో "నీవు ద్రౌపదిని స్వయంవరంలో గెలుచుకొన్నావు కాబట్టి నీవే వివాహం చేసుకో" అంటాడు. పెద్దవాడవు నీవుండగా

అది తగదు, నీవే అగ్రమహిషిగా చేసుకోమంటాడు అర్జునుడు. విధిప్రేరణ వలన పాండవులయిదుగురికీ ద్రౌపదిమీద వలపు కలుగుతుంది. అప్పుడు ధర్మజుడు వ్యాసుని మాటలు గుర్తుచేసి ఈమె మన ఐదుగురికి భార్యకాగలదంటాడు.

తమ కుమార్తెకు వరుడైనవాడెవ్వడో, వాని వంశమేదో, నడవడి ఎటువంటిదో తెలుసుకొని రమ్మని ద్రుపదుడు ధృష్టద్యుమ్నుని పంపుతాడు. అతడు మారువేషంలో పాండవులున్న ఇంటికి వచ్చి పాండవులు భిక్ష తెచ్చితల్లికీయగాఆమె ద్రౌపదిని పిలిచి రెండుభాగాలు చేయమని,ఒక భాగం మహా బలవంతుడైన తన కుమారునికి తక్కినది తన నల్గురు కుమారులు, తామిద్దరూ వినియోగించుకోవాలని చెప్పడం, ద్రౌపది ఎండుగడ్డి పరచి, వారికి వేరువేరుగా శయ్యలేర్పరచి, కృష్ణాజినాలు పరచి వారు సుఖంగా నిద్రింపగా వారి పాదాలవద్ద శయనించిందని, కఱకుదర్భలు , ఎండుగడ్డి పరుపులు, భిక్షాన్నమాహారము,తోళ్ళు, చింపిగుడ్డలు, బాణాలు వారి ధనమనీ అయినా ద్రౌపది వారినేవగించక వారి మధ్యసంతోషంగా ఉందని, ఆయుధ విషయమై వారుమాట్లాడుకోగా వారుక్షత్రియులన్పించినారని, నడవడి చూడగా బ్రాహ్మణులవలె నున్నారని తండ్రితో ధృష్టద్యుమ్నుడు చెబుతాడు.

ద్రుపదుడు సగౌరవంగా పాండవులను పిలపించి వారి నిజరూపం తెలిస్తేనే గాని వివాహం చేయనంటాడు. ధర్మరాజు తన తల్లిని చూపి ఆమె కుంతి యని తాము పాండుపుత్రులమనితెలియజేస్తాడు. ద్రౌపదిని అర్జునుడు వివాహమాడగలడన్న ద్రుపదునితో తామైదుగురము తమ తల్లి ఆజ్ఞప్రకారం ఆమెను వివాహమాడ తామంటాడు.

అదిలోక విరుద్ధమని బాధపడుతున్న ద్రుపదునితో అక్కడకు వచ్చిన వ్యాసుడు అంతకుముందు ఒక్కతెయే పెక్కుమందికి భార్యలైన జటిలుని కుమార్తెను, దాక్షాయణి, అజితలను గూర్చి చెప్పి ఇంద్రసేన వృత్తాంతం ఆమె కాశీరాజు పుత్రిగా పుట్టి భర్తకోసం తపస్సు చేయడం, ఈశ్వరుడు ప్రత్యక్షంకాగా పతిదానమని ఐదుసార్లడగడం, దేహాంతరంలో అది సిద్ధిస్తుందని ఈశ్వరుడు వరమీయడం, ఆమె తనకు ఐదుగురు భర్తలన్న ఈశ్వరునితో పతిశుశ్రూషసిద్ధి, ప్రత్యేకసంగమంలో కౌమారము, సౌభాగ్యం వరాలుగా కోరి పొందడం, ఈశ్వరుని ప్రభావంతో ఇంద్రుడు ఐదురూపాలుగా మనుష్యరూపంలో,ధర్మానిల ఇంద్రాశ్వినులు తమకు ఆధారకర్తలుగా ధర్మజ, భీమార్జున నకుల సహదేవులుగా జన్మించడం తెలియజేస్తాడు.

"............ వారలు ధర్మానిల శక్రాశ్వినులు తమకు ఆధారకర్తలుగా ధర్మజ భీమార్జున నకుల సహదేవులుగా బుట్టిరి......... అయ్యింద్రుల కేవురకును నేక పత్నిగా దపంబు సేసిన శ్రీమూర్తి యయిన యాజ్ఞసేని యజ్ఞవేదిం బుట్టె....."1

ఈ విధంగా చెప్పి వ్యాసుడు ద్రుపదుని అంగీకరింపజేస్తాడు. ద్రౌపదిని ధర్మజాదులు వరుసగా పాణిగ్రహణం చేస్తారు. వివాహ సందర్భంగా ద్రుపదుడు పాండవు లైదుగురికి వేరువేరుగా రత్నఖచితాలైన అమూల్యాభరణాలను, నూరుభద్ర గజాలను, నూరుబంగారు రథాలను,వేయి కాంభోజాశ్వాలను, పదివేల దాసదాసీ జనాన్ని, లక్షపాడియావులను అగ్ని సాక్షిగా సమర్పిస్తాడు.

తన శుశ్రూషతో ద్రౌపది భర్తలకు, అత్తకు సంతోషాన్ని కల్గిస్తుంది. కోడలి ఉత్తమ గుణాలకు సంతృప్తురాలైన కుంతీదేవి" హరికి లక్ష్మి, చంద్రునికి రోహిణి, ఇంద్రునికి శచి, వసిష్ఠునకు అరుంధతి లాగ నీవునీ భర్తలకు ప్రియమైన దానవై పతిభక్తితో పుత్రులను పొందు.అతిథిపూజ, అన్నదానం చేస్తూ, బ్రాహ్మణులను, ప్రజలను సంతృప్తి పరచు.గురువృద్ధ బంధుజనులను సమాదరించు.నీ యందు నేను ప్రీతినొందినట్లుగా పుత్రపౌత్రుల ప్రీతిపొందు." అని దీవిస్తుంది.

ఇంద్రప్రస్థపురంలో ద్రౌపదీసహితులై సుఖంగా ఉన్న పాండవుల వద్దకు వచ్చిన నారదుడు వారికి సుందోపసుందుల వృత్తాంతం చెప్పి, ఎంతటి ధృతిమంతులకైనాస్త్రీ మూలంగా విభేదాలు వస్తాయని, ద్రౌపది విషయంలో సమయ నియమ మేర్పరచుకోమని సలహాఇస్తాడు.

"ఇంతుల నిమిత్తమున ధృతి;
మంతులు బొందుదురు భేదమతి గావున మీ
రింతయు నెఱిగి యొండులు;
చింతింపక సమయ మిపుడు సేయుడు బుద్ధిన్ " 1

నారదుని హితోపదేశం మేరకు పాండవులు తాము ఒక్కొక్కరు ద్రౌపదితో వరుసగా ఒక్కొక్క సంవత్సరం కాపురం చేయాలని, ఆ సంవత్సరం ద్రౌపది ఎవరి యింటియందుంటుందో, అక్కడికితరులు పోకూడదనీ,అలా వెళ్లినట్లైతే పన్నెండు నెలలు తీర్థయాత్రలు చేయాలని, నియమం పెట్టుకుంటారు.

ద్రౌపది అందరిపట్లా సమానమైన ప్రేమతో ఉంటుంది.ఒక్కొక్కరి వల్ల ఒక్కొక్క పుత్రుణ్ణి కంటుంది.వారే ప్రతివింధ్యాదులైన ఉపపాండవులు.

---

1.భార.ఆది.ఆ7.ప.277 2.భార.ఆది.ఆ7.ప.114

ధర్మరాజు రాజసూయయాగం చేసినపుడు ఆ యాగం చూడడానికి వచ్చిన సకలరాజలోకాన్ని బ్రాహ్మణులను, వైశ్యులను,శూద్రులను, బంధుమిత్రులను, సేవకులను, స్వయంగా చూచి భోజనం పెట్టి, ఆ తర్వాత అర్ధరాత్రి సమయంలో తాను భోజనం చేసేదని స్వయంగా దుర్యోధనుడు ద్రౌపది సేవాతత్పరతను, కార్యదీక్షను మెచ్చుకొంటాడు.

" జన్నంబు చూడంగ సకల భూములనుండి;
వచ్చిన రాజన్య వరుల నవని
సురులను వైశ్యుల శూద్రుల నాత్మీయ;
బంధు సుహృద్వీరభట నియోగ
జనులను బేదల సాధుల నిత్యంబు;
దాన పరీక్షించి తగ వెఱింగి
యన్నంబు దయవెట్టి యందరు గుడిచిన;
దనుమధ్య యర్ధరాత్రంబున పుడగాని
కుడువదటె కమలాక్షి ద్రౌపది.......... "[1]

మాయాజూదంలో ధర్మరాజు శకుని చేతిలో తమ్ములను, తనను, ద్రౌపదిని పణంగా పెట్టి ఓడిపోతాడు.ద్రౌపదిని శకుని ప్రేరణతోనే పందెంలో ఒడ్డి ఓడిపోగానే కురుసభలోని ద్రోణభీష్మాదులందరూ దుఃఖిస్తారు.

దాసీలతో కలిసి తన యిల్లు తుడవడానికి ద్రౌపదిని తీసికొని రమ్మని దుర్యోధనుడు విదురునికాజ్ఞాపిస్తాడు.

"వరవళ్లు గలసి తన యిలు;
పరువడి తుడవంగ గృష్ణబనుచు వగన్ భా
సుర రాజ్యదర్ప మొప్ప వి;
దురు జెజ్జెర బంచె దాని దోడ్కొని తేరన్" [2]

విదురుడది సహింపలేక

"అవనీ తలసామ్రాజ్యో;
త్సవమునకును యోగ్యమైన సతి ద్రౌపదిపాం
డవ ధర్మపత్ని నీకం;
తవమానము సేయనేమి యనపాత్రయయే" [3]

1,.అదే.సభాపా2.ప.116 2.అదే.ప. 200 3.అదే.ప.203.

పాండవధర్మపత్ని, భూమండల సామ్రాజ్యోత్సవానికి తగిన యోగ్యతగల ద్రౌపదిని నీ విట్లా అవమానం చేయడానికి ఆమె ఆధారం లేని దనుకొన్నావా? మూర్ఖుడవై పాపం చేస్తున్నావు." అని హెచ్చరించినా వినకుండా దుర్యోధనుడు ప్రాతిగామిని ద్రౌపదిని తీసికొని రమ్మని ఆజ్ఞాపిస్తాడు.

అతడు వెళ్లి విషయమంతా చెప్పి, దుర్యోధనుని ఆజ్ఞ విన్పించగా ద్రౌపది "ఏ కాలంలోనైనా ఎంతనికృష్టుడైనా జూదరియైనా భార్యను ఒడ్డి ఓడినవాడున్నాడా? ధర్మరాజిట్లా చేస్తాడా?

"మున్ను దన్నోటు వడి మఱిసన్నునోటు
వడియెనో నన్ను మున్నోటు వడి విభుండు
గ్రన్నదన్నోటు వడియెనో యన్న నాకు
నెఱుగ జెప్పుము దీని నీ వెఱుగుదేని" [1]

తాను ముందు ఓడిపోయి పిదప నన్నొడ్డినాడా లేక నన్నొడ్డి ఓడి, తన్ను ఓడిపోయినాడా తెలిసికొని రమ్మన్న ద్రౌపది మాటలకు ప్రాతిగామి దుర్యోధనునికి నివేదిస్తాడు.

ఆ విషయం సభలోనే నిర్ణయించ బడుతుందని, ఆమెను తీసుకొని రమ్మంటాడు దుర్యోధనుడు. దుర్యోధనుని దుశ్చేష్టకుధర్మరాజు అంగీకారానికి భయపడిన ద్రౌపది ప్రాతిగామి వెంట సభకు వస్తుంది.ఏకవస్త్రఅయి, సంతతధారగా కన్నీరు కారుస్తున్న ద్రౌపదిని చూడలేక పాండవులు తలలు వంచుకొంటారు.భీష్మని వద్దనిలుచున్న ద్రౌపదిని తన వద్దకు తీసికొని రమ్మని దుర్యోధనుడు దుశ్శాసనుని పంపడం చూసి ఆమె భయపడి గాంధారి వద్దకు పరుగెడుతుంది.తనను సమీపిస్తున్న దుశ్శాసనుని " నేను రజస్వలను నన్ను ముట్టకు. గురు బంధు జనులతో కూడిన సభకెట్లా రాగలను.? అంటుంది. " నీ వేక వస్త్రవయితేనేమి,విగత వస్త్రవయితేనేమి? నిన్ను తప్పక తీసికొని పోతానని దుశ్శాసను డామె కొప్పు పట్టి యీడ్చుకొని వస్తాడు.

జుట్టుముడి వీడిపోగా వివర్ణమైన ముఖంతో సిగ్గుతోను, కోపంతోను ద్రౌపది "కురువృద్ధులారా, దైవయోగం వల్ల ధర్మరాజుకు యోగభ్రష్టత కల్గినా, ధర్మసంపద గలవాడు, ధర్మమార్గం తప్పనివాడు. కురుకులాధముడైన యీ దుర్మార్గుడు నన్నీ విధంగా ఎందుకు యీడ్చి తెచ్చినాడు?" అని ప్రశ్నిస్తుంది.

"ఇది తగినది కాదని వీరెవ్వరూ పల్కడం లేదు. వీడు నన్ను అవమానించ

1.భార.సభా.ఆ2. ప.209.

బోతున్నట్లు కన్పిస్తున్నది. భరతవంశం నేడధర్మమై అతినిందనీయమైనది." అనుకొని మనస్సులో కృష్ణుని తలంచుకొంటుంది.

ద్యూతమదోన్మత్తుడైన ధర్మరాజు మూలంగా సంభవించిన పాండవ పరాజయాగ్నిని తన తీక్షణవీక్షణాలచే ప్రజ్వరిల్లజేస్తున్న ద్రౌపదిని చూసి భీముడు దుఃఖంతో "ద్రుపదపుత్రిని పణంగాపెట్టి కపట ద్యూతమాడవచ్చునా, నీకారణంగా ఆమె అవమానింపబడింది. శకుని మోసం తెలిసీ పాపద్యూతంలో ప్రవర్తించిన నీ చేతిని తెగనరకాలి" అని కోపించి పల్కగా అర్జునుడు శాంతింపజేస్తాడు.

ద్రౌపది అధర్మ విజిత అనీ, ఏకవస్త్ర అయిన ఆమెను సభలోనికి తీసుకోని రావడం తగనిదని వికర్ణుడు ధైర్యంగా సభాసదులతో పల్కుతాడు.

"భార్యకు దైవంచే విధింపబడిన భర్త ఒక్కడే. ఈమె అనేక భర్తృక. ఇట్టి స్త్రీ 'బంధకి' అనబడుతుంది. ఇట్టిదాన్ని విగతవస్త్రను చేసి తెచ్చినా ధర్మవిరోధం కాదు." అని కర్ణుడు వికర్ణునికి బదులిస్తాడు. దుర్యోధనుడు ద్రౌపది వస్త్రాలను విప్పమని దుశ్శాసనుని ఆజ్ఞాపిస్తాడు. ఇది అకార్యమనుకోకుండా నీచుడైన దుశ్శాసనుడు ద్రౌపదీ వస్త్రాపహరణం చేస్తాడు. ఎంతసేపు విప్పినా ద్రౌపది శరీరం మీది వస్త్రాలు తొలగవు. ఒకవైపు దుశ్శాసనుడు విప్పిన వస్త్రాలు గుట్టలాగా పడి ఉంటాయి. వాడు అవమానంతో తన ప్రయత్నం విరమిస్తాడు. సభ్యులందరూ ఊపిరి పీల్చుకొంటారు.

దుశ్శాసనుడు ద్రౌపదికి చేసిన అవమానాన్ని సహింపలేక భీముడు "ద్రౌపది నిట్లా చేసిన దుశ్శాసనుని యుద్ధంలో లోకభీకరంగా వధించి, వాని రొమ్ముచీల్చి రక్తం త్రాగుతా" నని భీకరమైన ప్రతిజ్ఞ చేస్తాడు. సభాసదులు నివ్వెరపోతారు. విదురుడు ద్రౌపది ప్రశ్నకు సమాధానం ధర్మవిదులైనవారు చెప్పాలంటాడు దుర్యోధనునికి భయపడి ఎవ్వరూ పెదవి మెదపరు. ద్రౌపది దుఃఖంతో

"పాండవ ధర్మపత్నిని, గోవిందుని చెల్లెలిని, ఈనాడిట్లా సభామధ్యంలో అందరూ చూడగా అవమానించబడినాను. నా మాటల కెవ్వరూ ఎందుక సమాధానమీయరు? నేను వీరికి దాసినా?" అంటుంది. భీష్ముడామెతో, "అమ్మా ఈ ధర్మసూక్ష్మం ధర్మరాజు వివరింప వలసిందే. దీని ఫలాన్ని ఈ దుర్మార్గులు త్వరలోనే అనుభవిస్తారు." అంటాడు.

"తరుణీ, అయిదుగురి కంటె ఒక్కడు భర్తకావడం మేలుకాదా, జూదంలో భార్యనోడిపోని వాణ్ణి ఇంక భర్తగా వరించు." అని కర్ణుడు పరిహసిస్తాడు. తన తొడమీదకి రమ్మని దుర్యోధనుడామెకు సైగ చేస్తాడు. అది చూసిన భీముడు

మహారౌద్రంగా

"ధరుణి రాజ్యసంపద మదంబున గోమలిగృష్ణజూచిరం
భోరు నిజోరు దేశమున నుండగ బిల్చిన యీదురాత్ముదు
ర్వారమదీయ బాహు పరివర్తిత చండ గదాభిఘాత భ
గ్నోరు తరోరు జేయుదు సుయోధను నుగ్రరణాంతరంబునన్"[1]

రాజ్యసంపదగర్వంతో ద్రౌపదికి తన తొడ చూపిన దుర్యోధనుని తొడలు యుద్ధరంగంలో తనగదాఘాతంతో విరుగగొడతానని భీముడు పల్కిన పలుకులకు అది కోపానికి తగిన సమయం కాదని భీష్మద్రోణాదులు శాంతింపజేస్తారు.

విషయమంతా విన్నదైన గాంధారి విదురుని వెంటబెట్టుకొని ధృతరాష్ట్రుని వద్దకు వచ్చి పాండవ పరాజయాన్ని, ద్రౌపది పరాభవాన్ని, దుర్నిమిత్తాలు పుట్టడాన్ని తెలియజేస్తుంది. ధృతరాష్ట్రుడు కొడుకును పిలిపించి "తపస్విని, పాండవధర్మపత్ని, అయోనిజ అయిన ద్రౌపదిని సామాన్య మానవకాంతగా భావించి దుష్టంగా మాటలాడవచ్చునా, నీ దుష్టభావంచేత పాండవులకు తీరని దుఃఖం కల్గింది" అని మందలిస్తాడు. "అమ్మా, నా కోడళ్లలో నీవెంతో గౌరవనీయురాలివి. నీకు సంతోషం కలిగేట్లుగా వరాలిస్తాను కోరుకో." అని ద్రౌపదితో అంటాడు.

"నీవు కరుణతో నాకు వరమీయదలుచుకుంటే లోకవిజితుడు, మనువుతో సమానుడైన ధర్మతనయుని దాస్యం తొలగించు. అప్పుడు కురు కుమారులు, గురువృద్ధులచే లాలింపబడుతూ పెరిగిన ప్రతివింధ్యుని లోకం దాసపుత్రుడనదు" అని కోరుకుంటుంది. రెండవ వరం కోరమంటే తక్కిన నల్గురు భర్తలు ఆయుధాలు కవచాదులతో దాస్యవిముక్తి పొందాలని కోరుతుంది. మూడవ వరం వేడమన్న ధృతరాష్ట్రునితో "వైశ్య స్త్రీ ఒక్క వరం,క్షత్రియ స్త్రీరెండు, శూద్రస్త్రీ మూడు వరాలు కోరుకోవాలి.కాబట్టి నేనింక కోరకూడదు అంటుంది.ఆమె ధర్మగుణానికి మెచ్చిన ధృతరాష్ట్రుడు తమ్ములతో సహా ధర్మజుని పిలిపించి తన కొడుకు చేసిన అపరాధాన్ని మన్నించి ఎప్పటివలె రాజ్యం చేసుకొమ్మని, ఇంద్రప్రస్థానికి వెళ్లి సుఖంగా ఉండమని పంపుతాడు. ద్రౌపది మూలంగా తమకు తిరిగి రాజ్యం లభించడాన్ని భీముడు నిరసిస్తాడు.

రెండవసారి జూదంలో ధర్మరాజు ఓడిపోయి పన్నెండు సంవత్సరాలు అరణ్యవాసం, ఒక్క సంవత్సరం అజ్ఞాతవాసం చేయడానికి బయలుదేరగా ద్రౌపది

1.బార.సబా.ఆ2.ప.249

భర్తలననుసరిస్తుంది. "వినుతమైన అర్థాలలో విచక్షణగలది" అని విదురుడామె ధర్మపరత్వాన్ని ప్రశంసిస్తాడు.

తనకు నమస్కరించి శోకాక్రాంతయై నిల్చిన కోడలిని చూసి కుంతీదేవి కన్నీటితో

" ధవళాక్షి నీ కతంబున;
బవిత్రమైద్రుపదుకులముబాండుకులంబున్
భువనముల వెలిగె నీవు;
ధృవ మౌటను జొచ్చుటను శుభస్థితితోడన్" [1]

"నీవు పుట్టడం,మెట్టడం మూలాన ద్రుపదవంశం, పాండవ వంశం లోకమంతా ప్రసిద్ధినొందినా'' యని కుంతి ద్రౌపదిని ప్రశంసిస్తుంది." పురుషశ్రేష్ఠులైన భర్తలవెంట వెళ్లి,వారిని పరమభక్తితో సేవింపబోతున్న నీవెంతో పుణ్యం చేసుకున్నావని ప్రేమతో కౌగిలించుకుంటుంది.

అరణ్యవాసం చేస్తూ దుఃఖోపశమనం కోసం కథలు చెప్పుకుంటూ ప్రొద్దుపుచ్చుతూ ఉన్న సమయంలో ఒకనాడు ద్రౌపది ధర్మరాజుతో సంభాషిస్తూ

"కొడుకు మాటలు విని క్రూరుడై పాపబుద్ధితో మిమ్ములను రాజ్యం నుండి వెళ్లగొట్టి ధృతరాష్ట్రుడిప్పుడు సుఖంగా ఉన్నాడు కాబోలు. ఆ దురాత్ముని హృదయం ఇనుములాగా,రాయి లాగా కఠినం. ధర్మాత్ములైన మిమ్ములను కొడుకు లెగ్గులాడినా వారించడు. రమ్యహర్మ్యాలలో నివసిస్తూ రాజభోగాల కర్హులైన మీరు, రాజలోకం చేత సేవలు గొనవలసిన మీరు ఈ విధంగా అడవులలో తిరుగుతూ, గడ్డీ గాదం పై పవ్వళిస్తూ, ధూళిధూసరితమైన దేహంతో, వన్యప్రాణుల లాగా ఉంటూన్న మిమ్ముల నీ విధంగా చూస్తూ నేనెలా మనశ్శాంతి కలిగి ఉండగలను? సకల భోగాలకు మిమ్ము దూరం చేసి విధి కూడ ధృతరాష్ట్రునిలాగా మీకు శత్రువయ్యింది కాబోలు.

నీ ఆజ్ఞ అనే సంకెళ్లకు లోబడి నీ తమ్ములు తమ పరాక్రమం విడిచి చెఱలో బడిన సింహపు పిల్లలలాగా కష్టాలు పడుతూ ఎంత కృశించి పోయినారు? నిరంతరం సౌఖ్య సంపదతో వృద్ధిపొందవలసిన మీరు భయంకరారణ్యాలలో నివసిస్తూ యిలా కష్టపడటం నాకు దుఃఖాన్ని కల్గిస్తూన్నది.

రాజుల కిరీటాలలోని పద్మరాగమణుల కాంతితో ఎఱ్ఱవడే నీ పాదపద్మాలు కఠినశిలలపై నడవడం చేత ఎఱ్ఱవడినాయి. నిత్య పది వేల మంది

1.భార.సభా.ఆ2.ప.290

బ్రహ్మవిదులైన బ్రాహ్మణులు బంగారు పళ్లెరాలలో ఇష్టాన్నాలు భుజించి సంతుష్టులైన పిదప వారి భుక్తశేషాన్ని ఉపయోగిస్తూండే నీవు అడవులలో కాయకసురులు భుజిస్తూ కౌరవుల పట్ల క్రోధం లేకుండా ఉండటం యుక్తం కాదు.

పదివేలఏనుగులబలంతో విరాజిల్లే భీముడు కారడవిలో ఆకులలములు తింటూ దీనంగా ఉండటం చూసీ, వేయి చేతులు కల్గిన కార్త వీర్యుని కంటె బలవంతుడై ఏకబిగిన తన దీర్ఘబాహు ద్వయంతో అయిదు బాణాలొకేసారి వేయగల్గిన అర్జునుడు వన్య మృగాలతో కలిసి జీవించడం చూసీ, సుఖాల కర్హులైన నకులసహదేవులు దీనంగా ఉండటం చూసీ నీవు శాంతంగా ఉండవచ్చునా?

క్షమను, తేజస్సును ఆయా సమయాలలో ప్రయోగింపలేని రాజుకు ప్రజల అనురాగంగాని, ప్రతాపంగాని ఉండవని ఇతిహాసాలు పేర్కొంటున్నాయి. క్షమా తేజములలో ఏది విశేషమనిబలి తన పితామహుడైన ప్రహ్లాదుని అడుగగా "ఎల్లప్పుడూ క్షమను గాని లేక తేజాన్ని గాని వహించి ఉండటం రాజుకు తగదు. నిత్యం క్షమావంతుడైన వానికి సేవకులు భయపడక అవమానం చేస్తారు. ధనాధికారులు ధనాన్ని హరిస్తారు. దర్పం చూపుతారు. ఇక నిత్యం తేజమే అధికంగా ప్రదర్శించేవాడు తన క్రూరదండనతో అందరినీ బాధిస్తూ ఇంటిలోని పాములాగా తానెప్పుడూ ఉద్వేగాన్ని కల్గిస్తూ ఉంటాడు. కాబట్టి రాజు సమయానికి తగినట్లుగా క్షమాతేజాలు ప్రదర్శించాలి. అప్పుడే ఉభయ లోకసిద్ధి కల్గుతుంది." అని వివరించినాడు. అల్పమైన ఒక్క అపరాధాన్ని క్షమించవచ్చు, మిమ్ముల నెదిరించి ఎన్నో అపరాధాలు చేస్తున్న దుర్మార్గులైన కౌరవులనెందుకు క్షమించాలి?

ఇది పరాక్రమం చూపదగినసమయం. నీ క్రోధాన్ని కొంత ప్రజ్వరిల్ల జేసినట్లైతే నీ తమ్ములుగ్రులై దయలేని దురహంకారులైన దుర్యోధనాదులను వధిస్తారు." అని ప్రబోధిస్తుంది.

ధర్మరాజామెను శాంత పరచి క్షమ యొక్క ప్రభావాన్ని వివరిస్తాడు. అంతా విని ద్రౌపది " ఓ అజాత శత్రుడా! నీవు క్షమయందే చిత్తం నిల్పి, కల్మషం లేని ధర్మబుద్ధితో వర్తించే కరుణాత్ముడవు. ధర్మమే రక్షిస్తుందని శత్రువుల పట్ల కూడ సమబుద్ధి చూపడం తగునా? ధర్మదూరులైన కౌరవులను ధర్మం శిక్షించగల్గిందా? వంచకులను వంచించకపోతే వారు సజ్జనులను వంచించి వధార్హులంటారు. సజ్జనులకు హీనత,దుర్జనుల కున్నతి చేసి ఓ విధాతా, నీవు అవినీతి పరుడవై తప్పు చేస్తున్నావు. నీకు మంచి వాళ్లు శత్రువులు, చెడ్డ వాళ్లే

చుట్టాలా? " అని విధిని నిందిస్తున్న ద్రౌపదిని దైవదూషణ చేయవద్దని ధర్మరాజు వారిస్తాడు.

తమను చూడడానికి వచ్చిన సత్యభామకు ద్రౌపది సుదీర్ఘంగా పతివ్రతా ధర్మాలు ఉపదేశిస్తుంది. సత్యభామ ద్రౌపది సౌభాగ్యాన్ని ప్రశంసిస్తుంది.

పాండవులు తృణబిందుని ఆశ్రమంలో ఉంటూ ధౌమ్యుని ద్రౌపది రక్షణకోసమై ఉంచి వేటకు వెళతారు. ఒంటరిగా ఉన్న ద్రౌపదిని ఆ దారిన వెళ్తున్న సైంధవుడు చూసి మన్మథావేశానికి లోనై, కోటికాస్యుడనే రాజకుమారుని ఆమె వద్దకు పంపుతాడు. అతడు ద్రౌపది వద్దకు వచ్చి సైంధవుని భావం తెలియజేసి "నీ మనస్సు తెలుసుకోవడం కోసం జయద్రథుడు నన్ను నీ వద్దకు పంపినా" డంటాడు.

ద్రౌపది సంభ్రమంతో తాను పట్టుకొని ఉన్న కదంబశాఖను విడిచి ఉత్తరీయం సరిచేసుకొని, " అన్నా ఇక్కడ ఒంటరిగా ఉన్న నావద్దకు నీవిట్లారావడం నీతిమార్గమా? ధర్మవతిని, పుత్రవతిని అయిన నన్ను నీవు ఇతర కాంతలవలె భావించి తప్పుగా మాటలాడడం తగదు. నీవు శిబి వంశంలో జన్మించిన సురథుని పుత్రుడవని నాకు తెలుసు. నేను పాండవ పత్నిని. ద్రుపదుని కుమార్తెను కృష్ణను. నాభర్తలు నలుదిక్కులకు వేటకు వెళ్లినారు. త్వరలోనే రాగలరు. మీరు వారికిగౌరవ నీయులు. కాస్సేపు యీ ఆశ్రమ సమీపంలో ఉండి వారు చేసే సత్కారాలు గ్రహించి వెళ్లండి" అని పైకి ఎంతో ధైర్యంగా పలికి లోపల భయపడుతూ పర్ణశాలలోనికి వెళ్లిపోతుంది.

కోటికాస్యుడు ఆమె పాండవపత్ని అని చెప్పినా దుర్మార్గుడైన సైంధవుడామె నపహరించాలని ఆశ్రమంలోనికి ప్రవేశించి " నీ ప్రేమను పొందిన సుందరులైన నీ భర్తలు క్షేమమా? అని ప్రశ్నిస్తాడు. "స్థిరబుద్ధిగల కౌంతేయులందరూ క్షేమమే. నీవు కుశలమా, ఈ యింటి అల్లుడవు కాబట్టి ఆసనము, అర్ఘ్యపాద్యాదులు స్వీకరించు కురంగమాంసంతో భోజనం చేయి ఇంతలో వేటకు వెళ్ళిన నా భర్తలు వచ్చి నీకు తగిన సత్కారాలు చేస్తారు. ఆ పిదప నీ వారితో కలిసి వెళ్లుదువుగాని" అని ద్రౌపది పలుకుతుంది. "మన్మథాస్త్రాలకు లోనైన నా మనస్సునకు నీ అతిథిపూజలు రుచింపవు. నన్ను కృతార్థుని చేయి. రథమెక్కు" అని పాండవులను హీనపరచి మాటలాడుతాడు.

ద్రౌపది కంపిస్తున్న హృదయంతో ప్రక్కకు తొలగి తిరస్కార పూర్వకంగా అతనిని చూస్తూ తన భర్త రాకను కోరుతూ అతనికి సమాధానమిస్తూ కొంత

కాలక్షేపం చేయదలచి " పాండవుల తోబుట్టువైనదుస్సల భర్తవైన నీవు నాకు సోదరుడవు. అధర్మంగా మాటలాడవచ్చునా? నయము, ధర్మముగల వంశములో జన్మించినావు. ఇహపరాలకు విరుద్ధమైన మార్గమెందుకు? ధర్మం తెలుసుకో". అని హితవు పల్కుతుంది. ఆ దుష్టుడామె మాటలు పెడచెవిన బెట్టి" వనితా రత్నాలు ఎల్లవారికి భోగ్యవస్తువులే " అంటాడు.

"ఈ పాపాత్ముడు మంచి మాటలతో చక్కబడడు. కఠినంగా పల్కితే గాని ప్రయోజనం ఉండదు"అనుకొని ద్రౌపది "మహావీరులు, సాటి లేని పరాక్రమవంతులైన నా భర్తలను గూర్చి ఆలోచింపకుండా గర్వంతో ఇట్లా నన్ను ధిక్కరించి మాటలాడుతావా ? నీ దుష్ప్రలాపాలు కట్టిపెట్టు. వీటి ఫలితం ఊరికే పోదు. ధర్మాత్ముడు, ఉగ్రపరాక్రమోన్నతుడైన ధర్మనందనుని నీవు లెక్కచేయక పోవడం మదగజానికి బరిగోలలు చూపడమే.

సింహసదృశుడైన భీముని, దుస్సహ పరాక్రమంతో శోభిల్లే అర్జునుని, క్రూర విషసర్పాలనాలుకలు కోయగల సర్పశ్రేష్ఠుల వంటి మాద్రీపుత్రులను క్రోధాగ్నికి గురి చేయడం నీవు మృత్యువును కొని తెచ్చుకోవడమే. నీకు పోగాలం దాపురించింది." అని రోషంతో పల్కిన ఆమె మాటలు లెక్కచేయని సైంధవునితో ద్రౌపది "వీర పత్నిని, వీరసహోదరినైన నేను నీకు అనాథలాగా కన్పిస్తున్నానా? శ్రీకృష్ణుడూ, అర్జునుడూ నిన్ను బాణవృష్టితో ముంచినపుడు విచారిస్తావు".

"నను బెఱ వనితల చందం;
బున నవమానింప నీకు బోలదు మత్పా
వన పాతివ్రత్య మహిమ ;
ననిశము నే కీడు నెందు నందదు నన్నున్ " [1]

అని ఎంత చెప్పినా సైంధవుడు వినక తనను పట్టుకొనబోయేసరికి ద్రౌపది ధౌమ్యుని ఎలుగెత్తి కేకవేస్తుంది.అతడు వచ్చే లోపునే సైంధవుడామెను బలవంతంగా ఎత్తుకొని పోవడంకోసం ఆమె పైటకొంగు పట్టి లాగుతాడు. కోపంతో విదిల్చికొని ద్రౌపది అతణ్ణిలాగి కొడుతుంది.పెనుగాలికి సమూలంగా తెగిపడిన వృక్షంలాగ అతడు నేలకూలుతాడు. అయినా వెంటనే లేచి, ఆమెను రథంపై పెట్టుకొని పరివారంతో పారిపోతాడు.

ద్రౌపది తన పురోహితునికి మ్రొక్కుతుంది.అతడాక్రోశిస్తూ రథంవెంట

1. భార. అరణ్య. ఆ. 6. ప.188

పరుగిడతాడు. వేటముగించి వచ్చిన పాండవులు ఆశ్రమం వెలుపల నేలపై పొరలాడి యేడుస్తున్న ద్రౌపది పరిచారిక ధాత్రేయిక వలన విషయం తెలుసుకొని సత్వరంగా సైంధవుని కోసం బయలుదేరుతారు.

తనను సమీపిస్తూ సింహనాదాలు చేస్తూ వస్తున్న పాండు పుత్రుల రథధ్వని విని సైంధవుడు ద్రౌపదితో "ఆ వస్తున్న వాళ్లు నీ ఐదుగురు భర్తలు. వాళ్లలో ఎవ్వడెలాంటివాడో నాకు నీవు చెబితే తెలుసుకోవాలని ఉంది." అంటాడు. "నీవింక వాళ్లను గూర్చి తెలుసుకొన్నా, లేకున్నా నీ చావుమూడింది. అయినా నీవడిగావు కాబట్టి చెబుతాను. నీ వల్లనాకు భయంలేదు." అని పాండవుల గొప్పదనాన్ని పేరుపేరునా పేర్కొంటుంది.

సైంధవునితోను, అతని చుట్టుముట్టిఉన్న రాజుల సమూహంతోను పాండవులు భీకరయుద్ధం చేస్తారు.సందు చూసుకొని సైంధవుడు పాంచాలిని దించి, రథంలో పారిపోతాడు.దుస్సలను తలచుకొని పాండవులతనిని వెంబడింపక విరమించుతారు."ఆ పాపాత్ముని విడిచిపెట్టక, చంపి నాకు సంతోషం కల్గించండి. ఆ ద్రోహి అన్నివిధాలా చంపతగినవాడే" అంటుంది ద్రౌపది.

భీముడు వాని వెంట తరిమి రథంనుండి పారి పొదలో దాగినవానివి రక్తం కక్కేటట్లు తన ముష్టిఘాతాలతో ప్రాణావశిష్టుని చేస్తాడు.అర్జునుడు ధర్మరాజు మాటలు తలచి వానిని వదలమంటాడు.భీముడు కత్తితో వాని శిరస్సు చెక్కలు చెక్కలుగా కొఱిగి "ఈనాడు మొదలుకొని సభలన్నిటా నేను పాండవదాసుడనని చెప్పుకో" మంటాడు. వాడు దండభయంతో అట్లే చేస్తానంటాడు. పెడరెక్కలు కట్టి తెచ్చి "వీడు పాండవదాసు"డని ధర్మరాజు ముందు వడవేసిన భీమార్జునులతో ధర్మరాజు" అయితే యితనిని వదలి వేయండి" అంటాడు. ద్రౌపది నవ్వుతూ సైంధవుని చూచి "ఈ పాపాత్ముడు మీ దాసుడైనాడు.కాబట్టి వీడిని పోనివ్వండి" అని విడిపిస్తుంది.వాడందరికీ మ్రొక్కి వెళ్లిపోతాడు.

సైరంధ్రిగా సుదేష్ణ వద్దనున్న తనను చూచి కామవికారంతో ప్రలాపించిన కీచకుని ద్రౌపది ఆ నీచుని పరుషోక్తులతో భయపెడితేగాని పోడని, తన భర్తలైన గంధర్వులు అతని మానప్రాణాలు హరించగలరంటుంది."నీ భర్తలేకాదు, ముల్లోకాలలో నన్నెవ్వరూ ఏమీ చేయలే" రని పల్కగా

"చను జనదని చూడక యం;
దని మ్రాకుల పండ్లు గోయదలచుట హితమే
మునుచెడిన రావణాదుల;
విని యెఱుగవె యెన్నడును వివేకవిహీనా"

మహాభారత మహిళాదర్శనం

అని మందలిస్తుంది.

సుదేష్ణ మద్యం తెమ్మని తనను కీచకుని యింటికి పంపినపుడు తనకు ఇష్టం లేకపోయినా తప్పనిసరియై వెళ్లిన ద్రౌపది "దేవి తృష్ణతీర్చడం కోసం వెంటనే మద్యం పోయించ" మని అడుగుతుంది. ఆ నీచుడు ముందు తన తృష్ణ తీర్చమని మదనోన్మత్త ప్రలాపాలు చేస్తాడు. ధీరురాలైన ద్రౌపది ఆ మాటలు పెడచెవిన పెట్టి తనకు మద్యం పోయిస్తే త్వరగా వెళ్లిపోతానంటుంది. మోహాంధుడైన కీచకుడు తాళలేక ఆమెను పట్టుకొనబోతాడు.

కీచకుని యింటికి బయలుదేరేటప్పుడు ద్రౌపది హరిస్మరణ చేసుకొని బయలుదేరి సూర్యుని చూచి తాను పాండుపుత్రులను తప్ప అన్యులను తలంచని మనస్సుగలదైతే తనను కీచకుని బారినుండి రక్షించమని ప్రార్థించుకుంటుంది. సూర్యుడామెను రక్షించడానికి ఒక రాక్షసుని అదృశ్యాకారంతో పంపి ఉంటాడు.

ఆ రాక్షసుని బలం తననావేశించగా ద్రౌపది వేగంగా కీచకుని విదిల్చుకొని పారిపోతూ విరాటుడు కొలువుదీరి ఉండడంచూసి కొలువులో ప్రవేశిస్తుంది. కామాంధుడు, గర్వోన్మత్తు డైనకీచకుడామెను వెనుకనే వచ్చి జుట్టుపట్టి కాలితో తంతాడు.పాంచాలీరక్షకుడైన రాక్షసుడతన్ని కూలదోస్తాడు.తన భంగపాటు ఇతరులకు తెలియక పోవడం చేత ఆశ్చర్యపోయిన కీచకుడు ఒడుపు తప్పిన మహా సర్పంలాగ రాక్షసునిమూలంగా బాధింపబడుతూ చేసేదేమీ లేక నిట్టూరుస్తూ కోపంతో బుసలుకొడుతూ ఉంటాడు.

భీముడు ద్రౌపదీ పరాభవం ఓర్చుకోలేక మహాక్రోధంతో సమీపంలో ఉన్న తాళవృక్షాన్ని పెకలించాలని సాభిప్రాయంగా ధర్మనందనుని ముఖంలోకి చూస్తాడు. నిగూఢభాషణాలతో అతడు భీముని కోపాన్ని శాంతింపజేస్తాడు.

కన్నీరు ఉబుకుతూ ఉండగా తనకు కీచకుని వలన కల్గిన అవమానానికి దీనత్వం పొందిన ద్రౌపది విరాటుని సభను సమీపించి ధర్మాధర్మ నైపుణ్యం గలవారు పరిశుద్ధమైన మనస్సులతో దుష్టశిక్షణ,శిష్టరక్షణ చేయగల సామర్థ్యం గలవారు, సకలశాస్త్ర పరిచయంగలవారు, శత్రుమర్దన క్రీడాచతురులైన గంధర్వులైదుగురు నా భర్తలు. ఈ విధంగా నన్నొక నీచుడు పరాభవిస్తుంటే ఊరకుండడం ఆశ్చర్యంగా ఉంది. లోకంలో ఇంక ఎవ్వరి భార్యలు పరాభవింప బడకుండా ఉండగల్గుతారు? ఈ రాజు ఆస్థానంలో ఒక్కడైనా ధర్మలోప భయంతోనైనా తగినమాట పలుకకున్నాడే, ఇంతమంది చూస్తుండగా పతివ్రత నైననన్ను కీచకుడు ఎవరూ ఎవ్వరినీ చేయనట్లుగా అవమానింపగా కొందరికైనా

దయకలుగలేదా?మత్స్యదేశాధినాథుడైన యీ విరాటుడు కీచకుని నిందించాలి. ఎవరు అధర్మంగా ప్రవర్తించినా ప్రభువులు తెలుసుకొని దండించాలి. ఈ సభలో నన్ను తన్నిన కీచకుని చూసి కూడ ఊరకుండడం న్యాయమా?" అని ప్రశ్నిస్తూ ఉండగా విరాటుడు కీచకుని దండించే సామర్థ్యంలేక, కీచకుని మంచి మాటలతో అక్కడనుండి వేగంగా నిష్క్రమించే టట్లు చేస్తాడు.

సైరంధ్రిని చూచి జనులు పరిపరివిధాల భావిస్తూ ఉంటారు.ధర్మరాజు "నీ విషయం ఈ సభవారు గ్రహించినారు.ఇంక మాటలాడక వెళ్లిపో.గంధర్వులకు నీ పరాభవం కోపకారణంకాదా,సమయంకాదు కాబట్టి, నియమానికి లోబడి ఊరకున్నారు.భర్తలను నిందించకూడదు. సభలలో ఇంతసేపు ఈ విధంగా నిలిచి ధిక్కరించి మాటలాడకూడదు." అని సైరంధ్రిని మందలిస్తాడు. అయినా ఆమె కదలక ఇంకా ఏదో మాటలాడాలని ప్రయత్నిస్తూ ఉంటే "కులసతుల గౌరవం నశించేలాగ, నాట్యకత్తెలాగా. విచ్చలవిడిగా పలుపోకడలు పోతున్నావు. వెళ్లు" మంటాడు. ద్రౌపది సాభిప్రాయంగా అతనితో

" నాదు వల్లభుండు నటు దింత నిక్కంబు
పెద్ద వారి యట్ల పిన్నవారు
గాన బతుల విధమ కాక యే శైలూషి
గా దనంగ రాదు కంక భట్టు" [1]

"అట్లగుటం చేసి నాకు నాట్యంబున బరిచితంబు.మత్పతి శైలూషుండ కాదు కితవుండును గావున జూదరియాలికి గఱువతనం చెక్కడియది" అని,నా భర్త నటుడే గాదు,జూదరికూడా,జూదరి భార్యకు గౌరవమెక్కడి" దని వెళ్లిపోతుంది.

ఆ రాత్రి రహస్యంగా వంట ఇంట్లో భీముని కలుసుకొని కీచకుని వల్ల తనకు కలిగిన పరాభవాన్ని, ధర్మజుడు తనను మందలించి పలికిన మాటలను చెప్పుకొని బాధపడుతుంది. సమయభంగమవుతుందని ధర్మరాజా విధంగా ప్రవర్తించినాడని, తన కోపాన్ని కూడా నిగూఢంగా మాటలాడి శాంతింపజేసిదని భీముడామెను శాంతింపజేస్తాడు.

తాను కుంతికి గాని,భర్తలకుకాని,దైవానికికాని,సుదేష్ణకు భయపడినంతగా భయపడనని, కలుషాత్ముురాలైన ఆమె పనులు చేసేటప్పుడు భయం కల్గుతుందని, కేవలం ఒక దుర్మార్గుని చేతల వల్ల అవమానింపబడి తాను ధర్మరాజును నిందించిందే తప్ప ఆతని మహనీయత నెరుగక కాదని ద్రౌపది ధర్మజుని కీర్తిస్తుంది. నేర్పుగా, తీయగా తన అత్తను, భర్తలను కీర్తిస్తూ మాటలాడి కీచకుని చంపేందుకు

భీముని ఒప్పిస్తుంది.మరునాడు రాత్రి నర్తనశాలలో తనను కలుసుకొమ్మని చెప్పమని ద్రౌపదికి భీముడు చెబుతాడు.నిర్మానుష్యమై, అంధకారబంధురమై, ఉన్న ఆ నర్తన శాలలో కీచకుని వధిస్తానని ద్రౌపది నూరడిస్తాడు

భీముడు చెప్పినట్లే ద్రౌపది మహానేర్పుగా కీచకునితో మాటలాడి అతనిని నర్తనశాలకు వచ్చేటట్లుగా చేస్తుంది. భీముడు కీచకుని అతిభయంకరంగా సంహరించి దీపపు వెలుగులో తనకు చూపగా "దీనికోసం ఇంత తాపత్రయ పడినావా?" అని ముక్కున వేలు వేసుకుంటుంది. భీముని పరాక్రమాన్ని కీర్తించి అతని మనస్సుకు సంతోషం కలుగజేసి వేగంగా వెళ్లిపోతుంది.

భీముడు వెళ్లిపోయి ఉంటాడని నిశ్చయించుకొని కొంతసేపటికి నర్తనశాల కావలివారలను పిలిచి" నా భర్తలైన గంధర్వుల చేతిలో దుర్మరణం పాలైన యీ పాపాత్ముని చూడండి" అని కీచకుని గురించి చెప్పగా వారు సంభ్రమంతో ఆయుధాలు తీసుకొని నర్తనశాలకు వస్తారు.ఆ సంరంభం చూసి వచ్చిన కీచకుని సోదరులు అవయవాలు ఇవి అని గుర్తించడానికి వీలులేకుండా ఉన్న తమ అన్న శవాన్ని చూసి "ఈ సైరంధ్రి మూలంగానే ఇంత జరిగింది. దీన్ని ఇతని శరీరం మీద వేసి చంపుతామని విరాటుని వద్దకు పోయి అతని అనుమతి తీసుకొని ద్రౌపదిని పాడెమీద కీచకునిశరీరంతో కలిపి కట్టివేసి తీసుకొని వెళ్తుండగా ఆమె తన్ను రక్షించమని భర్తలను ఎలుగెత్తి పిలుస్తూ, ఉపకీచకులు తమ అన్న శవంతో తననూ బంధించి తీసికొని పోతున్నారని ఆక్రందిస్తుంది.

ఆమెరోదనం విన్న భీముడు పరుగున వచ్చి నూటైదు మంది ఉపకీచకులను సంహరించి ద్రౌపదిని రక్షిస్తాడు.

ఈ వృత్తాంతం విన్న విరాటుడు సైరంధ్రిని వెళ్లిపొమ్మని చెప్పమని భార్యతో చెబుతాడు.తానింక పదమూడు రోజులు మాత్రమే ఉంటానని,అంతవరకు ఉండనిమ్మని ద్రౌపది సుదేష్ణకు నచ్చచెబుతుంది. బృహన్నల వద్దకు వెళ్లి నిగూఢంగా సల్లాపాలు గావిస్తుంది.

ఉత్తర గోగ్రహణ సందర్భంలో ఉత్తమునికి తగిన సారథి బృహన్నలయే అని ఉత్తరతో చెప్పి అతడు సారథ్యం వహించే విధంగా చేస్తుంది.

ఉత్తరుని విజయవార్తవిన్న విరాటుడు తన కుమారుని పరాక్రమాన్ని కీర్తిస్తుండగా కంకుభట్టు రూపంలో ఉన్న ధర్మజుడది బృహన్నల ప్రతాపమంటాడు. విరాటుడు కోపం పట్టలేక చేతిలోని సారెతో ధర్మజుని వేయగా ధర్మజునినుదుట గాయమై నెత్తురోలుకుతుంది.అక్కడే ఉన్న సైరంధ్రి వేగంగా వెళ్లి తన ఉత్తరీయంతో

ఆ రక్తాన్ని తుడిచి అక్కడున్న బంగారు కలశంలోనికి పిండి అరచేయి తడుపుకొని ధర్మజుని నుదురు తుడుస్తుండగా విరాటుడు రక్తాన్ని ఉత్తరీయంలో పట్టడానికి కారణమేమని అడుగుతాడు. "విమలమైన వంశం, పవిత్రమైన నడవడిగల ఈ మహాత్ముని రక్తం భూమిపై ఎన్ని చుక్కలు పడితే అన్ని సంవత్సరాలు ఆ రాజ్యంలో కరువు వస్తుంది." అని సమాధానమిస్తుంది.

శ్రీకృష్ణుడు కౌరవసభకు రాయబారిగా వెళ్లేటప్పుడు ద్రౌపది తన మనస్సును దహిస్తూ ఉన్న పరాభవాగ్నిని వెళ్లగ్రక్కుతుంది. విరబోసుకుని ఉన్న తన కురులను ఎడమచేతితో పట్టుకుని"ఇవి దుశ్శాసనుడు పట్టియీడ్చగా మిగిలినవి.కౌరవులతో సంధిమాటలు పలికేటప్పుడు వీటిని గుర్తుచేసుకో" అంటుంది." నీ సోదరిని గదా,నాకింత అవమానం జరిగినా ఊరుకుంటావా" అని శ్రీకృష్ణుని దీనంగా అడుగుతుంది.

తన ఐదుగురు పుత్రులను అశ్వత్థామ క్రూరాతిక్రూరంగా చంపినాడన్న వార్త వినగానే పుత్రశోకంతో మొదలు నరికిన తరువులా కూలిపోతుంది.అవేశంతో అశ్వత్థామను చంపించమని, అప్పుడుగాని తన హృదయం శాంతించలేదని లేకపోతే తాను ప్రాయోపవేశం చేస్తానని అంటుంది.అశ్వత్థామను చంపమని భీముని నియోగిస్తుంది.భీముడతని శిరోమణిని తెచ్చి ఇచ్చి,అతడింక చచ్చినవాడితో సమానమన్నప్పుడుగాని ఆమె శాంతించలేదు. మహనీయమైన ఆ మణిని ధరించడానికి ధర్మజుడే అర్హుడని, ఆ మణిని అతనిచే ధరింపజేస్తుంది.

మహాప్రస్థానంతో అందరికన్నా ముందుగా ద్రౌపది పడిపోవడం చూసి "ఎన్నడూ ధర్మహాని చేసి ఎరుగని ద్రౌపది ఇట్లా కావడానికి కారణమే" మని భీముడడగగా ఆమెకు మనస్సులో ఇంద్రనందనుడైన అర్జునునిపై పక్షపాత మెక్కువ" అని ధర్మజుడు వివరిస్తాడు.

## 251 సుదేష్ణ

సైరంధ్రీవేషంలో రాచనగరులో ప్రవేశించినద్రౌపది సౌందర్యం అబ్బుర పరచగా విరాటుని పత్నీ , కీచకుని సోదరీ అయిన సుదేష్ణ ఆమెను తన వద్దకు పిలిపించుకొని "నీ కులమేది? పేరేమి? ఏపనికోసమై ఎక్కడకి వెళుతున్నావు? అని ప్రశ్నిస్తుంది. తాను సైరంధ్రీజాతి సంభూతనని, తన పేరు మాలిని అని, తనకైదుగురు మహాబలవంతులైన భర్తలున్నారని, ఒక కారణంచేత తాను భర్త సన్నిధినే అవమానించబడి, భర్తలతో బాటు వనవాసం చేసిందని తన వ్రతసమాప్తి కింకొక్క సంవత్సరమున్నదని, ధర్మవర్తిని అని తాను సుదేష్ణను గూర్చి విని

యుండడం వల్ల తనకు వచ్చిన పనులతో ఆమెను సేవించదలచి వచ్చినానని ద్రౌపది వివరిస్తుంది.

సుదేష్ణ "నీవు తప్పక సుర గరుడ, యక్ష, కిన్నర, విద్యాధర, సిద్ధ తరుణులలో ఒక దానవు. ఏ పనిమీద యీ పట్టణానికి వచ్చావో దాచక చెప్పు" మంటుంది. ద్రౌపది తాను మొదట సత్యభామకు, ఆ పిదప పాంచాలికి పరిచారికగా వర్తించిందని, ద్రౌపది తనను ప్రాణానికి ప్రాణంగా భావించి గౌరవించేదని చెప్పి "నీవు కూడ నన్ను నీచమైన పనులకు నియోగించవద్దు. నేను పువ్వులు అందముగా మాలలల్లగలను. చక్కగా గంధాలు తీయగలను. అనేక విధాలుగా తిలకములను పెట్టగలను. వివిధ రకాలుగా కేశరచన చేయగలను" అంటుంది.

"నీ రూపం చూస్తే నా భర్త ఉవ్విళ్లూరుతాడు. స్త్రీలే నీ సౌందర్యాన్ని ఆశ్చర్యపోయి చూస్తున్నారు. ఎండ్రి గర్భం ధరించినట్లుగా నిన్ను నా వద్ద ఉంచు కొనడం చేతులారా విధ్వంసాన్ని తెచ్చుకొనడమే అవుతుంది" అన్న సుదేష్ణతో ద్రౌపది గంధర్వులైన తన భర్తలు ప్రతిక్షణం తనను ఏమారక రక్షిస్తూ ఉంటారని, ఏ మానవుడైనా తనను నీచభావంతో చూస్తే, ఒక్క రాత్రిలోనే వాడిని కడతేరుస్తారనీ, కాబట్టి నిశ్చింతగా తనను సైరంధ్రిగా స్వీకరించవచ్చునని చెబుతుంది.

సుదేష్ణ సంతోషిస్తుంది. తనను కుత్సితపు పనులకు పంపకూడదని, ఎంగిళ్లు తిననని ద్రౌపది సుదేష్ణతో చెబుతుంది. కీచకుడు ద్రౌపదిని చూసి మోహావేశంతో అక్క వద్దకు వెళ్లి తనకు సైరంధ్రీసమాగమ మేర్పరచమంటాడు. ఆమె మొదట ఎన్నో హితోక్తులు పలికి అతని మనస్సు మరల్చాలని చూస్తుంది.

"ఆయురైశ్వర్య కీర్తుల నపహరించు;
పరసతీ సంగమము ధర్మపథమునందు
బరుగు వారలు పరిహరింపంగ గనియు
వినియు దెలియవె యిది దుర్వివేకమగుట"

పరసతీ సంగమం ఆయురైశ్వర్య కీర్తులను హరించివేస్తుందని నీవు వినలేదా? భర్తకు తెలిస్తే తన ప్రాణంమీదకు వస్తుందనే భయంతో గుండెలదురు తుండగా,లోకులు చూస్తే తన మర్యాద నిలవదన్న భయంతో ముఖం వివర్ణంకాగా పరిచారికలు చూస్తే తన పరువు పోతుందన్న భయంతో చేష్టారహితమై బంధువులు చూస్తే వంశగౌరవం మంటగలుస్తుందన్న కలతతో చెమటలు కమ్ముతుండగా, రతిక్రీడా సౌఖ్యాన్నిపొందజాలని పరస్త్రీ సంగమం హృదయానికి ఇంపుకూర్చ గలగుతుందా? కాని మార్గంలో వెడితే బ్రతుకుకే చేటుమూడుతుంది. వింతరుచిగా

ఉన్నా అపథ్యాలను యిష్టపడవచ్చునా? కనుక నీ మోహం విడనాడు. నా మాట విను. ఆమె భర్తలైదుగురు మహాబలవంతులైన గంధర్వులు. అది తలచుకుంటేనే నా హృదయం వణకిపోతున్నది. ఆ సైరంధ్రి నీకెందుకు?

ఇంత వివరంగా చెప్పినా కీచకుడు వినకపోయేసరికి మన్మథ బాణాల వల్లనైనా లేక- సైరంధ్రి భర్తల వల్లనైనా కీచకుని చావు తప్పదని సుదేష్ణ నిశ్చయించుకుంటుంది. పైకి మాత్రం తమ్మునితో "ఇంత విచారం దేనికి, ఏదో ఉపాయంతో ఆమెను నీకు సమాగమ పరుస్తాను. ఆలస్యం చేయక ఇక ఇక్కడ నుండి వెళ్లు. ఆసవం తెమ్మనే వంకతో నీ యింటికి సైరంధ్రిని పంపుతాను.నీ కోర్కె తీర్చుకో" అంటుంది. కన్నీటిని కళ్లలోనే మ్రింగుకొంటుంది.

సైరంధ్రి రాగానే సుదేష్ణ "దాహంతో నా నాలుక పిడచ కట్టుకొని పోతున్నది. శ్రేష్ఠమైన మదిర సేవిస్తేనే గాని యీ దప్పిక తీరదు. కీచకుని ఇంటిలో బహుశ్రేష్ఠమైన మదిర ఉంటుంది. నీవు వెంటనే వెళ్లి తీసుకొని రా. నీ వెంత త్వరగా రాగల్గుతావో చూస్తాను." అంటుంది. తననా విధంగా ఇతరుల యింటికి, నీచమైన పనులకు పంపదగునా అని ద్రౌపది అడుగగా అనుచితానికి మనస్సులో సందేహిస్తూనే పైకి మాత్రం"అయ్యో, నేనెంతో వేడుకపడి ఆసవం గ్రోలాలని ప్రేమగా కోరాను. నికృష్టులను పంపడం యిష్టంలేక నిన్ను కోరాను.అది పరాయి యిల్లా? నిన్ను అందరూ తమ హృదయాలలో ఎఱుగరా? నిన్ను గురించి నేను తెలినినవారందరికి అన్ని విధాల చెబుతూనే ఉంటాను.చనువుగా నేను చెప్పినదానికి నీవు గోరంతలు కొండంతలు చేస్తున్నావు." అని ఎన్నో విధాల నచ్చబలికి ద్రౌపదిని కీచకుని వద్దకు పంపుతుంది.

కీచకునిచే పరాభవింపబడి ధూళిధూసరితమైన దేహంతో, కాంతి తరిగిన ముఖంతో ద్రౌపది తన వద్దకు రాగా " నిన్నిట్లా అవమానించినవారెవరో చెప్పు. వారిని చంపుతాను. అవమానిస్తా"నని ఓదార్పు మాటలు పలుకుతుంది. "నీ తమ్ముడే నన్ను రాజసభలో వెనుకనుండి పట్టుకొని తన్నినా" డని ద్రౌపది చెప్పగా "దుఃఖించకు కీచకుణ్ణి దండించి నీకు సంతోషం కల్గిస్తా" నంటుంది. " నీకా శ్రమ అక్కరలేదు. అందుకు నా భర్తలున్నారు" అని ద్రౌపది అనగానే సుదేష్ణ భయపడుతుంది

కీచకుణ్ణి, ఉపకీచకులను భీముడు మట్టు పెట్టిన తర్వాత విరాటుడు గంధర్వులచే కీచకులందరూ సంహరింపబడినారని తెలిసికొని, సైరంధ్రిని మంచి మాటలతో పంపివేయమని, ఆమె రూపం పురుషులనాకర్షిస్తోందని, అందువల్ల

పట్టణం లోని వారికి చేటు కలగ గలదనీ భార్యతో చెబుతాడు.భర్త మాటలు తన మనస్సుకు సంతోషం కల్గించగా సుదేష్ణ ఆ విధంగానే చేయాలని నిశ్చయించు కొంటుంది. భయం, శోకం దాచుకొని ఎంతో వినయ గౌరవాలతో మొదట ద్రౌపదిని సంభావిస్తుంది.“ నీవు చక్కని దానవు. మగవాళ్లు ధైర్యరహితులు.అందువలన రాజు భయపడి నిన్ను వెళ్లమన్నాడు. అని పలికి - అంతలోనే తన తమ్ముళ్లనందరినీ చంపించిందన్న కోపంతో “నీకు పరాక్రమవంతులైన భర్తలున్నారని జనాన్ని చంపించజూస్తున్నావు. ప్రజలు నీవున్న వైపు రావడానికి కూడ భయపడుతున్నారు. మా పట్టణం, రాష్ట్రం వదలి వెళ్లు.” అని కఠినంగా పల్కుతుంది. తానింక పదమూడు దినాలు మాత్రమే ఉంటానని, తన భర్తలు చేసిన మేలు మరవరని రాజుకు వారుశుభం కలుగజేస్తారని చెప్పగా సరేనంటుంది. తన భర్తను, కుమారులను ‘ఉదారమతి’ తో చూడమని కోరుతుంది.

## 252 అంబ

కాశీరాజు తన పుత్రికలైన అంబ, అంబిక, అంబాలికలకు స్వయంవరం చాటిస్తాడు. భీష్ముడు తన తమ్ముడైన విచిత్రవీర్యునికోసం స్వయంవరంలో తక్కిన రాజులను జయించి వారిని తీసుకొని వచ్చి, వివాహానికి ప్రయత్నాలు చేస్తుండగా సాంభపుర రాజైన సాళ్వుని తాను ప్రేమించినట్టు అంబ భీష్మునితో చెబుతుంది. తనను సాళ్వుని వద్దకు పంపమంటుంది.అతడికి కూడా తనపై వలపు కలదని చెబుతుంది. తల్లి సత్యవతి కీవిషయం చెప్పి, వృద్ధాంగనలను తోడిచ్చి భీష్ముడు అంబను సగౌరవంగా సాళ్వుని వద్దకు పంపుతాడు.

“ భీష్ముడు తీసుకొని పోయిన నీకు కన్యాత్వం పోయింది.నిన్నింక భార్యగా స్వీకరింపలేను.”అన్న సాళ్వునితో కేవలం తన తమ్మునికోసమే భీష్ముడు తనను తీసుకొని వెళ్లినాడని, తన తండ్రి తన ప్రేమసంగతి తెలియక తనకు కూడా స్వయంవరాలంకారం చేయడం చేత భీష్ముడు తన చెల్లెండ్రతో బాటు తననూ తీసుకొని వెళ్లినాడని,ఇందులో అతని తప్పేమీ లేదని; తన ప్రేమసంగతి తెలిసిన తక్షణమే తనను ఎంతో గౌరవంగా పంపించిన అతనిని నిందించ వద్దని అంబ పరిపరి విధాలుగా సాళ్వునికి నచ్చచెప్ప ప్రయత్నిస్తుంది. చివరకు కరుణాతి కరుణంగా విలపిస్తుంది. అయినా సాళ్వుని హృదయం కరుగదు. ఆలస్యం చేయకుండా వెళ్లమని కఠినంగా పలికి ఆమెను వెళ్లగొడతాడు.

“సాళ్వుడు నన్ను తిరస్కరించి నపుడే సంసారానికి దూరమైనాను.ఇంక భీష్ముని వద్దకు ఎందుకు వెళ్లడం? దీనికంతకూ మూలమైన గాంగేయునిపై పగ

తీర్చుకోవడానికి తపస్సు చేస్తాను.'' అని అంబ నిర్ణయించుకొంటుంది. మునులు తపస్సు చేస్తున్న చోటికి వెళ్లి తన వృత్తాంతం వివరిస్తుంది. ''రాజులు చేసిన పని సాధువులచేత చక్కబడుతుందా? నువ్వు సుకుమారివి. నీకిది సాధ్యంకాదు.తండ్రి వద్దకువెళ్లు. అదే పరమ ధర్మం'' అంటారు మునులు.'' నేనెవ్వరికి తెలియకుండా యీ అరణ్యంలోనే ఉండి తపస్సు చేసుకుంటాను.ఇదే నా నిర్ణయం ఎవరి వద్దకైనా ఎలా వెళ్లగలను?'' అంటూఉండగానే ఆ ఆశ్రమానికి హోత్రవాహనుడనే రాజర్షి వస్తాడు ఆయన అంబను చూసి ఆమె విషాదానికి కారణమడిగి,మునుల వల్ల ఆమె విషయం విని ఆమె తనకూతురి కూతురని తెలుసుకొని జరిగినదంతా సవివరంగా తెలుసుకొని చాలా చింతించి '' నీకు తపస్సెందుకు?నీవు పరశురాముని ఆశ్రయిస్తే అన్ని కష్టాలు తొలగిపోతాయి. అతడే నీ ఆపద తీర్చగలడు.''అని చెప్పి అంబను పరశురాముని సాక్షాత్కారంకోసం మహేంద్రపర్వతం మీద తపస్సు చేయమంటాడు.అంతలోనే పరశురాముడు మరునాడు అక్కడికి రాబోతున్నాడని విని సంతోషిస్తాడు.

మరునాడు పరశురామునికి తన మనుమరాలిని చూపి, హోత్రవాహనుడామె నోటితోనే ఆమె వృత్తాంతం వినమంటాడు. అంబ తన పాదాలకు నమస్కరించగా పరశురాముడు'' నేను నీ తాతవంటివాడిని. విషయం వివరించు'' మంటాడు. అంతా విని,''నీకిద్దరూ పరాభవం చేశారు.సాళ్వుని కడతేర్చమంటావా? భీష్ముని పరిమార్చమంటావా? నీకేది ప్రియం?'' అని ప్రశ్నిస్తాడు.

'మహాత్మా, సాళ్వుడింక నన్ను స్వీకరింపడు. నాకు మనస్సులో భీష్మునిపైనే కోపం. అతన్ని చంపాలనే తపస్సు చేయబూనుకున్నాను. నిన్ను చూచి, నీ శరణు జొచ్చాను.'' అంటుంది అంబ.''భీష్ముడు నేను చెప్పినట్లు చేస్తాడు. చేయకపోతే నా బాణాలకతన్ని గురి చేస్తాను నీవు తపస్సు మానుకో.''అని ఆమెను వెంటబెట్టుకొని కురుక్షేత్రానికి వస్తాడు.ఆయన రాకను విన్న భీష్ముడు సాదరంగా వచ్చి వినయంగా పరశురాముని అర్చిస్తాడు.

అతని భక్తి వినయాలకు సంతోషించి కూడా పరశురాముడు'' ఈ కన్యను బలవంతంగా ఎత్తుకొని వచ్చి త్రోసిపుచ్చడమెందుకు?నీ తమ్మునికిచ్చి వివాహంచేయి.'' అంటాడు.'' స్వామీ! ఆమెతాను సాళ్వుని వరించినానన్నందుననే ఆవిధంగా పంపవలని వచ్చింది. ఇతరులపై మననున్న దానిని నా తమ్మునకేవిధంగా ఇచ్చి వివాహం చేయగలను?'' అన్న భీష్మునితో''నేను గురువునని తెలిసీ నా మాట నిర్లక్ష్యం చేస్తున్నావు నీవు నేను చెప్పినట్లు చేస్తేగాని

నా కోపాగ్ని చల్లారదు." అన్న పరశురామునితో "ధర్మాచరణ కోసం ఇంత వాదనలేల? పరపురుషునియందా సక్తురాలైన స్త్రీని ఎవరు పెండ్లాడుతారు? ఈ పనిచేయడంకంటె నీచే ఎలా శిక్షింపబడినా మేలే"అని "గర్వంతో ఉచితానుచితాలు తెలుసుకోక,లోకం నడిచే మార్గంలో నడువక, ఉన్మాద స్వభావంతో సంచరిస్తే గురువునైనా దండించమని పెద్దలు చెప్పారు." అని భీష్ముడనగా మండిపడిన పరశురాముడు తనతో యుద్ధానికి ఆహ్వానిస్తాడు ఇరువుని మధ్యా భీకర యుద్ధం జరుగుతుంది.మునులు, వసువులు, గంగ అనేక విధాలుగా చెప్పి పరశురాముని కోపాన్ని శాంతింపచేస్తారు.అతడు అంబతో"అమ్మా, నన్ను భీష్ముడు గెల్చినాడు.ఇంక నీ ఇష్టం వచ్చిన చోటికి వెళ్లు నా వల్ల అయినదింతే" నంటాడు.

యమునా నదీతీరంలో అంబ ఘోరతపస్సు చేసి కౌశికుడు మొదలుకొని ఎందరో సిద్ధుల ఆశ్రమాలన్నింటిలో కఠినాతికఠినమైనవ్రతాలు చేస్తూ ఉండగా గంగ వచ్చి కారణమడిగి, తెలుసుకొని "నీవు భీష్ముని గూర్చి కుటిల ప్రచారం చేస్తున్న కారణంగా యీ శరీరం విడిచి నదివై ప్రవహిస్తావు. ఇంకేమీ చేయలేవు" అని శపిస్తుంది.

తన వ్రతఫలంలో అర్ధభాగం వల్ల అంబ తన పేరుతో నదియై మత్స్యదేశంలో ప్రవహిస్తూ, మిగతా సగంతో తన రూపుచెడకుండా తన తపోశక్తితో గంగాశాపాన్ని గెలిచి పవిత్రమైన ఆశ్రమాలలో కఠినమైన తపస్సు చేస్తుంది. ఈశ్వరుడామె తపస్సుకు మెచ్చి ప్రత్యక్ష్యమవుతాడు. తనకు భీష్ముని చంపే వరమీయమంటుంది అంబ. అట్లేయగుగాక అన్న ఈశ్వరునితో అదెట్లా సంభవమని అడుగుతుంది. "నీవీ శరీరం విడిచి మొదట ద్రుపదునికి పుత్రికగా జన్మించి ఆ తరువాత పుత్రరూపం పొంది శిఖండి పేరుతో, మహాపరాక్రమంతో, విలువిద్యా నైపుణ్యంతో ప్రశస్తికెక్కి, యుద్ధంలో అతనిని చంపగలవు" అని వివరించి అదృశ్యమవుతాడు. అంబ చితి పేర్చుకొని,చుట్టూ ఉన్న మునులు ఆశ్చర్యం నుండి కోలుకోకముందే " క్రోధదీప్తమూర్తియై భీష్ముని వధించుదానను అంటూ అగ్నిలో ప్రవేశిస్తుంది.

సంతానహీనతతో బాధపడుతున్న ద్రుపదుడు శివుని గూర్చి తపస్సు చేసి, ప్రత్యక్షమైన శివుని తనకు భీష్ముని చంపే పుత్రునీయమంటాడు." కూతురై పుట్టి, తర్వాత పుత్రత్వం పొంది యుద్ధంలో భీష్ముని చంపే సంతానం నీకు కల్గుతుంది. నా మాట తప్ప" దని శివుడు వరమిస్తాడు.

ఆ విధంగానే ద్రుపదుని భార్య గర్భవతియై కుమార్తెను కంటుంది. ఆ

రహస్యం దాచిపెట్టి, పుత్రుడనే ప్రచారం చేసి శిఖండిపేరుతో అతి గోప్యంగా పెంచుతూ ద్రోణుని వద్ద శస్త్రాస్త్ర విద్యలు నేర్పిస్తూ ఉంటారు.యౌవనంలో ఉన్న శిఖండికి వెంటనే వివాహంచేయాలని, పరమేశ్వరుని వరం సమయం వచ్చినప్పుడు నెరవేరగలదని దశార్ణ దేశపురాజు హేమవర్మ కుమార్తెనిచ్చి పెండ్లి చేస్తారు.

ఆ రాజకుమార్తె తన భర్త పురుషుడు కాదన్న సత్యాన్ని తెలుసుకొని తన దాసితో రహస్యంగా తన తల్లిదండ్రులకు చెప్పి పంపుతుంది. హేమవర్మ దుఃఖంతోను, కోపంతోను ద్రుపదుని వద్దకు తన దూతను పంపుతాడు.

"కొడుకని చెప్పి కూతురికి మాఅమ్మాయినిచ్చి పెండ్లి చేస్తావా? దీని వల్ల నీవు పొందిన లాభమేమి? నగుబాటు పొందినావు. శత్రుభయంకరుడైన హేమవర్మను మోసంచేసినావు. నీకు పౌరుషం ఉంటే చూపించు." అని పల్కిన దూతతో ద్రుపదుడు నవ్వుతూ "ఇవేమి మాటలు? ఇలాంటి వెర్రివాళ్లుకూడా ఉంటారా? ఇట్లా చేయడం సాధ్యంకాదని తెలియదా? అని నేర్పుగా మాట్లాడి అతనిని పంపించి వేస్తాడు దూత తన రాజుకు విషయమంతా వివరిస్తాడు.హేమవర్మ సైన్యంతో వచ్చి పట్టణం వెలుపల అగడ్త చుట్టూ మోహరిస్తాడు.

పట్టువడిన దొంగలాగ ద్రుపదుడు తమకు కల్గిన ఆపదకు భార్యతో చింతిస్తూ ఉంటాడు.మరునాడు సూర్యోదయంతో రెండుదేశాలమధ్య యుద్ధం ప్రారంభం కాబోతున్నది. ఆ రాత్రి శిఖండి తనకింక మరణం తప్ప వేరు గత్యంతరం లేదని నిశ్చయించుకొని, సమీపంలోని నిర్జనవనం స్థూలకర్ణుడనే యక్షునిదని ముందే తెలిసి ఉండడం చేత ఎంతో అందంగా ఉన్న ఆ యక్షుని మందిరానికి వెళ్లి ప్రాణాలు విడిచే ప్రయత్నం చేస్తాడు.

యక్షుడది తెలుసుకొని " ఎందుకిట్లా బలవంతపు చావు చస్తున్నావు? నీ మనోవేదన నేను తొలగిస్తాను చెప్పమంటాడు. శివునికి తప్ప ఇతరులకది సాధ్యం కాదని శిఖండి తన వృత్తాంతం తెలియజేయగా యక్షుడికి దయకలిగి, తన పురుషత్వం గ్రహించి ఆపద తొలగించుకొని పదిరోజుల తర్వాత తిరిగి వచ్చి తన పురుషత్వం తనకిమ్మంటాడు. అంతవరకు ఆమె స్త్రీరూపాన్ని తాను ధరిస్తానంటాడు. ఆ విధంగా పరస్పరం వేషాలు మార్చుకుంటారు.

శిఖండి పురుషుడై వచ్చి తల్లిదండ్రులకు మ్రొక్కి విషయం తెలియజేస్తాడు. వాళ్లు మహదానందభరితులౌతారు. తెల్లవారిన పిదప ద్రుపదుడు తగిన వారిని పంపి, హేమవర్మను పిలిపించి "సంభ్రమంబు లేక, వేగిరపడక, నాగరిక ప్రకారంబున శిఖండి పురుషత్వంబు" తేట పరుస్తాడు. హేమవర్మ పశ్చాత్తప్తుడౌతాడు.

అక్కడ అరణ్యంలో యక్షుల రాజైన కుబేరుడు విమానంలో వెళ్లుతూ స్థూలకర్ణుని మందిర సౌందర్యానికి అబ్బురపడి స్థూలకర్ణుడు తన దర్శనానికి రాకపోవడానికి కారణమేమని చుట్టూ ఉన్న యక్షులనడుగుతాడు. అతని అవినయానికి శపించ బోయేటంతలో అతని స్త్రీత్వాన్ని గూర్చి చెప్పి సిగ్గు వల్ల మీకు ముఖంచూపలేకుండా ఉన్నాడని చెబుతారు. అయినా సరే రమ్మని కుబేరుడు కబురుపంపుతాడు. స్థూలకర్ణుడు వచ్చి నమస్కరింపగా అతని స్త్రీరూపాన్ని చూచి అతనికది శాశ్వతమౌతుందని శపిస్తాడు. తక్కిన యక్షులందరూ ప్రార్థించగా శిఖండి జీవించి ఉన్నంతవరకు స్థూలకర్ణుడు స్త్రీగానే ఉంటాడని, తరువాత నిజరూపం పొందుతాడని తన శాపాన్ని సడలిస్తాడు.

మాట ప్రకారం పదిరోజుల తర్వాత శిఖండి తన పురుషత్వాన్ని యీయబోగా, "నీ వల్ల దోషంలేదు. విధి శాశ్వతంగా నీకు పురుషత్వాన్ని ప్రసాదించిందని తనకు కుబేరుడి శాపాన్ని గూర్చి వివరిస్తాడు. శిఖండి సంతోషంతో తిరిగి వచ్చి ద్రోణాచార్యుని వద్ద మరింత విశేషవిద్యాభ్యాసం చేస్తాడు.

భీష్ముడు యుద్ధరంగంలో స్త్రీలతో గానీ స్త్రీలను ముందు పెట్టుకున్న వారితో గాని, స్త్రీపేరు పెట్టుకున్న వారితో గాని స్త్రీ ఆకారం గలవారితో గాని యుద్ధం చేయనని వ్రతం పూని ఉంటాడు. అందువలన అర్జునుడు శిఖండిని ముందు ఉంచుకుని యుద్ధంచేసి భీష్ముడు శస్త్రసన్యాసం చేసేటట్లుగా చేస్తాడు.

## 253 ప్రభావతి

భరద్వాజుడనే ఋషి కుమార్తె ప్రభావతి.ఇంద్రుడు తనకు భర్తకావాలని తపస్సు చేస్తుంది. ఇంద్రుడామెను పరీక్షింపగోరి వశిష్ఠుని రూపంలో వస్తాడు. ఆమె అతనికి అర్ఘ్యపాద్యాదులిచ్చి, పూజించి, తాను ఇంద్రుని పాణిగ్రహణం చేసేటంతవరకు తన పట్టు విడువనని చెబుతుంది. అతడు చిరునవ్వుతో సరేనని ఆమెకు కొన్ని రేగుపండ్లిచ్చి, వాటిని ఉడుకబెట్టి ఇమ్మంటాడు. ఆమె స్నానం చేసి శుభ్ర వస్త్రాలు ధరించి అగ్ని రాజేసి నీళ్లతో కూడా ఆ ఫలాలను పొయ్యిమీద కెక్కించి, ఎంతసేపు మంటబెట్టినా అవి పక్వంకావు.తెచ్చిన కట్టెలన్నీ అయిపోతాయి. అగ్ని సమసిపోవడం ప్రారంభించినా, రేగు పండ్లు పక్వంకాలేదు.కట్టెలు తీసుకొని వచ్చేసరికి అగ్ని ఆరిపోతే అది దుష్పాకమవుతుందని ఆమె తనకాలినే ఇంధనంగా పొయ్యిలో పెట్టి పండ్లనుడికించే ప్రయత్నం చేస్తుంది. ఇంద్రుడాశ్చర్యపోయి ప్రత్యక్షమయి నీ నిష్ఠకు మెచ్చుకొన్నాను. నీ కోరిక నెరవేరుస్తాను. నీ శరీరం విడిచి

స్వర్గానికి రా. సర్వపాప పరిహారమై యీ తీర్థం ముల్లోకాలలో ప్రసిద్ధమవుతుంది" అని వరమిస్తాడు. ఆమె ఇంద్రుని భార్య అవుతుంది. ఆ క్షేత్రం పేరు బదరిపాచన క్షేత్రం.

## 254-255 అలంబుస, సరస్వతి (నది)

దధీచి అనే ముని తపస్సును విఘ్నం చేయడానికి ఇంద్రుడు అలంబుస అనే అప్సరసను పంపుతాడు. ఆమె దర్శనంతో అతనికి రేతః పతనమవుతుంది. సరస్వతి దానిని ధరించి గర్భవతియై పుత్రుని కని, తపస్వులతో గోష్ఠిలోనున్న అతని వద్దకు వచ్చి, "వీడు నీ కొడుకు.నీ తేజస్సు వృధాకాకుండా నేను ధరించి వీడిని కన్నాను. స్వీకరించ" మని యిస్తుంది. దధీచి ఆ బాలుని ఎత్తుకొని ఆలింగనం చేసుకొని,మూర్ధం ఆఘ్రాణించి, ఆ నదీమతల్లిని చూసి," నీవు బ్రహ్మసరస్సున జన్మించినావు. పుణ్యనదులలో మేటివైనావు.నీ జలాల్లో తర్పణం వదిలితే విశ్వంలోని దేవతలు, పితరులు, గంధర్వులు తృప్తి చెందుతారు.ఈ కుమారుడు నీ పేర సారస్వతు డనబడుతాడు. రాబోయే కాలంలో పన్నెండేండ్లు అనావృష్టి కల్గుతుంది. ఆ ఆపద నుండి ఇతడనేక మంది మునులను రక్షించి వేదాధ్యయనం చేయిస్తాడు." అని ఆ బాలుణ్ణి ఆమెకిస్తాడు సరస్వతి సంతోషంతో కుమారుని తీసుకొని వెళ్తుంది.

ఇది సారస్వత తీర్థం కధ.

## 256 జనకుని భార్య సునయన

జనకమహారాజు తన రాజ్యం విడిచి భిక్షావృత్తి స్వీకరించాలనుకుంటాడు. ఆయన భార్య దానికంగీకరించక " రాజ్య పాలనం చేయకుండా భిక్షార్థియై పోయినట్లైతే అతిథి అభ్యాగతుల సేవలు,దేవపితృతర్పణాలు చేయడం సాధ్యమవుతుందా? కాషాయ వస్త్రాలు ధరించి, తలగొరిగించుకొన్నవాడు అన్నంకోసం గృహస్థుల యిండ్లకు వెళ్లుతాడు. గృహస్థుడు అందరికి కరుణతో అన్నం పెడతాడు. అన్నదానం గొప్ప ధర్మమన్న సంగతి నీకు తెలియదా? చేయిచాపే వానికంటే పెట్టేవాడే శ్రేష్ఠుడు. ఇవన్నీ ఆలోచించకుండా దీనభావంతో భిక్షార్థివై ఇంటింటికి భిక్షకై వెళ్తావా? త్రైవిద్యులైన మహాత్ములు నీ వలన బ్రతుకదలచి యుండగా నిష్క్రియా పరుడవై నీవు ఇందరిని పాడు చేస్తావా? స్వామీ, నీకిది ధర్మంకాదు.మానుకో.

మీ తల్లిని శోకసముద్రంలో ముంచి, వంశధర్మం వదిలి,నీవు వెళ్లిపోతే ఎట్టి గతి నీకు పడుతుందో నేనూహింపలేను. చలివేంద్రంలాగ, పండ్లతో విరుగగాసిన

తరువులాగ ప్రజల ఆకలిదప్పులు తీర్చగల్గిన మహాత్మునికి లఘుత్వం కోరి వరింప దగినదా? ఇది ధర్మవిరోధం.దీనివల్ల నీకు మోక్షం లభిస్తుందన్న విషయం నాకు సందేహమే" అని ఎంతో సహేతుకంగా విమర్శిస్తుంది.

## 257 మాధవి

మాధవి యయాతి మహారాజు కుమార్తె. గాలవుడనే ఋషిని గరుత్మంతుడు యయాతికి తన స్నేహితుడని పరిచయం చేస్తాడు. తన గురువుకు గురు దక్షిణ చెల్లించడం కోసం దేహమంతా శుద్ధ ధవళవర్ణంతో ఉండి, ఒక్క చెవి మాత్రమే నీల వర్ణమైన ఎనిమిది వందల గుఱ్ఱాలు తనకు కావాలని గాలవుడు యయాతిని అర్థిస్తాడు.

తన వద్ద అలాంటి గుఱ్ఱాలు లేవని యయాతి తన కుమార్తె మాధవిని మునికి సమర్పించి"ఈమెకోసమై ఏమహారాజైనా నీకటువంటి గుఱ్ఱాలనీయగల"[1] డంటాడు.

ఆమెను వెంట బెట్టుకొని గాలవుడు అలాంటి గుఱ్ఱాలు గల రాజుల నన్వేషిస్తూ అయోధ్యకు వెళ్లి ఇక్ష్వాకుమహారాజును కలుస్తాడు ఆయన తన వద్ద ఇన్నూరు మాత్రమే అశ్వాలున్నాయంటాడు.మాధవి గాలవునితో "ఒక మహానుభావుని వరం వల్ల నేను పుత్రవతినైనా కన్యగానే ఉంటాను. కాబట్టి నీవొక షరతుమీద ఈ రాజుకు నన్నిచ్చి అతని వద్ద ఉన్నన్ని గుఱ్ఱాలు పుచ్చుకో"[2] మంటుంది. గాలవు డందుకు సమ్మతిస్తాడు. సంతానార్థియైన ఇక్ష్వాకుడు ఆమె తనకు సంతానం ప్రసాదించే వరకు భార్యగా ఉంటుందని చెప్పి, రెండువందల గుఱ్ఱాలనిచ్చి ఆమెను స్వీకరిస్తాడు. ఆమె వల్ల వసుమన్యుడనే కొడుకును పొందుతాడు.

ఆ విధంగానే ఆమెను రాజులకు సమర్పిస్తూ కావలసిన గుఱ్ఱాలు పొందమని గరుత్మంతుడతనికి సలహానిచ్చి వెళ్లిపోతాడు.[3] ఆ ప్రకారంగా మాధవి వల్ల కాశీరాజు దివోదాసుడు ప్రవర్ధనుడనే కొడుకును,భోజపురనాథుడైన ఔశీనరుడు శిబి అనే పుత్రుని పొంది, ఒక్కొక్కరు ఇన్నూరేసి గుఱ్ఱాలను గాలవునికి యిచ్చుకుంటారు.

మిగతా రెండు వందల గుఱ్ఱాలకోసం గాలవుడు విచారిస్తూ ఉండగా గరుత్మంతుడు మళ్లీ వచ్చి " ఒక కారణం చేత యీ ముగ్గురు రాజులకూ యీ

---

1.భార.ఉద్యోగ.ఆ3.ప.312 2.అదే.ప.315 3.భార. ఉద్యోగ.ఆ3.ప.316

గుఱ్ఱాలు లభించాయి. ఇంకెక్కడా నీకు మరి లభింపవు కాబట్టి ఈ ముగ్గురిలాగానే విశ్వామిత్రుడు కూడా ఈమెవల్ల కొడుకును పొందేటట్లుగా సమ్మతింపజేసి, ఈ ఆరునూర్లు గుఱ్ఱాలు సమర్పించు" కొమ్మని సలహాయిస్తాడు. అంతేగాకుండా తాను తోడు వెళ్లి" ఇతడు బాలుడు, నీవు దయాళుడవు. ఇతణ్ణి కృతార్థుని చేయ"మని ప్రార్థించి, అంగీకరింపజేసి వెళతాడు. విశ్వామిత్రుడు మాధవి వల్ల అష్టకుడనే పుత్రుని పొంది, ఆమెను తిరిగి శిష్యునికి సమర్పిస్తాడు. మాధవి తపస్సు చేసుకోవడానికి వెళ్లగా, గాలవుడు తన దారిన తాను వెళతాడు.

## 258. సుకుమారి

నారదుని చెల్లెలి కొడుకు పర్వతుడు. ఇద్దరూ భూలోకంలో పర్యటించాలనే వేడుకతో స్వర్గంనుండి దిగి వచ్చి, తమలో తాము రహస్యం లేకుండా తమ తమ మనస్సులలో కల్గిన భావాలు ఎదుటి వారితో చెప్పుకోవాలని నియమం చేసుకొంటారు. అలా చేయలేక మనోభావాలు దాచినట్లైతే వారు శాపం పొందడానికి అర్హులని కూడ అనుకుంటారు.

వాళ్లొక రోజు సృంజయుని వద్దకు వెళ్లి, అతని పూజలు స్వీకరించి, అతని యింట్లో కొన్ని రోజులుంటామంటారు. అతడు సంతోషంతో తన కుమార్తె సుకుమారిని వారి పరిచర్యలకు నియమిస్తాడు.

ఎలప్రాయంలో ఉన్న ఆ సుందరి ప్రత్యంగ సౌందర్యం నారదుడు ధైర్యం కోల్పోయేటట్లు చేస్తుంది. అతడు మన్మథబాణ పీడితుడవుతాడు.

"అల్ల దనంబున యనువు మైకొన జూచు నడపుకాంతికి వింత తొడవుగాగ
వెడవెడ నూగారు వింతయైయేర్పడు దేరని వళులతో నారు నిగుడ
నిట్టలు ద్రోచుచు నెలవులకలమేర లెల్లను బిగియెక్కి యేర్పడంగ
దెలుపును గప్పును వెలయంగ మెరుగెక్కు తారకంబుల గల్కితనము దొడక
జరణములును నడుము జన్నులు గన్నులు జవ్వనంబు చెన్ను నివ్వటిల్లు
చునికి దెలుప సృంజయునిపుత్రి మెలగువిధంబు నారదునికి దగులొనర్చె"
"అట్లు కాముబారింబడి నలంగియు......"

అనుదినం కృశిస్తూన్న మామను చూసి పర్వతుడు కారణం తెలియక ఆశ్చర్యపోతాడు. నారదుడు పర్వతునితో విషయం చెప్పడానికి సిగ్గుపడి దాచిపెడతాడు. పర్వతుడు తన దివ్యదృష్టితో తెలుసుకొని "మన ఒప్పందాన్ని ఉల్లంఘించి, నీవు నన్ను వంచించినావు. రాజపుత్రి మీద నీకు అనురాగం కల్గడం

నావద్ద దాచినావు. మన్మథుడు చాల బలవంతుడు. కనుక నీవు ఆమెను వరింపకుండా జీవింపలేవు. పెళ్లైన మరుక్షణం నీకు కోతి ముఖం కల్గుతుంది" అని శాపమిస్తాడు.

"నీవు స్వర్గలోకానికి వెళ్లకుందువుగాక!" అని నారదుడు ప్రతి శాపమిస్తాడు. పర్వతుడక్కడి నుండి వెళ్లపోయి భూలోకంలోని ప్రజల సేవలు పొందుతూ ఉంటాడు.

పర్వతుని శాపానికి భయపడకుండా నారదుడు రాజుతో అతని కుమార్తె సుకుమారిని తనకిచ్చి వివాహం చేయమంటాడు. సృంజయుడు సంతోషంతో సుకుమారి నిచ్చి వివాహం చేస్తాడు. మరుక్షణమే నారదుడు వానర వదనంతో వికృత రూపుడవుతాడు. అయినా సుకుమారి అతన్ని అసహ్యించుకొనక, విరక్తి చెందిన భర్తకు తగినట్లుగా సేవిస్తూ, సంతృప్తి పరుస్తూ ఉంటుంది. పతివ్రతయై భర్త నారాధిస్తూ ఉంటుంది.

ఒకనాడెందుకో అరణ్యానికి వెళ్లిన నారదునికి పర్వతుడు కన్పించి తనకిచ్చిన శాపం ఉపసంహరించమంటాడు. "నీవే ముందు శపించావు. ముందు నీవే నా శాపం మరల్చు" అంటాడు నారదుడు. మామా అల్లుళ్లు పరస్పర శాపవిమోచనం చేసికొని రాజమందిరానికి తిరిగి వస్తారు. భర్తను చూసి ఎవరో పరపురుషుడనుకొని సుకుమారి మారుముఖం పెట్టుకొని వెళ్లబోతుంది. పర్వతుడు నవ్వుతూ ఆమెకు విషయమంతా వివరించి అతడామె భర్తేనని విశ్వసింపజేస్తాడు.

కొన్ని సంవత్సరాలు కాపురం చేసిన తర్వాత నారదునికి అక్కడి నుండి వెళ్లాలన్న కోరిక కల్గుతుంది. సృంజయునితో "నీకేదైనా ఉపకారం చేస్తా" నని అతనికి సువర్ణష్ఠీవి అనే పుత్రుణ్ణి ప్రసాదించి, ఇంద్రుని వల్ల ఆ బాలునికి మరణం ఉంటుందని, అయినా తాను రక్షిస్తానని చెప్పి, బంగారం కోసం దొంగలు వధించిన ఆ బాలుని బ్రదికించి రాజు అనుమతితో అక్కడి నుండి వెళ్లిపోతాడు.

## 259. భూదేవి

కాశ్యపుడు తనకు పరశురాముడిచ్చిన భూమినంతటినీ బ్రాహ్మణులకు దానం చేస్తాడు. అందువల్ల భూమికి 'కాశ్యపి' అనే పేరు వస్తుంది. కొన్నాళ్లకు వైశ్యులు, శూద్రులు ధర్మం తప్పి బ్రాహ్మణుల స్త్రీలను, ధనధాన్యాలను అపహరించడం మొదలు పెడతారు. పాపభారంతో భూమి క్రుంగి పోతూ ఉండగా కశ్యపుడు తన తొడను ఆసరా ఇచ్చి, భూమిని ఉద్ధరిస్తాడు. ఆ కారణంగా భూమికి

ఉర్వి అని పేరు. పరశురామునిచే ఇంకా చావకుండా మిగిలిన హైహయులను గూర్చి భూదేవి కశ్యపునికి చెబుతుంది.

"పౌరవ వంశంలో జన్మించిన విదూరథుని కొడుకు ఋక్షవత్పర్వతంలో ఎలుగు బంట్లచే రక్షింపబడినాడు. సౌదాస వంశంలో జన్మించిన వాడు పరాశర మహర్షికి యజ్ఞసమయంలో సర్వకార్యాలు చేసి, సర్వకర్ముడనే పేరుతో ఉన్నాడు. శిబి మనుమడు గోపతి అరణ్యాలలో గోవులను రక్షిస్తూ బ్రతికి ఉన్నాడు. ప్రతర్దనుని కొడుకు వత్సుడనేవాడు పశువులశాలలోని లేగదూడలు రక్షింపగా పెరుగుతున్నాడు. దివిరథుని కుమారుడు దధివాహనుని కొడుకు కంగుడనేవాడు గంగా తీరంలో గౌతముని రక్షణలో ఉన్నాడు. బృహద్రథుని వంశంవాడైన భూరి అనేవాడు గృధకూట పర్వతం పై వానరాలు రక్షింపగా పెరుగుతున్నాడు. మరుత్తు సంతానానికి సంబంధించిన వారు నాలుగేండ్ల వారు ముగ్గురు సముద్రుని రక్షణలో సముద్ర తీరంలో పెరుగుతున్నారు. వీరందరూ ఉత్తమ క్షత్రియులు. వీరి పెద్దలు నా కోసమై యుద్ధంలో పరశురాముని చేతిలో మరణించినారు. కాబట్టి నీవు వారందరినీ రాజులను చేయి" అని భూదేవి వేడుకోగా ఆ విధంగానే చేస్తానని చెప్పి, కశ్యపుడు వాళ్లను రప్పించి, ఆధిపత్యానికి వారు తగిన వారని నిర్ధారించుకొని భూమిని విభజించి వారందరినీ రాజులుగా అభిషేకిస్తాడు.

ఒకనాడు బ్రాహ్మణుల విషయమై వాసుదేవుడు భూదేవితో ఈ విధంగా సంభాషిస్తాడు.

" ఓ కాశ్యపీ! నీవు లోకమాతవు. కాబట్టి నేను నీ వలన తెలుసుకోవాలని అడుగుతున్నాను. మానవులు ఏ పనులు చేసి పాపాలు తొలగించుకోగలరో నాకు విశదీకరించు"

అందుకు భూదేవి " బ్రాహ్మణులను సేవించడం వలన, పూజించడం వలన, వారికి మేలు చేయడం వలన, మానవులు పాప నివృత్తి నొందగల్గుతారు. ఇవన్నీ రాజు చేయవలసిన పనులు. దేవేంద్రుని సహస్రాంకిత శరీరునిగా చేసినది, తిరిగి నేత్ర భాసురునిగా అతనిని మార్చినది బ్రాహ్మణుల అలుక, అనుగ్రహాలే కదా!" అంటుంది.

వాసుదేవుడా మాటలు మెచ్చి, భూదేవిని కొనియాడుతాడు.

## 260. పూజని

బ్రహ్మదత్తుడనే రాజు పట్టణంలో పూజని అనే పేరు గల చిలుక ఉండేది.

అది చాలా చక్కగా, నేర్పుగా మాట్లాడగలిగేది. అది తన పిల్లకు మేలైన పండ్లు పెట్టేది. బ్రహ్మదత్తుని కొడుకు పసివానికి కూడ కొన్ని మంచి పండ్లను యేరి పెట్టేది. ఆ పిల్లవాడు కూడ ఆ పక్షి పిల్లతో మచ్చిక గల్గి ఆడుతూ ఉండేవాడు.

ఒకనాడు దాది తనవద్ద లేని సమయంలో ఆ రాజపుత్రుడు ఆ పక్షిపిల్ల తలనులిమి చంపివేస్తాడు. పూజని వచ్చి చూసి శోకంతో "అయ్యో ఇన్నాళ్లు కలిసి మెలిసి ఆడుతూ పాడుతూ, తింటూ, తిరుగుతూ ఉండి ఇప్పుడిట్లా పక్షిపిల్ల అనికూడా అనుకోకుండా చంపవచ్చునా? దీనికి ప్రతీకారం చేయకుండా ఉండను. రాజుకొడుకు కదా,రాజులకుపరిచయాలతోగాని,దయాదాక్షిణ్యాలతోగాని పనియేమి? అతి తొందరలోనే దయనుకోల్పోతారు. చేసినమేలు మరిచిపోతారు. రాజులు విశ్వాసానికి పాత్రులుకారు. అహంకారులు. క్రూరకర్ములు." అని నిందించి కోపంతో రాజుకొడుకు కనుగుడ్లు రెంటిని తన గోళ్లతో పొడిచి పెరికి వేసి ఆకాశంలోకియెగిరి బ్రహ్మదత్తునితో ఇలా అంటుంది.

"రాజా,పాపం చేసిన నీ కొడుకు ఆ పాపానికి తగిన ఫలమనుభవించినాడు. శిశువు పట్ల నేను చేసినదిక్రౌర్యంకాదు. అతడు చేసిన దానికి నేను ప్రతీకారం చేశాను. అందువలన నాకు కీడు కల్గదు." దానికి బ్రహ్మదత్తుడు" నిజమే, నీవు చేసినది తప్పుకాదు. నీవు వెళ్లడం నాకు దుఃఖకరం. ఎప్పటిలాగానే యిక్కడే ఉండు" అంటాడు.

పూజని"అది సాధ్యం కాదు. పరస్పరం పెంచుకొన్న ఈ పగ శాంతించేది కాదు. నీ మాటలకు నేను బేలు పోయి నిన్ను చేరడం తగినది కాదు" అంటుంది. బ్రహ్మదత్తుడు " చేసిన దానికి తిరిగి మారు చేస్తే పగ అంతలో తీరిపోతుంది. గుణవంతులుచేసిన మేలును మరచి దోషాలనే ఎన్నుతారు.అటువంటి వారు తుచ్ఛులు." అంటాడు.అప్పుడు శారిక అతనితో స్నేహం చెడిపోయి తర్వాత మాటల తియ్యదనం వల్ల పగను మరచిపోవచ్చునేమోగాని, పగ వల్ల చావుగాని, చేటుగాని, కలతగాని, సంభవిస్తాయి. మేలు మాత్రం కలగదు. భూమిని దోచుకున్నా దాయాదులైనా మాటామాటా పట్టింపువల్ల నైనా,స్త్రీలకు ద్రోహం చేసినా - ఈ కారణాలవల్ల తప్పక పగ కల్గుతుంది.పగకల్గితే అది సమసి పోదు. మానులో అగ్ని దాగి ఉన్నట్లుగా గూఢంగా ఉంటుంది. తరువాతి కాలంలోనైనా అది కీడును కల్గిస్తుంది.నమ్మడానికి వీలులేదు.తల్లిదండ్రులను,తోడబుట్టినవారిని,కడుపున బుట్టిన వాళ్లను,స్నేహితులను కూడ నమ్మకూడదంటే ఇక పగవారి విషయంలో నమ్మడానికి వీలుందా?ఓ బ్రహ్మదత్తా !చతురోక్తులు మాను" అంటుంది.

బ్రహ్మదత్తుడు" కాలవశం వల్ల మానవులకు మేలుగీళ్ళు సమకూరుతాయి. అంతేగాని పనిగట్టుకొని అవి పై వచ్చివాలవు. నేను తెలియని వాడనా,నన్ను విడిచి పోనేల?" అంటారు. పూజని అతని ముఖం తేరిపారజూచి"చల్లని మాటలలో క్రోధందాగి ఉంటుంది. సముద్ర జలాలలో ఆరని బడబాగ్ని ఉన్న విధంగా" అని పలికి తన దారిన తాను ఎగిరి పోతుంది.

## 261 కపోతి కథ

ఒక పాపాత్ముడైన బోయవాడు పక్షులను వేటాడుతూ గాలివానలో చిక్కి చెట్టు క్రింద ఆ రాత్రి చలికి వణకుతూ పడుకొని, ఆ చెట్టును చూచి భక్తితో "ఇక్కడున్న ప్రాణులు నన్ను దయతో కాపాడాలి." అని ప్రార్థించుకొని నిద్రిస్తాడు.

ఆ చెట్టు తొర్రలో నివసించే ఒక పావురాల జంటలోని మగపావురం రాత్రియైనా తన భార్య రాకపోవడంతో దుఃఖిస్తూ" నా భార్య ఎక్కడుందో,నన్ను విడిచి యింతసేపు ఎక్కడా ఉండేదికాదు. ఆమె లేకుంటే నేను జీవించడం వ్యర్థం ఎంతో ప్రేమానురాగాలు గల భార్య గుణాలే భర్తకు ఇహపర సుఖాలకు సాధనాలు. ఏ కారణం చేత ఏమైనదో?వానతీవ్రత వల్ల మరణించిందో ఏమో, నేనేమి చేయగలను. నా యిల్లు శూన్యమై పాడువారినట్లుంది." అని విలపించడంవిని చెట్టు క్రింద బోయవలలో ఉన్న ఆడుపావురం" భర్త మనసులో యింతటి స్థానం సంపాదించుకొన్న భార్య గదాపుణ్యాత్మురాలు! నా భర్త నన్ను గూర్చి ప్రియంగా మాటలాడే మాటలు వినగల్గి ధన్యురాలినైనాను.నా జన్మ సార్థకమైనది.యముడినే జయించాను" అని మనసులో అనుకొని భర్తకు తానున్న పరిస్థితి వివరించి విధివిధానానికి విచారించ వలసిన పనిలేదని చెబుతూ ఇంకా ఇలా అంటుంది.

"శరణువేడినవారిని దయతో రక్షించడం బుద్ధిమంతులు గొప్ప ధర్మంగా భావిస్తారు.ఈ కిరాతకుడు శరణాగతుడు. నీ చేతనైనట్లుగా ఇతనికి ఆపదలేనట్లుగా చూడు .విపరీతమైన చలి వల్ల అతని శరీరం కొంకర్లు పోతున్నది". భార్యమాటలు విని మగపక్షి దుఃఖం పోగొట్టుకొని మనుష్యవాక్కులతో బోయతోఇట్లా అంటుంది "అన్నా నీవు చాలా అలసిపోయావు. మా యింటికి అతిథివై వచ్చినావు. నీక ఆలస్యం చేయకుండా ఆతిథ్యం ఇవ్వాలి. నీ కోరికేదో తెలియజేయి."

ఆ మాటలు విని బోయ మనస్సు సంతోషంతో నిండిపోగా "ఈ చలివల్ల సమస్తావయవాలు కొంకర్లు పోతున్నాయి. నాకి బాధను తొలగించు." అంటాడు. పక్షి వెంటనే వేగంగా సమీపంలోని పల్లెకు వెళ్లి ఎండుపుల్లలను, నిప్పుతో కూడిన

పుల్లలను ముక్కుతో పట్టుకొని వచ్చి, అగ్ని రాజేసి,ఆ నిప్పుతో చలి కాచుకొమ్మంటుంది.

ఆ విధంగానే వాడు చలికాచుకొని, ఆకలి బాధ మిక్కుటం కాగా ఆ విషయం కపోతంతో చెబుతాడు. అందుకా పక్షి చింతిస్తూ అతని అతని ఆకలి తీరే మార్గం లేక "పక్షులకు సంగ్రహించిన ఆహారం ఉండదు కదా, సేకరించిన ఆహారం తిని ఆకలి తీర్చుకొంటాము. దొరకక పోతే ఏరుకొంటాము. నీవు ఆకలితో అల్లాడుతున్నావు. నీ కాతిథ్యం యివ్వవలసి ఉంది. నా శరీరాన్ని ఆహారంగా గ్రహించు" అని అగ్ని చుట్టూ ప్రదక్షిణం చేసి వెంటనే అందులో దూకుతుంది.

బోయవాడాశ్చర్యంతో మ్రాన్పడిపోయి చూస్తూ ఉంటాడు. అతని మనస్సంతా వైరాగ్యంతో నిండిపోతుంది. "ఈ పక్షి భార్యను, బంధువులను విడిచి అగ్నిలో దూకి ప్రాణాలు వదిలింది. నేను కూడ ఇటువంటి తెగింపుతో వైరాగ్యం పూని, నా పాపాలకు ప్రాయశ్చిత్తం చేసుకొని, పరలోకానికి తగిన పుణ్యం సంపాదించుకొంటాను." అని వలలో ఉన్న పక్షులనన్నిటినీ వదిలి వేసి తన వల, సాధనాలు అక్కడే వదిలి వెళ్లిపోతాడు.

ఆడు పక్షి భర్త అగ్ని కాహుతి కావడం చూసి దుఃఖంతో కంఠం గద్గదం కాగా "నేనాకలి గొంటే నీవు సహింపలేవు. ఏదైనా నేను తిన్న తర్వాతనే నీవు తినేవాడివి. నేను ఆయాస పడితే నీవు బాధపడేవాడివి. అటువంటి నీవు నన్ను విడిచి వెళ్లడం తగునా?"

"చిగురు జొంపాలలో, పూలగుత్తులతో, పొదల చాటున, సెలయేటి తేటనీటిలో, అందమైన పర్వత ప్రాంతాలలో, మామిడి చెట్లలో, ఎలదీగలతో ఇంపారే తోటలలో, పరిమళ భరితాలైన సరోవర తీర ప్రాంతాలలో నా మనస్సును పరవశింప జేస్తూ నాతో క్రీడించే నీ చేష్టలు నేనెట్లామరువగలను? ఇప్పుడే నా ప్రాణాలు వదిలి నీ వద్దకు వస్తాను. అంతేగాక భర్త మరణిస్తే అతనితో బాటే ప్రాణాలు వదిలిన భార్య ఉత్తమగతి పొందుతుంది. అతనితో కలిసి పరలోకంలో ఆమె అంతులేని స్థిరమైన సుఖాలు పొందుతుందని విన్నాను" అని పలికి నిప్పు తీవ్రంగా రాజేసి, అగ్నికి ప్రదక్షిణం చేసి,భర్తను కలుసుకోవడం కోసమై తాను ఆ మంటల్లో దూకుతుంది.

దివ్య విమానంలో దేవతలు పరివేష్టించి ఉండగా రత్నాభరణాలు దాల్చి, పరమ సుందరాకారంతో ఒప్పుతున్న భర్తను కలుసుకొని అప్సరసల బృందం తమను చుట్టుముట్టి అభినందిస్తూ ఉండగా ఆనంద పరవశమైన ఆ పక్షుల జంట స్థితి

పుణ్యాత్ముడు కావడం చేత ఆ కిరాతునికి కన్పిస్తుంది.

తానూ ఆ విధంగా కావాలని ఆ బోయవాడు శరీరమంతా ముళ్లతో గీరుకొని పోయి రక్త సిక్తమైనా లెక్కచేయక వెళ్లుతూ ఎదురుగా అరణ్యాన్ని దహిస్తూన్న దావాగ్ని కమ్ముకోగా, ఆనందంతో అందులో పడి ప్రాణాలు వదిలి దేవత్వం పొందుతాడు.

## 262. చిరకారి తల్లి

ఒక ముని తన భార్యపై కోపంతో ఆమెను చంపమని చిరకారి అనే తన కొడుకును ఆజ్ఞాపించి వెళ్లిపోతాడు. అతడు విచారంతో తల్లిని చంపలేక, తండ్రి ఆజ్ఞ దాటలేక పరిపరి విధాల తల్లి గొప్పతనాన్ని తలచుకొంటాడు.

"తల్లి క్షేత్రం. తండ్రి బీజం. నేను యిద్దరికీ చెందినవాడిని. వీరిలో ఎవ్వరిని యిప్పుడు వదలాలి? తండ్రేనేనై జన్మించిన వాడిని. అతడే తపస్సు, అతడే విద్య, అతడే ధర్మం, అతడే పరమ దైవం. అతని కిష్టమైన పని చేస్తే దేవతలందరూ ప్రీతి చెందుతారు".

అనుకొని మళ్లీ తల్లిని గూర్చి తలపోస్తూ "కాళ్లు చేతులతో కూడిన ఈ దేహం అరణి వల్ల అగ్ని పుట్టినట్లు సంభవమైంది.భరించడానికి సాధ్యం కాని ప్రసవ వేదనను, గర్భ భారాన్ని బిడ్డల మీద ప్రేమతోనే గదా తల్లి తన శరీర చింత లేశమైనా లేక భరిస్తుంది. తండ్రి వస్తూ, పోతూ, చూస్తూ ఉంటాడు తప్పితే తల్లి లాగా పాట్లు పడతాడా? ధర్మశాస్త్రాలలో తల్లికి ఎక్కువ గౌరవం. కొడుకు బాలుడైనా, వయస్సులో ఉన్నా, వృద్ధుడైనా తల్లి ఒకే విధంగా ప్రేమిస్తుంది. తల్లి అనే పదార్థమే జగత్తులోని సంపదలకెల్లా కారణం. క్షుద్ర జంతువులకైనా, పెద్దలకైనా తల్లి అవసరం ఒకటే. తల్లి ఉన్నచోట ఊరడిల్లినట్లుగా వేరుచోట మనస్సు ఊరడిల్లగలదా?

మాతృవియోగం సంభవించితే వెంటనే మానవుడు అసమర్థుడవుతాడు. బలవంతుడై ఉండీ బలం కోల్పోతాడు. ప్రౌఢ బుద్ధి కలవాడైనా మూఢ బుద్ధి అవుతాడు. తల్లియే ఎవ్వరికైనా అతి గొప్ప, సౌఖ్యవంతమైన సంపద. అటువంటి తల్లిని నేనెట్లా వధించేది?

"వచ్చిపోయి చూచు వాడుగా కిడుమల;
బడునె తల్లి వోలె బట్టి తోడ
దండ్రి చెప్పునిట్లు ధర్మశాస్త్రంబులు;
న్న గౌరవము నధిక మగుట"

బాలుడైన గొడుకు ప్రౌఢుడైనను వృద్ధు;
డైన నొక్క విధమ యర్మిలి యును
నరయు భరము దల్లికా పదార్థంబు;
జగంబు కలిమి కెల్ల గారణంబు "
క్షుద్ర జంతువులకు గురులకు నెమ్మెయి ;
దలప నొక్కరూప తల్లి వలయు
నూఱడిల్ల గలదె యొందు సోటుల సువ;
స్తువు నివాసమైన చోట గాక"

"కలవాడు లేనివాడు స;
బలుడబలుడు మూఢబుద్ధి ప్రౌఢుడనంగా
వలదెవ్వరికైన జనని కలిమియ
యత్యంత సౌఖ్యకరమైయుండున్"

అక్కడ తండ్రి తన తొందర పాటుకు చింతిస్తూ, అతి వేగంగా తిరిగి వస్తూ పుత్రుని చూసి "చిరకారి తన పేరుకు తగినట్లు ఆలస్యం చేస్తాడే గాని శీఘ్రకారి కాబోడు. తన గర్భంలో జన్మనిచ్చిన తల్లిని అనుదినం, అనుక్షణం తన క్షేమమే విచారించే తల్లిని నేనాజ్ఞాపించినంత మాత్రాన వధించుతాడా? అనుకొంటూ వచ్చాను. నాయనా, నీ పేరుకు సార్థకత చేకూర్చుకున్నావు" అంటూ సమీపించగా చిరకారి, అతని తల్లీ ఆయన పాదాలకు మ్రొక్కుతారు. అతడా యిద్దరినీ లేవనెత్తి, కుమారుని గాఢాలింగనం చేసుకొని పొగడ్తలతో ముంచెత్తుతాడు.

## 263 సులభ

సులభ అనే ఒక యోగ విదూషీమణి జనకుడు యోగ విద్యాలంపటుడని విని, అతని జ్ఞానాన్ని పరీక్షింపగోరి యోగ నియమాచరణ చేత కృశించిన శరీరాన్ని యోగవిద్యా ప్రభావం చేత దాచి, సుందర సుకుమార దేహాన్ని ధరించి, జనకుణ్ణి చూచి భిక్షావృత్తికి సంబంధించిన విషయాలు ఉపన్యసిస్తుంది. అతడు చేసిన సత్కారానికి సంతృప్తి చెంది అతని సమీపంలో ఒక ఉచితాసనంలో కూర్చుని అతడు మోక్షగామి అవునో కాదో తెలుసుకొనగోరి తన ప్రభావంతో అతని మనస్సులో మన్మథ వికారాన్ని కలుగ జేయాలనుకుంటుంది. తన కంటి చూపుల కాంతుల నా జనక మహారాజు ముఖం మీద ప్రసరింపజేయగా అతడామె ఆలోచన పసిగట్టి చిరునవ్వుతో "నీవెవ్వరవు? ఎక్కడి నుండి ఎక్కడకు వెళ్తున్నావు? దేని కోసం

పయనిస్తున్నావు? అది అలా ఉంచి నా మాటలను నీవు శ్రద్ధతో విను.

నేను పంచశిఖుడనే మహామునీంద్రుని శిష్యుడను. అతని వల్ల సాంఖ్య యోగం, భూపరిపాలనం, త్రివిధమోక్ష ధర్మాలు నేర్చుకొన్నాను. ఆ మూడు మార్గాలలో నడిచి పరానికి దూరం కాకుండా ఉంటాను. జ్ఞానఖడ్గం చేత సమస్త రాగ బంధాలను, భోగబంధాలను ఛేదించి వేసినాను. ఆ విధంగా ముక్తుడనైన నా మనస్సులో ప్రవేశించి నేను మోక్షగామినో కాదో తెలుసుకొనగోరినావు. అదే కదా నీవు కోరిన ప్రయోజనం? నీవు బ్రాహ్మణివి, యోగినివి. పరుని భార్యవు. అంతే గాక భర్త నిన్ను పోషించువాడు. నేను రాజపుత్రుడను, గృహస్థును, ఆచారపరుడను. ఇట్టి నన్ను రమించడం నీకు నిందను తెస్తుంది గదా, స్వతంత్రురాలివై నీవు చేసిన ఈ పని వల్ల కలిగే ఫలితం నీ యందే నిలుచుగాక! అంతే గాదు, నా పట్లగల అనురాగం వల్లనే నీవిట్లా చేసినావు. నన్ను గెల్చే బుద్ధితో గాదు. ఈ వ్యర్థమైన మాయలనిప్పుడు విడిచి పెట్టలేకుండా ఉన్నావు.

యోగశక్తి ప్రభావం వల్ల నిన్ను నీవు దాచి, కుటిలభావంతో దుష్ట చరిత్రురాలి వైనావు.ఇది మోక్షగాముల మార్గమేనా? నేను నిన్ను బయట పెట్టిన తర్వాతనైనా ఆ మోహపు చూపులు మానవద్దా?" అని తన వైరాగ్యాన్ని, జ్ఞానాన్ని వెల్లడి చేసి" నీ దేహం సుందరం. నూత్న యవ్వనంలో ఉన్నావు. ఇంతటి యోగ విద్యా నైపుణ్య మెట్లా సాధించగలిగినావో దాచకుండా చెప్పు" అంటాడు.

తనను లెక్క చేయకుండా జనకుడు పల్కిన మాటలకు కొంచెం కూడ జంకూ గొంకూ లేకుండా సులభ ఎంతో చతురంగా ఇట్లా అంటుంది.

"శ్రోతకూ, తనకూ ఇష్టమైన మార్గంలో సాగితేనే అది తగిన సంభాషణ అవుతుంది. అట్టి సంభాషణలోనే తగిన వాక్యాలు వాచ్యమవుతాయి. తక్కిన సంభాషణ నీచుల మధ్య సాగుతుంది. నీ వాక్య వైదగ్ధ్యం ఆ విధంగా ఉంది. ఇక నీవు నన్ను గురించి అడిగిన దానికి సమాధానం చెబుతాను విను.

గాలి, నీరు, నిప్పు ఏ విధంగా సకల ప్రాణికోటికీ సహజంగా లభ్య మవుతున్నాయో, దేహంకూడ ఆ విధంగానే లభ్యమవుతున్నది. దేహం కల్గడ మన్న పనిలో ఆ దేహికీ, ప్రాణానికీ పరస్పరాధీన భావం లేదు.

ఒక్కశరీరంలోనే పంచభూతాలు, పది ఇంద్రియాలు, మనస్సు, బుద్ధి అనే ప్రధానమైన అంగాలున్నాయి. అవి ఒక్కొక్కటి ప్రత్యేకమైనవి నిజానికి ఎవరూ ఎవరి వారు కారు. సమస్త లోకాలు అత్యుత్తమాశ్వాల లాగా పరుగులు పెడుతూ ఉంటాయి. ఇది తెలిసీ ఎవరికైనా ఎక్కడ ఉంటారని తెలుసుకోవడం

సాధ్యమవుతుందా? నిన్ను నీలో చూసుకొన్నట్లుగా ఇతరులలో దర్శించాలి. తననూ ఇతరులనూ ఒక్కటిగా చూచే పురుషుడు "మీరెవరు,ఎక్కడ ఉంటా"రని ప్రశ్నిస్తాడా?

శత్రువులు,మిత్రులు, దాసీలు అంటూ షడ్గుణాల మార్గాల ననుసరిస్తూ విజయాన్ని కోరుకుంటూ ఉండడం ముక్తి మార్గమా? అందువలన నీవు ముక్తుడవు గావు. అయినా నిన్ను నీవు ముక్తుడననుకొంటున్నావు. నేనెందుకు ముక్తుడనుగాను? అంటావేమో, సావధానంగా విను.

వర్గ త్రయం పైనా, సప్తాంగాలలోను మనస్సు మెదులుతూ ఉంటే రాజులు స్నాన భోజన నిద్రావసరాలు తప్ప తక్కిన సమయాల్లో ప్రజల విజ్ఞాపనలు విని ఆజ్ఞాపిస్తూ, మంత్రులు, తమకు ప్రీతి పాత్రమైన స్త్రీలు, తమ స్వాతంత్ర్యాన్ని హరించి వేయగా,అర్థుల కాహారధనాలొసంగుతూ, శత్రువులు మనస్సు పాడు చేస్తూ ఉంటే వారిని పరిహరిస్తూ, ఎన్నో దుఃఖాలు, అల్పంగా సౌఖ్యాలు అనుభవించడం రాజ్యం చేసేవారి జీవితం. వాళ్లు ముక్తులుకాక పోవడం స్పష్టం.

ఓ బుద్ధిమంతుడా! పంచశిఖమునీంద్రుడునీకు మోక్షం తెల్పినాడన్నావు. నేను నీ హృదయంలో ప్రవేశించడాన్ని ఎంతో అసహ్యించుకొన్నావు. ముక్తుని తీరు ఇదేనా? నీవు కోరికలు లేని వాడవయితే ఏది ఎట్లయినా ప్రశాంతత కొంచమైనా చెదరనీయక, కలత చెందక నిర్వికారంగా ఉండాలి కదా?

అంతేగాదు, కాలు,చేయి మొదలైన నా అంగాలలో ఏదీ నిన్ను కలవలేదు. మరి ఎందుకిట్లా బాధపడుతూ నన్ను నిందించావు ?" అని మంత్రులవైపు చూసి "వీరు పెద్దలు. వీళ్లు వినేటట్లుగా తులువ మాటలు మాట్లాడటం రాజుకు తగినదా, ఎదుటివారిని తూలనాడటం తగిన మార్గమా, అందువల్ల గాంభీర్యానికి లోటు కల్గదా?

స్త్రీకి పురుషుని పట్ల, పురుషునికి స్త్రీపట్ల పుట్టిన భావాన్ని వెల్లడి చేయడం దిమ్మరితనం. ఎంతటి నికృష్టుడైనా ఈ పనికి పూనుకోడు. మరి రాజపుత్రునకిది తగునా? తామరాకు మీది నీటి బిందువులాగాసాంగత్యం లేకుండా నీ మనస్సులో నివసించిన నన్ను ఎట్టిదాననో తెలిసికొనలేకపోయినావు. ఆ పంచశిఖ మునీంద్రుడు నీకు మోక్షం ఉపదేశించడం అబద్ధమని అనిపిస్తున్నది.

ఇంక పెక్కు మాటలెందుకు? నీవు గృహస్థధర్మపరత్వాన్ని కూడ విడినావు. మోక్షమూ దూరం. రెంటికీ చెడ్డ రేవడవైనావు. ముక్తులు ముక్తులను కలుసుకోవడం ఆకాశం ఆకాశాన్ని పొందినట్లు తగినది. నీ ముక్తత ముక్తత కాదు. సక్తత అని నీవు

తెలుసుకొంటే చాలు.

మనం ముక్తులం గాకున్నా మనకు సాంగత్యం కల్గడం నిందనీయం కాదు. ఎట్లంటే ప్రజలందరూ శ్రవణపేయంగా వినడానికి ఇష్టపడే ప్రథమ రాజవంశంలో జన్మించినాను. నా పేరు సులభ. నాపూర్వీకులు శతశృంగంలో, ద్రోణపర్వతం మీదా, శక్రద్వారంలో మహాయజ్ఞాలు చేశారు. ఇంద్రుడు తమ చెంతకు రాగా, అతనితో పరమార్థాన్ని చర్చిస్తూ ఉంటారు. నాకు సంబంధించిన పురుషుడు లేకపోవడం చేత, మోక్షధర్మాసక్తనై చరిస్తూ ఉంటాను. కాబట్టి నీవు వర్ణసాంకర్యమని చెప్పిన దోషం నా సాంగత్యం వల్ల కల్గదు.

నన్ను నేను దాచనేల? నీకు మోక్షమున్నదో లేదో తెలుసుకుందామని వచ్చాను. అది తప్పా?" అని అడిగిన సులభ మాటలకు జనకుడు మారుపల్కాడు. ఆమె నవ్వుతూ "గౌరవనీయ వంశంలో జన్మించిన రాజముఖ్యుడా! అగ్ని వెచ్చగా ఉంటుందా, చల్లగా ఉంటుందా అని చర్చించడం వంటిదే నిన్ను నీవు ముక్తుడవో కావో అని ఆలోచించడం. అది నా బాలిశ భావమని భావించు.

రాజా, నీవాడినమాటల్లో అసత్యమేదీ లేదు. నీవు సన్మతుల చేత కీర్తనీయుడవు. మోక్షం నీ అరచేతిలోనిది. నిన్ను పరిహసింప జేయాలని, నీ గౌరవం తెలిసీ మాటలాడినాను. నేను పల్కినవన్నీ అసత్యాలు. నేను వచ్చినది మాత్రం వాస్తవం. నీ సౌజన్యంతో నా అపరాధాన్ని మన్నించు. ఈ జన్మలో నాకు సులభ అని పేరు. భూలోకమంతా తిరుగుతూ ఉంటాను. నీవు మునిజన సేవనీయుడ వగుట చేత నేనిక్కడ నిలిచి పోతాను".

ఆమె మాటలకు జనకుడు, మంత్రులు ఆమెను కొనియాడతారు. గోష్ఠిలో సులభా జనకులిర్వురూ ఏకాభిప్రాయులవుతారు. మరునాడు జనకుని అనుమతితో ఆమె తన యిష్టం వచ్చిన చోటికి వెళ్లిపోతుంది.

## 264 ఘృతాచి

వేదవ్యాసుడు తన తపోనిష్ఠతో సంతుష్టుడైన ఈశ్వరునితో తనకు పంచభూతాల వలె వీర్యవంతుడైన కుమారుడు కావాలని కోరుతాడు. ఇచ్చితిని పొమ్మంటాడు ఈశ్వరుడు. అగ్ని కార్యం కోసం అరణిని మథిస్తూండగా ఆ అరణిలో ఘృతాచి అనే అప్సరస కన్పిస్తుంది. ఆయనకు కామవికారం కల్గుతుంది. ఆమె అతని మనస్సు తెలుసుకొని , మాయతో చిలకలాగా సమీపంలోనే ఉంటుంది. అప్సరస రూపం వల్ల మనస్సు చలించిన ముని వీర్యం అరణిలో పడుతుంది.

ఎటువంటి మనోవైకల్యం లేకుండా అతడు అరణి మథిస్తాడు.

ఆ అరణిలో తండ్రి రూపంతో, గొప్ప తేజస్సుతో శుకుడు జన్మిస్తాడు.

## 265 భంగ్వాసని

భంగ్వాసనుడనే రాజు పుత్రుల కోసం ఇంద్రుని కప్రియమైన యజ్ఞాలు చేసి నూరుగురు కొడుకులను పొందుతాడు. ఒకరోజతడు వేటకు వెళ్లగా ఇంద్రుడతనికి దిగ్భ్రాంతి కలిగించి దారి తప్పించుతాడు. ఆ రాజు నడచి నడచి ఒక సరస్సును చూచి దప్పి వల్ల అందులో దిగి ఆ నీరు త్రాగగానే స్త్రీగా మారిపోతాడు.

ఆ వేషంతో మంత్రుల ముందుకు రావడానికి సిగ్గుపడినా వెళ్లి, తన విషయం వివరిస్తాడు. వారాశ్చర్యపోతారు. భంగ్వాసనుడు తన కుమారులకు రాజ్యమప్పగించి అడవులకు వెళ్లి, తపస్సు చేస్తుండగా మునులలో ఒకడు స్త్రీ రూపంలో ఉన్న భంగ్వాసనుని స్వీకరిస్తాడు. వాళ్లిదరూ కలిసి కాపురం చేస్తారు. వారికీ నూరుగురు కొడుకులు పుడతారు. వాళ్లను తీసుకొని తాను పురుషుడిగా నున్నపుడు కన్న పుత్రుల వద్దకు వెళ్లి, తాను స్త్రీగా కన్న కొడుకులని పరిచయం చేసి, అందరూ సఖ్యంగా ఉండండని భంగ్వాసని కోరుతుంది.

వారంతా అన్యోన్యంగా ఉండడం ఇంద్రుడు విని, తానతనికి కీడు చేయాలనుకొంటే మేలుగా పరిణమించినదేమని బ్రాహ్మణాకారంలో వచ్చి వాళ్లకు పరస్పర విరోధం కలిగేటట్లు "ఎక్కడి తండ్రి? ఎవరికి పుట్టిన కొడుకులు? తోబుట్టువు లెట్లా అవుతారు?" అని ఎన్నో విధాలుగా చెప్పి, వారికి విరోధం కల్గజేస్తాడు. వారందరూ పరస్పరం యుద్ధం చేసి, అందరూ మరణిస్తారు.

భంగ్వాసని పుత్రశోకంతో ముఖం, రొమ్ములు మోదుకుంటూ, కొడుకులను తలచుకొంటూ విలపించడం చూసి ఇంద్రుడక్కడికి బ్రాహ్మణ వేషంలో వస్తాడు. ఆమె ఏడుస్తూ తాను వేటకు వెళ్లి స్త్రీగా మారడం మొదలుకొని కొడుకులు యుద్ధం చేసి చనిపోవడం వరకు మొత్తం కథనంతా వివరిస్తుంది.

తానింద్రుడనని, తన కయిష్టమైన యాగం చేసి నందు వల్ల ఆ విధంగా చేసివానని ఇంద్రుడు చెప్పగా, సంభ్రమంగా కొడుకుల కోసం తానా విధంగా చేశానని, తనను దయజూడమని సాష్టాంగ పడి వేడుకోగా ఇంద్రుడు కరుణించి కొందరు కొడుకులను బ్రతికిస్తాను, కోరుకోమంటాడు. తానుస్త్రీగా కన్నబిడ్డలను బ్రతికించమంటే ఇంద్రుడు కారణమడుగుతాడు. సిగ్గుపడుతూ స్త్రీలకు సంతానం

పై ప్రేమ ఎక్కువ అంటుంది. ఇంద్రుడు "నీవు నిజం చెప్పినావు. నీకు పురుషత్వం కూడ ఇస్తాను. అందరు పుత్త్రులను బ్రతికిస్తాను" అంటాడు.

"కొడుకులందరినీ బ్రతికించు. కాని నాకీ స్త్రీత్వమే ఉండనీయ"మని భంగ్వాసని వేడగా ఇంద్రుడాశ్చర్యపడి, దానికి కారణమేమని అడుగుతాడు". రతిలో పురుషుని కంటె స్త్రీలకే సౌఖ్యం ఎక్కువ. కనుక ఈ రూపంలో సురత సౌఖ్యాన్ని అనుభవించాలనే ఆ కోరిక కోరాను" అంటుంది. ఇంద్రుడు ఆ విధంగానే వరమిచ్చి అంతర్ధాన మవుతాడు.

## 266 గౌతమి

గౌతమి అనే ఒక బ్రాహ్మణి కుమారుడు పాము కరచి చనిపోగా విలపిస్తూ ఉంటుంది. ఒక కిరాతుడది చూచి ఆ పామును పట్టి తాడుతో కట్టి తెచ్చి "తలను కొట్టి చంపమంటావా, కత్తితో రెండుగా నరకమంటావా?" అని ఆమె నడుగుతాడు. "ఈ పాము నీ కొడుకు ప్రాణాలు తీసింది. కాబట్టి దీని ప్రాణాలు తీస్తాను' అంటాడు.

"విధివశాత్తు వచ్చిపడిన ఆపదకు బుద్ధిహీనులు మహాసంసార సాగరంలో మునిగి పోతారు. ఉత్తములు, ధర్మాత్ములు ప్రశాంతంగా ఉంటారే గాని, ఆవిధంగా మునగరు. ఈ పామును చంపితే నా కుమా రుడు బ్రతుకుతాడా, విడువు" మంటుంది గౌతమి."ఈ మాటలన్నీ కోపంతోఉన్న నాకు రుచించవు. చంపి తీరుతాను. పామును చంపి మనుష్యులను రక్షించడం తప్పా? వృత్రాసురుని దేవేంద్రుడు చంపలేదా? ఈశ్వరుడు దక్ష యజ్ఞం ధ్వంసం చేయలేదా ? కాబట్టి హింస కూడ ధర్మమే. నీవీ పామును చంపడానికి ఒప్పుకో"మంటూ వాడు ఒత్తిడి చేస్తాడు.

అప్పుడు పాము "నేనేమి తప్పు చేశానని నన్ను చంపజూస్తున్నావు? ఈ బాలుని పట్ల నాకు రోషం గాని, కామం గాని లేవు. మృత్యుపరాధీననై కరచినాను.' అంటుంది. "నీవు మృత్యుసాధనం కాబట్టే చంపుతా"నంటాడు కిరాతుడు.

కిరాతునికీ పాముకూ ధర్మసంబంధమైన సుదీర్ఘ చర్చ జరుగుతుంది. వారి ధర్మ సంశయం తీర్చడానికి స్వయంగా యముడే అక్కడికి వస్తాడు. కర్మానుసారం చేత ప్రాణులకు శోకం, సౌఖ్యం మొదలైనవి కల్గుతూ ఉంటాయని వివాదాన్ని మానమని చెప్పి, గౌతమి మాటలు, దేవతల మాటలు ఒక్క తీరుగానే ఉన్నాయని, స్త్రీలు పాపం చేస్తేనే పుత్ర శోకాన్ని అనుభవిస్తారంటాడు.

## 267 నర్మద

దుర్యోధనుడనే రాజు సౌందర్యం నర్మదానదికి కామావేశం కల్గించగా స్త్రీ రూపం ధరించి అతని సాంగత్యం పొందుతుంది. వారిద్దరికీ సుదర్శన అనే అతి లోక సౌందర్యం కల్గిన కన్య జన్మిస్తుంది.

## 268 సుదర్శన

తన కుమార్తె సుదర్శనను దుర్యోధనుడు అగ్ని హోత్రంలో పరిచర్యలకు నియమిస్తాడు. ఆమె అగ్ని సంబంధమైన ఆయా పనులు చేస్తూంటే అగ్ని దేవుడు ఆమె సౌందర్యానికి ధైర్యం కోల్పోయి కామాతురుడవుతాడు.

"అర్చించి నప్పుడయ్యంగన కెంగేలి;
జిగి సొంపు చిత్తంబు దిగిచి కొనగ
నరసి కన్గొనునపుడయ్యింతి కనువగ;
పొలపము రాగంబు పొదల జేయ
నన్యుల బనిబంచు నప్పుడమ్ముద్దియ;
పలుకుల తీపు కోర్కులగెలర్చ
నల్లన యాడెడు నప్పుడక్కొమ్మ;
వాతెఱ తావి ధైర్యంబు త్రిప్పి కొలుప
మరుడు తోడ్తోడ దేకువ మాలి కదిసి ;
తూపు గముల క్రొవ్వాడిమి చూపునంత
కంత కగ్గలమగు వలవంత దూలి ;
పోయె బావకుడేమి చెప్పదు నరేంద్ర"[1]

పూజించేటప్పుడామె చేయి సొగసు, చూచుటప్పుడామె కన్నుల సౌందర్యం, ఇతరులకు పనులు చెప్పేటప్పుడామె పెదవుల తావి, అగ్ని ధైర్యాన్ని కోల్పోయేటట్లు చేయగా మన్మధుడు తన పదును బాణాలతో వేసి తూలిపోయేటట్లు చేసినాడట.

ఈ విధంగా మదనాగ్నితప్తుడై అగ్ని సుదర్శనతో తనకు భార్య కమ్మంటాడు. ఆమె సిగ్గుతో ముఖం వంచుకొని "కుల కన్యలు పరులతో ఇట్టి మాటలు మాటలాడకూడదు. పెద్దవారు తప్పు"అంటుంది. సరేనంటాడగ్ని.

దుర్యోధనుడొక మహాయజ్ఞం చేయబూని, బ్రాహ్మణులకు పూజలు చేస్తూ ఉండగా అగ్ని బ్రాహ్మణ వేషంలో వచ్చి, "రాజా, నీ కుమార్తెను నాకీయ"మంటాడు.

---

1.భార.అనుశాసనిక.ఆ1.ప.48

అన్యవర్ణుడైన అతనికి తన కుమార్తె నెట్లా యివ్వడమని రాజు బాధపడుతుండగా అగ్ని తనమూర్తిని ఉపసంహరిస్తాడు. అగ్నిఉపసంహారం తమవల్ల కల్గిన లోపమేమోనని రాజు, ఋత్విక్కులు భావించి మంత్రాలతో అగ్నిని స్తుతిస్తారు. అప్పుడగ్ని తన విషయం వివరిస్తాడు. మహాసంతోషంతో అగ్నికి రాజు తన కుమార్తెనిచ్చి వివాహం చేస్తాడు.

ప్రజలందరాశ్చర్య పోయేటట్లు అగ్ని బ్రాహ్మణ కుమారుడై సుదర్శనను స్వీకరిస్తాడు.

## 269 ఓఘవతి

సుదర్శనుని కుమారుడు ఓఘవంతుని కుమార్తె ఓఘవతి. ఆమెను అన్యులకీయడాని కిష్టపడక తన తండ్రి సుదర్శనునికే యిచ్చి పెండ్లి చేస్తాడు ఓఘవంతుడు.

గృహస్థాశ్రమ ధర్మంతో మృత్యువును జయిస్తానని ప్రతిజ్ఞ చేసి సుదర్శనుడు ఓఘవతితో కలిసి కురుక్షేత్రానికి వెళ్లి, అందమైన ప్రదేశంలో పర్ణశాల వేసుకొని ఉంటాడు. ఒకనాడు భార్యతో "నా కతిథి పూజ చేసే కోరిక తీవ్రం. నీవు నాకనుకూల వతివై అలుపు లేక అతిథి పూజలు చేయాలి. నేనెక్కడున్నా, ఇక్కడ లేకున్నా, అతిథులు తమ కోర్కెలు తీరి సంతృప్తులయితేనే గృహస్థుకు, గృహిణికి కృతకృత్యత లభిస్తుంది. ఒకవేళ అతిథి నిన్ను కోరితే మనస్సులో సంకోచించకుండా అతని కోర్కె తీర్చు. భర్త చెప్పినట్లు చేయడమే భార్య ధర్మం" అంటాడు.

ఒకనాడు సుదర్శనుడు దర్భలకై అడవికి వెళ్లిన సమయంలో ఒక అతిథి రాగా ఓఘవతి ఉచిత సత్కారాలు చేస్తుంది. అవన్ని స్వీకరించి అతడు కామాతురుడై "నీ పట్ల నాకు కోర్కె కలిగింది. నా కోర్కె తీర్చ" మంటాడు. ఆమె వేరువేరు కోరదగిన వస్తువుల నన్నిటినీ ఏకరువు పెడుతుంది. అతడు తన కవేవీ వద్దంటాడు.

భర్త మాటలు గుర్తుకు వచ్చి ఓఘవతి అతని కోరిక తీర్చాలనుకుంటుంది. కాని ఆమె మనస్సంగీకరించదు. ఏం చేయాలో తోచక చాలా సేపు సంకోచించి, చివరకు సంకోచం వదిలించుకొని ఏకాంత ప్రదేశానికి వెళ్లుతుంది.

ఆ సమయంలో సుదర్శనుడు వచ్చి భార్యను పిలుస్తాడు. అతిథి ఆమెను సమాధాన మీయవద్దంటాడు. ఆమె బ్రాహ్మణ శాపభీతితో ఊరుకుంటుంది. ఎన్నోసార్లు భార్యను ఎలుగెత్తి పిలిచి, ఆమె నుండి బదులు రాకపోయేసరికి సుదర్శనుడు ఆమె నుద్దేశించి స్నేహవాక్యాలు పలుకుతాడు. అప్పుడతిథి ఆమె

తనకాతిథ్యం యిస్తున్నదని, తన సేవలో ఉన్న ఆమె పై కోపించవద్దని "నీవు గృహస్థ ధర్మవిదుడవు. నీకు తెలియనిదేమున్నది?" అంటాడు.

సుదర్శనుడు ఓఘవతితో "నీ వల్ల నేను అమితంగా సంతోషిస్తున్నాను. అతిథులకు పూజలు జరిగే గృహాలే పవిత్రమైనవని అంటారు పెద్దలు. నా మాటలు, మనస్సు ఒక్కటే. దీనికి సూర్యచంద్రులు, పంచభూతాలు సాక్షులు"అంటాడు. "ఇతడు పూజనీయుడు, ఇతని మాట సత్యం" అని ఆకాశవాణి పల్కుతుంది.

అప్పుడతిథి ధర్మదేవత రూపంలో ప్రత్యక్షమై "నీ మనస్సును పరీక్షిద్దామని వచ్చాను. నీవు నిశ్చలవ్రతుడవు. నీ ప్రతిజ్ఞకు హాని కల్గితే నిన్నంతం చేయాలనే వచ్చాను. కాని నీవు కామరోషాది వికారాలను జయించినావు. నీ భార్య పవిత్రురాలు. నీవు బొందితో స్వర్గానికి వచ్చే వరమిస్తున్నాను. నీవెప్పుడు రావాలనుకుంటే భార్యతో కూడ అప్పుడు రావచ్చును" అని వరమిచ్చి "ఈ పతివ్రత నీ తపస్సులోని సగం ఫలితం వల్ల ఓఘవతి అన్న పేరుతో నదియై ప్రవహిస్తుంది. మిగతా సగం వల్ల తన ఎప్పటి రూపంతో నీకు పరిచర్యలు చేస్తుంది. మీరు నిర్మల కీర్తిని పొందడానికే నేనీ విధంగా వరమిస్తున్నా"నని చెప్పి వెయ్యి శ్వేతాశ్వాలు పూన్చిన రథంపై తిరోహితుడవుతాడు.

## 270 ఉత్తర దిశ

వదాన్యుడనే మునికుమార్తె సుప్రభ అనే కన్యను అష్టావక్రుడనే బ్రహ్మచారి, తాపసోత్తముడు వివాహం చేసుకోవాలని కన్యనిమ్మని వదాన్యుడిని అడుగుతాడు. "నీవు యోగ్యునివి. నీకు నా కుమార్తె నిస్తాను. కాని నీవు ఉత్త[illegible] దిశగా వెళ్ళి, కుబేరుని పట్టణం దాటి పార్వతి పరమేశ్వరునికై తపస్సు చేసిన స్థలాన్ని చూసిరా. అక్కడ పరమేశ్వరుడు పార్వతికి ప్రియంగా ప్రమథ గణాలతో కూ[illegible] ఆడుతూ పాడుతూ, మునులు కీర్తింపగా విహరిస్తూ ఉంటాడు. అది పరమ పవి[illegible] ప్రదేశం. దానిని దాటితే కడిమి చెట్ల అడవి కన్పిస్తుంది. అందులో ప్రాయం[illegible] ఉన్నది, పుణ్యమూర్తి,పవిత్రమైన హృదయం గల ఒక స్త్రీ మూర్తి నివసిస్[illegible] ఉంటుంది. ఆమెను చూచి నీవు తిరిగి వచ్చిన తర్వాతనే నా కు[illegible]ర్తెతో [illegible] పరిణయం" అంటాడు.

అష్టావక్రుడంగీకరించి, బయలుదేరి కుబేరుని పట్టణానికి వెళ్ళగా అత[illegible] ఎదురు వెళ్ళి, తీసుకొని వచ్చి, సత్కరించి రంభాది అప్సరసల ఆటపాటల[illegible] అనుదినం వినోద కార్యక్రమం [illegible] చేస్తాడు. ఒక సంవత్సరం అక్క[illegible]

ఉంటాడు. కుబేరుడు "నీ కోరికేదో చెప్పు,తీరుస్తా"నంటాడు. తనకే కోరిక లేదని ఒక మునీశ్వరుని పనికై వచ్చానని చెప్పి, వీడ్కోలు తీసుకొని హిమాలయానికి వెళ్లి ఈశ్వరుడు తపస్సు గావించిన చోటికి ప్రదక్షిణం చేసి, మ్రొక్కి వెళ్తాడు. కడిమి చెట్ల అరణ్యం కన్పిస్తుంది. అందులో ప్రవేశించగా మణిమయ సౌధాలెన్నో కాన వస్తాయి. అన్నింటిలో మహావైభవంగా ఒప్పుతూన్న ఒక భవన ప్రాంగణం లోనికి వెళ్లి తన పేరు చెప్పి పంపగా రూప సంపదతోశోభించే కొందరు కన్యలు వచ్చి. వినయంగా, ఆనందంతో అతనిని లోనికి తీసుకొని వెళతారు.

ఆ విధంగా తీసికొని వెళ్తున్నప్పుడు ఆ స్త్రీలసౌందర్యం తన కంటికీ. మనస్సుకు, ఆనదం కల్గించినా చలించని హృదయంతో అష్టావక్రుడుఅభ్యంతర మందిరానికి వెళతాడు. అక్కడ వివిధ రత్నాలతో శోభిల్లే పర్యంకంపై ఒక మహనీయురాలు, తెల్లని వస్త్రాలు ధరించినదీ. ప్రౌఢ వయస్సులో ఉన్నది. అందమైన ఆభరణాలు ధరించినదీ అయిన ఒక స్త్రీమూర్తిని చూచి "నీకు మేలగుగాక!" అని ఆశీర్వదిస్తాడు. ఆమె ఎదురువచ్చి 'ఇటురండు' అని అతనిని ప్రేమతో కూర్చుండబెట్టి అర్ఘ్యపాద్యాదులతో శాస్త్రోక్తంగా అర్చించి. వేరొక శయ్యపై కూర్చుంటుంది. ఆ కన్యల 'విభ్రమవికారంబులు' తాను చూడడం ఇష్టంలేక వారిని పంపించివేయ మంటాడు. వారినందరినీ పంపించివేసి ఆమె తగిన మాటలు మాట్లాడుతూ ప్రొద్దుపుచ్చుతుంది.

రాత్రి కాగానే చలిగా ఉందంటూ అతని శయ్యమీదకి వెళ్ళి. అతడు ప్రక్కకు జరుగగా ఒక ప్రక్కన పడుకొంటుంది. మనస్సులో సంతోషిస్తుంది. తర్వాత తానే పూనుకొని తన శరీరంతో అతని శరీరాన్ని పెనవేసి చిక్కనికౌగిలితో బిగిస్తుంది.

అష్టావక్రుడు ఎటువంటి చలనం గాని, వికారంగాని లేక మానులాగ ఉంటాడు. ఆమె "మగవాళ్ళు భోగపరులు. స్త్రీలలో ఇంద్రియ నిగ్రహం ఉంటుంది. అట్లాకాక నేను కోరినా నీవు అనుభవింపకుండా ఉండవచ్చునా, నా సంపద. దివ్యభోగాలు అన్నీ నీవే. నేనే నీ ధనాన్ని, నీయాజ్ఞలు శిరసావహిస్తాను నన్ను బాధపెట్టక స్వీకరించి సుఖించు" అంటుంది.

అష్టావక్రుడు "పరస్త్రీ సంగమం అతి నిందనీయం. తగనిది. శూద్రస్త్రీ అయితేమహాదోషం . బ్రాహ్మణుని భార్య అయితే పాపానికి అంతులేదు. అంతేగాక నేనస్ఖలిత బ్రహ్మచారిని భార్యకోసం ప్రయత్నిస్తున్నాను"అంటాడు. "నేను నీ సౌందర్యానికి నిన్ను మోహించాను. స్త్రీలు కామవశులై వంశహానిని గాని, భర్తను గూర్చిగాని ఆలోచింపరు. భర్తకు భయపడరు. కొడుకుల గూర్చి ఆలోచించరు.

అన్నదమ్ముల గూర్చి విచారింపరు. వందమంది పురుషుల సాంగత్యంలోనైనా తృప్తిపొందరు. ఈ విషయం ఆలోచించు" అంటుందామె.

అతడు "ఇవి ఏమి మాటలు? ఎందుకట్లా నామనసు మార్చాలని ఇట్లా చెబుతున్నావు? నీ 'మదవృత్తి 'మానుకో .నేను వెళతానంటాడు. అప్పుడామె నవ్వుతూ "నీ పని అయిన తరువాత వెళ్లుదువుగాని అంతవరకు నిలువ"మంటుంది. "నీవు నన్ను తాకకపోతే నిలుస్తాను. ధర్మబద్ధంగా ప్రవర్తించు" అని ఆమెను శాసిస్తాడు. ఆ విధంగా ఆమెను వారించి "ఈమె శాపవశాత్తు వయస్సు పైబడిన దేవకన్య కాబోలు, లేకుంటే ఈమె తీరు తెలిసీ, నా హృదయంలో ఎందుకు జాలి కల్గుతున్నది? అని వితర్కించుకొంటాడు.

రాత్రి గడచి ప్రభాత సమయమవుతుంది. ఆమె కార్యక్రమాలు నిర్వర్తించుకొమ్మని ఉత్తమ స్నాన ద్రవ్యాలు తీసికొని వచ్చి , అతని అనుజ్ఞతో తన మృదువైన చేతులతో  ఒళ్ళుతోమి, స్నానం చేయిస్తుంది. అతడు సంధ్యా వందనాదులు ముగించగా అమృత తుల్యమైన అన్నపానాలతో అతన్ని తృప్తిపరుస్తుంది.

తిరిగి రాత్రి కాగానే పడుకోవడానికి పిలువగా అష్టావక్రుడు రాడు. "నేను కన్యను.నేను కూడఅస్ఖలిత బ్రహ్మచర్యంతోనే ప్రౌఢవయస్కురాలినైనాను .నేను స్వతంత్రురాలిని. నన్ను వివాహం చేసుకో" అంటుంది.
అందుకు ఆముని

" బాల్యమున దండ్రి యౌవనప్రాప్తి మగడు;
వార్ధకంబున దనయుడు వామనయన
నరసి నడపన కాదెందు నంగనలకు;
వలసినట్లులు చేయగా వచ్చునెట్లు" 1

కాబట్టి నీవు నిన్నిచ్చినా నేను స్వీకరించను అది న్యాయం కాదు" అంటాడు. చూస్తూ ఉండగానే ఆమె ఇనుమడించిన సౌందర్యంతో శోభిస్తుంది. అయినా అతడామె పట్ల ఎటువంటి వ్యామోహం లేని హృదయంతో " ఈ కపట వర్తన మెందుకు?నిజమెమిటో, నీ ఆలోచనలేమిటో చెప్పు. నేను వెళ్ళాలి. నాకు పనులున్నాయి. " అంటాడు.

అప్పుడామె సంతుష్టురాలై "నిన్ను పరిక్షించే నిమిత్తమై వదాన్యుడు నన్నిక్కడికి పంపినాడు. నేను ఉత్తరదిశను. నీనిష్ఠను పరిక్షించాను ఆ వదాన్యుడు

1.భార.అనుశా.ఆ2.ప.22

నిన్ను మెచ్చుతాడు. నాపట్ల మనస్సులో ప్రియభావంతో ఉండు. వెళ్ళి సుప్రభను వివాహం చేసుకో" అంటుంది.

అష్టావక్రుడు వినమ్రంగా ఆమె వద్ద సెలవు పుచ్చుకొనివచ్చి, వదాన్యునికి విషయమంతా వివరిస్తాడు. వదాన్యుడు సంతోషంగా తన కుమార్తెనతనికిచ్చి వివాహం చేస్తాడు.

## 271 పంచచూడ

ఒకప్పుడు ధర్మరాజు నారదునితో " పాపాకెల్లమూలం స్త్రీలే . కాబట్టి వారి విషయం నాకు తెలియజేయి" అనగా నారదుడతనికి " పంచచూడ' అనే అప్సరసతో స్త్రీ స్వభావం గురించి తాను చేసిన సంభాషణ వివరిస్తాడు.

ఒక చోట తానామెను చూసి తాను అడగబోయే విషయానికి సమాధానం చెప్పమంటాడు.ఆమె "నాబోటి వారికి తెలిసిన విషయాలైతే సమాధాన మీయగలను"అంటుంది."స్త్రీల స్వభావమెటువంటిదో వివరించమని నారదుడు అడుగుతాడు. ఆమె నవ్వుతూ "నేను స్త్రీనై ఉండీస్త్రీల దుష్ట చేష్టలిలాంటివని ఎట్లా చెప్పగలను?" అంటుంది. "నిజం చెబితే తప్పేమీలేదు. కనుక నిజం వివరించు" అంటాడు నారదుడు.

అందుకామె నీవెరుగని స్త్రీ స్వభావాలు లేవు. అయినా చెబుతాను విను. మంచికులం, గౌరవంతో మెలగుతూ ఉండి కూడ స్త్రీ తన ఇష్టం వచ్చినట్లు వ్యభిచరిస్తుంది ఒక రహస్యమేమిటంటే పరపురుషుని చూచినా స్త్రీలకు యోని ద్రవిస్తుంది.తినడం, త్రాగడం, మంచిదుస్తులు ధరించడం, ఆభరణాలు ధరించడం ఇవేవీ స్త్రీలకు పరపురుషుని పొందుకోసం పరుగెత్తిన ఆనందాన్ని ఇవ్వజాలవు. అగ్ని కాష్టంతో, మహాసముద్రాలు నదులతో , యముడు భూతకోటితో, స్త్రీలు పురుషులతో తృప్తి పొందడమనేది. అసంభవమని పండితులంటారు.

" కులమును సమ్మాన్యతయును;
గలిగియొకని భార్యయైన గౌరవలీలం
మెలగుచు వెల జరియించు;
నలన వలసినట్ల యేమనంగలదనఘా"

"అగ్నికాష్ఠముల మహాంబుధి. యేరుల ;
నంతకుండు భూతసంతతులను
వనజముఖులు పురుషులను దృప్తిపొందుట;

కలుగదండ్రు కోవిదులు మునీంద్ర "
"కుడుచుట కట్టుట పూయుటతొడుగుట ;
యును వివిధ ధనతతులు గూడుటయె
క్కుడు వేడ్క సేయజాలవు ;
పడతికి బరపురుషుడు గవయబారుటవోలెన్"

"దోషాలకంతటికీ మూలం స్త్రీలే. వాళ్ళను గురించి ఏంచెప్పమంటావు? అడిగావు కాబట్టి, నేను చూచినదంతా చెబుతాను. విను. పురుషుని శ్రేష్ఠత్వం స్త్రీలెరుగరు. సిగ్గూలజ్జా లేకుండా, నీచులతో సాంగత్యం చేస్తారు. వాళ్ళకు వర్జింపదగ్గ పురుషులంటూ ఎవ్వరూ లేరు. ఒక్క దండభీతితో మాత్రమే న్యాయమార్గంలో ఉన్నారు." అని చెబుతుంది. "నిజం చెప్పావంటాడు నారదుడు.

ఇది పంచచూడా సంవాదమనే ఇతిహాసంగా పేర్కొనబడిందని నారదుడు చెప్పగా "స్త్రీలను తెలుసుకొనే మార్గం చెప్ప" మంటాడు ధర్మరాజు.

అప్పుడు భీష్ముడు "వాళ్ళు మాయా శంబరాది రాక్షసులను మించిన వ రాయలు కలిగి తెలుసుకోవడానికి సాధ్యం కాకుండా ఉంటారు. ఇంకొక విశేషం విను.పూర్వం ప్రజలందరూ పాపం లేని మనసుతో ఉండడం చేత వాళ్లకు బ్రహ్మకోరినపుడు దైవత్వాన్ని అనుగ్రహించినాడు. ఆ నాడు మాయలను ఉపయోగించడం లేక స్త్రీలు సాధ్వులై ఉండేవారు. అందుకు దేవతలు అసూయా, పరులై బ్రహ్మతో తమ మనసు తెలపగా అతడు స్త్రీలను మాయావతులుగా అంతులేని కామం కలవారిగా చేసినాడు. పురుషులు, ఋషులు వారివలన చిక్కులలోబడి దుర్గుణాలకు లోనై దైవత్వం కోల్పోయారు. దేవతలు సంతోషించారు" అని చెబుతాడు.

## 272 రుచి

దేవవర్మ అనే ముని భార్యరుచి. సర్వాంగసుందరి. ఆమె సౌందర్యం దేవ గంధర్వులకు సైతం దర్శనీయంగా ఉండేది. ఒకనాడు దేవవర్మతన క్రతువుకు ఉపదర్శనం చేయడానికి వెళ్లాలనుకొని విపులుడనే తన శిష్యుని పిలిచి తన భార్య రుచి కోసం ఇంద్రుడు కాచుకొని ఉన్నాడని ఆమె రక్షణభారం అతడిదే నని చెప్పి వెళతాడు.

ఇంద్రుడు మాయలు చేస్తాడనీ,పశువక్ష్యాదుల రూపంలో కూడ రావచ్చునని అందుకని తన భార్య నతి జాగ్రత్తగా చూసుకోవాలని దేవవర్మ

హెచ్చరించి ఉంటాడు. విపులుడెంతో అప్రమత్తతతో అమెను కనిపెట్టుకొని ఉంటాడు.యోగవిద్యా నైపుణ్యంతో తానామె నావేశించితే ఇంద్రుని వల్ల ప్రమాదాన్ని నివారింప వచ్చునను కుంటాడు. తన గురువు ఈ విషయాన్ని గ్రహించ గల్గుతాడని, ఇందులో తప్పు లేదని అనుకొని ఒకనాడు ఆమె సమీపంలో కూర్చుని, గాలి ఆకాశంలో సంచరించే విధంగా తన ఆత్మనామె శరీరంలో ప్రవేశింప జేస్తాడు, ఆమె శరీరాన్ని జడీభూతంగా చేస్తాడు.

దేవేంద్రుడెంతో అందమైన వేషంలో అక్కడకి వచ్చి విపులుని చూసి నిద్రపోతున్నాడనుకుంటాడు. కామోన్మత్తుడు కాబట్టి వేరేది ఆలోచించ కుండా ముని పత్నిని సమీపించి " నీ వల్ల నాకు కల్గిన మన్మధభావాన్ని నీవు గ్రహించాలి." అంటాడు.ఆమె మూఢబుద్ధిగా మారినందున ఇంద్రునితో తగినట్లుగా మాటలాడలేక ఊరుకుంటుంది.

"ఏ నమరేంద్రుడ నాదగు
మానము గామశిఖ గ్రాగె మానిని తడయం
గానేల నన్ను దగన
న్మానింపుము నీకు సిగ్గు మాటింకేలా" [1]

అంటాడు. అప్పుడామె శరీరంలో ఉన్న విపులుడు యోగమాయ చేత ఆమెతో "నీ విక్కడికి రావలసినపనియేమున్నది?" అని పలికి మళ్లీ మూర్ఛితురాలిని చేస్తాడు. ఇంద్రుడు సిగ్గుతోను, భయంతోను చూస్తాడు. విపులుడామె శరీరం విడిచి, తన శరీరంలో ప్రవేశించి, ఇంద్రునితో "గౌతముని శాపంతో దేహమంతా భగాంకితమై ఎట్లో పోగొట్టుకొన్నావు.ఋషుల పట్ల సేవాభావంతో ఉండవలసిన నీకీ చేష్టలేమి?ఛీఛీ! నీచుడా, ఇంద్రియాలను అదుపులో పెట్టుకోకుండా ఏవిధంగా ఇంత పాపానికొడిగట్టి నావు ? నా గురువు కోపాగ్నికి నీదేవాధిపత్యం, మహత్వ యొుక్క గొప్పదనమంతా నశించి పోగలదు" అని తిడుతూ ఉంటే తన దివ్యజ్ఞానంతో విపులుని యోగబలం తీరుతెలుసుకొని ఇంద్రుడు కాలికి బుద్ధి చెబుతాడు విపులుడు "నేను తలచుకొంటే నిన్నిపుడే భస్మం చేయగలను కాని చేయదలచుకోలేదు", అంటున్నా వినకుండా అంతర్ధానమవుతాడు.

తర్వాత విపులుడు రుచికి మెలకువ తెప్పిస్తాడు. తర్వాత వచ్చిన దేవవర్మతో విపులుడు ఏకాంతంగా ఇంద్రుడు వచ్చి తనను చూసి సిగ్గుతో, భయంతో పారిపోయినాడని మాత్రమే చెబుతాడు. గురువు సంతోషించి శిష్యుడు

1.భార.అనుశా.ఆ2.ప.198

కోరిన వరమిస్తాడు.

ఒకనాడాశ్రమ సమీపంలో దేవతా స్త్రీ ఒకతె సంచరించుతూండగా ఒక అందమైన పుష్పం దివ్యపరిమళంతో వచ్చి భూమిపై బడుతుంది. రుచి కుతూహలంతో దానిని తీసుకొంటుంది. అంగ దేశపు రాజైన చిత్రరథుడు ఆ ఆశ్రమానికి వస్తాడు. అతని భార్య రుచికి తోబుట్టువు. తన ఇంట్లో జరిగే ఉత్సవానికి రుచిని ఆమె భర్తను చిత్రరథుడాహ్వానిస్తాడు. రుచి ఆ పుష్పాన్ని ధరించి వెళ్లగా ఆమె సోదరి ఆ పుష్ప పరిమళాన్ని మెచ్చుకొని ఆ పుష్పమెక్కడిదని తన అక్కనడుగుతుంది. తమ ఆశ్రమంలోనిదని చెప్పి రుచి దేవవర్మకు వద్దకు వచ్చి ఆ పువ్వుల కోసం తన చెల్లెలు వేడుకపడుతున్నదని చెబుతుంది. అతడు విపులుని పిలిచి అపువ్వులు తీసుకొని రమ్మంటాడు.

అతడా పువ్వులెక్కడ దొరికాయో తెలుసుకొని తన తపశ్శక్తితో గురు ప్రభావంతో ఆ పనికి వెళతాడు. దైవికంగా అక్కడ అపువ్వుల గుత్తి కన్పిస్తుంది. దానిని తీసుకొని వస్తూండగా ఒక చోట స్త్రీ పురుషులు చేతులు పట్టుకొని గుండ్రంగా తిరుగుతూ "నీవు సరిగా తిరగ లేదు. తప్పు చేశావు."అంటే బదులుగా ఒకడు "నేను తప్పు చేస్తే విపులునికి పట్టే గతే నాకూ పడుతుంది. "అంటాడు.

ఆ మాటలు విన్న విపులుడు తానేమి దోషం చేసినాడా అని ఆత్మపరిశీలన చేసుకుంటూ రుచి శరీరంలో తాను ప్రవేశించినట్లు గురువుకు చెప్పకపోవడమే ననుకొంటాడు. మరి కొంచెం ముందుకు నడువగా ఆరుగురు జూదమాడుతూ ఉంటారు. వారిలో ఒకడు పైవిధంగానే ఒట్టుపెట్టుకుంటాడు. అది విన్న విపులుడు తిరిగి వచ్చి ఆ పూల దండ గురువుమరదలికిచ్చి తర్వాత దారిలో జరిగిన విశేషం గురువుతో చెబుతాడు.

"నీవు రుచిని కాపాడినపుడు చేసిన పనిని నాకు తెలియజేయకపోవడం వారు అధర్మంగా భావించినారు. అది పాపం అని నేననుకొని ఉంటే నీకు శాపం ఇచ్చి ఉండేవాడను. పాపం కాదనే నీకు వరమిచ్చినాను" అన్న గురువు జ్ఞానానికి ?ష్యుడాశ్చర్యపోతాడు. ఆ స్త్రీ పురుషులు రాత్రింబవళ్లని, ఆ ఆరుగురు ఋతువులని మనుష్యులు చేసే పాపపుణ్యాలను అహర్నిశలు, ఋతువులు ఎప్పుడూ పరిశీలిస్తూ ఉంటాయని,వాటి కన్నుగప్పి మనుష్యుడు ఏ పనీ రహస్యంగా చేయజాలడని చెప్పి", స్త్రీ రక్ష చాల సూక్ష్మమైనది.నీవు మాకు వంశహీనత లేకుండా నాభార్యను కాపాడినావు. అది ఏరూపంలో చేసినా దోషం కాదు. ఆ విషయం నాకు తెలియజేయక పోతేనేమి?" అని ఊరడిస్తాడు. దేవవర్మ, అతని భార్యరుచి,

విపులుడు -ముగ్గురూపుణ్యలోకాలకు పోతారు.

## 273 కుశికమహారాజు పత్ని

కుశికమహారాజు వంశానికి చేటు చేయాలనుకొని చ్యవన మహర్షి ఆరాజు వద్దకు వెళ్ళి, తానొక వ్రతం నిమిత్తమై అతని వద్దకు వచ్చినానంటాడు. తన భార్య బంధువులు, ప్రజలు సంతోషించేటట్లు తన రాజ్యాన్ని స్వీకరించమంటాడు కుశికుడు. తనకు రాజ్యకాంక్షలేదని, రాజును,రాణిని తనకు పరిచర్యలు చేయమంటాడు. ఋషి. ఆ దంపతులు సంతోషంగా అతనికి సేవలు చేస్తూ ఉంటారు.

రాత్రికాగా చ్యవనుడు శయ్యచేరి రాజదంపతులను తన పాదాలొత్త మంటాడు. తాను మేల్కొనేదాకా నిద్రలేపవద్దంటాడు. వారు నిద్రాహారాలు వర్జించి అతనికి పాదసేవ చేస్తూ ఉంటారు. ఇరవై ఒక్కరోజులు నిద్రపోయి, ఇరవై రెండవ రోజు నిద్రలేచి ఏమీ మాట్లాడకుండా వెళ్ళిపోతాడు. వారు వెంబడించినా పలుకక పట్టణం వెలుపలికి వెళ్ళి,వారు చూస్తుండగా అదృశ్యుడవుతాడు. రాజురాణి మూర్ఛపోతారు.

కొంతసేపటికి మెలకువ వచ్చి విచారంతో రాజభవనానికి తిరిగి వచ్చి, అభ్యంతర మందిరంలోనికి వెళ్ళగా అక్కడ శయ్యపై ఇంతకుముందు పడుకున్న ప్రక్కన కాకుండా వేరొక ప్రక్కన నిద్రిస్తున్న ఋషి కన్పిస్తాడు. వారు సంతోషించి, అలసట లెక్కచేయక ఎప్పటిలాగా కాళ్లువత్తుతూ ఉంటారు మరొక ఇరవైఒక్క రోజులు గడుస్తాయి. మరునాడు తనకు తైలాభ్యంగన స్నానం చేయించమంటాడు. రాజు పరిమళభరితమైన నూనె తెప్పించి తలకు దేహానికి నూనె పూయగా, తిట్టి మాయమవుతాడు. మధ్యాహ్నానంతరం తిరిగి కన్పించి, ఎటువంటి వికారం లేకుండా ఉన్న రాజ దంపతులను చూచి సంతోషించి స్నానం చేస్తాడు. వాళ్ళు రకరకాల ఖాద్యపదార్థాలు, పానీయాలు సమకూర్చి భోజనానికి పిలువగా వచ్చి వాటన్నిటిని చూచి, ఎక్కడికో వెళ్ళిపోతాడు. వాళ్లు భయపడిపోతారు. ఆరాత్రి, పగలు గడిచిన తరువాత తెల్లవారుజామున కన్పించి"వెంటనే రథం తెప్పించు, నీవు నీ భార్య రథం లాగుతూండగా బంగారం,రత్నాలు, ఆవులు, గుఱ్ఱాలు, యాచకులకు దానం చేస్తూ నేను పోవాలి" అంటాడు.

ఆ విధంగానే రాజు రథం తెప్పించి చ్యవనుడు కోరినవన్నీ తెచ్చి ఇమ్మని మంత్రులకు ఆజ్ఞాపించి తాను తన భార్య రథం లాగడానికి సిద్ధమవుతారు.

చ్యవనుడు రథమెక్కి, వాడియైన కళ్ళితో వాళ్ల శరీరాలు నెత్తురొలికేటట్లుగా అదిలిస్తూ అక్కడక్కడా యాచకులకు దానాలు చేస్తూ, వెళ్తూ ఉంటాడు.

ఎన్నో రాత్రులు, పగళ్లు నిద్రాహారాలు లేని కారణంగా ఆకలిదప్పులతో అలసటతో తూలిపోతున్నా రాణిని ములుగోలతో పోట్లు పొడవగా ఆమె శరీరమంతా మోదుగుపూలు పూచినట్లు రక్తసిక్త మవుతుంది. ప్రజలాదృశ్యం చూసి “ ఇటువంటి తపోమహిమకూడా ఉంటుందా? ఇదేమి అన్యాయం? కోపించడానికి వీల్లేదు. న్యాయం మాటలాడ వీలులేదు. తేరిచూడడం సాధ్యంకావడంలేదు ఈ దంపతుల ధీరత్వం ఇంత గొప్పదా? మోయ సాధ్యంకాని భారాన్ని నిర్వికార చిత్తంతో మోస్తున్నారు” అని బాధపడుతూ వారిని చుట్టుముట్టి నడుస్తారు. చ్యవనుడు పట్టణం వెలుపలికి వచ్చి వాళ్లలో మనోవికారం పొడగానక ఆశ్చర్యంతోను మెచ్చుకోలుతోను రథం దిగి వాళ్ల తలలకు కట్టిన పగ్గాలు విప్పి దేహాలను తన చేతులతో స్పృశించి కుశికుని ముఖం చూసి “ చాలా అలసిపోయావు. వరమిస్తాను. దుఃఖించకుండా పట్టణానికి వెళ్లు. నేను గంగాతీరంలో యజ్ఞచర్యావశేషం నిర్వహిస్తాను. నీవు రేపు నీ భార్యా సమేతంగా నా వద్దకురా” అని చెప్పి వెళతాడు. రాజు, రాణి యౌవన శోభతో అలరారే తమ దేహాలను చూసి, శ్రమ, ములుగోల గాయాలు మాయమవడం చూసి సంతోషాశ్చర్యాలు పొందుతారు. సవినయంగా మునికి దండప్రణామాలు చేస్తారు.

మరునాడు ముని ఉంటున్న అరణ్యానికి వెళ్లగా అక్కడ వేద, సంగీత, సాహిత్యాభ్యాసాలతో అలరారే మంటపాలు, చిలుకలు, కోకిలలు, తుమ్మెదల నాదాలతో సొంపారే ఉద్యానవనాలు, హంసలు, చక్రవాకాలతో ఒప్పే సరస్సులు, క్రీడాపర్వతాలు, కళ్లకు చెవులకు ఇంపు గొలపగా, దేవతలు, గంధర్వులు, అప్సరసలు యథేచ్ఛగా విహరించడం చూస్తారు.

ఎదురుగా అతి సుందరమైన భవనం కన్పించగా ఇది కలా, నిజమా, బొందితో స్వర్గానికి వచ్చామా” అనుకుంటూ ఆ మేడలో ప్రవేశించి అందున్న మణిమయ తల్పంపై పవ్వళించి ఉన్న ఆ మహామునిని చూస్తారు. అంతలోనే అదంతా అదృశ్యమవుతుంది.వాళ్లు ఆ అడవిలో తిరుగుతూ ఒక చోట పద్మాసనస్థుడై జప నిమగ్నుడైన మునిని చూస్తారు.

కుశికుడు భార్యతో “మునుల యోగమహిమ ఇలాంటిది.రాజ్యం లభించవచ్చునేమోగాని బ్రాహ్మణత్వం, తనస్సు మానవులకు దుర్లభం. తపోబలం వల్లనే ముని ఇదంతా ఇష్టం వచ్చినట్లుగా చేయగల్గుతున్నాడు.” అంటూ ఉండగానే

వారిని తన వద్దకు రమ్మని ముని పిలుస్తాడు. తనకు సాష్టాంగ నమస్కారం చేసిన వారిని దీవించి, ప్రసన్నమైన చూపులతో" రాజా, నీ మనస్సు, ఇంద్రియాలు నీ కింత వశమైనాయి. నీవు కొంచమైనా బాధచెందలేదు.నీ నిష్ఠకు సంతోషించినాను. వరం కోరుకో." అంటాడు. మునులను సేవించ గల్గడం కంటే తనకు వేరొక వరం వద్దంటాడు కుశికుడు.ఋషి ప్రవర్తనకు కారణమేమని తెలుసుకోగోరతాడు. తాను వారిని శపించే ఉద్దేశ్యం తోనే ఆ విధంగా ప్రవర్తించినానని, భార్యాభర్తలలో ఏ ఒక్కరి సేవలో లోపం జరిగినా శపించాలనుకున్నానని, కాని వారి ప్రవర్తన వల్ల అది సాధ్యం కాలేదని చెప్పి, ఆశీర్వదించి వెళ్లిపోతాడు.

## 274 గో లక్ష్మి సంవాదం

ఒకప్పుడు లక్ష్మీదేవి గోవుల వద్దకు వెళ్లగా " నీ వెవ్వర"వని అడిగి ఆమె తాను శ్రీదేవినని,వారితో నివసించాలని వచ్చినానని చెప్పగా గోవులు " చంచలవైన నిన్ను మాలో ఉండటానికి అంగీకరించము." అంటాయి." నేను తొలగి పోతే సమస్త రాక్షస వంశం నశించింది.నా అనుగ్రహం కోసం సదా తపస్సు చేస్తారు.నేను వస్తేనే కదా,దేవతలకైనా ప్రభుత్వం ఉంటుంది. నన్నీ విధంగా అవమానించడం మీకు తగునా?" అంటుంది లక్ష్మి. " నీవు మాలో వద్దన్నాము.అది అవమానమా, నీ యిష్టం వచ్చిన చోటికి వెళ్లు." అంటాయి గోవులు.

"మీచే ఇట్లా పరాభవింపబడి వెళ్లితే నన్నెవ్వరూ స్వీకరించరు.నేను మిమ్ము శరణు వేడుతున్నా" నంటుంది లక్ష్మీదేవి."మీ సమీపంలో ఉండడమైనా నాకు మేలు. దానికైనా అనుమతించండి." అంటుంది.

గోవులామె పట్ల ఎంతో ఆదరంతో"మా మూత్ర పురీషాలుఎంతో పావనమైవని వేదాలెరుగును. ఈ మేలివస్తువులు నీ ప్రియదాయకంగా చేసుకో" మంటాయి."నా పుణ్యం వల్ల మీ అనుగ్రహం కల్గింది" అని లక్ష్మి గోవుల మూత్రపురీషాల్లో నివసిస్తుంది.

గోమాత సురభి ఒకప్పుడు తపస్సు చేయగా బ్రహ్మ అన్ని లోకాల కంటె గోలోకం ఉన్నతమైనదిగా వర మిచ్చినాడు.

## 275 సుశోభన

పరీక్షిత్తు ఒకనాడు వేటకు వెళ్లి అడవిలో ఒక అతిలోక సుందరిని చూచి మోహిస్తాడు.ఆమె కూడ అతని సౌందర్యాన్ని మెచ్చి సాభిప్రాయంగా చూస్తుంది." నీవెవ్వతెవు? ఏ కారణం చేత యీ అరణ్యంలో భయం లేకుండా ఒంటరిగా

సంచరిస్తున్నావు?" అని అడిగిన అతనితో ఆమె తన తండ్రి ఆజ్ఞ మేరకు తాను తగిన వరుని వెదకుతూ తిరుగుతున్నాని "నే నెవ్వరినని నీవనుకొంటున్నావు?" అని ఎదురు ప్రశ్న వేస్తుంది.

ఆమె ప్రగల్భాలకు మెచ్చి పరీక్షిత్తు తన కోరిక తెలియజేస్తాడు." నన్నేనాడూ జల విహారానికి బలవంతం చేయనట్లయితే నిన్ను వరిస్తా" నంటుందామె. అందుకతడు సమ్మతించి పట్టణానికి తీసుకొని వచ్చి ఆమెతో యిష్ట సుఖాలను అభవిస్తూ ఉంటాడు.

రమణీయ ఫల వృక్షాదులతో, కలువలు, పద్మాలతో కూడిన సరోవరాలతో కూడిన మనోహరమైన పట్టణోద్యానవనంలో ఆమెకు నివాసభవనం నిర్మించి ఇచ్చిన పరీక్షిత్తు ఒకనాడు ఆమెతో అందులో విహరిస్తూ ఉంటాడు.సరోవరం శోభకు ముగ్ధుడై, శరీరం స్వేదభూయిష్టమైనదని, ఆమెను ఒడ్డున ఉంచి తాను నీటిలో దిగి స్నానం చేసి" నీళ్లు పరిశుభ్రంగా ఉన్నాయి. చెమట పోయేటట్లుగా నీవూ స్నానం చేయరాదా? అంటాడు.ఆమె చిరునవ్వుతో ఆ మడుగులోనికి దిగి మాయమవుతుంది.

ఎంతసేపటికీ ఆమె బయటకి రాక పోయేసరికి రాజు సరస్సులోని నీళ్లన్నీ బయటకు తోడించుతాడు.అందులోని కప్పలను జూచి అవితన ప్రియురాలిని మింగేయన్న కోపంతో అనుచరులను ఎక్కడెక్కడి కప్పలను పట్టి చంపమని ఆజ్ఞాపిస్తాడు.మండూక రాజు అందుకు బాధపడి వృద్ధతాపసి వేషంలో రాజు వద్దకు వచ్చి "ఇట్లా కప్పలను వధించడం అధర్మం వాటిని రక్షించు" అంటాడు." అవి నా ప్రియురాలిని మింగినాయి. మాయజంతువులు, వాటిని చంపించి తీరుతా" నంటాడు రాజు. ఆయన మిక్కిలి దుఃఖాత్ముడై " రాజా,నేను ఆయువనే పేరుగల మండూక నాయకుణ్ణి. నీ ప్రియురాలు నా కూతురు సుశోభన.ఆమెవల్ల ఎందరో మోసపోయారు. నీ వెంతవాడివి?" అంటాడు.

అయితే ఆమెను నాకు తెచ్చియివ్వ" మంటాడు.పరీక్షిత్తు ఆ రాజు చిరునవ్వుతో తన తలంపు తోనే ఆమెను రప్పించి పరీక్షిత్తు కిచ్చి, కుమార్తెతో "నీవు చాలా దుష్టురాలివి. ప్రసిద్ధులైన రాజులను కష్టపెట్టినావు.కనుక నీకు పుట్టే పిల్లలు కపటవర్తను లవుతారు." అని కుమార్తెను శపించుతాడు.ఆమె వల్ల పరీక్షిత్తు శలుడు,దలుడు,వలుడు అనే ముగ్గురు కొడుకులను పొంది,పెద్దవానికి రాజ్యాభిషేకం చేసి వానప్రస్థాశ్రమానికి వెళ్లిపోతాడు.

## 276 మృత్యుదేవత

బ్రహ్మలోకాలు సృష్టిస్తూ పోగా ప్రాణికోటి పెరిగి పెరిగి, సమ్మర్దం ఎక్కువై ఊపిరాడనట్టు ఉక్కిరి బిక్కిరవుతాయి. బ్రహ్మచింతించి సంహార మార్గం ఆలోచిస్తాడు. ఆయన చిత్తం లోని కార్యదాహం వల్ల మహాదహను పుట్టి లోకాలన్నీ దహించుతాడు.శివుడు వచ్చి అతనిని శమింపజేసి,ఆ అగ్నిని ఉపశమింప జేస్తాడు. బ్రహ్మతన ఇంద్రియ రేణువు నుండి ఎఱ్ఱని కన్నులు, ఉజ్జ్వలమైన రూపంగల ఒక స్త్రీమూర్తి జన్మించి దక్షిణ దిశగా పోవడం చూసి ఆమెను పిలిచి, " ఓ మృత్యువా! నీవు ప్రజలందరినీ బలవంతులు, దుర్బలులన్న భేదం లేకుండా సంహరింపు" మని ఆజ్ఞాపిస్తాడు.

ఆమె కన్నీరు కారుస్తూ " నీకు పుట్టి, ఇంతటి క్రూరమైన పని చేయగలనా? ధర్మకార్యాలకై ఆజ్ఞాపించు" అంటుంది. బ్రహ్మ ఆమె కన్నీటి బిందువులు దోసిట పట్టి "నీ వందుకోసమే ఉద్భవించిన దానవు. నీవు ప్రజాసంహారం చేసి తీరవలసిందే" నంటాడు.

ఆమె గాలికి తూలిపోయే తీగలాగ కంపిస్తూ
"మనుజుల హరించి బాంధవ ;
జనమున శోకంబు చూడ జాలుదునె తపం
బునకేగెద సదయంబున ;
ననుజ్ఞ నేయంగ వలయునని ప్రణమిల్లెన్ " [1]

బ్రహ్మచిరునవ్వు నవ్వుతూ "అట్లా ఎందుకాలోచిస్తావు. జంతు సంహారం నీకవశ్య కర్తవ్యం. దానిని చేయకపోవడమే అధర్మం.అని నిర్బంధించుతాడు.ఆమె నిస్సహాయంగా మిన్నకుండి పోతుంది.తర్వాత ధేనుకాశ్రమానికి వెళ్లి అతి దీర్ఘకాలం ఘోరతపస్సు చేస్తుంది. కౌశికి, గంగ, నంద అనే నదులకు వెళ్లి వాయువే ఆధారంగా ఎన్నో దుష్కరమైన వ్రతాలు అనేక సంవత్సరాలు చేసి, హిమాలయ శిఖరాగ్రానికి వెళ్లి బ్రహ్మకు ప్రియమైన నిష్ఠతో సహనవతియై ఉండగా బ్రహ్మ ప్రత్యక్ష్యమై "తపస్సు వల్ల ప్రయోజనమేమీ లేదు తల్లీ మానుకో" అంటాడు."నిన్ను శరణు వేడుతున్నాను నన్ను దయతో రక్షించు" అని మృత్యుదేవత వేడుకుంటుంది.

"ప్రజలను సంహరించడమే నీకుపరమ కర్తవ్యం. నేను బొంకజాలను.
22 దీనిని నీవు అన్ని విధాలా నెరవేర్చాలి.ఇది నా ప్రార్థన. దీన్ని భగ్నం చేయడం

1.భార.శాంతి.ఆ5.ప.206

తగదు. ఇంకొక్క విషయం చెబుతాను విను.నీ అశ్రువులు నేను దోసిట పట్టుట ఎరుగుదువు కదా, అవి నానా వ్యాధుల రూపంలో మానవులను బాధిస్తాయి.కామ క్రోధాలు వాటికి తోడ్పడతాయి. వారు వాటితోనే అంతమవుతారు. నీవు నిమిత్తమాత్రురాలివే. నీకొక వరమిస్తాను.

"పురుషుడును నంగనయును నపుంసకుడు
నగుము పుత్రిక పురుషుని నంగన
నునపుంసకుని జంపువేళల బొందకుండు
పాపమును విదిధర్మమైపరుగు నీకు" 1

"పురుషుడివి,స్త్రీవి, నపుంసకుడివి నీవె.వారిని చంపేటప్పుడు నీకు పాపం అంటదు" అంటాడు. బ్రహ్మశాపభయానికి ఆమెమారు పల్కదు.

## 277. పద్మ్మడనే వాని భార్య భుజగాంగన

భృగుడనే బ్రాహ్మణుడు పుణ్యతీర్థాలు సేవిస్తూ గోమతీ తీరంలో సుప్రసిద్ధమైన మహాపద్మమనే సరస్సు ఒడ్డున నున్న నాగరాజు మందిరం చూసి, అందులో ప్రవేశిస్తాడు.ఆ నాగేంద్రుని పత్ని భక్తితో ఎదురు వచ్చి, వెంట తీసుకొని వెళ్లి అర్చించి " మీ రాకకు కారణమేమి?మీరేది ఆజ్ఞాపించినా నెరవేరుస్తాను. సెలవీయండి" అంటుంది. నీభర్తను చూడడానికే వచ్చినాను. ఎక్కడున్నాడు.? అతనిని పిలిపించు" అంటాడు భృగుడు.సూర్యరథ వాహనంగా తనకు నెలవారీ వంతు వచ్చినందున ఆయన వెళ్లినాడు.ఎనిమిది రోజులకు వస్తాడు.ఆయన జీవన విధానం అలాంటిది.మీ కోరిక ఏదో తెలియజేస్తే తీరుస్తా." నంటుందా ఇల్లాలు. " నీ భర్తను చూడటం తప్ప నాకింకే కోరికా లేదు" అని, "అతడు వచ్చేదాకా అరణ్యంలో ఉంటాను.వచ్చిన పిదపనాకు తెలియజేయి. అని చెప్పి గోమతీ తీరంలోని అరణ్యంలో తపస్సు చేస్తూంటాడు భృగుడు. నిరాహారుడై ఉంటాడు.

ఆ నాగరాజు భార్యతన బంధువులు, కుమారులతో అతని వద్దకు వస్తుంది. వారంతా "నీ వాహారం తీసుకోక ఆరుదినములైనది. మేము అతిథి పూజా పరులము. మాకు ధర్మ విరోధం కాకుండా మా ఆతిథ్యం స్వీకరించు. మా ప్రార్థన మన్నించి అన్నమో, ఫలమో, దుంపలో లేక మరేదైనా భక్షించి మమ్ము రక్షించు." అని ప్రార్థిస్తారు.

"ఇన్ని మాటలెందుకు? నేను భుజగరాజు రాకకై నిరీక్షిస్తున్నాను.ఆ పని

---
1.భార.శాంతి.ఆ5.ప.209

అయ్యేవరకు భోజనం చేయను, నీళ్లు త్రాగను.నాకు కొంచమైనా ఆకలి దప్పులు లేవు. ఏకాంతవాసం కోసం నేనీ అరణ్యానికి వచ్చాను.నన్నెందుకు బాధిస్తారు?మీకు ధర్మవిరోధం కాకుండా ఉండటానికే యీ వ్రతం పూనినాను. ఇంక రెండు రోజులుంటే వ్రతం సమాప్తం అవుతుంది.ఎనిమిదవ రోజు నాగరాజు వస్తాడు.నేను సంతోషంతో భోజనం చేస్తాను. నన్ను మన్నించండి." అని భృగుడు ప్రార్థించగా వారు అంగీకరిస్తారు.

ఎనిమిదవ రోజు నాగరాజు భార్య చక్కగా అలంకరించుకొని తన సౌందర్యానికి అలంకారం మెరుగులు పెట్టగా సంభ్రమంతో భర్తను ఎదుర్కొని స్వాగతం చెప్పి, ఆదరంగా లోనికి తీసుకుని వెళ్లి, అతని మనస్సు రంజిల్లేటట్లుగా అర్ఘ్యపాద్యాది సేవలు చేస్తుంది.అతడు సంతోషించి తన సమీపంలో కూర్చుని ఉన్న భార్యను "ప్రియా, క్షేమమేనా, దేవతాతిథి పూజలు ఎప్పటివలె సక్రమంగా నడచినాయా?నేను లేకపోయినా లోపమేమి లేదుకదా? ఏ పనియైనా విఫలమయిందా?" అని అడుగుతాడు.

"నీ శిక్షణ పెంపువల్ల నాకు తెలిసినంత వరకు లోపమేమి జరగలేదు. సమస్త దేవతాతిథి పూజలు సక్రమంగా నడిచినాయి. సజ్జన ప్రీతికరమైన కార్యాలు కూడ భేదమేమీ లేకుండా నిర్వహించినాను.గురుభక్తి శిష్యులకు, వేదపరత విప్రులకు,జనరక్ష భూపతులకు, న్యాయపూర్వకమైన సంపాదన వైశ్యులకు, త్రివర్ణాల వారిని ఆరాధించడం శూద్రులకు, యజమాని ఆజ్ఞ నిర్వహించడం. భటులకు సమస్త ఉపకార క్షమమై సారభూతమై అందరికీ ప్రియమైనది గృహస్థాశ్రమం. ఇంద్రియాలను అదుపులోనుంచి, కోరికలణచి వేసి ఉంచవలెనను బుద్ధియోగికి, పతివ్రతా ధర్మం భార్యకు వ్రతము. అందువలన ధర్మసూక్ష్మాలు తెలిసిన నీ మనస్సుకునొప్పికల్గేటట్లుగా నేనుప్రవర్తించగలనా? ఒక మనవి ఆలకించండి. పరమపావనుడైన ఒకబ్రాహ్మణ శ్రేష్ఠుడు మనయింటికి వచ్చి, నాచే అర్చించబడి, మీ దర్శనం కోసం వచ్చినానని చెప్పి, మీరు ఎనిమిది దినములకు వస్తారని చెప్పగా, అప్పడే వస్తానని చెప్పి అడవిలో జపంతోను, నిరాహార వ్రతంతోను కాలం గడుపుతున్నాడు. మీరక్కడకి వెళ్లి, అతన్ని సంభావించాలి" అని విన్నవిస్తుంది.

"నేను ఒంటరిగా ఎవరినో కలుసుకోవటానికి ఒక చోటకి వెళ్లాలా? దేవతలు, రాక్షసులు నన్నేం చేస్తారో ఆలోచించు" అంటాడు నాగరాజు. "నీ రాక కోసం ఆశతో ఎదురు చూస్తున్న ఆ విప్రుని కోరిక తీర్చక పోవడం ధర్మమా?

నీవంటి ఆచారవిదుడు బ్రాహ్మణుని ఆశను నెరవేర్చక పోవడంవల్ల కలిగిన పాపాగ్నిలో తన పురుషార్థాన్ని, సముచిత ప్రవర్తనను, దయను, ధర్మాన్ని, పాండిత్యాన్ని దహింప వచ్చునా?

"మౌనమున ధృడజ్ఞానము
దానంబున నభ్యుదయము ధర్మనిరతయా
శానిర్వహణంబున నర
కానీక నిణరణ సౌఖ్యమగు నంద్రుబుధుల్"

ఆశా విచ్ఛేదం వల్ల బ్రహ్మహత్యాదోషం కల్గుతుంది అందువలన బ్రాహ్మణుని ఆశతీర్చాలి. చాతకపక్షి వానకోసం ఎదురుచూసేటట్లు నీ రాకకోసం అడవిలో బ్రాహ్మణుడు ఎదురుచూస్తుంటాడు. ఓ ధర్మనిరూఢ హృదయా ! కోపం మాను" అని భర్తను ప్రబోధిస్తుంది .

ఆమె హితబోధవల్లనాగరాజు తేరుకొని "ఇతరులకోసం అరణ్యానికి పొమ్మనగానే కోపం వచ్చి తగనిమాటలు గర్వంతో ఆగ్రహించి పల్కినాను. అయినా నీవు సందేహించకుండా నా కర్తవ్యాన్ని ప్రబోధించి నాకు ధర్మాన్ని,పేర్మిని కలుగజేసినావు. కార్తవీర్యుడు రావణుడు, పరశురాముడు మొదలైనవారు క్రోధగుణం వల్లనే కదా నశించారు. కాబట్టి అలుకవిడవడం మేలు" అని భార్యతో సహ వెంటనే భృగుణ్ణి కలుసుకోవడం కోసం బయలుదేరాడు.

## 278 సరస్వతీ నది

ఒకప్పుడు సరస్వతీనది దూరంగా ప్రవహిస్తూ ఉండగా నైమిశారణ్యం లోని మునులు యజ్ఞం చేయబూనుకోగా ఆ నది వారిని సంభావించదలచి దారిమార్చుకొని అక్కడికి సమీపంలోనికి వస్తుంది. బలరాముడా విశేషం విని విస్మితుడై సప్తసారస్వత తీర్థానికి వెళ్లాడు. అక్కడ మంకణ మహాముని నివసించిన నైమిశారణ్యంలో మునులయాగంలో, గయుని క్రతువులో, ఉద్దాలకుని యాగంలో,వసిష్ఠుని సప్త తంతువులో, సురుని యాగంలో, మరొకసారి ఆ బ్రహ్మయుగంలో,హిమవంత పుష్కరాదులైన ఆయాప్రదేశాలలో సుప్రభ, కనకాక్షి,విశాల, సురతవ్య, మేఘమాల, సువేణి, విమలోదక అన్న పేర్లతో స్త్రీరూపం ధరించి వెళ్లిసకలదేవతా ముని బృందాలచే, యజమానులచే సంభావింపబడిందని, మంకణుని ఆశ్రమంలో సప్తాకారాలలో ప్రవహించుటచేత సప్తసారస్వతమని ప్రసిద్ధిపొందినదని జనమేజయుడికి చెప్పి వైశంపాయనుడు ఇంకా ఇలా

మంకణుని చరిత్ర వివరిస్తాడు.

ఒకనాడు మంకణ మహర్షి సరస్వతీనదిలో మునుగుతూ సమీపంలో ఒక స్త్రీ ఒంటిపై బట్టలు లేకుండా నదిలో స్నానం చేయడం చూస్తాడు. ఆయనకు రేతః పతనం అవుతుంది. దాన్ని కుండలో సురక్షితంగా దాచగా అది సప్త భేదాలొంది, ఏడుగురు పురుషులుగా జన్మిస్తారు. వానే మరుద్గణము.

విశ్వామిత్రుడొకప్పుడు వశిష్ఠునిపై తపోవిషయ మాత్సర్యంతో అతనిని చంపగోరి సరస్వతిని మదిలో తలచగా తక్షణం సౌమ్యవేషంలో ప్రత్యక్షమై పనియేమని అడుగుతుంది. వసిష్ఠుని తనవద్దకు తెమ్మని విశ్వామిత్రుడాజ్ఞాపిస్తాడు. వారిద్దరి తపోమహిమ తెలిసిన సరస్వతి వసిష్ఠునితో ఆ పని ఏమిటో చెబుతుంది. ఆయన నీవు నన్ను తీసికొని వెళ్లకపోతే అతడు నీకు శాపమిస్తాడు. కనుక కొంచెమైనా జంకులేకుండానన్ను తీసికొని వెళ్లు" అంటాడు. వసిష్ఠుడు తన తీరప్రాంతంలో ఉండగా సరస్వతీ నది ఒడ్డును తన ప్రవాహంతో కోసి అతనిని తీసికొని వెళుతుంది. వసిష్ఠుడు అంగీరస మంత్రాలతో ఆనదిని స్తుతిస్తాడు. విశ్వామిత్రుడు వసిష్ఠుని ఏ సాధనంతో చంపాలా అని ఆలోచిస్తుండగా సరస్వతి తన ప్రవాహంతో వసిష్ఠుని అక్కడినుండి తొలగిస్తుంది. ఆనది తనను వంచించిందని విశ్వామిత్రుడు రక్తపు టేరులై ప్రవహించమని ఆనదికి శాపమిస్తాడు.

".......... అగ్గాధి మానుండు వధియించుసాధనంబన్వేషించు నాలోన వంచించి యీ ప్రవాహం బవ్వసిష్ఠుం దొలగించిన గోపించి విశ్వామిత్రుండు శోణితవాహిని వగుమని శపించిన నొక్క సంవత్సరం బత్తటిని దైత్యసేవితయై యుండె" ఆ నది సంవత్సరం పాటు రాక్షసులచే సేవించబడుతూ ఉంటుంది. ఒకనాడు కొందరు మునులాతీర్థానికి వచ్చి ఆ దురవస్థను చూచి ఆ మహానదిని కారణమడిగి తెలిసికొని తమ యత్న బలంతోఆ దురవస్థ తొలగించి ప్రీతితో స్నానాలు చేస్తారు. అప్పుడు కొందరు బ్రహ్మరాక్షసులు ఆమునులకు ప్రణామం చేసి తాము చేసిన విప్రద్వేషం, గురుజనావమానం దుష్టాన్న భక్షణం మొదలైన పాతకాలు విడివిడిగా చెప్పుకొని తామక్కడ నివసిస్తున్నామని తమకు నిష్కృతి అనుగ్రహించాలని ప్రార్థిస్తారు.

మునులు ఆ పనికై సరస్వతిని ప్రార్థిస్తారు. ఆమహానది అరుణా నది వలన అది సాధ్యమవుతుందని తెలుసుకొన్నది కనుక రహస్యంగా అరుణా ప్రవాహాన్ని తన లోనికి తెచ్చి అందులో స్నానం చేయమని చెబుతుంది. ఆ బ్రహ్మరాక్షసులాప్రకారం చేసి అక్కడే తమ శరీరాలు విడిచి ధర్మపరుల గతికి

వెళ్లుతారు. ఇంద్రుడు అది తెలుసుకొని నముచిని తాను స్నేహం చేసి నమ్మించి చంపిన పాపం ఆ నదిలో మునిగి తొలగించుకొంటాడు.

## 279 సురభి

విశ్వకర్మ తపోనిరతుడై యజ్ఞార్థుల ,మోక్షార్థం అమృతమయమూర్తి, కామరూపీ అయిన 'సురభి' అనే కన్యను తన మనోవృత్తిచే సృష్టించి మహా తేజోమయుడైన ఒక పురుషుని కూడా సృష్టిస్తాడు. అపుడతి మనోహరాకారంలో ఉన్న ఆ స్త్రీని చూచి అతడు కామమోహితుడవుతాడు. ఆర్తినొందిన అతనికి లోకపావనుడైన బ్రహ్మప్రత్యక్షమై (మార్తోభవ' (బాధనొందకు) అని పలికి అతని ఆర్తిని బాపి తన పల్కు కారణంగా అతనికి మార్తాండుడనే పేరుపెట్టి వారిద్దరికీ వివాహం చేస్తాడు. "మీ యిద్దరికి పుట్టిన సంతానం యజ్ఞ మోక్షముల కొఱకు క్షీరాన్ని ఉత్పత్తి చేసేవై నాలోకానికి పైభాగంలో వర్తించెటట్లు వరమిస్తున్నా "నంటాడు. వారిరువురికి పుట్టినదే గో సంతానం. ఆ కారణంగా గోకులం నాటినుండి సురాసురులైన సమస్త ప్రజలకు ఆరాధ్యమైంది. సకల గోమాతయైన సురభి ఒకనాడు దేవేంద్రుని వద్దకు వెళ్లి దయనీయంగా ఏడుస్తుంది. ఇంద్రుడాశ్చర్యపోయి "నీ దుఃఖానికి కారణమేమి? అందరికీ క్షేమమే కదా" అని ప్రశ్నిస్తాడు. నీ వజ్రాయుధం రక్షిస్తూ ఉండగా నా వాళ్లకు తప్ప అందరికి క్షేమమే. దేవా! నామనవి విను. బలంగల ఎద్దులలో బలహీనమైనవాటిని నాగళ్లకు కట్టి అవి పొలం దున్నటంలో అసమర్థులైనందుకు ప్రజలువాటిని ములుగోలులతో పొడిచీ, తిట్టీ, బాధిస్తున్నారు.అది చూచి నేను దుఃఖిస్తున్నాను" అంటుంది.

"నీకు వందల సంఖ్యలో సంతానం ఉంది. వాటన్నిటికీ ఒకేవిధమైన దుఖం కలుగలేదుగదా శోకించకు" అంటాడు ఇంద్రుడు.

"దేవా దీనములైన ముఖాలతోబలహీనములైన నా సంతానం దుఃఖాన్ని నేనెట్లా చూడగలను?"అని గోమాత దుఃఖించగా యింద్రుడు కరుణతో వర్షాలు కురిపించి తృణసంపద నధికం చేసి బలహీనమైన గోసంతానం బలసమృద్ధ మయ్యేటట్లు చేస్తాడు.

## 280 గోమాతలు

సుమిత్రుడనే మునీశ్వరుడు తన గో సంతానాన్ని భక్తి శ్రద్ధలతో సేవిస్తూ ఉంటాడు. ఒకనాడు అతని గోవులలో కొన్ని కామరూపిణులైనవి స్త్రీ రూపాలు ధరించి, ఒక రమణీయమైన సరస్సులో జలక్రీడలు సల్పుతుండగా తక్కిన గోవులు

వారిని మానవ వాక్కులతో మీ రెవ్వరని అడుగుతాయి " మేము గోవులము" అని చెప్పగా " ఇంతటి అద్భుతప్రభావం మీకెలా కల్గిందని" గోవులు అడుగుతాయి. యజ్ఞాలకు పితృకార్యాలకు , అతిథిపూజలకు. సద్బ్రాహ్మణుల ఆహారానికి వారు సంతోషించేటట్లుగా కమ్మని పాలు కురిపిస్తాము. వ్యవసాయాది పనులకు మా పుత్రులను పంపుతాము. మ సుకృతాలవలన మాకీ విశేషాలు కల్గినాయి మాకు గోలోకం సులభం. మీరా మంచి పనులు చూసి అసూయచెందుతారు.కాబట్టి మీరు పిల్లాపాపలతో దుర్గతి చెందుతారు. భవిష్యత్తు మాజ్ఞానం వల్ల తెలుసుకొని మీపై కృపతో చెప్పవలసి వచ్చినది"అని కామరూపిణులైన గోవులు పేర్కొనగా ఆ గోవులు దీన వదనాలతో "గోవులకు గోవులేగతి కాబట్టి మేము సద్గతిపొందే మార్గం ఉపదేశించండి" అని ప్రార్థిస్తాయి.

రంతిదేవుడు వేయి సంవత్సరాలు చేసే యజ్ఞానికి పశువులై వెళ్లండి. అతడు వధించగా మీకు గోలోక వైభవం కల్గుతుందని గోమాతలు సెలవీయగా ఆ గోవులు అరాజు యజ్ఞానికి వెళ్లడానికి ఉత్సాహపడతాయి. వాటిలో ఒక గోవు మనము సుమిత్రుని ధనం. అతని అనుమతి లెకుండా ఎలా వెళ్లగలం? అంటుంది. "మనమతనిని చంపుదాము. అతడు గోలోకానికి వస్తాడు" అని గోవులన్నీ బయలుదేరి ఆ మునీంద్రుని తేజ చూడలేక మరలవస్తాయి వాటిలో కొన్ని కపిల ధేనువులు అతిక్రూరమైన మనస్సుతో "మేమతన్ని వధిస్తాము మీరు మాకేమి మేలు చేస్తారు?అని ప్రశ్నిస్తాయి. అన్ని అవులు ఏకవాక్యంగా ఆవులన్నిటిలో కపిలగోవు శ్రేష్టమయినది. కపిలగోవును దానమీయడం నూరుఆవులను దానమిచ్చి దానితో సమానమయ్యేటట్లుగా మీకు వరమిస్తాము" అంటాయి.

అందుకు సంతోషించి కామరూపిణులైన ఆ గోవులు రూపం మార్చుకొని ఆ సుమిత్రునివద్దకు వెళ్ళి "మేము గోమాతలం నీ గోసమారాధనకు మెచ్చుకొని వరమీయవచ్చినాము. నీయిష్టమేదో అడుగు మనగా అతడు "ఇప్పటిలాగే ఎల్లప్పుడూ గోవులపట్ల భక్తి స్నేహాలు కలిగేటట్లుగా వరమీయుమంటాడు, " అట్లే" అని పల్కి "ఈ లోకం ఎందుకు, మాతో గోలోకానికి రా" అని ఆహ్వానించగా నాగోవులను విడిచి రాలేనంటాడు సుమిత్రుడు.

అప్పుడా ధేనువులు తమ యోగబలంతో అతని శరీరాన్ని అకాశానికి ఎత్తి, చైతన్యం తొలగించి, అతని దేహాన్ని భూమిపై పడవేసి, వేగంగా తమ కొమ్ములతో పొడిచి, కాళ్లతో కుమ్మి, తిరిగి ఆ వృత్తాంతమంతా పూసగ్రుచ్చినట్లు

సంతోషంగా గోలోకముఖ్యులైన గోమాతలతో చెబుతాయి. గోమాతలు తమ వద్దకు వచ్చిన సుమిత్రుని ఆదరించి స్త్రీ రూపధారిణులైన గోవులు మొదలుకొని సమస్త వృత్తాంతం తెలియజేసి "నీకు దీని వల్ల మేలే జరిగిందని చెప్పి, అతనికి సంతోషం కల్గిస్తాయి. బ్రహ్మఘాతినులైన అన్నిగోవులను "మీ ముఖాలు అశుచియై మీ వంశమంతా అలాగే అవుతుందని శాపమీయగా ఆ గోవులు రంతిదేవుని వద్దకు వెళ్ళి, మనుష్యవాక్కులతో తమ సద్గతి కోసం తమను యజ్ఞంలో వధించమని వేడుకొంటాయి. "మిమ్ములను వధిస్తే నేను సద్గతినెట్లా పొందగల్గుతా"నని రంతిదేవుడు ప్రశ్నించగా "జ్ఞానులైన గోమాతలు మా సద్గతికై నిన్నీపని చేయమని అర్థించమని మమ్ము పంపగా వచ్చితిమి. ఈ పని వల్ల నీ కీర్తి లోకాలలో వ్యాపిస్తుంది. సద్గతి కల్గుతుంది" అంటాయి. అయితే మీలో ఏ ఒక్క గోవైనా మోహానికి లోనైతే ఆనాడే నాయజ్ఞం సమాప్తమవుతుం"దంటాడు రంతిదేవుడు. గోవులంగీకరిస్తాయి. యజ్ఞక్రియకై వాటిని ప్రతిదినం రంతిదేవుడు వధిస్తూ ఉంటాడు. ఒకనాడు ఒకగోవు తన లేగకు పాలిస్తూ "అయ్యో! దయలేని వారు నన్ను చంపవస్తారు. నివింక ఎక్కడికి చేరుతావో కదా! అని దానిని చూస్తూ విచారంతో పల్కడం రంతిదేవుడు మహానుభావుడు కాబట్టి విని, యజ్ఞాన్ని సమాప్తం చేస్తాడు. మిగిలిపోయిన గోవులు భూలోకంలో నిలుస్తాయి.

యజ్ఞంలో వధింపబడిన గోవులతోపాటు రంతిదేవుడు,సుమిత్రుడు గోలోకంలో శాశ్వత స్థానం పొందుతారు.

## 281-283అరుంధతి- గంగ- వృషాదర్భి హోమంలో పుట్టిన రాక్షసి

కశ్యపుడు, అత్రి, విశ్వామిత్రుడు, గౌతముడు, భరద్వాజుడు, జమదగ్ని, వసిష్ఠుడు - వీళ్ళ సప్తర్షులని పిలవబడతారు. వీరు, వసిష్ఠుని భార్య అరుంధతి, వారి పరిచారిక గండ, ఆమె భర్త పశుసఖుడు భూలోకంలో సంచరిస్తూ ఉంటారు. అనావృష్టి కారణంగా వారి కాహారం లభించదు. శిబికుమారుడైన యాజ్యుడనేవాడు తన కొడుకు నీలుడనేవాడిని యజ్ఞంలో దక్షిణగా ఋత్విక్కుల కిచ్చి ఉంటాడు. కాలంతీరి అతడు చనిపోయి ఉంటాడు. క్షుద్బాధ తాళలేక ఆ పదిమందీ పాడెపై ఉన్న ఆ నీలుని శవాన్ని భక్షించాలనుకుంటారు.

ఇంతలో వేటకు పోయి తిరిగి వస్తూండిన వృషాదర్భి అనే రాజు ఆ దృశ్యం చూసి మునులతో "మీరాకలి బాధ భరించలేక శవాన్ని పీక్కు తినాలనుకొన్నారు. నేను మీకు అనేక విధాలైన ఆహారపానీయాలు, గ్రామాలు,

అవులు బహుమతిగా యిస్తాను. నావెంట రండి " అంటాడు. " రాజుల నుండి స్వీకరించడం మాకు విషంతో సమాన" మంటారు మునులు. కృత్రిమమైన పండ్లను చేయించి లోపల బంగారం నింపి రాజు వారికి తన మంత్రులతో పంపుతాడు. అవి బంగారంతో నిండి ఉన్నాయని ఋషులు తిరస్కరిస్తారు. వారి తిరస్కారాన్ని విన్న రాజు రాజసంతో అగ్నిలో కృత్తిని వేల్చమని తగినవారిని ఆజ్ఞాపిస్తాడు.ఆ హోమంలో నుండి ఒక రాక్షసి పుడుతుంది. సప్తర్షులను చంపమని రాజు ఆ రాక్షసి నాజ్ఞాపిస్తాడు.

ఆ రాక్షసి వారున్నచోటు వెదుక్కుంటూ బయలుదేరుతుంది. ఋషులు ఒక సరస్సును చేరి, అందులోని తామరతూడులను తిందామని సమీపిస్తారు. ఆ రాక్షసి వారిని కొలను సమీపంలో అడ్డగిస్తుంది. వారామె నెవ్వరివని ప్రశ్నిస్తారు. "నే నెవరినైతేనేమి, ఈ కొలనుకు కాపలాగా ఉన్నాను." అంటుంది. ఆ కొలనులోని తామర తూడులను తిందామని వచ్చినామన్న వారితో ఆ రాక్షసి " మీ మీ పేర్లు చెప్పి, పిదప సరస్సులో ప్రవేశించండి" అంటుంది.

ఆమె తమను చంపడంకోసం వచ్చిందని తెలుసుకొన్న ఋషులు తమ పేర్లను ఆమెకర్థంకాకుండా నిర్వచనాలతో చెబుతారు.రాక్షసి తెల్లముఖం వేస్తుంది. శునస్సఖుడనే పరివ్రాజకుడు సప్తర్షులతో కలసి సంచరిస్తూండినవాడు తన పేరు స్పష్టంగా చెప్పినా, నీ పేరు చెప్పమని గద్దిస్తుంది."స్పష్టంగా చెప్పినా చెప్పలేదనడం తప్పుకాదా? ఇంతటి ఉద్దండురాలివి నా మంత్ర దండం పాలబడి భస్మంకా" అని తన యోగదండం దాని శిరస్సుపై పెడుతూ శాపాక్షరాలు పల్కుతాడు.

ఆ రాక్షసి బూడిద కుప్పవుతుంది.సప్తర్షులు కొలనులో ప్రవేశించి, తామరతూడులు కన్పించక, ఒకరినొకరు శంకించి శపథాలు పల్కుతారు. ఋషులందరూ శపథాలు చేసిన పిమ్మట అరుంధతి మెల్లగా నవ్వుతూ " ఎప్పుడూ అత్తను నిందించేది, భర్త పట్ల దుష్టచిత్తం కలది, పరమాన్నం ఇతరులకు పెట్టకుండా తానొక్కతే తినేది, ఏ దుర్గతికి వెళ్తుందో, తామరతూడులు దాచి ఉంటే నాకు అట్టి దుర్గతి కలగాలి." అని శపథం చేస్తుంది.

గండ "వంట చేసిన స్త్రీ తాను ముందే తినడం, పనుల పట్ల కపటంతో ప్రవర్తించడం, కుమార్తెకు ధరపుచ్చుకోవడం, మంచివారికి కీడు చేయడం - ఈ పనులు చేసే స్త్రీకి ఏదుర్గతి పడుతుందో, తామరతూడులు దాచిఉంటే నాకు అట్టి దుర్గతి కలుగుతుంది." అని శపథం చేస్తుంది.

శునస్సఖుడు తానే తామరతూడులు దాచి వారందరిచే ఆ విధంగా

శపథాలు చేయించినానని, ఆ రాక్షసిని వృషాదర్భి పంపినాడని తెలుసుకొని తాను సంహరించినానని చెబుతాడు.

## 284 ఉమా మహేశ్వర సంవాదము - ఉమ

పరమేశ్వరుడు ఒకసారి సుర, సిద్ధ, సాధ్య, విధ్యాధర, మునిపుంగవ సమేతుడై కొలువుదీరి ఉండగా గౌరి చక్కగా అలంకరించుకొని వచ్చి, వెనుక నుండి ఆయన కన్నులు మూస్తుంది. వెంటనే లోకమంతా సూర్యచంద్ర నక్షత్ర రహితమై అంధకార బంధురమై పోతుంది.పరమేశ్వరుడు వెంటనే తన ఫాలనేత్రం విప్పుతాడు. ఆ అగ్ని జ్వాలలు వెండికొండను కప్పివేయగా తండ్రికి జరిగిన కీడు సహించలేని పార్వతి మనస్సు తల్లడిల్లగా పరమేశ్వరుని పాదాలపై వ్రాలుతుంది.

శంకరుడు కరుణతో చూడగా అగ్నిజ్వాలలు శాంతించుతాయి. గౌరి విస్మయంతో " ఫాలనేత్రం తెరవడానికి కారణమేమి? సర్వేశా, ఇది రహస్యం కాకపోతే నాకు తెలుపు" అని వినయంగా అడుగుతుంది. "నీకు తెలియకూడని రహస్యాలు నాకు ఏమున్నాయి? లోకాత్మకత్వం నాకు కల్గడం చేత నేనేది పొందితే అన్ని లోకాలు దానిని పొందుతాయి. "నాకళ్లు నీవు మూయగా లోకాలన్నీ,చీకటియై పోయి ప్రాణికోటి భయభ్రాంతమైంది. ఆ చీకటి తొలగించడం కోసం ఫాలనేత్రం తెరువవలసి వచ్చింది." అని వివరిస్తాడు.

అప్పుడు పార్వతి తనకు తెలియని విషయాలన్నీ శంకరుని నుండి తెలుసుకోవడానికి కిది సమయమని భావించి "దేవా,నీకు నాల్గుముఖాలు కల్గడానికి కారణమేమి?"అని అడుగుతుంది."సుందోపసుందులనే రాక్షసులసామాన్య బలవంతులు. వారెవ్వరి చేత చావరు. వాళ్ళను చంపడం కోసం యముడు లోకంలోని అందమైన పదార్థాలన్నింటిలోని సారాన్ని తిల ప్రమాణంలో గ్రహించి, ఒక స్త్రీమూర్తిని సృష్టించి తిలోత్తమ అనే పేరు పెట్టి నావద్దకు తెచ్చినాడు. ఆమె నాకు ప్రదక్షిణం చేస్తుండగా " ఈమె దేవతా కార్యాన్ని చేయగలుగుతుందా, లేదా అని పరీక్షించడంకోసం ఆమె ఒక్కొక్క దిక్కుకు తిరిగినపుడంతా ఒక్కొక్క ముఖం ధరించి నేనామెను పరీక్షించాను. అప్పటి నుండి చతుర్ముఖుడ నయ్యాను" అంటాడు.

కంఠంలో నీకు నల్లదనం ఉండటానికి కారణమేమి? అన్న ప్రశ్నకు బదులుగా " దేవదానవులు క్షీరసాగరాన్ని అమృతం కోసమై మథించినపుడు పుట్టిన విషాన్ని భరించడం అనితర సాధ్యమైంది.అది త్రిలోక భీకరమైంది. అందువలన

దానిని నా కంఠంలో ధరించి లోకాలను రక్షించవలసి వచ్చినది. ఆ మహావిష ప్రభావం వల్ల నా కంఠం నీలమై నీలకంఠుడన్న పేరు కల్గింది. ఇంకా ఏమేమి అడగదల్చుకున్నావో అడుగు" అంటాడు.

"నీవు పినాకాన్నే ఎందుకు ఆయుధంగా మెచ్చి పట్టుకున్నా" వని గౌరి అడుగుతుంది. "కృతయుగంలో కణ్వుడనే మహర్షి నిష్ఠతో తపస్సు చేస్తుండగా అతని దేహాన్ని కప్పివేస్తూ పుట్టపెరిగి, ఆ పుట్టలోనుండి వెదురు పుట్టింది.అది లోక సామాన్యమైనది కాదు. మహా అద్భుతంగా విస్తరించి అధికమైన వైశాల్యం కల్గగా బ్రహ్మ ఆమునికి ప్రత్యక్షమై లోక కల్యాణం కోసం ఆ వెదురుతో నాకు విష్ణువుకు పినాక శార్ఙ్గములు, దాని అగ్రభాగంతో గాండీవాన్ని చేసి, ఆ ధనుస్సును తాను తీసుకొని తన లోకానికి వెళ్లినాడు." అని వివరిస్తాడు

అలాగే ఒకప్పుడు హిమాలయాలలో దేవ హితార్థమై తాను గొప్ప తపస్సు చేస్తుండగా ఆవులన్నీ తనచుట్టూ చేరి ఇబ్బంది పెట్టగా తాను కోపంతో చూడగా గోకులమంతా అల్లాడిపోయిందనీ, బ్రహ్మ, తక్కిన దేవతలు వచ్చి, ప్రార్థించి, తన కోపాన్ని శాంతింపజేసి, వృషభాన్ని తనకు కానుకగా ఇచ్చి, గోపతి అన్నపేరు తనకు పెట్టి, గోవుల బాధ మాన్పించారని, నాడు మొదలుకొని తాను వృషభవాహనుడు, వృషకేతనుడూ అయినానని పార్వతి మరో ప్రశ్నకు సమాధానంగా చెబుతాడు.

స్మశానవాసతకు కారణమేమన్న పార్వతితో ఈశ్వరుడు క్రూరభూతాలు జనులను భయంకరంగా బాధించి చంపుతూఉంటే బ్రహ్మ దానికి ప్రతీకారం చేయమని తననెంతో వినయంగా ప్రార్థించగా తాను నిశ్చింతగా ఒకచోట ఉండి లోకాలను రక్షించాలనుకొని, మోక్షార్థులు శుచిస్థానమని నిర్మానుష్యమైన స్మశానాన్ని పేర్కొనడం తన మనస్సుకు తట్టగా అక్కడే ఉండి, లోకాలన్నీ రక్షిస్తూ ఉంటానని, ఆ విధంగా ప్రేతభూమి తన నివాసస్థానమైందని వివరిస్తాడు.

బూడిద పూతకు, అస్థిఫణాభరణ ధారణకు, పరశు శూలాయుధ సహిత భీకర రూపానికి పార్వతి కారణాలడుగగా "లోకాలన్నీ సౌమ్య, ఆగ్నేయ యోగ కలితాలు,శీతోష్ణములనే రెండింటి కలయిక. విష్ణువు సౌమ్యాన్ని, నేను ఆగ్నేయాన్ని వహిస్తాను. ఆగ్నేయ భావరూఢమైన రూపాన్ని లోకహితార్థమై వహించినాను" అని చెబుతాడు.

దక్షయజ్ఞ విధ్వంసన సమయంలో తాను దేవతలను బాధిస్తూ చంద్రుని దేహాన్ని త్రొక్కగా అతడు తనను శరణు వేడినాడని, మనస్సులో పశ్చాత్తాపం కల్గి, చంద్రుణ్ణి ఆ విధంగా బాధించిన దోషం అతన్ని తలపై ధరిస్తేగాని పోదని

నాటినుండి తాను చంద్రశేఖరుడ నయ్యానని వివరిస్తాడు.

ఆ విధంగా పరమేశ్వరుని రూపనిరూపణం చేయడమే కాకుండా పార్వతి ఆయనతో సుదీర్ఘంగా సంభాషించి, వర్ణాశ్రమధర్మాలు, తపస్స్వరూపం, రాజత్వమహిమాతిశయం, వర్ణకర్మ పరిపాకం, ఆయుర్వృద్ధి క్షయాలకు కారణాలు, స్వప్నాదుల విశేషం, ధర్మవిశేషం, సాంఖ్యాప్రకారం, ఆత్మ సాయుజ్య ప్రాప్తి మొదలైన విషయాలను లోకహితార్థమై పరమేశ్వరునితో చెప్పించి, పరమేశ్వరుని కొలువులో ఉన్న సమస్తమునులు, దేవగణాలకు పరమానందం చేకూరుస్తుంది.

ముల్లోకాల హితంకోసం తాను శివలింగ స్థాపన చేసినాననీ, ఆ లింగ స్వరూపంలో తనను భావించి నేతితో గాని, పాలతోగాని, నీటితోగాని అభిషేకించి భక్తితో గంధ, మాల్య, ధూపదీపనైవేద్యాలు సమర్పించి, లింగమూర్తిలో తనను దర్శించి భజించినవారికి మోక్షం లభిస్తుందని శంకరుడు గౌరితో పలికి "నీవు దేవాంగనలు మొదలైన ముల్లోకాల స్త్రీల ఆరాధనకు పాత్రురాలివి. వారి మ్రొక్కులకు యోగ్యమైన పాదపద్మాలు గల శ్రేష్ఠురాలివి, చతురవు,వివేక విభవోన్నత చిత్తవు. వ్రతవిధాననైష్ఠికతా సంయుతమతిని, అనిందితవు. అందువలన స్త్రీల ధర్మం నీ వలన తెలుసుకోవాలను కుంటున్నాను." అంటాడు.

పార్వతి సిగ్గుపడుతూ, చిరునవ్వుతో వింత అందంతో శోభిస్తున్న ముఖాన్ని వంచుకొని భర్తతో "మీకు తెల్పడానికి నేనెంతటి దానను? అయినా మీరడిగారు కాబట్టి నా మనస్సుకు తోచిన సమాధానం స్త్రీల గురించి నాకు తెలిసినంత వరకు వివరిస్తాను. అయినా, నన్నెప్పుడూ విడువకుండా ఉండే నదులు గంగ, యమున, గోదావరి, కౌశికి, కావేరి, కృష్ణవేణి, పెన్న, బాహుద, రేవ, తమస, మొదలైన స్త్రీలతో చర్చించి సమాధానం చెబుతాను." అని తనతో వచ్చిన వారితో " శంకరుడు ఈ విధంగా అడుగుతున్నాడు ఎట్లా చెబుదాము? " అని అడుగుతుంది." నీకంటె మాకెక్కువ తెలుసా, నీకు తెలిసినట్లు చెప్పి, పరమేశ్వరుని సంతోషపెట్టు. మేము నీ వాగమృతాన్ని వీనుల విందుగా ఆస్వాదిస్తా"మని గంగాదేవి పల్కుతుంది.

పార్వతి ప్రసన్న చిత్తంతో భర్త ముఖంపై చూపు నిలిపి, "స్వామీ, నీ అనుగ్రహం వల్ల నాకు కల్గిన జ్ఞానంతో స్త్రీల తీరులు, వారి సేవాధర్మాలు చెబుతాను" అంటుంది. సురలు, మునులు, దేవతలు, గంధర్వ, సిద్ధసాధ్యస్త్రీలు పార్వతి ఏం చెబుతుందో అనే కుతూహలంతో క్రిక్కిరిసి ఉంటారు. దేవకీతనయ యోగమాయ అప్పుడు పార్వతి వెనుకే ఉంటుంది.

ఋతుమతి కానిది, శుద్ధతకల్గినది అయిన కన్య వివాహార్హత కల్గినది.

తల్లిదండ్రులు, తండ్రి తోడబుట్టినవాడు, మేనమామ, కన్యసోదరుడు పిల్ల నీయడానికి అర్హులు. వారు యోగ్యవరుని చూసి కన్యకు వివాహం జరిపించగా అప్పటినుండి ఆమెకు భర్తే ప్రభువవుతాడు. అతని సమ్మతితో దేవతా పితృపూజ, అతిధిసేవలు మంచి మనస్సుతో భర్త క్షేమం కోరి ఆచరించే పతివ్రత ఇహపర సౌఖ్యాలు పొందుతుంది.

అందుకుదాహరణగా ఒక్క నిదర్శనం వినండి. ఒక బ్రాహ్మణునికి ఇద్దరు భార్యలు. వారిలో పెద్దభార్య భర్త చెప్పకుండానే దేవతా పితృకార్యాలు చేసేది. రెండవ భార్య భర్త చెప్పిన విధులన్నీ ఆచరించేది.విధి వశాత్తు వాళ్లు ముగ్గురూ ఒకే సారి మరణించారు. ఆ పతివ్రత భర్తతో బాటు స్వర్గానికి వెళ్లగా యముడు"నీవు వెళ్లడానికి వీలులేదు. మళ్లీ నీ శరీరానికే మరలి వెళ్లు" అంటాడు.ఆమె దుఃఖంతో కన్నీరు నింపగా దయతో "భర్త అనుజ్ఞలేకుండా ధర్మం ఆచరించడం తప్పు. ఇకనైనా భర్త కిష్టమైనట్లు నడచుకొంటే అతనిని కలుసుకొనగలవు." అని చెబుతాడు.ఆ బ్రాహ్మణి వెళ్లిపోతుంది. కాబట్టి గృహిణికి భర్తననుసరించడమే ధర్మం.

భార్య మంచి నడతకల్గి, అతని కిష్టమైన పదార్థాలు వండిపెడుతూ, తనను భర్త పొందాలనుకుంటే మనోహరంగా అలంకరించుకుని, మనసారా తనను సమర్పించుకోవాలి. పనులు చెబితే మారుపలకరాదు.భర్త మరచిపోతే ధర్మార్థ సంబంధాలైన పనులు గుర్తుచేసి, చేయిస్తూ, సవతి ఉంటే పోట్లాట లేకుండా ఐకమత్యంగా ఉండటమే సతీధర్మం. భర్త తన సవతినే యిష్టపడినా, మనస్సు కష్టపెట్టుకోకుండా అతని యిష్టానుసారం నడుచుకొనే భార్య అందరికీ ఆరాధనీయురాలు

భర్త తన కప్పగించిన వస్తు సముదాయాన్ని జాగ్రత్తగా భద్రపరచి, భర్త యిమ్మన్నప్పుడు యివ్వాలి. భర్త తన కేమిచ్చినా అమిత సంతోషం పొందాలి. కన్న కొడుకుతో నైనా ఒంటరిగా, ఒకే ఆసనంలో కూర్చోవడం స్త్రీలకు చెరుపు చేస్తుంది.

ధనవంతుడు, నిర్ధనుడు, రూపసి, కురూపి, అవివేకి, మూర్ఖుడు, రోగిష్టి, రోగాలు లేనివాడు అవి ఆలోచించకుండా భార్య భర్తను సేవించాలి. బలిభిక్షం దాటవేయకుండా పెట్టాలి. దేవపూజలు, పితృపూజలు చేసేటప్పుడు తత్ఫలితంగా భర్తకు శుభాన్నే కోరుకోవడం భార్యకు తగినది. భార్యకు భర్తేగతి.అతనిని మించిన సత్పరాయణత లేదు. కాబట్టి ఆమె అతని పట్ల అమితభక్తి కల్గి ఉండటమే ఆమెకు సకల శుభాలు కల్గిస్తుంది.

అనిచెప్పి, పతివ్రత చేయకూడని పనులనుకూడ పార్వతి శివునికి

తెల్పుతుంది."పరమేశ్వరా, ఆసురి, పైశాచి, రాక్షసి అని అధర్మాంగనల పేర్లు వాళ్లందరూ వ్యభిచార తత్పరులై ఉంటారు. ఆసురాంగన ఎప్పుడూ క్రూరకార్యాలు చేస్తూఉంటుంది. ధనధాన్యాలు తన యిష్టం వచ్చినట్లు ఖర్చుచేస్తుంది. భోగాసక్తురాలు, చంచల హృదయ. ఈర్ష్యాపరురాలు.పైశాచి క్రోధస్వరూపురాలు. భర్తపైగాని, బిడ్డలపైగాని ప్రేమ ఉండదు.ఇంటి పనుల్లో నైపుణ్యం ఉండదు. ఎప్పుడూ కలహిస్తూ ఉంటుంది. రాక్షసికి సూక్ష్మత ఉండదు. ఎప్పుడూఅబద్ధాలు చెబుతూ ఉంటుంది. సిగ్గూలజ్జా ఉండవు. వీళ్లందరూ భర్త వంశం వారికి పాపం కల్గించి నరకానికి పోతారు.

వీళ్లకు జ్ఞానం కల్గిన తర్వాతనైనా పతిభక్తికల్గి, ధర్మాన్ని నిర్వర్తించి, శాంతి కల్గిఉంటే ముందు చేసిన పాపాలన్నీ తొలగి, భర్తతో స్వర్గానికి పోగల్గుతారు. అలాకాక భర్త అంతిమ సమయంలో చింతలేక అతనితో కలసి సహగమనం చేస్తే భర్తతో సహా ఆభార్యకు సద్గతి కల్గుతుంది.

"ద్విజ భామినికి నధర్మము
ప్రజగావించిన పిదప నయ్యపత్యముశోకో
ద్విజతయు బతిభక్తయునై
త్యజించి యనుమరణ నియత యగుట మహేశా"[1]

బ్రాహ్మణ వనిత సంతానాన్ని పొందిన పిదప ఆ సంతానాన్ని పతిభక్తితో త్యజించి, భర్తతో అనుమరణం పొందడం అధర్మం" పార్వతి ఈ విధంగా ఉపన్యసించి పరమేశ్వరునితో " వాచాలత్వం వల్ల ఏవో కొన్ని మాటలు విన్పించి నాను..కరుణతో నా తప్పు మన్నించు" అని సిగ్గుతో ఎఱ్ఱవడిన తన ముఖాన్ని వంచుకొంటుంది. శివుడితో బాటు దేవతలు, మునిపత్నులు, గంధర్వులు, ఖేచరులు, కింపురుషులు నాగులు మొదలైన జాతుల స్త్రీలంతా పార్వతిని ప్రీతితో స్తుతిస్తారు.

## 285, 86, 87 ఉదంకుని భార్య-గౌతముని భార్య అహల్య మిత్రసహోఖ్యునిభార్య

గౌతముని శిష్యుడైన ఉదంకుడు చాలాకాలం గురు శుశ్రూషచేస్తాడు. గురువు తక్కిన శిష్యులందరికీ వివిధ వరాలిచ్చి వీడ్కొల్పుతాడు. కాని ఉదంకుని గూర్చి తలంపనైనా లేదు. పరమ తపోనిష్ఠుడైన ఉదంకుడు ఎంతో శ్రద్ధతో గురువుకు

1.భార.అనుశా.ఆ5.ప.302

సేవ చేస్తూ ఉంటాడు. ఒకనాడు ఎంతో బరువైన వంటకట్టెల మోపును తెచ్చి క్రింద పడవేస్తాడు. ఉదంకుని జడలలో ఒకటి ఆ కట్టెలకు తగులుకొని ఊడిక్రింద పడిపోతుంది. తెల్లగా మెరిసిపోతున్న ఆ జడను చూసి ఉదంకుడు వయస్సు చెల్లిపోయిన విషయం బోధపడి రోదిస్తాడు. గౌతముడా అశ్రువులు దోసిట పట్టమని తన కుమార్తెనాజ్ఞాపిస్తాడు. ఆమె వెంటనే దోసిలి పట్టి,చేతులు వేడెక్కడంతో భరించలేక విడిచి పెడుతుంది. ఆ కన్నీరు క్రింద పడగానే నేల కంపించుతుంది. గౌతముడు శిష్యుని దగ్గరకు పిలిచి శోకానికి కారణమడుగుతాడు.

"శిష్యులందరిపైన ఉన్న కరుణ చాలాకాలం గడచినా, మీకు నాపైలేదు. దానికి దుఃఖింపపడకుండా ఎలా ఉండగలను?" అని ఉదంకుడనగా గౌతముడు కరుణతో "నీకు యౌవనాన్ని ప్రసాదిస్తున్నాను. వివాహం చేసుకో నీ తేజస్సును భరించడం యీమెకు తప్ప ఎవ్వరికి సాధ్యంకాదు. యీమెకూ యౌవనం ప్రసాదిస్తున్నాను. గురుపుత్రిని వివాహం చేసుకోవడం అధర్మం కాకుండా వరమిస్తున్నా" నంటాడు.

నవయౌవనవంతుడై గురుపుత్రిని వివాహమాడిన ఉదంకుడు "మీ దయవల్ల మీరేది కోరినా తెచ్చి ఇవ్వగల శక్తి నాకు లభించింది. నన్నాజ్ఞాపించండి" అని వేడుకోగా గురువు "దక్షిణ ఇంకెవ్వరికైనా ప్రీతి అవుతుందేమో గాని నాకు మాత్రంకాదు. నీ నడవడి వల్లనే నాకు ప్రీతి" అంటాడు. ఉదంకుడు గురుపత్ని అహల్యకు మ్రొక్కి" అమ్మా! మీకు కావలసిన పదార్థాన్ని ఆజ్ఞాపించండి. వెంటనే తెచ్చి ఇస్తానంటాడు." నాయనా! వద్దు. నీవు పరాయివాడవా. నీ సద్గుణాలకు సంతోషించిన మీ గురువుగారి మాట మనసులో నిల్పుకో, చాలు" నంటుంది అహల్య. కాని ఉదంకుడు పదేపదే విన్నవించగా ఆమె మిత్రసహాఖ్యుని భార్య కుండలాలు తెచ్చి ఇమ్మంటుంది. ఉదంకుడు సంతోషంగా ఆ పనికి బయలు దేరుతాడు. తరువాత గౌతముడు తన శిష్యుని గానక భార్యనడుగగా ఆమె విషయం వివరిస్తుంది." అయ్యో, ఆ సౌదాసమహారాజు మనుష్యుల మాంసం తింటాడు. అతనివి రాక్షస చర్యలు. మనుష్యభోజనమతనికి శాపవశాత్తూ కల్గింది" అంటాడు.

"అయ్యయ్యో, ఎంతపని జరిగింది! ఏమౌతుందో?" అని అహల్య భయపడుతూ భర్తను" ఉదంకునికి కీడు కల్గకుండా కాపాడ" మని వేడుకుంటుంది."భయపడకు.అతనికే ఆపదా రానీయ"నని గౌతముడు ఊరడిస్తాడు.

ఉదంకుడు ఒక శూన్యారణ్యంలో ఉన్న ఆ మిత్రసహాఖ్యుని కలుసుకుంటాడు. తనను భక్షింపకోరిన రాజుకు తాను గురుకార్య నిమిత్తమై వచ్చినానని,

"నీవు అర్థులకు వారు కోరిన పదార్థం ఇచ్చేదాతవు.నేను నీ దానానికి పాత్రుడను. గురువు కొరకైన నా కోర్కెను నీవు తీర్చగలవనే కృతనిశ్చయంతో వచ్చినా" నంటాడు.

నీకోర్కె ఏమనిరాజడగగా "నీ భార్య ప్రీతితో ధరించే కుండలాలిమ్మ"ని ఉదంకుడు చెప్పగా " ఇతరుల ధనం ఇచ్చే వాళ్లుకూడా ఉంటారా? కుండలాలు కాకుండా ఇంకేదైనా అడుగు" అంటే" నీవు ఏదోసాకు పెట్టి నాకోర్కెను త్రోసివేసే వాడవుకావు.నాకు వేరే వస్తువులక్కరలే" దంటాడు.రాజుతన భార్య ఉన్న చోటికి వెళ్లి, తాను చెప్పినానని చెప్పమంటాడు.

ఉదంకుడు వెళ్లి అడుగగా ఆమె తన కానవాలు తెమ్మంటుంది. ఉదంకుడు వచ్చి రాజును ఆనవాలడుగుతాడు. రాజు "ఈ గతి సేమమగునని విష్టింప రాదిది వెలిగాగ లేదు వేఱుగతియును" [1]అనే మాటలు తన మాటలుగా చెప్పమంటాడు.

ఆ మాటల ఆనవాలుతో మదయంతి"నా భర్త ఆజ్ఞ ప్రకారం నీకు గురు హితార్థివి కాబట్టి కుండలాలిస్తున్నాను. దేవతలు, గంధర్వులు, నాగులు ఈ కుండలాలు పొందాలని ఎన్నో ఉపాయాలతో కాచుకొని ఉంటారు. ఎంగిలి తగిలినా, ఏమరు పాటుతో నీవు నిద్రించినా, నేలపై పెట్టినా అపహరిస్తారు. భక్తితో వీటిని అర్చించి ధరిస్తే ఆకలిదప్పులు, అగ్ని భయం, విషవికారం, భూతబేతాళ బాధలు ఉండవు. ఇవి పిల్లలకైనా పెద్దలకైనా చక్కగా అమరిపోతాయి. ఇవి బంగారాన్ని కురిపిస్తాయి. జాగ్రత్తగా వీటిని తీసుకొని వెళ్లు. నీ గురువులు నిన్ను అభినందిస్తారు." అని ఆ పతివ్రత భక్తి, ప్రీతి, వినయాలతో వాటిని ఉదంకునికి సమర్పిస్తుంది.

ఉదంకుడు సంతోషంతో ఆమె నాశీర్వదించి రాజు వద్దకు వచ్చి తాను రాజపత్ని వల్ల కుండలాలు పొందిన విషయం సంతోషంతో అతనికి చెప్పి " నీ వల్ల నేను కృతార్థుడైనాను.నాకానవాలుగా నీవు చెప్పిన వాక్యం చాలా గూఢమైనది. దాని అర్థమేమో తెలియజెప్పు" మని కోరుతాడు.

"రాజులు బ్రాహ్మణులను పూజిస్తారు.కాబట్టి నేను బ్రాహ్మణులను పూజిస్తాను.బ్రాహ్మని చేతనే ఇట్లు శాపగ్రస్తుడనైనాను.వేరే ఉపాయం చేత నాకు పాపాన్ని పోగొట్టుకొనే దారిలేదు."దీని వల్ల మేలు పొందుతామనడానికి వీలు లేదు. ఇది కాదన్న వేరొక మార్గంకూడా లేదుకదా?"అని నామాటలుగా మదయంతికి చెప్పి పంపేను. విశిష్ట రత్నమయ కుండలాలిచ్చి నీమూలంగా నాకు కల్గిన కీడు

1 భార.అశ్వమేధ - ఆ3 ప.95

తొలగిపోతుందని ఆశిస్తున్నా" నంటాడు.

ఉదంకుడు తన స్పర్శతో అతని పాపాన్ని పోగొట్టి, అది తన గురువు గౌతమునికృప అని వినయంతో పలికి అతనికనేక దీవనలనిచ్చి గురువు ఆశ్రమానికి వేగంగా వెళ్ళుతూ మార్గ మధ్యంలో ఆకలి కాగా కుండలాలతో కృష్ణాజినాన్ని ఒక చెట్టు కొమ్మకు తగిలించి పళ్ళుకోసుకుంటూ ఉండగా గాలి తాకిడికి ఆ కృష్ణాజినం క్రింద పడుతుంది. ఒక సర్పం మహావేగంతో ఆ కుండలాలు గ్రహించి పుట్టలో జొరబడుతుంది. ఉదంకుడు ఒక కర్ర తీసుకొని పుట్టను త్రవ్వ నారంభిస్తాడు. భూమి అది సహింపలేక కంపిస్తుంది. దేవేంద్రుడు బ్రాహ్మణ వేషంలో వచ్చి "కొయ్యతో త్రవ్వితే పాతాళయానం సిద్ధిస్తుందా? ఐరావత సంతానం కుండలాలు తీసుకొని పాతాళానికి వెళ్లింది. అది ఇక్కడికి వెయ్యి యోజనాలుంది." అని చెబుతాడు.

"పాతాళ లోకంలో ఉండనీ, నేను కుండలాలను గ్రహించి తీరుతా"నని ఉదంకుడు దృఢంగా పల్కుతాడు.దేవేంద్రుడతని దృఢత్వానికి మెచ్చుకొని ఆ కర్రకు వజ్రాయుధంతో సమానమైన బలం, పదును ఇచ్చి, తన బాంధవ్యం చెప్పి వెళ్లి పోతాడు. భూమి భయపడి ఉదంకునికి దారి ఇస్తుంది.

ఉదంకుడు పాతాళలోకం ప్రవేశించి అశ్వరూపంలో ఉన్న అగ్నిదేవుని అనుగ్రహంతో కుండలాలను తిరిగి పొంది, ఆశ్రమానికి వచ్చి, గురుపత్ని చేతిలో కుండలాలను పెట్టి, సాష్టాంగ నమస్కారం చేస్తాడు.

అహల్యాగౌతములు ప్రియమారా అతన్ని దీవించుతారు."మీ దయ వల్లనే ఆటంకాలనధిగమించి కుండలాలు తేగల్గినా"నని ఉదంకుడు వినయంతో సమాధానమిస్తాడు. అహల్య ముత్తయిదువులనందరిని పిలిచి నిష్ఠతో వ్రతం చేసి కుండలాలను పూజించి, వాటిని ధరిస్తుంది.

## 288 పులితల్లి

పౌరవుడనే రాజు క్రూరకర్మ నిష్ఠుడై మరుజన్మలో గోమాయువై పుట్టి తన పుట్టుకను గూర్చి తెలుసుకోవాలను కుంటాడు. మాంసాహారం వర్జించి, ఆకులు, పండ్లు తింటూ గొప్ప వ్రతశీలుడై ఉండగా ఒక పులి తనను లోకం క్రూరుడని భావిస్తుందని, తన క్రూరత్వాన్ని మాన్పమని ఆ నక్క స్నేహాన్ని అర్థిస్తుంది. తన మైత్రి పట్ల అసూయతో సేవకులు తమ మధ్య విభేదాలు సృష్టించినా, చలించ కుండా తన బుద్ధిని విశ్వసించి పాటిస్తే తన కభ్యంతరం లేదంటుంది నక్క.

పులి భృత్యులు ఆనక్క పట్ల అసూయతో ఒకరోజు పులి తినడానికి ఉద్దేశించిన మాంసాన్ని నక్క నివాసంలో దాచి ఉంచుతారు.పులి ఆహారాన్ని రక్షించ వలసిన బాధ్యత ఉండిన నక్క మాంసాన్ని గానక ఆ విషయం పులికి తెలియ జేస్తుంది. పులి భృత్యులు ఆ మాంసాన్ని నక్క నివాసంలో చూపించి"మాంసాహారి యైన నక్క ఇన్నాళ్లు కపటవర్తనం గావించింది. మీకు మారు పల్కడానికి భయపడి ఇన్నాళ్లు ఊరుకొన్నాము" అని పలుకుతారు.

చెప్పుడు మాటలకు లోబడిన ఆ పులిరాజు నక్కను పట్టి వధించమని వారినాజ్ఞాపిస్తాడు.

"ఇవన్నీ కృత్రిమాలు. ఆనక్క అటువంటిది కాదు. సేవకులసూయతో ఎన్నెన్నోకుటిల కృత్యాలు చేస్తూ ఉంటారు.అయ్యో నీ జ్ఞానం ఏమైపోయింది? బుద్ధిమంతుని దుర్బుద్ధులు, అధికుణ్ణి హీనులు, రూపసిని కురూపి అసూయతో ద్వేషిస్తారు. ఇదంతా నీవు తెలుసుకోవాలి. కుమారా, ధర్మం అధర్మంలాగా, అధర్మం ధర్మంలాగా కనబడుతూ ఉంటుంది. నిర్మలమైన బుద్ధితో ధార్మికత్వాన్ని కోరేవాడు వాస్తవం తెలుసుకోవాలి.

"బుద్ధిమంతు వలన దుర్బుద్ధు లధికు;
వలన హీనులు రూపసి వలనగొనటి
వారసూయలు సేయుదు రీరసమున;
నింత యెఱుగంగ వలవదే యీవు గొడుక[1]

" ధర్మమధర్మము భంగిన;
ధర్మము ధర్మంబు మాడ్కి దనయాతోచున్
నిర్మల మతి నరయ వలయు;
ధార్మికతన కోరువాడు దనకేర్పడగన్" [2]

ఈ గోమాయువు వచ్చిన దగ్గర నుండి మనకు చేసిన మేలు ఆలోచించు ఇట్టి సజ్జనుడింతటి అకృత్యం చేయగలడన్న ఊహగూడా రాకూడదు.హితుడైన మంత్రిని, కుటిలాత్ములు గొప్ప కపటోపాయాలతో నాశనం చేయాలని చూస్తారు. చక్కగా పరీక్షించకుండా ఏ పనీ చేయకూడదు." ఈ హితోపదేశం తల్లి చేయగా పులి నక్కను పిలిపించి కౌగలించి కన్నీళ్లతో తగిన మాటలతో గౌరవిస్తుంది. నీవు నాకు చేసిన వాగ్దానాన్ని మరిచి, సేవకుల మాటలకు లోబడినావు. తెలిసిగాని,

భార.శాంతి.ఆ3.ప.70. 2.అదే.71

తెలియకగాని ఎవ్వరినైనా అవమానించి, తరువాత స్నేహితునిగా చేసుకోవడం ధనవంతునికి తగునా? అది వానికి హితాన్ని కలిగించదు. ఆస్నేహం నిలువదు" అని నక్క అరణ్యానికి వెళ్లిపోతుంది.

## 289 దేవకీదేవి

దేవకీదేవి అడుగగా నారదుడు ఆయా నక్షత్రాలలో చేయవలసిన దానాలను గూర్చి ఆమెకీ విధంగా తెల్పుతాడు.

" కృత్తికలో పాయసము, రోహిణిలో మినుములు, మృగశిరలో మాంసం నంజుడుగా అన్నం, ఆర్ద్రలో గోవు, పునర్వసులో తీపు కలిసిన పులగం, పుష్యమిలో బంగారం, ఆశ్రేషలో ధనం, మఖలో ఉప్పు, పుబ్బలో నువ్వులు, ఉత్తర ఫల్గునిలో చెరకురసంతో కలసిన అన్నం,హస్తలో అరువది రకాలైన అన్నాలు,చిత్తలో ఏనుగులతో పూన్చిన రథం, స్వాతిలో శ్రీగంధపు చెక్క,విశాఖలో ఎద్దు, అనూరాధలో ఉత్తరీయం, జ్యేష్ఠలో కరివేప, మూలలో ముల్లంగి, పూర్వాషాడలో సన్మాల ఫలము, ఉత్తరాషాడలో పెరుగు, శ్రవణం, ధనిష్ఠ, పూర్వాషాడలలో మోదుగు తేనెలతోడి అన్నం, పూర్వాభాద్ర, ఉత్తరాభాద్ర, రేవతి, అశ్వని, భరణిలలో యవలు,కొఱ్ఱలు, మినుములు, గొఱ్ఱెమాసం, కంచుకుండతో పాడియావు, గుఱ్ఱాలతో శకటం, మెండుగా నువ్వులు. ఆవులు అన్నికార్తెలలో దానమీయదగినవి. ఇవి ఊర్ధ్వలోకాలను కలుగజేస్తాయి."

## 290. లక్ష్మీదేవి

నారాయణుని అంకతలంలో లక్ష్మీదేవి శోభిస్తూండగా చూచిన రుక్మిణీదేవి ఆమెను సంభావించి"అమ్మా నీవు ఎటువంటి స్త్రీపురుషులలో నివసిస్తూ ఉంటావు?" అని అడుగగా లక్ష్మీదేవి రుక్మిణితో ఇట్లా అంటుంది.-

"నిత్య సత్యులు శౌచనిరతులు గురుభక్తు
ల ప్రమత్తులు దక్షులమల మతులు
సత్కర్మపరులు, విజ్ఞానము దపము
బ్రహ్మచర్యమ్ము శమముగల్గు
వారలు ప్రీతి నా వసి యించునిక్కలు
క్రూరు నాస్తికు గృతఘ్నుని గుబుద్ధి
వర్జింతు నెంగిలి వర్జించి యిలువడి
ఘట శుద్ధిగలిగిన కాంతలందు

నిల్తు వల్లభ ప్రతికూల నిష్ఠురాత్మ;
నన్య మందిర గామిని నధిక నిద్ర
యైన మానిని దొరగుదు నబ్జి నీత;
టాక తరుషండ పుష్ప వాటముల నిలుతు"[1]

"నిత్యము సత్యము చెప్పేవారు, శుచిమంతులు, గురుభక్తులు, ఏమరుపాటు లేనివారు, యోగ్యులు, పవిత్రమైన మనస్సుగలవారు, మంచి పనులు చేసేవారు, విజ్ఞానం, తపస్సు, బ్రహ్మచర్యం, శమము కల్గినవారు- నేను ప్రేమతో నివసించే స్థానాలు.

క్రూరులు నాస్తికులు కృతఘ్నులను దుష్టబుద్ధులను, ఎంగిలిని విసర్జిస్తాను. కులీనత, ఘటశుద్ధి కల్గిన స్త్రీలలో ఉంటాను.భర్తకు వ్యతిరేకంగా నడుచుకొనే స్త్రీ, నిష్ఠుర స్వభావ, ఎప్పుడూ ఇతరుల ఇళ్లకు వెళుతూఉండే స్త్రీ, అధికంగా నిద్రపోయే స్త్రీలను నేను పరిహరిస్తాను తామర పువ్వులలో, చెరువులలో, వనాలలో, పుష్పవాటికలలో నివసిస్తాను.

## 291,92 కైకేయి- శాండిలి

కేకయ రాజ్యములోని సుమన అనే ఒక స్త్రీ స్వర్గములో శాండిలి అనే స్త్రీని చూసి" నీకు భవ్యమైన యీ దివ్యలోకం ఎట్లా దక్కిందో నాకు చెప్పు" మని అడగ్గా ఆమె ఆ సుమనతో

"మామకు నత్తకు మార్పల్క దేవ పి;
త్రతిథి పూజనముల యందు సొలయ
నిలువడి దలవాకి లెప్పుడు నెఱుగక ;
పెలుచ నవ్వక శుద్ధి వెలయ విప్ర
భిక్ష యోపిక గల్గి పెట్టుచు వర్తింతు;
వలయు కార్యములకు వెలది మగుడ
బతి వచ్చునప్పుడు భక్తియు వేడ్కయు;
బొదల నాసన పాద్యములు సుముఖ
భావముననను సేవ పాటింతు బిడ్డల;
శిక్షవదల దిట్ట జెట్ట గనియు
నాకు వేర ప్రియమనగ లేదు పతిమెచ్చు;
వంటకములు చవిగ వండి యిడుదు"[2]

1.భార. అనుశా.ఆ1.ప.285 2. భార.అనుశా.ఆ4.ప.358

"భర్త ప్రవాసానికి వెళ్లింది మొదలు అతడు తిరిగి వచ్చే వరకు పూవులు, మేనిపూతలు, మంచి చీరలు, ఆభరణాలు పరిహరిస్తాను. రుచులు, పిండివంటలు కోరను. ఆయన ఉన్నప్పటి వలెనే పెద్దలకు, బంధువులకు భోజనాదికములతో ఏమరారా సేవలు చేస్తాను.

ఆవులు ఇత్యాదులగు జంతువులు సుఖంగా జీవించేటట్లు చూసుకొంటాను. గృహలక్ష్మిగా చేయవలసినదంతా చేస్తాను. భర్త మనస్సు నొప్పించే మాట ఏదీ పలుకను. అగ్నులను శ్రద్ధతో కాపాడుతాను. రహస్యాలు వెలిబుచ్చను. గర్భం దాల్చినపుడు రుచులన్నీ పక్కకు పెట్టి గర్భవతి కేవి పథ్యాలో వాటినే స్వీకరిస్తాను" అని చెప్పి అలా నడుచుకొనే స్త్రీకి ఇహపరాలు రెండూ సౌఖ్యావహాలవుతాయని, ఆమె అరుంధతి వలె పొగడ్తల నందుతుందని వివరిస్తుంది.

## 293 దుస్సల

యాగాశ్వాన్ని వెన్నంటి దేశాలు తిరుగుతూ అర్జునుడు సింధు దేశానికి రాగా, పూర్వవైరాన్ని పాటించి భారత యుద్ధంలో చనిపోయిన సైంధవుని పుత్ర పౌత్రాదులు అతన్ని వేల సంఖ్యలో ఎదుర్కొంటారు. వారందరినీ అర్జునుడవలీలగా ఓడించి సంహరిస్తాడు. అపుడు సైంధవుని భార్య, కౌరవుల చెల్లెలూ అయిన దుస్సల మనుమడినివెంటబెట్టుకుని వచ్చి కన్నీళ్లు వరదలయ్యేటట్లుగా రోదిస్తుంది. ఆమెనుచూచి అర్జునుడు కోదండం భూమిపై ఉంచుతాడు. ఆమె తన మనుమని అర్జునుని ముందుకు తెచ్చి"ఈ పసివాడిని రక్షించు. ఇతడు నీ అల్లుని కొడుకు" అని చూపుతుంది."ఇపుడు నా మేనల్లుడెక్కడున్నాడని విజయుడడుగగా దుస్సల వెక్కివెక్కి ఏడుస్తూ "తన తండ్రి నీ చేత చచ్చినాడని విన్నది మొదలు అంతులేని దుఃఖంలో ఉండినాడు.ఇప్పుడు నీ రాక వినగానే భయంతో ప్రాణాలు వదిలినా"డని పెద్దగా రోదిస్తుంది.

అర్జునుడు విచారంతో తల వంచుకొని ఉంటాడు.దుస్సల అతన్ని ఉద్దేశించి"కౌరవుల కీడు మనస్సులో ఉంచుకోకుండా, సైంధవుడు చేసిన తప్పులన్నీ మరచి, తండ్రి లేని యీ శిశువుపై నీ కనికరం చూపవా ఆశ్రితవత్సలా!" అని ఆ పసివాణ్ణి అర్జునుని పాదాలపై పడవేసి "శరణు, శరణు నన్ను రక్షించు.కీర్తినీ, ధర్మాన్నీ ఆర్జించు" అని ప్రార్థిస్తుంది.

మనస్సు ద్రవించిన పార్థుడు
"రాచకొలమిది కాల్పనే క్రౌర్యమూల

మని తలంచుచు నాతడయ్యతివతోడ
నధమ వృత్తి సుయోధ నుండంత కంటె;
నేము గొఱ గాము మాచేత నింత పుట్టె"[1]

"ఈ రాజవంశం ఎందుకు కాల్చడానికా, క్రౌర్యాని కంతటికీ మూలం. సుయోధనుడు హీనస్వభావుడు మేము అంతకంటె మంచివాళ్లము కాదు. ఇదంతా మా వల్లనే కదా సంభవించింది?" అంటూ ఎన్నోవిధాల ఆమెనోదార్చి ఆమెతల తన అక్కున చేర్చుకొని "అమ్మా! విచారం వదలి నీవు నిశ్చింతగా ఉండు." అని సాగనంపుతాడు.

## 294 రుక్మిణి

శ్రీ కృష్ణుని అష్టమహిషులలో ప్రథమురాలు. కృష్ణుడు కుమారుని పొందడం కోసం హిమాలయాలకు వెళ్లి తపస్సు చేయగా రుక్మిణి తానూ వెంట వెళ్తుంది.

"తనయుని బడయుటకై తప
మొనరింపగ రుక్మిణియు సముత్సుక వృత్తిం
దనతో రా దుహినాద్రికి
జనియెం కృష్ణుండు మునులు సంతసమందన్"[2]

స్వతంత్ర ప్రవర్తనుడైన దుర్వాసుడొసారి శ్రీకృష్ణుని మందిరానికి వస్తాడు. మందహాసం చేస్తూ, కోపిస్తూ, సుముఖుడవుతూ, విముఖుడవుతూ, తిననంటూ, ఎంతోమందికోసం చేసిన పదార్థాలు తానొక్కడే తింటూ, పడక మీద ఒకసారి, నేలపై ఒకసారి నిద్రిస్తూ -ఇలా యిష్టం వచ్చినట్లు ప్రవర్తిస్తాడు. ఒకనాడు" కృష్ణా, నాకు పాయసం తినాలని మనసైనది.పెట్టించు." అంటాడు.శ్రీకృష్ణుడు పాయసం చేయించి పెట్టించగా కొంత తిని, కొంత తన ఒంటికి పూయమన్నాడు. శ్రీకృష్ణుడా విధంగానే పూసినాడు.

దుర్వాసుడు అక్కడున్న రుక్మిణిని చూసి, కొంత పాయసం ఆమె శరీరానికి తానే పూసి, రథానికి ఆమెను గుఱ్ఱంలాగా కట్టి తాను రథమెక్కి వీథులలోనికి బయలుదేరుతాడు.ఆమెను ములుకోలతో పొడుస్తూ రథం నడిపించుతాడు. శ్రీకృష్ణుడు కొంచమైనా కోపంగాని, యీర్ష్యగాని లేకుండా తోడు నడుస్తాడు.

యాదవులు ఆశ్చర్యంతోను, కోపంతోను, భయంతోను అనేక విధాలుగా తమలో తాము మాటలాడుకొంటూ, చేసేదిలేక వారు రథం వెంటనే నడుస్తూ

1.భార.అశ్వమేధ - ఆ4.ప.47 2.భార. అనుశా - ఆ4 ప.396

వస్తారు. రుక్మిణి రథం నుండి నేలమీదకు కూలిపోగా దుర్వాసుడు రథంమీది నుండి క్రిందికి దిగి,ఆమె మీదకు ధూళి చల్లి వేగంగా వెళ్లిపోతాడు.కృష్ణుడతని వెనుకనే పరుగెత్తి వినయంగా వెనుకకు రమ్మని ప్రార్థిస్తాడు.ముని శాంతించి "మిమ్ములను కష్టపెట్టాను. నీవు కోపాన్ని జయించినావు. నీకు వరమిస్తాను. అందరూ తమను తాము ఎంతగా ప్రేమిస్తారో నిన్ను అంతగా ప్రేమిస్తారు.లోక వంద్యుడవై సాటిలేని మహిమలతో అలరారుతావు.నా శరీరమంతటా భక్తితో పాయసం పూశావు. కాని అరికాలికి పూయలేదు. కాబట్టి దాటరాని అపాయం నీకు అక్కడ కలుగుతుంది.అది నీకు పరమపద ప్రాప్తికి కారణమవుతుంది. అందువలన అది నీకు అశుభంకాదు" అని రథం లాగడం వల్ల సొమ్మసిల్లిన రుక్మిణితో" నీవు సౌందర్య సౌభాగ్యాలతో అలరారుతూ సాటిలేని దానవై శ్రీకృష్ణుని అంతఃపుర కాంతలందరి కంటె ఎక్కువ మాననీయురాలివవుతావు" అని వరమిస్తాడు.

## 295, 296 సక్తుప్రస్థుని భార్య, కోడలు

ధర్మ క్షేత్రమైన కురుక్షేత్రంలో రోష కామ విరహితుడైన ఒక మహా బ్రాహ్మణుడు ఉంఛవృత్తిచే జీవిస్తూ ఉంటాడు.భార్య, కొడుకు, కోడలు అతనిననుసరిస్తూ ఉంటారు. అనావృష్టి కారణంగా వారికి తగిన ఆహారం లభించదు. ఒకనాడు ఉదయం నుండి సాయంత్రందాకా నలుగురూ కలసి ఏరిన గింజలతో కుంచెడు పేలపిండి తయారవుతుంది.అనుష్ఠానాలు తీర్చుకొని ఆ నలుగురు ఆ పేలపిండిని సమంగా పంచుకొని భుజించ బోతున్న సమయంలో యముడు బ్రాహ్మణ రూపంలో అతిథిగా వస్తాడు.బ్రాహ్మణుడు సగౌరవంగా అతనిని పూజించి తన భాగం పేలపిండిని సమర్పిస్తాడు. దానితో అతిథి ఆకలి తీరదు. అతనిని సంతృప్తి పరచడమెలాగా అని బ్రాహ్మణుడాలోచిస్తూ ఉండగా అతని భార్య అతని ఆలోచన తెలుసుకొని భర్తతో తన వంతు పేలపిండిని యిచ్చి అతిథిని సంతృప్తుని చేయమంటుంది.

"పశుపక్ష్యాదులు తగిన ఆహారం తెచ్చి, తమ భార్యలకు పెట్టి, సంతోషిస్తూ ఉంటాయి. అలాంటిది నీ ఆహారాన్ని నేను గైకొనడం మంచిది కాదు. భార్యను సంతోష పెట్టాలని ఆశపడని మనసు లేని వాడధముడు.అతడు ఇహలోకంలో నిందింపబడతాడు. యమభటులచే పరలోకంలో హింసింప బడతాడు" అని భర్త అంటాడు. భార్య "భర్తే భార్యకు చుట్టము, పక్షము, స్నేహితుడు, తల్లీ, తండ్రీ, గురువూ, దైవం. కాబట్టి అతని పని నెరవేర్చడమే స్త్రీ

ధర్మం. అంతేగాక నీ వాకలితో ఉంటే నేనాహారం ఎట్లా స్వీకరింపగలను? కాబట్టి అతిథికి నా వంతు సమర్పించు" అంటుంది. బ్రాహ్మణుడు సరేనని తన భార్య వంతు, తనను ప్రార్థించిన కొడుకు వంతు సమర్పించినా అతిథి ఆకలి చల్లారదు. అప్పుడు కోడలు మామ ముందుకు వచ్చి తన వంతు కూడా అతిథికి ఇమ్మంటుంది "ఆకలితో శిథిలమైన నీ అవయవాలు చూస్తూ నేనీ పిండిని ఎలా పుచ్చుకొన గలను?" అంటాడు మామ. "మీరు నాకు తండ్రి వంటి వారు. మీ శుశ్రూషకే గదా నా ప్రాణాలు, అంగములు, సమస్త సంపద! ఇట్లా చేయడం నాధర్మం. కాబట్టి దయతో నేను నాధర్మం నెరవేర్చేటట్లు చేయండి." అని ప్రార్థిస్తుంది. బ్రాహ్మణుడామె పాలు కూడా అతిథికి సమర్పిస్తాడు.

అతిథి సంతోషించి యముని రూపంలో ప్రత్యక్షమై బ్రాహ్మణుని కుటుంబ సమేతంగా బ్రహ్మలోకానికి విమానంలో పంపిస్తాడు.

## 297 శశిబిందుని లక్షమంది భార్యలు

శశిబిందుడనే రాజుకు లక్షమంది భార్యలు.ఒక్కొక్కరికి పదివేలమంది సంతానం కలుగుతారు.మొత్తం పదికోట్ల మంది ఆ రాజు సంతానం.

# అధ్యాయం2
# స్త్రీపాత్రలు-వర్గీకరణ

మహాభారతం లోని స్త్రీపాత్రలను మానవ స్త్రీలు, దివ్యస్త్రీలు, రాక్షస స్త్రీలు, తిర్యగాదులైన స్త్రీలు,పురుషులుగా మారిన స్త్రీలు, స్త్రీలైన పురుషులు, నదులైన స్త్రీలు, స్త్రీలైన నదులు- ఇత్యాదులుగా వర్గీకరింపవచ్చును. ఆయాస్త్రీ పాత్రలు ప్రవర్తించిన విధానాన్ని బట్టి,వారి జీవితాల్లో సంభవించిన ప్రత్యేక సంఘటనలను బట్టి, వారి విశిష్ట గుణదోషాదులను బట్టి కూడా ప్రత్యేకంగా వర్గీకరింపవచ్చును. స్త్రీ పాత్రల సృష్టిలో కవిత్రయం చూపిన వైవిధ్యాన్ని బయల్పరచడం యీ అధ్యాయంలోని విషయం.దివ్యులు, తిర్యగాదులు కాని వారంతా మానవ కాంతలు. కాబట్టి వారిని ప్రత్యేకించి పేర్కొన వలసిన అవసరం లేదు.

## 1 దివ్య స్త్రీలు

(అ) సృష్టి స్థితి లయ కారకులైన త్రిమూర్తుల భార్యలు సరస్వతి, లక్ష్మి, పార్వతులు. తార్క్ష్యునికి తపోదాన మహిమాతిశయాన్ని సెలవిచ్చేదిగా సరస్వతీ దేవి, గోస్త్రీ సంవాదములో గోవుల దగ్గరకు వెళ్లి, తనను వాటి మధ్య ఉండనిమ్మని ప్రార్థిస్తున్నదిగా లక్ష్మీదేవి, ఉమామహేశ్వర సంవాదంలో పరమేశ్వరునితో అనేక విషయాలు చర్చించి, తెలుసుకొని, పతివ్రతాలక్షణాలను శంకరునికి తెలియ చేసినదిగా పార్వతీదేవి చిత్రించబడ్డారు. ఉపశృతి అనే దేవత శచీదేవికి ఇంద్ర దర్శనం కల్గిస్తుంది.

(ఆ)అప్సరసలు :- దేవవేశ్యలు. మునుల తపోభంగానికై ఇంద్రుడు వీరిలో అధిక సంఖ్యాకులను నియోగించాడు.

<u>1.మేనక</u> :- విశ్వావసుడనే రాజు వల్ల ప్రమద్వరకు జన్మనిస్తుంది. విశ్వామిత్రునికి తపోభంగం చేసి శకుంతలను కంటుంది. వృషతుడనే పాంచాల రాజుకు తపోభంగం చేసి మరుత్తు అంశతో ద్రుపదుని జన్మకు కారకురాలవుతుంది.

<u>2.ఊర్వశి</u> :- పురూరవుని భార్య. ఇంద్రుని ప్రియురాలు.అర్జునుని మోహించి, తిరస్కరింపబడి శపించింది.

<u>3.ఘృతాచి</u> :- వేదవ్యాసునికి అరణిలో దర్శనమిచ్చి శుకుని జన్మకు, భరద్వాజునికి

నగ్నంగా దర్శనమిచ్చి ద్రోణుని జన్మకు కారణమవుతుంది.

4. అద్రిక :- శాపవశాత్తూ చేపయై వసురాజు వీర్యబిందుద్వయం మ్రింగి మత్స్యగంధి, మత్స్యరాజులను ప్రభవిస్తుంది.

5.అలంబుస :- దధీచికి తపోభంగం చేస్తుంది.అతని రేతస్సును సరస్వతీనది ధరించి సారస్వతుణ్ణి కంటుంది.

6.పంచచూడ :- నారదునికి స్త్రీలు దుష్ట స్వభావలని తెలుపుతుంది.

7.నంద

8.సౌరభేయి కుబేరుని ఇష్ట సఖులైన అప్సరసలు. బ్రాహ్మణ శాపవశాత్తు

9. సమీచి

10 బుద్బుద మొసళ్లుగా మారి అర్జునుని వల్ల శాపమోక్ష ం పొందినవారు

11 లత

(ఇ) సప్తమాతృకలు :- హవిష, కాళి, కౌశిక, ఉద్ధత, శీర్య, ఆర్య, వైధాత్రి - వీరూ దివ్యస్త్రీలే. లోకమాతలు. శిశుపీడ, పశుపీడాదులచే దుష్కీర్తిని పొందారు.

## 2 రాక్షస స్త్రీలు

1. హిడింబి :- రాక్షస స్త్రీ యైనా దివ్యత్వం కలది. పతివ్రత. భూత భవిష్యత్తులు తెలిసినది. భీముని భార్యయై పాండవులకు ప్రథమ వారసుణ్ణి అందించింది.

2. వృషాదర్భుని హోమంలో పుట్టిన రాక్షసి :- సప్తర్షులను సంహరించ బూనుకొని చివరకు తానే మరణిస్తుంది.

3. పుష్పోత్కట :- రావణ కుంభకర్ణుల తల్లి.

4. మాలిని :- విభీషణుని తల్లి.

5. పాబక :- ఖర, శూర్పణఖల తల్లి

6. శూర్పణఖ :- లక్ష్మణునిచే వికృతరూపయై సీతాపహరణకు రావణుని ప్రేరేపించినది.

7. త్రిజట :- రాక్షస స్త్రీలలో ఉత్తమురాలు.

8. త్ర్యక్షి 12. లలాటాక్షి
9. ఏకాక్షి 13. దీర్ఘజిహ్వా
10. త్రిస్తని 14. అజిహ్వా
11. ఏకపాది 15. ఏకలోచని

} సీతకు కాసలా ఉన్న రాక్షస స్త్రీలు

## 3 దేవతల అంశతో జన్మించిన మానవ స్త్రీలు

1. దేవకి :- విష్ణుదేవునంశతో పుట్టినది.
2. రుక్మిణి :- లక్ష్మి అంశతో జన్మించినది.
3. శ్రీకృష్ణుని పదహారు వేలమంది అంతఃపుర స్త్రీలు :- అప్సరసల అంశతో జన్మించిన వారు.
4. గాంధారి :- మతి అనే వేల్పు అంశతో జన్మించినది.
5. కుంతి సిద్ధి, బుద్ధి అనే దేవతలు కుంతీమాద్రులుగా జన్మించారు.
6. మాద్రి
7. యాజ్ఞసేని :- శ్రీమూర్తి

## 4.తిర్యాగాదులైన స్త్రీలు

1. దేవశుని శరమ :- మాధ్యమిక దేవతా వర్గానికి చెందినది. ఉచితానుచితాలాలోచించకుండా మంచి వారికి, పేదలకు, హానిచేసేవారికి కీడు కల్గుతుందని జనమేజయుని తమ్ములను శపించింది.ప్రతీకారార్థంగా జనమేజయుడు శాంతి పౌష్టిక క్రియలు నిర్వర్తిస్తాడు.
2. గోమాత సురభి :- దుర్బలులైన సంతానంపై తల్లికి ప్రేమ ఎక్కువని నిరూపించింది.
3. వ్యాఘ్రమాత :- కొడుక్కు హితులెవరో, అహితులెవరో తెలిపిన రాజనీతిజ్ఞురాలు.
4. లావుకపెంటి జరిత :- సంతానం అగ్నికి ఆహుతి అవుతుందేమోనని నిస్సహాయంగా విలపించిన మాతృమూర్తి.
5. రంతిదేవుని యజ్ఞంలోని గోవు :- తాను యజ్ఞపశువు కాబోతున్నందున తన దూడను చూచి విలపించిన దీ గోమాత.
6. కపోతి :- స్త్రీత్వము, పాతివ్రత్యము, అతిథి సేవ రాశీభూతమైన మహనీయ.
7. కరంజ :- వృక్ష మాత.
8. నందిని :-సురభి పుత్రి, వసిష్ఠుని హోమధేనువు.
9. పూజని :- బ్రహ్మదత్తునికి పగ యొక్క తీవ్రతను ఉపన్యసించిన గోరువంక.
10. తామ్ర అనే స్త్రీకి జన్మించిన కాకి, శ్యేని, భాసి, ధృతరాష్ట్రి, శుకి అనే కన్యకలు పక్షి మాతలౌతారు. కాకికి ఉలూకాలు, శ్యేనికి శ్యేనాలు, భాసికి భాస, గృధ్రాదులు, ధృతరాష్ట్రికి హంస చక్రవాకాలు, శుచికి శుకాలు పుడతాయి.
11. క్రోధుడనే వానికి పుట్టిన మృగి, మృదమంద, హరి, భద్రమనస, మాతంగి, శార్దూలి,శ్వేత, సురభి, సురస- అనే కన్యలు జంతువులకు తల్లులవుతారు.

మృగికి మృగాలు, మృగమందకు ఎలుగుబంట్లు, చమరమృగాదులు, భద్రమనసకు ఐరావణం, హరికి వానరగణాలు, మాతంగికి ఏనుగులు, శార్దూలికి సింహాలు, పెద్దపులులు, శ్వేతకు దిగ్గజాలు పుడతాయి. సురభికి జన్మించిన రోహిణికి పశుగణాలు, గంధర్వికి గుఱ్ఱాలు, సురసకు సర్పాలు పుడతాయి.

## 5 స్త్రీ రూపం దాల్చిన నదులు

1. గంగ :- స్త్రీ రూపిణియై శంతనుని భార్యయై అష్ట వసువులకు జన్మనిచ్చింది. అష్టమ వసువైన దేవవ్రతుని పెంచి, పెద్దచేసి, విద్యావంతుని చేసింది.

2. శుక్తిమతి :- కోలాహల పర్వత సంగమంతో గిరికా వసుపాదులకు జన్మనిచ్చి వసురాజుకు కానుకగా ఇచ్చింది.

3. సరస్వతీ నది :- మతినారునికి భార్యయైనది. మనుష్య రూపధారిణియై శ్వేతకేతుని సేవిస్తుంది. దధీచి వీర్యాన్ని ధరించి సారస్వతుణ్ని ప్రభవిస్తుంది. నైమిశారణ్యంలో, మంకణముని యాగం చేసిన ప్రాంతంలో ఏడు పేర్లతో ఏడుగురు స్త్రీమూర్తులుగా యజమానులను, మునులను సేవిస్తుంది.

4. గోదావరి
5. పెన్న
6. కృష్ణవేణి
7. బాహుద
8. తమస
9. రేవ
10. గోమతి
11. కౌశికి
12. కావేరి

ఈ నదులన్నీ స్త్రీరూపంలో ఎప్పుడూ తనను వెన్నంటే ఉన్నట్లుగా పార్వతి పరమేశ్వరునితో చెబుతుంది. గంగతో సహా నదీమాతలు నిరంతరం పార్వతిని సేవిస్తూ ఉంటారు.

## 6. నదులైన స్త్రీలు

1. పతివ్రతయైన పులోమ పులోముడనే రాక్షసుడు తనను ఎత్తుకొని పోతూన్నపుడు తాను విలపించినంతమేరా నదియై 'వధూసర' అన్న పేరుతో పిలువబడుతుంది.
2. గంగ శాపం వల్ల అంబ నదియై అదే పేరుతో మత్స్య దేశంలో ప్రవహిస్తుంది.
3. మహాపతివ్రతయైన ఓఘవతి ధర్ముని వరం వల్ల అదే పేరుతో నదియై ప్రవహిస్తుంది.

## 7. స్త్రీగా మారిన పురుషులు

1. స్థూలకర్ణుడనే యక్షుడు శిఖండికి తన పురుషత్వాన్ని ఇచ్చి, స్త్రీగా మారి, కుబేరుని శాపం వల్ల శాశ్వతంగా స్త్రీత్వాన్ని పొందుతాడు.
2. భంగ్వాసనుడనే రాజు భంగ్వాసనిగా మారి,వేరొక మునిని వివాహం చేసుకొని నూరుమంది పుత్రులను కంటాడు.

## 8. పురుషులైన స్త్రీలు

1.ద్రుపదునికి ఈశ్వరుని వరం వల్ల స్త్రీగా పుట్టిన శిఖండి స్థూల కర్ణుడనే యక్షుని దయవల్ల పురుషునిగా మారుతుంది.

## 9. బహుభర్తృకలైన స్త్రీలు

1. జటిలముని కుమార్తె 2. దాక్షాయని 3. అజిత -వీరు
ద్రౌపది కన్నా ముందే బహుభర్తృకలని వ్యాసుడు ద్రుపదునికి తెలియజేస్తాడు.

## 10. పుత్రవతులైనా కన్యాత్వం పోనివారు.

సత్యవతి, కుంతి, మాధవి, ద్రౌపది. ద్రౌపది శంకరుని వరం వల్ల, సత్యవతి వ్యాసుని వరం వల్ల, కుంతి సూర్యుని వల్ల, మాధవి ఒక మహానుభావుని వల్ల యిట్టి వరాలను పొందారు.

## 11. సద్యోగర్భంలో పుత్రులను కన్న స్త్రీలు.

సత్యవతి వ్యాసుని, కుంతి కర్ణుని, హిడింబ ఘటోత్కచుని, ఉలూచి ఇరావంతుణ్ణీ సద్యోగర్భంలో కన్నారు.

మాతృత్వమనేది లోకంలోని స్త్రీలందరికి సర్వసామాన్య ధర్మం. తొమ్మిది నెలలు గర్భభారం వహించిన తరువాత సంతాన ప్రాప్తి లోక సహజమైన విషయం. కాని సద్యోగర్భంలో సంతానాన్ని పొందడం అసహజమైన, విడ్డూరమైన విషయం.ఆంధ్ర మహాభారతంలోని స్త్రీపాత్రలలో కొందరు కృత్రిమ పద్ధతుల వలన సంతానం పొందడం, మరికొందరు అతి దీర్ఘకాలం గర్భధారణ చేయడం ఆశ్చర్యాన్ని కలిగించడమేగాక, సహజత్వానికి దూరమైన విషయాలు. భారతంలోని అతి మానుషమైన అలౌకికమైన మహిమాన్వితమైన లీలలుగా వీటిని సరిపెట్టుకోవాలి.

కుంతీ, సత్యవతులు అవివాహితలుగా పుత్రవతులైనారు.కాబట్టి వారి గర్భాలు లోకానికి ప్రకటితం కాకూడదని వారికి సద్యోగర్భాన పుత్రజననమైందని

భావించ వచ్చును. కుంతి కర్ణుని పదినెలలు మోసి కన్నదనే తిక్కన, ఎఱ్ఱనల అభిప్రాయం.ఉలూచీ హిడింబలు వివాహితలై సద్యోగర్భంలో పుత్రవతులవడం ఎందుకో వివరింపబడలేదు. ఇక అసహజమైన రీతులలో సంతాన ప్రాప్తి పొందిన స్త్రీల నీవిధంగా వర్గీకరింపవచ్చును.

## 12. దీర్ఘకాలం గర్భధారణ చేసిన స్త్రీలు

1. శకుంతల :- భరతుణ్ణి మూడేండ్లు గర్భంలో మోస్తుంది.
2. అదృశ్యంతి :- పన్నెండు సంవత్సరాలు గర్భాన్ని మోసి పరాశరునికి జన్మనిస్తుంది.
3. మదయంతి :- ఈమె కూడ పన్నెండేండ్లు గర్భాన్ని మోసి, విసిగి గర్భతాడనం చేసుకోగా 'అశ్మకు'డనే రాజర్షి పుడతాడు.
4. భృగుపత్ని :- ఈమె నూరు సంవత్సరాలు గర్భాన్ని తన తొడలో దాచింది. తొడ నుండి పుట్టిన వాడు కాబట్టే ఆమె కుమారుడు ఔర్వుడు.
5. లోపాముద్ర :- ఏడేండ్లు గర్భం దాల్చి దృఢస్యుడనే కొడుకును కంటుంది.

## 13. కృత్రిమ పద్ధతుల వల్ల సంతానం పొందిన స్త్రీలు

1. పులోమ :- ఈమె గర్భస్థ శిశువు సహజ మార్గానగాక కుక్షిగుండా బయట పడతాడు.
2. కద్రువ :- ఈమె గర్భాలు అండాలు కాగా వాటిని నేతి కుండలలో బెట్టి రక్షిస్తూ ఉండగా, అయిదు వందల ఏండ్లకు వాటినుండి వేయి మంది నాగులు జన్మిస్తారు.
3. వినత :- సవతివలె తానూ తన గర్భాండాలను అయిదు వందల ఏండ్లు రక్షించినా సంతానం కల్గలేదని, తన రెండు అండాలలో ఒకదాన్ని చిదుమగా అసంపూర్ణ దేహంతో అనూరుడు పుడతాడు.

వేయి సంవత్సరాలు అండాన్ని రక్షించగా గరుత్మంతుడు పుడతాడు.

4. సత్యవతి, ఆమె తల్లి వృక్ష సంబంధమైన చరువుల నుపయోగించి, వృక్షాల నాలింగనం చేసుకోవడం ద్వారా పుత్రవతులవుతారు.
5. బృహద్రథుని భార్యలు భర్త యిచ్చిన మామిడి పండును చెరి సగం తిని, చెరి అర్ధ దేహం మాత్రమే కల శిశువును ప్రసవిస్తారు.
6. స్వాహాదేవి :- అగ్ని భార్య. ఆరుగురు ముని పత్నుల (కృత్తికల)రూపంలో భర్తతో సంగమించి,ఆరు సార్లు స్ఖలింపబడిన ఆ వీర్యాన్ని ఒక రెల్లు దుబ్బలో సంపెంగ పొదలో దాచగా దాని నుండి ఆరు ముఖాలు పన్నెండు చేతులుగల కుమారస్వామి జన్మిస్తాడు.

7. భద్ర :- భర్త స్వప్న సమాగమం వల్ల పుత్రులను పొందుతుంది.
8. అద్రిక :- వసురాజు వీర్యబిందు ద్వయం మింగి గర్భవతియైన చేపరూపంలో ఉన్న అప్సర.

## 14.నియోగ పద్ధతిలో సంతానవతులైన స్త్రీలు

1. అంబిక
2. అంబాలిక } సత్యవతి నియోగం చేత వ్యాసుని వల్ల ధృతరాష్ట్ర, పాండురాజులనుపొందారు.

3. కుంతి :- భర్త ఆజ్ఞమేరకు ధర్మానిల శక్రుల ద్వారా ధర్మజ, భీమార్జునులను కన్నది.

4.మాద్రి :- ఈమె తన కోరిక మేరకే భర్త నర్థించి కుంతి దయతో అశ్వనుల వలన సంతానం పొందింది.

5.శారదండాయని అనే రాజు తన భార్యను ఋత్విజుల వల్ల సంతానం పొందమని నియోగిస్తాడు.

6. కల్మాషపాదుడు తన భార్యను వసిష్ఠ మహర్షి వల్ల పుత్రవతి కమ్మని నియోగిస్తాడు.

7. బలి అనే రాజు తన భార్య సుదేష్ణను దీర్ఘతముడనే వృద్ధముని వల్ల సంతానం పొందమని నియోగిస్తాడు.

## 15 దర్శనమాత్రం చేత ఋషుల సంతాన ప్రాప్తికి కారణమైన స్త్రీలు

1. ఘృతాచి :- భరద్వాజునికి నగ్నంగా దర్శనమీయగా అతనికి రేతఃస్ఖలనం అవుతుంది. దాని నుండి ద్రోణుడు పుడతాడు.

2. జానపది :- తన హావ భావ విలాసాలచే శరద్వంతునికి చాంచల్యం కల్గించింది. అతనికి రేతః స్ఖలనం కాగా ఆ బిందు ద్వయం నుండి కృపుడు, కృపి జన్మిస్తారు.

3. మేనక :- ఈమె పృషతుడనే పాంచాల రాజుకు పై విధంగానే ద్రుపదుడు కల్గేట్లు చేసింది.

4. ఘృతాచి :- వేదవ్యాసునికి అరణిలో దర్శనమిచ్చి శుకుని జన్మకు కారకురాలైంది.

## 16 భర్తృపరిత్యక్తలైన స్త్రీలు

పురాణకాలంలోను, భారత కాలంలోను స్త్రీలకు జరిగిన అన్యాయాలు అన్నీ ఇన్నీ కావు. నిష్కారణంగా భర్తచే పరిత్యజింపబడి దుర్భరమైన దుఃఖాగ్నిచే దహింపబడిన స్త్రీలు ఈ నాటి సమాజంలో లాగ ఆనాడూ ఉన్నారు.

1. మానవలోకానికి వచ్చి, మానవ కన్య సుకుమారిని వలచి, భార్యగా పొంది,

కాపురం చేసి, నిష్కారణంగా ఆమెను వదిలి నట్టేట ముంచినవాడు నారదుడు.
2. ముని పత్నులపై వ్యామోహంతో, నూత్న యౌవ్వనంలో ఉన్న సుదర్శనపై మరులుతో భార్య స్వాహాదేవిని పరిత్యజిస్తాడు అగ్ని.
3. ఏడాది పాటు రావణుని చెరలో బందీగా ఉండిన తన భార్య సీతను"నీవు కుక్క ముట్టిన హవ్యమైనా" వని పరిత్యజిస్తాడు రాముడు.
4. తనను నమ్మి నిశ్చింతగా నిద్రిస్తూన్న భార్యను అర్ధరాత్రి నట్టడివిలో ఒంటరిగా వదిలి వెళ్లిపోతాడు నలుడు.
5. అసిధారా వ్రతం లాగా తనకు అహర్నిశలూ సపర్యలు చేస్తూండిన భార్యను కేవలం తనను నిద్రలేపిందన్న సాకుతో వదిలి వేస్తాడు జరత్కారువు.

## 17 భర్తను పరిత్యజించిన స్త్రీలు

వృద్ధుడూ, పుట్టుగ్రుడ్డీ యైన భర్తను తానే భరిస్తూన్న కారణంగా ద్వేషించి, కొడుకులతో అతన్ని కర్రలతో కట్టి నదిలో పడవేయించింది ప్రద్వేషిణి.భారతంలోని స్త్రీ పాత్రలన్నింటిలోను యింత క్రూరంగా భర్త పట్ల ప్రవర్తించిన స్త్రీ ఈమె ఒక్కర్తే.

## 18.అత్యాచారానికి గురైన స్త్రీలు

శతాబ్దాలు గడిచినా, యుగాలు మారినా స్త్రీ పట్ల పురుషుని దృక్పథం మారలేదని భారతంలోని కొన్ని స్త్రీపాత్రల మూలంగా స్పష్టమౌతోంది. వివాహిత యైనా గర్భవతియైనా, ఒంటరిగా ఉన్న స్త్రీలేగాక భర్తా పుత్రుల సమక్షంలో కూడా స్త్రీలు బలవంతులు, దుర్మార్గుల క్రూరవాంఛకు గురియైన సంఘటనలు నాటి సంఘంలో పురుషుల విశృంఖల పోకడలను తెలియజేస్తాయి. కొందరు రక్షింప బడ్డారు. కొందరు బలియైనారు.
1. పులోమ :- నిండు గర్భిణి. పులోముడనే రాక్షసుడు బలవంతంగా ఎత్తుకొని పోతూండగా ఆమె గర్భస్థ శిశువే కుక్షి గుండా బయటపడి, ఆ రాక్షసుని తన తేజంతోనే దహించి తల్లిని రక్షిస్తాడు.
2. మమత :- పూర్ణ గర్భిణియైన మమతను అతిథిగా వచ్చిన బృహస్పతి కామించగా గర్భస్థ శిశువు అడ్డుపడి శాపానికి గురి అవుతాడు.
3. మత్స్యగంధి :- పరాశరుని శాప భయంతో ఇష్టం లేకున్నా లొంగి పోయిన ఈ కన్య పట్ల జరిగింది అత్యాచారమే.ఎన్నో విధాల అడ్డుచెప్పి విఫలురాలైంది.
4. కుంతి :- ఈమె పట్ల సూర్యుని ప్రవర్తన కేవలం బలాత్కారమే.

5. ఉద్దాలకుని భార్య :- మహాసాధ్వి అతిథిగా వచ్చిన వృద్ధబ్రాహ్మణుడామెను కామించగా కుమారుడైన శ్వేతకేతువు అడ్డుపడి ఆక్రోశిస్తాడు

అతిథులుగా వచ్చి గృహిణుల శీలాన్ని ఆతిథ్యంగా కోరటం నాడు సర్వసామాన్యమని, భర్తలు కూడా అంగీకరించే వారని ఓఘవతి, శ్వేతకేతుని తల్లి-వీరి దృష్టాంతాలు ఋజువు చేస్తున్నాయి.

6. దమయంతి :- అరణ్యంలో తనను కొండచిలువ బారినుండి రక్షించిన నిషాదుడే కామించి, బలాత్కరించ బోగా తన పాతివ్రత్యం వల్ల రక్షించ బడింది.

7. ద్రౌపది :- ఒంటరిగా ఉన్న ద్రౌపదిని బలవంతంగా ఎత్తుకొని పోయిన సైంధవుడు పాండవుల వల్ల పరాభూతుడవగా రక్షింపబడింది. కీచకుని వల్ల, కౌరవ సభలోనూ ఈమె పొందిన పరాభవాలు జగద్విదితం.

## 19. బహుభార్యాత్వానికి బలియైన స్త్రీలు

ఒక పురుషునికి ఒకే భార్య అయితేనే ఆ స్త్రీ సౌభాగ్యవతిగా భర్త వల్ల పత్నీత్వపు హోదాను, భర్త అనురాగాన్ని, సాంఘిక గౌరవాన్ని, దైహికంగా గాని, మానసికంగా గాని పరిపూర్ణమైన ఆనందాన్ని పొందగల్గుతుంది.తన భర్తకు వారసులను ప్రసాదించి, అమితమైన ఆనందంతో మాతృత్వపు గౌరవాన్ని అనుభవిస్తుంది.

భారత కాలంనాడు సంఘంలో బహుభార్యాత్వం విస్తృతంగా అమలులో ఉండింది. దాని ఫలితంగా సవతుల మధ్యపోరు, వారిలో మొదట కొడుకును కన్న వారికి తప్ప తక్కిన వారికీ వారి సంతానానికీ దుర్భరమైన యాతనలు ఉండేవి.

1. వినత :- సవతియైన కద్రువకు దాసియైతన కొడుకుతో గూడా దాస్యం చేయించ వలసి వచ్చింది.

2. ధృతరాష్ట్రుని నూటపది మంది భార్యలు :- గాంధారితో బాటు ఆమె చెల్లెళ్ళ పదిమందిని, మరొక నూరుమంది కులము, రూపము, గుణము గల కన్యలను ధృతరాష్ట్రుడు వివాహమాడినాడు. వివాహ సమయంలో గాంధారి చెల్లెళ్ల పదిమంది పేర్లు తప్ప, తక్కిన నూరుగురి పేర్లుగాని,ఆ మొత్తం నూట పదిమంది ఊసుగాని భారతంలో ఎక్కడా కన్పించదు. అనామకురాళ్లైన వీరి సౌభాగ్యపు పరిమితి ఎంతో ఊహింపవచ్చు.

3. ధర్మరాజాదులకు ద్రౌపదిగాక వేరువేరు భార్యలున్నారు.అర్జునుని భార్యలైన సుభద్రా, ఉలూచీ, చిత్రాంగదలు తప్ప తక్కిన వారెక్కడా తారసిల్లరు.

4. చంద్రునికి దక్షుని కుమార్తె లిరవైఏడు మంది భార్యలు.
5. సుకన్య తండ్రి శర్యాతికి "చతుస్సహస్రదేవీ నివహం" ఉండేది.
6. శ్రీకృష్ణుని అంతఃపుర స్త్రీలు పదహారు వేల ఎనిమిది మంది అన్నది లోక విదితమే. వారిలో అష్టమహిషులు కొంత ప్రసిద్ధం.రుక్మిణి, సత్యభామ, జాంబవతుల పేర్లుతప్ప భారతంలో వీరెవ్వరి పేర్లు కనిపించవు.
7. శశిబిందుడనే రాజుకు లక్షమంది భార్యలు !

## 20. దాసీత్వానికి అంకితమైన స్త్రీలు.

రాచరిక వ్యవస్థలో వివాహమైన రాజపుత్రితో బాటు వందలు, వేల సంఖ్యలో దాసదాసీ జనాన్ని ఆమె వెంట పంపే పద్ధతి ఉండేది. ఈ దాసీ జనానికి స్వంత జీవితం, భర్త, కుటుంబం,వైవాహిక జీవితం, సంతాన భాగ్యం - ఏమీ ఉండేవి కావు. తమ యజమానురాలికి నిరంతరం సేవలు అందించడంతో బాటు యజమానికి కూడా వాళ్లు అన్ని వేళలా, అన్ని విధాలా అందుబాటులో ఉండాలి. వాళ్లు భోగ్య వస్తువులు మాత్రమే. ఎంతో దారుణమైన వాస్తవమిది!
1. దేవయాని శర్మిష్ఠతో బాటు వేయిమంది దాసీలను తన వెంట పంపమని వృషపర్వుని కోరుతుంది. వాళ్లందరితో 'దేవేంద్రవైభవం' అనుభవించమని యయాతిని కోరుతుంది.

"నన్ను వివాహమై నహుష నందన యీలలితాంగి దొట్టి యీ
కన్నియ లందరున్ దివిజ కన్యలతో నెనయైన వారు నీ
కున్నతి బ్రీతిసేయగ నృపోత్తమ వాసవు బోలి లీలతో
నిన్నరలోక భోగము లనేకము లందుము నీవు నావుడున్"

2. సుభద్రా వివాహ సమయంలో శ్రీకృష్ణుడు "రమ్య భూషణాలకృతలైన స్త్రీ సహస్రాన్ని అరణంగా ఇస్తాడు.
3. అభిమన్యుని వివాహ సందర్భంగా విరాటుడు కుమార్తెకు లక్షమంది దాసదాసీ జనాన్ని అరణంగా ఇస్తాడు.

## 21. వృద్ధ వివాహాలకు బలియైన స్త్రీలు

1. సత్యవతి :- గంగను వివాహమాడి, పుత్రవంతుడై యుక్త వయస్కుడైన కుమారునికి పెళ్లి చేయవలసిన వయస్సులో శంతనుడు సత్యవతిని వివాహమాడతాడు.తండ్రి దాశరాజు ఆజ్ఞకు సత్యవతి బద్ధురాలు.
2. సుకన్య :- చ్యవన మహర్షి వల్ల తన సైన్యానికి కల్గిన శాపాన్ని బాపుకొనేందుకు

ముక్కుపచ్చలారని ముగ్ధమోహన రూపసి సుకన్యను పండు ముసలియైన చ్యవనునికి సమర్పిస్తాడు శర్యాతి.

## 22. సహగమన మాచరించిన స్త్రీలు

సతీసహగమనం భారతకాలానికి నిర్బంధంకాదు. అయినా పతివ్రతలైన స్త్రీలు భర్తతో సహగమనం చేసే వారు. నాటి సంఘం ఇందుకామోదముద్ర వేసింది.

పాండురాజు భార్య మాద్రి,శ్రీకృష్ణుని భార్యలు రుక్మిణీ జాంబవతులు సహగమనం చేశారు.

## 23. వృత్తివిద్య, యుద్ధవిద్యా నిపుణలు

ఆ నాటి స్త్రీలకు వృత్తి విద్యా నైపుణ్యం,యుద్ధ విద్యా నైపుణ్యం ఉండే దనటానికి భారతకథలో ఆధారాలున్నాయి. మత్స్యగంధి పడవపడిపేది. అర్జునుడు సుభద్రా సహితుడై ద్వారక నుండి వస్తున్నపుడు సుభద్ర రథం నడిపింది.

## 24. ఆధ్యాత్మిక జ్ఞాన సంపన్నలు, ధర్మజ్ఞలు

జనకునితో వేదాంత చర్చ చేసిన సులభ ఆధ్యాత్మిక జ్ఞానసంపదతో రాజర్షియైన అతణ్ణి నిరుత్తరుని చేసింది. జనకుని భార్య, సావిత్రి, శకుంతల, దమయంతి,ద్రౌపది, గాంధారి-ఆయా సందర్భాలలో వీళ్లు చేసిన ధర్మసంబంధమైన చర్చ, హితోపదేశం వీనుల విందులేగాదు, ఆత్మానంద సంధాయకాలు కూడ.

## 25. పతివ్రతా శిరోమణులు

భారతంలోని స్త్రీపాత్రల్లో అత్యధిక భాగం పతివ్రతలే. శకుంతల, సీత, సావిత్రి, గాంధారి, కుంతి, ద్రౌపది, దమయంతి, రుక్మిణి, సుకన్య, సుకుమారి, కుశికుని పత్ని, భుజగాంగన, కపోతి, ఓఘవతి, లోపాముద్ర, కౌశికుని ప్రబోధించిన పతివ్రత - వీళ్లందరూ తమ పాతివ్రత్యం వల్ల భారత స్త్రీలకు చరిత్రలో మహోన్నతమైన స్థానాన్ని సిద్ధింపజేసిన మహనీయమూర్తులు.

# అధ్యాయం 3
# విశ్లేషణ
# కథతో ప్రత్యక్ష సంబంధం ఉన్న పాత్రలు

కవిత్రయ విరచితమైన ఆంధ్ర మహాభారతంలోని స్త్రీ పాత్రలను కథలను బట్టి రెండు విధాలుగా వర్గీకరింపవచ్చును. ప్రధానమైన కథతో ప్రత్యక్ష సంబంధం కల్గినవి, పరోక్ష సంబంధం కల్గినవి అని. వీటిలో కూడ నామమాత్రావశిష్టమైన పాత్రలనేకం. ఉపాఖ్యానాలలో వచ్చే స్త్రీ పాత్రలన్నీ రెండవ కోవకు చెందినవి. ప్రధాన కథతో ఎట్టి సంబంధం లేకపోయినా, తమ విశిష్టమైన వ్యక్తిత్వంతో పాఠకుల మనస్సులపై బలమైన, చెరగని ముద్ర వేసిన పాత్రలు ఉపాఖ్యానాలలో అనేకం.

భారతదేశంలో పితృస్వామ్య వ్యవస్థ బలపడిన తర్వాత వ్రాయబడిన గ్రంథం భారతం కాబట్టి మొత్తం గ్రంథంలో పురుష పాత్రలకున్న ప్రాధాన్యం స్త్రీ పాత్రలకు లేదు. ఆంధ్ర మహా భారతంలోని స్త్రీ పాత్రలు అయిదు తరాలకు చెందినవి.

మొత్తం మహాభారత కథకంతా మూల మనదగినవి గంగ, సత్యవతి పాత్రలు. ఇవి మొదటి తరం పాత్రలు. స్త్రీ పాత్రలన్నింటిలో అత్యంత ప్రాధాన్యమూ, గౌరవము గల కుంతి పాత్ర. గాంధారీ మాద్రులపాత్రలు మూడవ తరానికి చెందిన పాత్రలు. కాగా సత్యవతి కోడళ్లైన అంబికా, అంబాలికలు రెండవ తరానికి చెందినవారు. అంబ రెండవ తరానికి చెందినా నాల్గవ తరం దాకా విస్తరించిన పాత్ర. ద్రౌపది, హిడింబ, సుదేష్ణ, ఉలూచీ చిత్రాంగదలు, సుభద్ర నాల్గవ తరానికి చెందిన పాత్రలు. పరీక్షిత్తుకు తల్లిగా వంశాన్ని పరిరక్షించిన ఉత్తర అయిదవ తరానికి చెందినది.

తక్కిన పురుష పాత్రలన్నీ ఈ పాత్రల మధ్యనే ప్రవర్తిస్తాయి.

## 1. గంగ

దివ్యాంగనయైన గంగ మహభిషునిపై ప్రేమలో పడటం,అతన్ని పొందడం కోసమై తాను మానవ స్త్రీగా అవతారమెత్తడం అత్యంత సహజమైన మానవ మనో ప్రవృత్తికి నిదర్శనం. కాని, గంగ ప్రతీపునికి సాక్షాత్కరించి తనను వివాహం చేసుకోమని “సాభిలాషంగా చూస్తూ” కోరడమన్నది అర్థం కాని విషయం.

"ఏను జహ్నుకన్య నింద్ర సమాననీ;
సద్గుణావళులకు సంతసిల్లి
భాను తేజ నీకు భార్యగా వచ్చితి;
నిష్టమున బరిగ్రహింపు నన్ను"[1]

అష్టవసువుల శాప వియోగం కోసం కరుణార్ద్ర చిత్తంతో వారికి వాగ్దానం చేసిన గంగ మాతృత్వ సౌభాగ్యాన్ని పొంది, నవమాసాలు మోసి, జన్మనిచ్చిన శిశువులను పుట్టిన వెంటనే యేటిపాలు చేయడానికి ఎంత దుఃఖాన్ని అనుభవించి ఉంటుందో ఎవరూహింపగలరు? "పుత్రఘాతిని" అన్న నిందను భర్త నోటి వెంట విని భరించవలసి వచ్చింది. స్త్రీ సహజమైన మాతృత్వపు మమకారంతో తనకు దీర్ఘాయుష్మంతుడైన కుమారుడు కావాలని వసువులను కోరి, ఆ ప్రకారమే అష్టమవసువైన చివరి పుత్రుణ్ణి తానే పెంచి పెద్ద చేస్తానని భర్తను కోరుతుంది. కన్నబిడ్డ ఆలనా పాలనా, ముద్దు ముచ్చటలు తనివితీరా అనుభవించి ఆబిడ్డడిని సకలశాస్త్రపారంగతునిగా ధనుర్విద్యావిశారదునిగా తయారుచేసి, చివరకు భర్తకు అప్పగించి నిష్క్రమించేటప్పుడు గంగ మాతృహృదయం ఎంత పుత్ర వియోగ దుఃఖాన్ని అనుభవించి అణచుకొన్నదో! సమయపాలన పేరుతో భర్తృవియోగం తనకు తానే విధించుకొన్నది.

ప్రేమించిన వా[illegible] చేజేతులా వదలుకొన్న ప్రేమమయిగా, కన్నబిడ్డలను నీటిపాలు చేసిన కసాయిదానిగా తనను భర్త భావించినా [illegible] శాపవిముక్తి కోసం స్థిరచిత్తంతో కర్తవ్యాన్ని నెరవేర్చిన దృఢమనస్కురాలిగా, మాతృత్వపు మమకారానికి ప్రతీకయై అష్టవసువులనుండి పుత్రభిక్ష పొంది తల్లిగా, జీవితాన్ని చరితార్థం చేసుకొన్న ధన్యమూర్తిగా, పరమయోగ్యునిగా తీర్చిదిద్దుకొన్న బిడ్డను చివరకు కన్న తండ్రికి అప్పగించి పుత్రవియోగాన్ని సహించిన త్యాగమయిగా, గంగ భారతంలోని స్త్రీ పాత్రలలో చిరస్మరణీయమైనది.

అంబ కోపాగ్నికి తన కుమారుడు ఆహుతి కాకూడదని అడుగడుగునా ఆతల్లి పడిన ఆరాటం, వసువులతో కలసి భీష్మపరశురాముల యుద్ధాన్ని విరమింపచేయడం, కఠోరమైన దుష్కరవ్రతాలతో, తపస్సుతో భీష్ముని అంతం చేయదల్చిన అంబను నదివై పొమ్మని శపించడం, గంగ మాతృహృదయాన్ని ఆవిష్కరించే కమనీయఘట్టాలు.

భీష్ముడు స్వచ్ఛందమరణం పొందిన తరువాత ధృతరాష్ట్రాదులు తిలోదక

భార.ఆది.ఆ4.ప.137

ప్రదానం చేస్తున్న సమయంలో అవతరించిన గంగ మూర్తీభవించిన పుత్రశోకం. లోకంలోని అందరు తల్లులలాగా తన కుమారుని గుణగానం చేస్తుంది. అతని పరాక్రమాన్ని కీర్తిస్తుంది.

"చెప్పవినుడుదృఢవ్రత శీలుడమల ,
బుద్ధిరాజవృత్తాఢ్యుడు భూరికృపుడు
కార్యసువేది పితృభక్తి ధుర్యుడార్య,
సమ్మతుండు విద్యా పరిశ్రమ ఘనుడు." [1]
"కాశిరాజు కన్యకలకు గాబెనంగి ,
వానిచే గాసియైరి భూవరులు
పలువురంబకైపూని వాని మహాబలంబు,
జామదగ్న్యుండు దెరలుప జాలడయ్యె"[2]

అంతటివాడు శిఖండిచేతిలో దుర్మరణం పొలవడం చూచికూడా తన హృదయం బ్రద్దలు కాలేదంటే అది వజ్ర సదృశ కఠినమని వాపోయిన గంగ ఎంతటి దివ్యవనితలకైనా పుత్ర శోకం సామాన్యమని నిరూపిస్తుంది.

దివ్యనదియై , దివిజభామినిగా, మానవకాంతగా, శంతనుని ఇల్లాలిగా వివిధ భూమికలు పోషించిన గంగను గూర్చి ఇతర విమర్శకుల అభిప్రాయాలు. "దివినుండి భువికి వచ్చి శంతనుని వివహించి ఏడుగురు కొడుకుల గని, నిర్దయతో గంగపాలుచేసి యెనిమిదవ కొడుకును శంతనుడడ్డుపడుటచే గంగపాలు సేయుటమాని, శంతనునొంటరిపాలు జేసి, భీష్ముని తనవెంట గొనిపోయి సర్వ విద్యావేత్తను చేసి మరల శంతనునకు సమర్పించిన గంగతీరు ఒక విచిత్ర స్వభావము. ఏడుగురు కొడుకుల చేతులారా నిష్కారణముగ జంపిన కఠినాత్మకు ఎనిమిదవ కొడుకుపై నంత ప్రేమకలుగుట విచిత్రముగా గన్పడినను ఆమె దైవనియతికి లొంగి తన ప్రేమను బలిపెట్టినట్లుగా జూపుటకైయే భీష్మునిపై నంత ప్రేమతో ప్రవర్తించినది. కావున తండ్రి బాధ్యతయైన విద్యాబుద్ధులు గరపుటను కూడా తానే నిర్వహించినది. భర్తృప్రేమకన్న సతికి పుత్రప్రేమ యధికమని నిరూపించినది. ఇది స్త్రీ స్వభావములోని దివ్యత్వము " - శ్రీ మూలం పల్లివారు.

"గంగా శంతనులు భార్యాభర్తృ సంబంధాలలోకి ప్రవేశించేటప్పుడు

1.భార. అనుశా.ఆ5.ప.475 2.భార. అనుశా.ఆ5.ప.476

తానేది,చేస్తే దానికి ఒప్పుకోవాలన్న షరతు పెడుతుంది గంగ. ఆమె తమకు పుట్టబోయే సంతానాన్ని గంగలో పారెయ్యటాన్ని దృష్టిలో ఉంచుకొని విధించినదిగా కనపడుతుంది కథా క్రమాన్ని చూస్తే. సంతానం మీద తల్లికి హక్కు ఉండే సామాజిక దశ తన అస్తిత్వం కోసం అప్పటికే ప్రారంభమై స్థిరమై కొనసాగుతున్న పితృస్వామిక సామాజిక వ్యవస్థలో చేసిన చివరి పెనుగులాటగా కనపడుతుంది ఈ కథార్థం''2 - శ్రీమతి కాత్యాయనీ విద్మహేగారు.

విశిష్టమైన వ్యక్తిత్వం గల స్త్రీమూర్తి గంగ.

## 2. సత్యవతి (మత్స్యగంధి)

మాతృస్వామ్య వ్యవస్థలోని స్త్రీల బలీయమైన వ్యక్తిత్వానికి సత్యవతి ఉదాహరణ.'ధర్మార్థంగా' తండ్రి ఆజ్ఞపై ఓడ నడపుతూ ఓడ ఎక్కవచ్చేవారికోసం నిరీక్షిస్తున్న 'మత్స్యగంధి' లేబ్రాయపు ముగ్ధ మనోహర సౌందర్యం తపో వృద్ధుడైన పరాశరుని కంటపడి అతడు విగత లజ్జా పరవశుడై ' తన అభిప్రాయం ఐక్కన్యక కెఱింగింపగా ' ఆమె తాను వ్యతిరేకిస్తే ముని శాపానికి గురికావలసి వస్తుందేమోనని భయపడినా,ఎంతో దయనీయంగాను, యుక్తిగాను తన వ్యతిరేకతను తెలియ జేస్తుంది.

"తనువు మీన్గొల వల్చు జాలరిదాన నట్లును గాకయే
ననఘ కన్యకా వ్రతమంతరించిన నెట్లు మ
జ్జనకుసంటికి బోవనేర్తు బ్రసాదబుద్ధి యొనర్పుస
మ్మని గణోత్తమ నాకు దోష విముక్తి యెట్లగు నట్లుగాన్" [1]

"శరీరం చేపల కంపు కొడుతున్న జాలరి చిన్నదాన్ని.పైగా పెళ్ళికాని పిల్లను కన్యకా వ్రతం తప్పితే తండ్రి ఇంటికి నెనెలా వెళ్లగలను? నీ ' ప్రసాద బుద్ధి'తో నాకు దోషం అంటకుండా చూడు. అన్న సత్యవతి మాటలలోని ప్రసాదబుద్ధికర్థం తనను దయతో వదిలిపెట్టమనే. కాని కాముకుడైన ముని తన కోరిక తీరిస్తే ఆమె కన్యాత్వం దూషితం కాదంటాడు. ఇక చేపల కంపుకు బదులు యోజన పర్యంతం ఆమె శరీరం సుగంధం వెదజల్లేలా చేస్తాడు. అయినా చివరి అస్త్రంగా" ఎల్లవారలుం చూడంగ నిట్టి బయల నెట్లు సంగమంబగునని ప్రశ్నిస్తుంది. ఆముని అప్పుడు 'అఖిల దృష్టిపథనిరోధినీహార తిమిరం గావించుతాడు.ఆవిదంగా కన్యగానే వ్యాసునికి జన్మనిచ్చిన సత్యవతి పెళ్ళీడుకొచ్చినకొడుకున్న శంతనునికి ద్వితీయ

1.భార.ఆది.ఆ3.ప.40

కళత్రమవుతుంది. సత్యవతి సౌందర్యం నాటి మునులనేగాదు రాజులను బలీయంగా ఆకర్షించిందనటానికి భారతంలోనేగాక, హరివంశంలోను ఉదాహరణలున్నాయి.

ధౌమ్యుని సోదరుడైన అసితుడనే మహర్షి వ్యాసుడు పుట్టిన పిమ్మట ఆమెను పెళ్లాడతానని దాశరాజును కోరతాడు. ఆమెను శంత.నునకిచ్చే ఆలోచన ఉండడంచేత దాశరాజు మహర్షికీయనంటాడు. శంతనుడు చనిపోయిన వెంటనే అతనికింకా తర్పణాలు వదలకముందే అజమీఢుని వంశస్థుడూ శంతనుని దాయాదీ అయిన 'ఉగ్రాయుధుడు' అనే రాజు హస్తినాపురంపై దండెత్తి తనకు సత్యవతిపై మక్కువ కలదని, ఆమెను తనకిస్తె హస్తినాపురం వదలివెళ్లిపోతానని, భీష్మునికి వర్తమానం పంపుతాడు. శౌచదినాలు గడిచేవరకు భీష్ముడు మంచి మాటలతో కాలంగడిపి, ఆ తర్వాత అతనితో యుద్ధంచేసి చంపివేస్తాడన్న కథ హరివంశంలోనిది. [1]

ఇక సత్యవతి మాతృస్నేహాన్ని నన్నయ పరమహృద్యంగా వర్ణించినాడు. "సత్యవతియును బెద్దకాలంబునకు వచ్చిన యా ప్రథమ పుత్రునతి హర్షంబున గౌగిలించుకొని యవిరళ పయోధర పయోధారల నానంద భాష్పధారల జేసియభిషేకించుచున్న నమ్మునివరుండు దల్లి బాష్ప జలంబులు దుడిచి అభివాదనంబు జేసి "[2]

విచిత్ర వీర్యుని మరణంతో అతని వంశం నిర్వంశం కారాదని సత్యవతి భీష్ముని ఎంతో యుక్తియుక్తంగా కోరుతుంది. అతడు నిరాకరించగా అతనికి వ్యాసుడు తాను కన్యగా ఉన్నరోజులలో పరాశరుని వల్ల జన్మించిన వృత్తాంతం తెలిపి, అతని వలన తన కోడళ్లకు సంతాన భాగ్యం కలిగించడానికి భీష్ముని అనుమతిని పొందుతుంది. తలచినంతనే సాక్షాత్కరించిన తన ప్రథమ పుత్రుని చాలాకాలం తరువాత చూడగానే ఆమె పాలిండ్లు అవిరళ పయోధారల కురిసినవట! ఆనంద బాష్పధారలతోను, క్షీరధారలతోను ఆ తల్లి కుమారుని కౌగిలించుకొని అభిషేకించినదట! తల్లీకొడుకుల సమాగమ దృశ్యం సహృదయు లైన పాఠకుల కన్నులముందు సాక్షాత్కరింపజేసినాడు. నన్నయ.

భీష్ముని ద్వారా వంశం నిలవడం న్యాయమని సత్యవతి చెప్పిన మాటలు స్వయంగా భీష్ముడే కాదనలేనంత ధర్మబద్ధంగా ఉండి ఆమె లోకజ్ఞతను వంశవృద్ధికోసం ఆమె పడుతున్న తాపత్రయాన్ని, ధర్మాన్ని గురించిన ఆమె

---

1.మహాభారత చరిత్ర పు.112 2. భార.ఆది.ఆ4.ప.241

వైదుష్యాన్ని , గృహస్వామినిగా ఆమె అధికారాన్ని చాటిచెప్పేవిగా ఉన్నాయి.

"జననుత సర్వధర్మువులు సర్వజగత్పరివర్తనన క్రమం
బును మరి సర్వవంశములు బుట్టిన మార్గము నీవ నిక్కువం
బనఘుయెఱుంగు దున్నత గుణాఢ్యుడవున్ భరతాన్వయావలం
బనుడవు నీవనిన్నొకడు పంచెద జేయుము మత్ప్రియంబుగాన్"[1]

"నాయనా,సర్వధర్మాలు, సర్వలోకాల పరివర్తనక్రమం సర్వవంశాలు జన్మించిన మార్గం నీకెంతో బాగా తెలుసు. ఎంతో గొప్ప గుణవంతుడవు. భరత వంశానికాధారం నీవే నాకానందంకల్గించే ఒకపని నిన్నాజ్ఞాపిస్తున్నాను."

నియోగ పద్ధతి 'దేవరన్యాయం' ఆనాటి సామాజిక న్యాయం అందుకే సత్యవతి ఆవిధంగా మొదట భీష్ముని, బ్రహ్మచర్య వ్రత కారణంగా అతడు నిరాకరించగా తన ప్రథమ పుత్రుడైన వ్యాసుని, మరదంద్రకు సంతానం ప్రసాదించమని శాసిస్తుంది.

కుటుంబ స్వామినిగా, నిర్ణయాధికారం కల్గిన శాసనకర్తగా, వంశం నిలబెట్టడం కోసం నియోగ పద్ధతిలో సంతానం పొందమని కోడళ్లను శాసించిన నియంతగా, తన వంశమే కురురాజు సింహాసనానికి వారసత్వాదికారం పొందాలని అభిలషించి భీష్ముని బ్రహ్మచర్యానికి కారణభూతురాలై చివరకు తనకు శంతనుని వలన పుట్టిన కుమారుల వలనగాక పరాశరుని వలన పుట్టిన వ్యాసుని మూలంగా వంశాన్ని విస్తరింపజేసినదానిగా సత్యవతి పరిస్థితులతో రాజీపడుతూ గోచరిస్తుంది. వైధవ్యంతో ధైర్యాన్ని కోల్పోక మనుగడ సాగించి కౌరవ సామ్రాజ్యానికి రాజవంశపు వారసులను గాక వ్యాసుని సంతానాన్ని (బ్రాహ్మణ జనితులను) వారసులుగా ప్రతిష్ఠించిన సత్యవతి మహాభారత కథ కంతటికీ మూలమూ, కీలకమూ అయిన పాత్ర.

మహాభారతకథకు మహితమూలమైనదని సత్యవతిని గూర్చి వ్యాఖ్యానిస్తూ చంద్రశేఖర శర్మగారు "మత్స్యగ్రంధి తనువు మీన్బోల వల్చు జాలరి తనమున నుండి పరాశరు నాకర్షించి యాతని వల్ల కానీనుడిగా వ్యాసుని గని తరువాత శంతను రాణియై భీష్మునకు బ్రహ్మచర్యమిప్పించి , విచిత్ర వీర్యాదులకు తల్లియై మహాభారతమునకు మహితమూలమైనది. ఇట పరాశర సంగమమున మత్స్యగంధి ప్రవర్తనము జాత్యుచితముగను, సమయోచితముగను సాధ్యమైనంతవరకు పరాశరుని వదిలించుకొను ప్రయత్నములో నన్నయ పోషించెను. ఇది యామె

1. భార.ఆది.ఆ4.ప.220

యుచితజ్ఞత. పరాశరుని కలయిక వల్ల వచ్చు నాపదలకు రక్షణమును బడసియే పరాశరుని వల్ల వ్యాసుని బడసినది. ... సత్యవతియై శంతను బెండ్లాడునపుడును, విచిత్రవీర్యుడు దివంగతుడై వంశ విచ్ఛిన్నము గానున్నప్పుడును దాశరాజుద్వారా నియమము లను నిబంధించుటలోను, భీష్ముని పెండ్లాడుమనుటలోను తన కానీనుడగు వ్యాసుని బిలిచి విచిత్ర వీర్యక్షేత్రము లందు నియోగించి సంతానమును బడయించుటలోను ఆమె శక్తి స్వరూపము సుసంగతముగా ప్రకాశితమైనది. సత్యవతి కానీనుడు చివరకు వంశోద్ధారకుడయ్యెనే కాని కుంతికానీనుని వలె వంశనాశనుడు కాలేదు." అన్నారు.[1]

"గంగ కథలోని శంతనుడే గంగ తన్ను విడిచి వెళ్ళాక సత్యవతిని చూచి మోహంలో పడతాడు. ఆమె తండ్రి శంతనుని వివాహ ప్రస్తావన నంగీకరిస్తూనే తన కూతురికి పుట్టే సంతానానికి రాజ్యం యిచ్చే పక్షంలోనే అది సాధ్యం అవుతుందంటాడు. కోరి వచ్చాడు గనుక శంతనుడు ఈరోజు తన కూతురుని బాగానే చూసుకోవచ్చు. కానీ అంతఃపురంలో ఆమెకెటువంటి స్థానం ఉంటుంది.? ఎటువంటి గౌరవం దొరుకుతుంది. ఆమెకక్కడ గౌరవాన్ని ఏర్పరచి నిలబెట్టాలంటే ఆమె కాబోయే రాజుకు తల్లియై ఉండాలి. ఆ ముందు చూపుతో అతనా షరతు పెట్టి ఉంటాడు."-[2] శ్రీమతి కాత్యాయనీ విద్మహేగారి వ్యాఖ్య ఇది.

## 3,4, అంబిక , అంబాలికలు

భారతంలోని రెండవతరం స్త్రీలైన అంబికాంబాలికలు అత్తగారి మాట కెదురాడ లేని ముద్దరాళ్ళుగా, చివరివరకూ ఆమెనే అనుసరించిన విధేయురాళ్ళుగా చిత్రింపబడ్డారు.

## 5 అంబ

తాను సాల్వుని ప్రేమించిన విషయం తన తండ్రికి తెలియక తనకు స్వయంవరాలంకారం చేయించి 0నందువల్లనే భీష్ముడు తన తమ్ముని కోసమై చెల్లెండ్రతో బాటు తనను స్వయంవరంలో రాజులందరినీ గెలిచి తీసుకొని వెళ్లినాడనీ తాను తన ప్రేమను వెల్లడించగానే సగౌరవంగా తనను పంపినాడనీ, అతని దోషం ఎంతమాత్రం లేదని అంబసాల్వునికి విన్నవించినా ప్రయోజనం లేకపోతుంది.

---

1.మహా.భా.వి.వి.కో.పుట373 2.సం.సా.స్త్రీ.దృ.పుట.8

"తమ్మునికిగాగ భీష్ముడుదగ్రవృత్తి,
గన్నియులగొనిపోయెడుగాన బలిమి
నన్ను గొనిపోయె నాచేత నిన్ను వినిన
యపుడె పుత్తెంచె దూషింపననఘ తగునె" [1]

"మా తండ్రి యెఱుంగక స్వయంవరాలంకారంబు,నాకుం జేయించిన కతంబున నింతపుట్టె భీష్మండు నా చెలియండ్రందన తమ్మున కిచ్చి నన్ను నీ కడకు దగననిచె దీననేమి తప్పని మఱియు ననేక ప్రకారంబులం పలికిన వినక తన్నుం జేకొనక సాళ్వుండు"[2] కరుణంబుగ నేడ్చుతలో దరిబో పొమ్మిచట మింకదడయకుమని మందిరము వెడలంగ నడచిన నరిగెనదియు నార్తచిత్తయై వికలగతిన్ '-[3]

కాబట్టి అంబ హృదయం మొదట భీష్ముని పట్ల కఠినం కాదు. ఎప్పుడైతే సాళ్వుడు తన ప్రేమను తిరస్కరించి నిర్దయగా వెళ్లగొట్టించాడో అపుడే ఆమె హృదయం శిలాసదృశ కర్కశమైనది. తానింక సంసార జీవితానికి నోచుకోలేదు. భీష్ముని వల్ల పరాభవింపబడిన సాళ్వుడు అతనిపై పగతో తనను ప్రేమించి, తన ప్రేమకు పాత్రమైన అంబను అవమాన పూర్వకంగా గెంటించినా అంబకు అతని పైగాక భీష్మునిపైనే పగ గల్గడం విచిత్రం. తన ప్రియునికి కీడుచేయడానికి సాధారణంగా స్త్రీ హృదయం అంగీకరించదు. అంబ వృత్తాంతమిందుకు ఉదాహరణ.

పరశురాముడు సాళ్వునా, భీష్మునా ఎవరినని కడతేర్చమంటావని అడిగినప్పుడు భీష్మునే కడతేర్చమన్నది గాని సాళ్వునితో తన వివాహం జరిపించమని కోరి ఉంటే పరశురాముడది అవలీలగా చేసి ఉండెడివాడు. తిరస్కృతయై తిరిగి అతని వద్దకు వెళ్లడానికి అభిమానవతియైన అంబహృదయం సుముఖంగా లేదు. తన జీవితమావిధంగా నాశనం కావడానికి భీష్మడే కారణమనుకొని పరశురాముడు భీష్మునిచే ఓడిపోయినా తన నిశ్చయం సడలించుకొనక, ఘోర మైన తపస్సు చేసి, గంగచే శపించబడి, సగం దేహంతో యేతై పారినా, మిగతా సగంతోనే తపస్సు కొనసాగించి, ఈశ్వరుని అనుగ్రహం పొంది తరువాతి జన్మలో స్త్రీగా పుట్టి పురుషునిగా మారి, భీష్ముని వధించే వరం పొందుతుంది. ఆమె తపశ్శక్తికి భయపడిన సత్యవతీ భీష్ములు తరచుగా ఆమె వృత్తాంతం తెలుసుకొంటూనే ఉండేవారంటే అంబ ఎంత అసామాన్యమైన

1.భార.ఉద్యోగ.ఆ4.ప.280 2.అదే.281. 3. అదే.ప.282

శక్తిమంతురాలో తెలుస్తున్నది.

ద్రుపదునికి శిఖండిగా జన్మించి, పురుషవేషంలో ద్రోణుని వద్ద సకల విద్యలునేర్చి,స్థూలకర్ణుని దయవలన పుంస్త్వం పొంది కుబేరుడు స్థూలకర్ణునికిచ్చిన శాపం తనకు జీవితాంతం వరప్రదం కాగా భీష్ముని వధకు కారణమై అంబ తన ప్రతిజ్ఞ నెరవేర్చుకొన్నది.

ప్రేమించినవాని తిరస్కారం స్త్రీ జీవితాన్ని ఎంత చిన్నా భిన్నం చేస్తుందో తిరస్కృతయైన స్త్రీ ఎంత ప్రళయ భీకరమూర్తి కాగలదో అంబవృత్తాంతం నిరూపిస్తుంది.

ప్రేమ వైఫల్యంతో ప్రతీకారభావాన్ని అణువణువునా నింపుకొని భీష్మునిపై పగ సాధింపబూనిన అంబ పాత్రను చంద్రశేఖర శర్మగారెంతో సునిశితంగా ఆవిష్కరిస్తూ ఇలా అంటారు. అంబసాల్వునికి భీష్ముని నిర్దోషిత్వమును వ్యక్తీకరించినది. కాని భీష్మునెదిరింపలేక పరాభవింపబడి యతడు సగౌరవముగా వారి యనురాగమును మన్నించి పంపిన యంబను భీష్మునిపై బగతో సాల్వుడు తిరస్కరించెను కామశరపీడితయైన కామినియై బ్రతిమాలినను అంబను ఇంటినుండి వెడలగొట్టించెను. దోషమంతయు తనదేనని గుర్తెరిగిన అంబ తనను తిరస్కరించిన సాల్వునిపై కినియలేదు. స్త్రీలకు బ్రియుడు తిరస్కరించినను బ్రియుడే. కావుననే పరశురాముడు సాల్వుని కడతేర్చ మందువా? లేక భీష్ముని కడతేర్చమందువా యనగా అంబ నిర్దోషియైన భీష్మునే కడతేర్చ మనును.అట్లుగాక సాల్వుడు తన్ను వివాహమగునట్లు జేయమన్నచో రెండు క్షణములలో నాతడు సాల్వుని రోగము కుదిర్చి,యంబను వివాహమాడు నట్లుచేయించి యుండెడివాడు. కాని యంబ కది యిష్టముగాదు. తిరస్కరింపబడి, వెడలనడువబడి సాల్వునింట నుండనేల యిష్టపడును? కావుననే సాల్వునకు గాని యపుడు సంసారమునకు బాసితినని నిశ్చయించుకొన్నది. విరక్తయైనది. కాని యీ విరాగ మాస్త్రీకి క్షణికము గూడకాలేదు.వెంటనే తన యాపదకు మూలముభీష్ముడే యనియు, నాతని వధించుట తన కర్తవ్యమనియు నిశ్చయించినది. తనకా విషయమున సహాయపడెదనన్న పరశురాముడోడిపోయినను, తన పట్టుదల వీడలేదు. తాను భీష్మవధకై తపో నిష్ఠుర వ్రతము లాచరించు చున్నప్పుడు గంగచే నేతై, పాఱెదవని శపించబడినను తన సామేనునే మత్స్యదేశమున నేతై పాఱజేసి, తక్కిన సామేనదపము తీవ్రతరముగా చేసి, రుద్రుని సాక్షాత్కరింప చేసుకొన్నది. రాబోవు జన్మమున పుత్రిగా జన్మించి, పుత్రునిగా మారి భీష్ముని వధించునట్లు రుద్రుని

వల్ల వరమును బొందినది. ఇట అంబ స్త్రీత్వము నందిన భీష్ముడా యనిపించును. కావుననే సత్యవతియు, భీష్ముడును ఆమెకు భయపడి ఎప్పటి కప్పుడామె జాడల నరయుచుండిరి. ఇట్లంబ రుద్రశక్తియైనది." [1]

'ప్రాచీన తెలుగు కావ్యాలలో విఫల మనోరథలైన స్త్రీపాత్రలు' అన్న తమ గ్రంథంలో శ్రీమతి శ్రీదేవి అంబ రాక్షస వివాహం అన్న ఆచారం కారణంగా విఫల మనోరథ అయ్యిందంటారు." అంబ పురుషునిలోని అహంకార ప్రవృత్తికి బలియైన మగువ.స్త్రీయైనా ఎన్నో సాహసాలు చేసింది. ఆమె జీవితమంతా అంధకారమే. ప్రతీకారం తీర్చుకోవాలన్న ఆశ ఒక్కటే ఆమెకు వెలుగు కిరణం అయ్యింది. అవమానాలు, పరాభవాలు ఆమె జీవితాన్ని దుర్భరం చేసాయి....." [2]

## 6. గాంధారి

మహాపతివ్రతా శిరోమణి గాంధారి. జన్మచేతనే అంధుడైన భర్తకు లేని దృష్టి తనకక్కరలేదని నేత్ర పట్టం (గంతలు) కట్టుకొన్న సాధ్వీశిరోరత్నం. నూటపది మంది సవతులున్నా ఆమె తన విశిష్ట వ్యక్తిత్వాన్ని నిటబెట్టుకొన్నది. మిగతా వారిలో ఏ ఒక్క పేరైనా మనకెక్కడా విన్పించదు, కన్పించదు.

గాంధారి ఎంత ధర్మపరాయణురాలో ఆమె ధృతరాష్ట్రునికి హితము పదేశించి ద్రౌపదికి వరాలిచ్చేటట్లుగా చేయడంలోను,తన హితబోధ పెడచెవిన బెట్టి యుద్ధానికి బయలుదేరుతూ తన దీవనలు కోరవచ్చిన కొడుకును " కొడుక యెచ్చట నుండు ధర్మమచ్చటకు సేరు జయ" మని దీవించడంలోను వ్యక్తమవు తుంది.తన దీవెనల ఫలితమేమో ఆ తల్లికి తెలుసు. తెలిసీ ఆ విధంగా దీవించిన ఆ ధర్మాత్మురాలి ధర్మనిరతికి లోకం శిరస్సువంచి నమస్సులర్పించ వలసిందే.

యుద్ధంముగిసిన పిదప ధృతరాష్ట్రునితో బాటు రణరంగంలో ప్రవేశించిన గాంధారి వ్యాసభగవానుడు ప్రసాదించిన యోగదృష్టితో సర్వం చూడగలిగింది. ఆమె మాతృహృదయం నూరుగురు పుత్రుల దుర్మరణాన్ని తట్టుకో లేకపోయింది. ఒక్క కొడుకును పోగొట్టుకుంటేనే మాతృగర్భ శోకానికంతం ఉండదే, అటువంటిది ఆ తల్లి తాను కన్న సంతానం మొత్తం యుద్ధరంగానికాహుతికాగా తట్టుకోలేక తల్లడిల్లి పోతుంది. ముఖ్యంగా దుర్యోధన, దుశ్శాసనులు భీముని చేతిలో పొందిన దారుణమరణం భీముడు చేసిన భీకర కృత్యాలు గాంధారి సహించలేక పోయింది. కాని వారి దురాగతాలను భీముడొక్కటొక్కటిగా వివరింపగా "ఆ చావు సావదగు

---

1.మహా భార.వి.వి.కో.పుట.375 2.పుట.116, 86

నన్నీచునకున్"అన్నది. ఆ తల్లి నిష్పక్షపాతమైన ఆ తీర్పు ఆమె ధర్మాభిరతిని అద్దం పట్టి చూపిస్తున్నది.

కాని అంతలోనే ఆమెకు భీముడు దుశ్శాసనుని గుండెలు చీల్చడం, దుర్యోధనుణ్ణి అధర్మపద్ధతిలో చంపడం గుర్తుకు రాగానే కోపంతో, దుఃఖావేశంతో ఊగిపోయింది. పాండవులను శపించబోయింది." గురుసార ధీర బుద్ధివైన నీవు అసూయాగ్రస్తవు కావచ్చునా"? అన్న వ్యాసుని మందలింపుతో ఆగిపోయింది. కాని అంతటి దుఃఖంలో కూడా గాంధారి తానసూయాగ్రస్తనన్న మాట తట్టుకోలేక పోయింది.తన కెంతమాత్రం అసూయ లేదని, కేవలం భీముని అధర్మపద్ధతే తనను బాధించిందని వ్యాసునితో చెప్పుకొన్నది.ధర్మరాజు వినయంతో గాని శోకావేశంతో భగ్గున మండిపోతున్న ఆ కన్న తల్లి హృదయం శాంతించలేదు.

చివరకు శ్రీకృష్ణుడు గాంధారి శాపాగ్నికి గురియైనాడు. కౌరవ పాండవుల యుద్ధాన్ని ఆపలేక పోయిన శ్రీకృష్ణుడూ, అతని వంశమూ నాటికి ముప్పయ్యారేళ్ల తరువాత నాశన మవుతారని, అతడు దిక్కులేని చావు చావాలని, కౌరవ స్త్రీలలాగా యాదవ స్త్రీలుభర్తలను, కుమారులను, బంధువులను తలచి తలచి విలపించాలని గాందారి కృష్ణుని శపించడం ఆమెలోని దుస్సహ ప్రతీకారేచ్ఛకు నిదర్శనం.

విధివిధానం ఎంతో చిత్రమైనది.పట్టమహిషిగా, రాజమాతగా, కురువంశపు పెద్దకోడలిగా, అధికారం,గౌరవం,ఐశ్వర్యం, సమస్త సౌఖ్యాలూ అందుబాటులో ఉన్న గాంధారి నూర్గురు పుత్రులను పొంది,అంతటి సుఖసంపదల మధ్య వారిని పెంచినా వారిలో ఏఒక్కడినీ ఉత్తముడినీ, యోగ్యుణ్ణీ చేయలేక పోయింది.తాను ధర్మపరాయణురాలైనా తనయులు అధర్మ పథగాములు కావడం చూస్తూ నిస్సహాయురాలిగా మిగిలిపోయింది. అసలు కౌరవుల జన్మమే సహజమైనది కాదు. కుంతి ముందుగా ధర్మజుని ప్రసవించిందన్న అసూయతో గాంధారి తన కడుపుపై మోదుకోగా గర్భస్థపిండం నూరు వ్రక్కలై వ్యాసుని సలహాపై వాటిని నేతి కుండలలో ఉంచి సంరక్షించగా దుర్యోధనాదులైన నూరుగురు పుత్రులూ, దుస్సల అన్న కుమార్తె ,జన్మించినారు. ఆధునిక విజ్ఞాన శాస్త్రం ప్రకారం వైద్యులు పరీక్షనాళికలలో సృష్టిస్తూన్న 'టెస్టు ట్యూబ్ బేబీస్' వంటిది కౌరవుల జన్మ అని అనుకోవచ్చును.

దుర్యోధనుడు పుట్టినప్పుడే దుశ్శకునాలు కల్గినాయట."పువ్వు పుట్టగానే పరిమళించు" నన్నట్లు జన్మించిన వెంటనే తన జాతక ప్రభావాన్ని చూపిన ఆ కొడుకును ఎంతటి బుద్ధులు గరిపినా ఆ తల్లి చక్కదిద్దలేక పోయింది. మాతృత్వపు

సాఫల్యమన్న గీటురాయిపై పరీక్షించి నప్పుడుమాత్రం గాంధారి పరాజితురాలైనదని చెప్పక తప్పదు.

స్త్రీ పర్వం గాంధారి విశిష్ట వ్యక్తిత్వం యొక్క విశ్వరూపానికి వ్యాసుడెత్తిన నివాళి.

మహాభారతం చారిత్రకతను తమ "మహాభారత చరిత్రము" అన్న గ్రంథములో సునిశితముగా పరిశీలించిన పెండ్యాల వేంకట సుబ్రహ్మణ్య శాస్త్రిగారు స్త్రీపర్వంలోని గాంధారి శాపాదికాలు జనమేజయుని కాలంలో భారతకథకు కూర్చబడిన గాథలంటున్నారు. "...కారణమేమనగా గాంధారి పాలికలనిలో జూచిన అభిమన్యాదుల శవములు కాక గృధ్రాదులకు వదలబడినను నాటికైదారు దినముల క్రితము చచ్చినను ప్రకాశమానములుగా నుండుట యెటుల పొసగును? ఆ శవములు తైలద్రోణాదులలో నుంపలేదు.గాంధారి శ్రీకృష్ణునకు శాపమిచ్చుటలో ముప్పది యారుసంవత్సరములనుట సందర్భముగా లేదు.అట్లు శాపమునే యిచ్చినచో నంత వ్యవధియేల? వెంటనే మీ వారందరూ చావగా నీవును దిక్కు లేకుండా జత్తువు గాక యని యా మహాపతివ్రత యేల యనరాదు? "యతోధర్మస్తతో జయః"యను నా పతివ్రతా శిరోమణి మా వారల కన్యోన్య కలహము బెంచి మాకులనాశము జేసిన నీ వాఫలము ననుభవింతువు గాకయని తిట్టిన దిట్టునని సర్వయాదవ నాశనాంతరము విచారగ్రస్తుడగు శ్రీకృష్ణుడు గాంధారీ వాక్యమును దలచెను. (మౌసల పర్వ 4 అధ్యా) అనుటచే బై భావ మూహింప బడుచున్నది. స్త్రీ పర్వ గాథలే నిజమైనచో బట్టాభిషేకానంతరము ధర్మజునకు విశేష ధర్మోపదేశము జేసినట్టి భీష్ముడు తన్ను జూచి శోకించు గాంధారి నొక్క యోదార్పు వాక్యమునైన పలుక కుండునా? కాన స్త్రీ పర్వగాథల సందర్భముగా నున్నవి."[1]

గాంధారి 'నేత్ర పట్టం' కట్టుకోవటమన్నది పాతివ్రత్యభావనతో చేసిన చర్య కాదని, తండ్రి తనను పుట్టు గుడ్డి వాడి కిచ్చి వివాహం చేయ నిర్ణయించడం పట్ల ఆమె తన నిరసనను వ్యక్తం చేయడానికా విధంగా చేసిందని కాత్యాయనీ విద్మహే భావిస్తున్నారు. "తన యిష్టాయిష్టాలతో ప్రమేయం లేకుండా తండ్రి తన వివాహం నిర్ణయించిన పద్ధతి పట్ల క్రోధంతో గుడ్డి వానిని భర్తగా చేసి బ్రతుకంతా చీకటి చేశారని చెప్పటానికన్నట్టు- ఒక నిరసన చర్యగా కళ్లకు గంతలు కట్టుకుంది. వాటితోటే జీవితాంతం గడిపింది."[2]

1.మహా. భార. చరిత్ర.పు.189 2.సం.సా.దృపుట.70

"పరపురుషులను చూడకుండా ఉండటమే పతివ్రతాధర్మమయ్యేట్లుంటే భర్తలు గుడ్డివాళ్లయినా, కాక పోయినా స్త్రీలందరూ కళ్లకు గంతలు కట్టుకోవలసిందే. కనుక గాంధారి విషయంలో కళ్లకు గంతలు కట్టుకోవటం పరపురుష దర్శనాన్ని పరిహరించటం కంటే పుట్టు గుడ్డి అయిన ఆ ముఖాన్ని చూస్తూ ఉంటే - వంశాన్ని విస్తరించుకోవాలని తన జీవితాన్ని సంపదల, అధికారాల బలం చేత బలి తీసుకొన్న ఆ ముఖాన్ని చూస్తూ ఉంటే తనలో ద్వేషం పెరగవచ్చు. ఆ ద్వేషం పెరగకుండా చేసుకోవాలనే కళ్లకు గంతలు కట్టుకున్నది గాంధారి. ఇష్టం లేని పెళ్లి పట్ల గాంధారి నిరసన పైకి తేలకపోవచ్చు. కాని కథా క్రమంలోని వాక్యాల వరుస నిర్మాణం తండ్రి నిర్ణయానికి నిరసన రూపమే నేత్ర పట్టం అన్న విషయాన్ని రూఢి చేస్తాయి"[1].

యుద్ధ పరిణామాలు స్త్రీ జీవితం మీద చూపే వ్యతిరేక ప్రభావాన్ని వెల్లడించడంలో స్త్రీ పర్వం నిర్వహించిన పాత్ర చెప్పుకోదగినదని, యుద్ధంలో పతులను, సుతులను, తండ్రులను, సోదరులను కోల్పోయిన స్త్రీలందరి దుఃఖ సాగరంలోని ఆటుపోట్లను చెప్పటానికి స్త్రీ పర్వం కేంద్రం అయ్యిందని, గాంధారి సానుభూతి, సహానుభూతుల పరంగా స్త్రీల దుఃఖాన్ని చెప్పటం ద్వారా అత్యున్నత భావోద్వేగాల నభివ్యక్తం చేసి, స్త్రీల కష్టాలను స్త్రీలు మాత్రమే అర్థం చేసుకోగలరన్న విషయాన్ని రూఢి చేయడం జరిగిందని కాత్యాయని అభిప్రాయ పడ్డారు.

"ధర్మం ఎక్కడుంటుందో అక్కడే జయ"మని కొడుకును దీవించడంలో గాంధారి స్వభావం మాతృత్వ పరివేషాన్ని దాటి సత్యం పట్ల నిబద్ధమైనదని, ఇందుకు కారణం గాంధారికి కురుసభలో జరిగిన ద్రౌపదీ పరాభవం మాటిమాటికీ గుర్తు రావడమేనని, న్యాయం కాని, సత్యం కాని దుర్యోధనుని వైపు లేవని తెలిసిన గాంధారి కన్న కొడుకే అయినా అతనికి విజయ సంసిద్ధి కలగాలని ఆశీర్వదించ లేకపోయిందని,ధర్మదృష్టి, లైంగిక పీడన పట్ల వ్యతిరేక స్పందన, స్త్రీల ప్రయోజనాల దృష్ట్యా కన్న కొడుకు ప్రవర్తనను కూడ నిష్పాక్షికంగా నిగ్గు తేల్చడం గాంధారి స్వభావమని కాత్యాయని స్పష్టీకరించారు. కొడుకు చావు కంటే, కోడలి దుఃఖానికి గాంధారి తీవ్రంగా ప్రతిస్పందించడం లోకంలో అత్తలు కొడుకులు - కోడళ్లు కలిసి ఉంటే సహించలేరన్న అపవాదాన్ని తిప్పి కొట్టిందని, కొడుకుతో సుఖాలను అనుభవించిన కోడలిని చూసిన తాను ఆ సుఖాలు లేకుండా మోడైన కోడలిని ఎలాచూడాలని, చూస్తూ ఎలా ఓర్చుకొని బ్రతకాలని గాంధారి ఆవేదన చెందటంలో కన్పించేది స్త్రీ సహజమైన సహానుభూతి ప్రవృత్తియేనని కూడా

1.సం.సా.దృ.పుట.70

కలిసి ఉంటే సహించలేరన్న అపవాదాన్ని తిప్పి కొట్టిందని, కొడుకుతో సుఖాలను అనుభవించిన కోడలిని చూసిన తాను ఆ సుఖాలు లేకుండా మోడైన కోడలిని ఎలాచూడాలని, చూస్తూ ఎలా ఓర్చుకొని బ్రతకాలని గాంధారి ఆవేదన చెందటంలో కన్పించేది స్త్రీ సహజమైన సహానుభూతి ప్రవృత్తియేనని కూడా కాత్యాయని వ్యాఖ్యానించడంలోని వాస్తవం ఎవ్వరూ వ్యతిరేకించలేనిది. తన అంతులేని దుఃఖానికి ప్రతీకారాన్ని తీర్చుకోలేని ఒకనొక నిస్సహాయతలో నున్న గాంధారి ఒక సాధారణ స్త్రీ వలెనే విపత్తుకంతా కారణమని తాననుకొంటున్న శ్రీ కృష్ణుడికి శాపనార్థాలు పెట్టిందని , మొత్తంమీద స్త్రీ పర్వంలో తల్లిగా కొడుకుల దుర్నయాలను వారించలేని నిస్సహాయత, మరణించిన పురుషులందరి స్త్రీల దుఃఖాన్ని తన దుఃఖంగా భావించ గల్గిన బాధిత స్త్రీ సహజ చైతన్యం గాంధారి. జీవితాన్ని రెండు ముఖాలనుండి ప్రదర్శించాయన్న కాత్యాయని విమర్శ [1] అక్షర సత్యం .

"పితృవాగ్దత్తయైన మాత్రముననే నేత్ర పట్టము గట్టుకొని భర్తనను సరించిన గాంధారి కుంతికి ధర్మజుడు గలుగుట విని యసూయతో తాడవము జేసికొని గర్భపాతము గావించుకొన్నది. ఇది స్త్రీ సహజమైన యసూయ. స్త్రీ పర్వమున గాంధారి దుఃఖమూర్తి. సర్వాపదలకు మూలమని శ్రీకృష్ణుని శపింపబోయినది. పుత్రవాత్సల్యమున్నను ధర్మైక తత్పర స్వభావమును వ్యక్తము జేసి సర్వం సహవలె శతపుత్ర శోకమును సహించినది"[2] అన్నది. మూలంపల్లి చంద్రశేఖర శర్మగారి వ్యాఖ్య.

'యుగయుగాల్లో భారతీయ నారీత్వం' అన్న తమ గ్రంథంలో కుమారి నివేదిత గాంధారిని గూర్చి " గాంధారి నిష్పక్షపాతిగా , భయమనేది తెలియనిదిగా, అందరిమెప్పును పొందింది. భర్తా , కుమారులూ ఆమెను గౌరవించినా అత్యాశ కారణంగా ఆమె మాటలను పెడచెవిని పెట్టారు. అయినా సరే ఆమె ఎప్పుడూ వాళ్లకు హితబోధ చేస్తూనే ఉన్నది. వారి కుటుంబంలో ధర్మాన్ని సమర్థించేది ఆమె ఒక్కతే. రాజసభలో ఎప్పుడూ ఉపస్థితురాలయ్యేది. తన అభిప్రాయాలను స్పష్టంగా నిర్ద్వందంగా చెప్పేది" అని పేర్కొన్నారు (పుట 36)

'భారతంలోని మరొక దురదృష్ట వంతురాలు గాంధారి' అంటారు శ్రీమతి శ్రీదేవి. తన కన్నులు భర్త కన్నులుగా చేయాలని భావించలేదామె... ఆమె అంతరాలలోఏదో చీకటి,నిరాశ వీటిని తరుముకొని వచ్చే ఈర్ష్య. అసూయ...

1.సం.సా.స్త్రీ.పుట.17,21 2.మహా.భార.వి.వి.కో.పు.377

తల్లితండ్రుల అసూయాగ్రస్త మనస్తత్వాన్ని పూర్తిగా పుణికి పుచ్చుకొన్నవాడు దుర్యోధనుడు. ...గాంధారి అసూయ వలదని వారిస్తున్నా లాభం లేకపోయింది. వారి ఘాతుక చర్యల కారణంగానే యుద్ధంలో చంపబడతారు. ఇది ఆమె జీవితంలోని విషాదం."[1]

"సాక్షాత్తు వాసుదేవుడు గాంధారిని"పాండవుల కలగకుండునది. నీవలిగి చూచిన త్రిలోకంబులు భస్మీభూతంబగునట్టి తపః ప్రభావంబున బ్రసిద్ధవు గావున నిన్ను బ్రార్థించెదన'ని యదార్థవాక్యమున స్తోత్రము' చేయుట గమనింపదగినది. "నీ వలిగి చూచినం ద్రిలోకంబులు భస్మీభూతంబులగు నట్టి తపఃప్రభావంబున ప్రసిద్ధవు" ఇది వ్యాసునకు గాంధారి యెడల గల సద్భావమునకు పరోక్ష ప్రస్తుతి. ఆ ఘట్టమున కృష్ణునుద్దేశించి"....'అంధుడు దీనుడు వృద్ధుడైన యీ' నృపు నరయంగ బాండవులు నీవును యుక్తులుగారె'యిమ్మొయిన్' [2] అని పల్కుటయు స్త్రీ త్యాగైకమయ స్వభావము నభివ్యక్తము చేయును.ఇందు విశేషమేమనగా నామె తన సంతతిని ప్రస్తావింపలేదు. తనపతి నరయుటయే పలికినది.దీని వలన తన బ్రతుకొక పరమార్థముగా భావింపలేదని తెలియుచున్నది. ఆమె వైరాగ్య ప్రవృత్తి కిది యెక నిదర్శనము....... ఈమె క్రోధ దీప్తి నియమము చేయుటకు సాక్షాత్తు వ్యాసుడంతటివాడు యత్నింపవలసి వచ్చినదిగా ఆమె సాధించిన చిత్తౌన్నత్యము అసమానమైనదని చెప్పవచ్చును.స్త్రీలలో ఇట్టి ఘనతను సాధించిన మహావ్యక్తి భారతమున మరొకతె లేదు." - గాంధారి మహోన్నత వ్యక్తిత్వ దర్శనం చేయించిన శ్రీ జక్కా వేంకట రమణప్పగారి చిత్రణ ఇది.

## 7. కుంతి

మహాభారతంలోని స్త్రీపాత్రలన్నిటిలోను మకుటాయమానమైనది కుంతి. భారత కావ్యంలో ఆద్యంతం కుంతిపాత్ర తన ఉజ్జ్వల దీప్తులను ప్రసరిస్తూనే ఉంది. కన్యగా, కుమార్తెగా, భార్యగా, సపత్నిగా, తల్లిగా, అత్తగా, తోడికోడలుగా, రాజమాతగా - వివిధ భూమికల్లో కుంతి తన విశిష్ట వ్యక్తిత్వాన్ని ప్రదర్శించింది.

అసలు పేరు పృథయైనా పెంపుడు తండ్రి పేరుతో పిలువబడిన కుంతి ఇంతులలో మేలుబంతిగా వాసిగాంచుతుంది.సమస్త సద్గుణాలు మూర్తీభవించిన కుంతి తండ్రిచే ఎంతో గొప్పగా ప్రశంసించబడుతుంది. ఆయనచే నియుక్తురాలై అహర్నిశలూ అతిజాగ్రత్తగా, కఠోర పరీక్షల నెదుర్కొంటూ దుర్వాసుని సంవత్సరం

---

1మహా.భార. వి.వి.కో. పుట.87 2భార.శల్య.ద్వితీయా.ప.373

పాటు సేవించి,ఆయన మెప్పును పొంది,ఆయన వరమిస్తానన్నా తన అభిజాత్యానికి తగినట్లు వినయంగానే తిరస్కరించింది.అతడు రెట్టించగా ఎక్కడ శపిస్తాడోనన్న భయంతోనే స్వీకరించింది.బాల్యసహజమైన కుతూహలంతో, అజ్ఞానంతో, మునిమంత్ర ప్రభావాన్ని పరీక్షింపగోరి, ముందు వెనుకలు ఆలోచించకుండా ఉదయసూర్యుని చూచి, అట్టి పుత్రునిమ్మని కోరుతూ మంత్రాన్ని జపించింది.

కాని తన ఎదుట ప్రత్యక్షమై తన కోరిక నెరవేరుస్తానన్న సూర్యుని చూడగానే కన్యా సహజమైన భయంతో,సిగ్గుతో వణకిపోయింది. తన బాల్యాన్ని, అజ్ఞానాన్ని, కన్యాత్వాన్ని తలచిమరలి పొమ్మని దీనాతిదీనంగా ప్రార్థించింది. ఎన్నో విధాల అతన్ని అనునయింపజూచింది.ముగ్ధమోహన సౌందర్యరాశియైన కుంతిని అనుభవించ కుండా వదలదలచు కోని సూర్యుని కర్కశ కామానికి బలియైనది.తన మూలంగా తన తల్లిదండ్రులకు, వంశానికి కళంకం కల్గుతుందని భయపడిన కుంతి ఎంతో తెగువతో సూర్యుని ఎదుర్కొంటుంది. పరివరి విధాల వేడుకుంటుంది.

"ముదము దలిర్ప బంధుజనముల్ గురువర్గము గూడిరూఢినొ
ప్పిదమగు ధర్మమార్గమున బెండిలి చేయగ బిమ్మటన్ సము
న్మదరసకేళి లీల గరిమంబగుగాక కులంబు శీలమున్
వదలి వధూ జనంబులకు వచ్చునె యిమ్మెయి వేడ్కసల్పగన్"[1]

"బంధుమతినైన నన్ను ని
ర్బంధము మెయి ధర్మబాహ్యపథమున నలినీ
బాంధవ యిటు సేయుటయున
మంథర భవదీయ కీర్తి మలినము గాదే"[2]

ఒక కన్యగా,కుమార్తెగా తనకూ తన తల్లిదండ్రులకూ కళంకం రాకూడదని కుంతి చేసిన ధర్మబద్ధమైన ఈ ప్రసంగం ఎంతో కరుణాపూరితంగా న్యాయ సమ్మతంగా ఉంది. పట్టువదలని సూర్యునికి గత్యతరం లేక కుంతి లొంగిపోవలసి వచ్చినది. శాపభయంవల్ల, తల్లిదండ్రులను,మంత్రముపదేశించిన మునిని దూషిస్తానని బెదిరించడం వల్ల లొంగిపోయిన కుంతికి జరిగినది బలాత్కారమనే చెప్పాలి.

"కావున నిప్పుడు మదీయ సమాగమంబున కొడంబడుము. నీ కోరిన యట్టి తనయుండు జనియుంచు నిట్లు చేయనినాడు నిన్నును, భవజ్జననీ జనకులను భస్మంబు సేయుదు మఱియు నీదైన శీల వృత్తంబు లెఱుంగక మంత్రంబు గర్వంబునం జేసినీ కుపదేశించిన తాపసునీ క్షణంబు నిగ్రహింతు"[3]

1.భార.అరణ్య.ఆ7.ప.335 2.ప.336 3.ప.331

ఏ యుగమైనా, ఏ కాలమైనా, ఏ దేశంలోనైనా, స్త్రీ పట్ల పురుషుడి యీ ధోరణి మాత్రం మారలేదు.ఏకాంతంలో అందమైన ఆడపిల్ల కనబడితే, అవకాశం దొరికితే అనుభవించకుండా వదిలివేయడని,ఎలాంటి గొప్పవాడైనా ఇందుకు భిన్నం కాదని అంతటి 'ధర్మదేవత' 'కర్మసాక్షి' సూర్యుని ప్రవర్తనే తెలుపుతున్నది.తన కోరిక తీర్చుకొని సూర్యుడు తన దారిన తాను వెళ్లిపోయాడు.గర్భవతియైన కుంతి ఆ గర్భాన్ని పదినెలలు ఎవరి కంటా పడకుండా మోయడానికి ఎన్ని కష్టాలు పడిందో ఎవరికి తెలుసు? అంత కష్టపడి కన్న తన కడుపు పంటను ఉంచుకొనలేక,వేదులు కొనలేక చిన్నారి తల్లి కుంతీ తల్లడిల్లి పోయింది. మనస్సు రాయి చేసుకొని, శతవిధాల దీవనలిచ్చి నదిలో వదిలింది. ఆమె మాతృహృదయ వేదన కళ్లకు కట్టినట్లుగా,గుండెలు పిండినట్లుగా అక్షర చిత్రంగా ఎఱ్ఱన మన ముందుంచాడు.

ఆ చిట్టితల్లి హృదయవేదన వివాహేతర్పూర్వ సంబంధాలతో తల్లులయ్యే స్త్రీలకొక హెచ్చరిక.కన్యగా తాను గన్న యీ పుత్రుని బయల్పరచలేక,మరువలేక కుంతి ఆజన్మ పర్యంతం దుర్భర వేదనలకు లోనైంది.కన్యగానే తల్లి అయిన విషయం బహిర్గతం కాకుండానే పాండురాజుతో వివాహమైంది.అప్పటి నుండైనా ఆమె జీవితం సాఫీగా జరగలేదు.వేటవ్యసనంలో చిక్కి, యుక్తాయుక్తాలు మరచి,మైథునక్రీడలో ఉన్న హరిణమిథునాన్ని వధించి మృగరూపంలో ఉన్న ముని శాపానికి భయపడి, భార్యాసంగమమే మృత్యుహేతువైన పాండురాజు తపోనిష్ఠలో కాలం గడిపివాడు.నిండు యౌవనవతి అయిన కుంతి కోర్కెలు 'అడవి పాలే'. వివాహితలైన అందరి స్త్రీలలాగా లోక సహజమై రీతిలో భర్త వల్ల సంతానం పొందే ప్రాప్తమామెకు లేకపోయింది.భర్త కోరిక మీద, అతని బలవంతం వల్లనే ఆ పరమ పతివ్రత తనకెంత మాత్రం యిష్టం లేకపోయినా పరపురుషుల వలన తల్లి కావలసి వచ్చింది. కలలోనైనా పరపురుషుని తలచనన్న కుంతితో పాండురాజు భర్త ఆజ్ఞమీరడం దోషమన్నాడు. తమ జన్మవృత్తాంతం తెలిపి,వంశవృద్ధికోసం దీనవదనంతో ఆమె ముందు మోకరించి,చేతులు జోడించి ప్రార్థించినాడు.

"అలయక ధర్మశాస్త్రముల యందు బురాణములందు జెప్పను
త్పలదళనేత్ర వినుము యపత్యము మేలని కావునన్ యశో
విలయుల బుత్రులం బడయు నీ కొనరించెద సంగతాంగుళీ
దళ విలసన్మదీయ కర తామరస ద్వయ యోజితాంజలిన్"[1]

1. భార.ఆది.ఆ5.ప.90

విధి లేక కుంతి భర్త ప్రార్థనను మన్నించి దుర్వాసుని మంత్రాన్ని గూర్చి చెప్పి,అతని ఆజ్ఞ మేరకు ధర్మానిల శక్రులవలన ధర్మజ భీమార్జునులను పుత్రులుగా పొందింది.భర్త ఆజ్ఞ వల్లనే మాద్రి సంతానవతి అయ్యేటట్లు చేసింది.భార్యగా, సపత్నిగా తన ధర్మాన్ని విశిష్టంగా నెరవేర్చింది.మాద్రీ సంగమంతో మరణించిన భర్తతో బాటు తానూ సహగమనం చేయడానికి సంసిద్ధురాలైంది. కాని మాద్రి అభ్యర్థనకు తలవంచి బిడ్డల సంరక్షణ కోసం ప్రాణాలతో మిగిలిపోయింది.

అది మొదలు కుంతి జీవితం అసిధారావ్రతమైంది."అపుత్రస్య గతిర్నాస్తి" యని ప్రాధేయపడిన భర్త విన్నపం మేరకు లోకాపరాధ భయాన్ని కూడా పక్కన పెట్టి, ఎంతో సాహసించి, సంఘానికి విడ్డూరకరమైన రీతిలో సంతానం పొందినా, భర్త అండదండలతో ఆ సంతానాన్ని పెంచే అవకాశం కూడా లేని దురదృష్టవంతు రాలామె. బిడ్డలు పసివాళ్లుగా ఉండగానే తండ్రిని కోల్పోతే వైధవ్య దుఃఖాన్ని మ్రింగి, మునుల సాయంతో బిడ్డలను వెంటబెట్టుకొని హస్తినకు తిరిగి వచ్చిన సమయంలో ఆమె ఎంతటి సంఘర్షణను, ఎంతటి సంఘ తిరస్కార భయాన్ని అనుభవించి ఉంటుందో ఊహింపవచ్చును. ముని శాపంఉన్న పాండురాజుకు సంతానంఎట్లా కలిగిందని బావగారుగాని, తోటికోడలుగాని, ప్రజలుగాని తనను నిలదీయవచ్చునని,నిందించ వచ్చునని అనుక్షణంఆమె భయంతోనే జీవించవలసి వచ్చిన పరిస్థితులవి.అయితే నోరు విప్పి ఎవరూ ఆమెను దూషించలేదు. మొండి ధైర్యంతో ఆమె బావగారింట ఉండి,బిడ్డలను పెంచి, విద్యాబుద్ధులు నేర్పించి, వీరులుగా, ధర్మపరులుగా, సద్గుణ శ్రేష్ఠులుగా తీర్చిదిద్దింది. మాతృస్వామ్యం ఎంత ఉన్నతంగా, విశిష్టంగా ఉండగలదో లోకానికి నిరూపించింది."ముండ సాకిన పిల్లలు ముకుతాడు లేని ఎద్దు" లన్న లోకోక్తిలో నిజం లేదని ఋజువు చేసింది.తన బిడ్డలు బాల్యం నుండి బావ బిడ్డల అసూయకు గురియైనా పెదవి విప్పక భరించింది.

కన్న బిడ్డల కన్న మిన్నగ మాద్రీపుత్రులు నకుల సహదేవులను ప్రేమించి,వారి ప్రేమను అంతగానూ పొందగల్గింది.లోకంలో 'సవతి తల్లి' 'సవతి తల్లి ప్రేమ' 'సవతి తల్లి పెంపకం' -అన్న మాటల అర్థాన్ని మార్చివేసి ధన్యత గన్న తల్లికుంతి.అరణ్యవాసానికి వెళుతున్న పుత్రులను ద్రౌపది కప్పజెబుతూ సహదేవుని 'ఇల్లడ' పెట్టింది.వట్టి పసివాడనీ, దేన్నీ అవునూ, కాదని చెప్పలేని అమాయకుడనీ, మనస్సు మిక్కిలి మెత్తన అని,తానతని ఆకలిని కనిపెట్టి అన్నం పెడితే తప్ప ఆకలైనా అడగడని, అలాంటి కొడుకు అరణ్యవాసానికి వెళ్లడం తన కమిత

దుఃఖం కలిగిస్తున్నదని వాపోతోంది.కన్న ప్రేమకన్నా పెంచిన ప్రేమమిన్న అన్న సత్యానికిది మనోజ్ఞమైన ఉదాహరణ.

"కడు పసిబిడ్డ వీడొకటి కాదవునా నెఱుంగడు ముందటె
య్యెడ నొక పాటెఱుంగడెద యెంతయు గోమల మెప్పుడైన నే
గుడువగ బిల్తుగాని తనకుంగల యాకటి ప్రొద్దెఱుంగడీ
కొడుకిటు పోకకున్ మనము గుందెడు నిన్గని యూరడిల్లెడున్"[1]

ఆశ్రమవాసంలో ఉన్న తల్లిని దర్శించాలన్న అభిలాషను వ్యక్తం చేసిందీ, అందరికన్నా ముందుగా వెళ్లి, తల్లి పాదాలపై పడి శోకించిందీ సహదేవుడే. సహదేవుని ఏమరక చూసుకొమ్మని ధర్మజునికి చెప్పడంతో బాటు ప్రతికొడుకును గూర్చి కుంతి కోడలికి జాగ్రత్తలు,చెప్పింది. తల్లీకొడుకుల మమతానురాగాలను ప్రదర్శించే మధుర ఘట్టాలెన్నో భారతంలో మనకు సాక్షాత్కరిస్తాయి.

అరణ్యవాస,అజ్ఞాత వాసాల నిమిత్తం పదమూడు సంవత్సరాలు పాండవులు ప్రజలకు కనుమరుగు కావడం వారి భవిష్యత్తును అగమ్యగోచరం, అంధకారబంధురం చేయకుండా తాను వారి ప్రతినిధిగా,వారి పునరాగమన సంకేతంగా, ప్రజలు పాండవులను విస్మరించకుండా ఉండటానికొక సాధనంగా కుంతి ఆ సుదీర్ఘకాలాన్ని పుత్రుల నిరీక్షణలో గడుపుతూ వారి వియోగ దుఃఖాన్ని సహించింది. కార్యదీక్షాపరులు వ్యక్తిగత సుఖదుఃఖాల కతీతులు గదా! కొడుకులు రాజ్యాధికారం తిరిగి పొందడం కోసం తల్లిగా కుంతి పరోక్షంగా చేసిన మహత్తరమైన సేవ ఇది.

వ్యసనపరులైన కొడుకుల జూచి దుఃఖింపని తల్లిదండ్రులు లోకంలో ఉండరు.ధర్మజుని జూదవ్యసనమే పాండవుల అవమానాలకు, ఆపదలకు మూలం. అరణ్యవాసానికి వెళ్తూ తన వద్దకు వచ్చి నమస్కరించిన కొడుకులను కోడలిని వల్కలవేషధారులుగా, నిరాభరణులుగా చూసిన కుంతి హృదయం శోక సముద్రమైంది. "మిమ్మల్నీ స్థితిలో చూడకుండా వెళ్లిపోయిన మీ తండ్రి పుణ్యాత్ముడు. నేనెంతటి మందభాగ్యురాలినో ఇంకా బ్రతికే ఉన్నా" నన్న కుంతీ విలాపంలో వ్యసనపరుడై ఇంతటి విపత్తుకు కారణభూతుడైన ధర్మజుని హృదయాన్ని చీల్చే వాగ్బాణాలు సంధించబడి, లోకంలోని వ్యసనపరులందరినీ తలలు వంచుకొనేటట్లు చేస్తుంది.

పాండవ రాయబారిగా వచ్చిన శ్రీకృష్ణుడు తనను దర్శించగానే అన్ని

---

1.భార. విరాట.ఆశ్వా .2.ప.213

సంవత్సరాలు కుంతి మనస్సులో గూడు కట్టుకున్న శోకమంతా కట్టలు తెంచుకొని యేరులై పొంగింది అంతలోనే "పదమూడేడులు బావ కొడుకుచే నదయమగు కూడు గుడుచుట" తలచుకొని వీరావేశంతో విజృంభించి వాడియీటెలవంటి మాటలతో కుమారులకు సందేశం పంపింది.

కుమారాస్త్ర విద్యాప్రదర్శన ఘట్టం కుంతి జీవితంలో కరుణాపూర్ణమైన మరొక సన్నివేశం. కర్ణుని రంగప్రవేశంతో, అతడవమానింపబడటంతో ఆమె హృదయంలో మానిన గాయం సెలవేసినట్లయింది. కురుపాండవయుద్ధం తప్పదని విదురుని వలన తెలుసుకొని, ఏకాంతంగా కర్ణుని కలుసుకొని, అతని జన్మరహస్యం తెలిపి, పాండవ పక్షానికి ఆహ్వానించి, తన ప్రతిపాదన నతడు నిర్ద్వంద్వంగా తిరస్కరించగా కుంతి ఆశలు అడియాసలు కాగా ముక్కలైన మనస్సుతో వెనుతిరుగుతుంది. పుత్ర సమాగమ సుఖమావిధంగా పరిణమించింది.

చీటికి మాటికి పోట్లాడుకొంటూ బద్ధశత్రువులుగా మెలిగే అత్తాకోడళ్లు ఉండటమే సహజమైన ఈ లోకంలో అత్తగా కుంతి ద్రౌపదిని మనః పూర్వకంగా ప్రేమించడం ఎంతో ఆనందాన్ని, అబ్బురాన్ని, ఊరటను కల్గిస్తుంది. కొడుకులకన్న మిన్నగా కోడలిని ప్రేమించి, అంతకన్నా ఎక్కువగా ద్రౌపదినుండి ప్రేమను, ఆదరాన్ని, సేవలను పొందగలిగిన అపురూపమైన అత్త కుంతి.

ఇక తోడికోడలైన గాంధారిని ఎంతో గౌరవంతో భక్తి వినయాలతో సేవించింది. కురుక్షేత్ర యుద్ధానంతరం రాజమాతగా తాను సమస్త భోగాలకు, సౌఖ్యాలకు పాత్రురాలైనా, నూరుగురు పుత్రులను కోల్పోయి, గర్భశోకంతో కుములుతున్న గాంధారీ ధృతరాష్ట్రులను తన కోడళ్ళతో కలసి తరచుగా దర్శిస్తూ, సేవిస్తూ , మంచిమంచి కానుకలతో ఉపచరిస్తూ ,కాలం గడిపింది. రాజభోగాలను తృణప్రాయంగా భావించింది.

కన్నకొడుక్కు పరలోకగతులుండవన్న భయంతో, వ్రయ్యలైన హృదయంతో, కర్ణుడు తన తొలిచూలు పుత్రుడన్న రహస్యాన్ని బహిర్గతం చేయడం కుంతి జీవితంలోని మరొక కరుణా పూర్ణమైన సన్నివేశం. వ్యాసమహర్షి అనుగ్రహంతో స్వర్గంలో ఉన్న కర్ణుని యోగ దృష్టితో చూచిన పిదపగాని కుంతికి కర్ణుని గూర్చిన దుఃఖం వీడలేదు.

కొడుకులు కోడళ్లు ఎంత వేడినా వినక కుంతి గాంధారీ ధృతరాష్ట్రులతో ఆశ్రమవాసానికి వెళ్లడం, ఆ సందర్భంలో ఆమె పలికిన మాటలు, ఆమెకు జీవితం పట్ల గల నిర్మోహభావాన్ని వ్యక్తం చేస్తాయి. పారమార్థిక చింతను, త్యాగభావాన్ని

తెలియజేస్తాయి. మూడు సంవత్సరాలపాటు కుంతి గాంధారీ ధృతరాష్ట్రులను కంటికి రెప్పలా కాపాడింది. వ్యాసమహర్షి ప్రశంసలు పొంది "కులాగ్రగణ్యగా" కీర్తింపబడింది. తుదకు దావాగ్ని మధ్యంలో వారితో సహా దగ్ధమైంది.

జీవితమంతా సంఘర్షణలతోనే గడిపిన కుంతి దైవోపహతు రాలనిపిస్తుంది. అటువంటివారు ఎంత ఉన్నత స్థానంలో ఉన్నా సుఖపడలేరు. అందుకామే జీవితమే ఒక ఉదాహరణ. ఆమె జీవితం స్త్రీజాతికెన్నో సందేశాలను ఇస్తుంది. బాల్యచాపల్యంతో చేసిన పొరపాటుకు జీవితాంతం దుర్భరమైన క్షోభను మనస్సులోనే అణుచుకోవలసి వచ్చింది. క్షణికోద్రేకంలో తప్పుచేసే స్త్రీలకు సైతం ఇదొక హెచ్చరిక.

స్త్రీలు అతి సామాన్యంగా కోరుకొనే ఏ ఒక్క కోరికా కుంతి జీవితంలో నెరవేరలేదు. ఆమె ఆశలన్నీ అడియాసలై, గొంతెమ్మ కోర్కెలైనాయి. (కుంతిని జానపదులు 'గొంతెమ్మ' అంటారని, నెరవేరని కోర్కెలను "గొంతెమ్మకోర్కెలు" అంటారని లోకంలో వాడుక.) మహావీరుడైన పాండురాజు పత్నియైనా రాజభోగాలనుభవించలేదు. వానప్రస్థజీవితం గడుపవలసివచ్చింది. భర్త వల్ల సంతానం పొందలేకపోయింది. ఎంతోకష్టపడి పెంచిన కొడుకులు, మహావీరులుగా తాము తీర్చిదిద్దుకొన్నవారు నాలుగు కాలాలపాటు రాజమాతగా గౌరవాన్ని, సుఖాన్ని అనుభవించలేదు. యుద్ధమామెను దారుణ వ్యధకు గురి చేసింది. చివరకు గాంధారి వలె తపస్సు చేయడానికైనా ఆమె నోచుకోలేదు.

ఎన్ని వ్యతిరేక పరిస్థితులెదురైనా తన ధ్యేయాన్ని నెరవేర్చుకొని కుమారులను భర్తకు వారసులుగా, కౌరవసామ్రాజ్యాభిషిక్తులుగా చేయగల్గిన కుంతి ధీరత, గంభీర వ్యక్తిత్వం, పుత్రులను కర్తవ్యోన్ముఖులను చేసేపట్ల కాఠిన్యం, క్షత్రియకాంతకుండవలసిన ధీరోధాత్తత, పౌరుషం,మాతృత్వపు మమకారం, సేవాభావం, త్యాగశీలత మహాభారతంలో వ్యాసమహర్షి అతి చక్కగా చిత్రించినాడు. భావిస్త్రీ జాతికొక స్ఫూర్తిగా, ఆదర్శమూర్తిగా ఆయన కుంతిని తీర్చిదిద్దినాడు.

లోకం భర్తతో సహగమనం చేసిన మాద్రి సతీత్వాన్ని కీర్తిస్తుంది గాని, పసికందులైన బిడ్డల పెంపకం కోసం విధవయైన తల్లిగా కుంతి పడిన కష్టాలను అర్థం చేసుకోలేదు. కుంతి అనగానే కన్యగా సూర్యునివలన కర్ణుని కన్నదన్న విషయమే జనసామాన్యంలో ప్రచారంలోనికి వచ్చిందిగాని, ఆ పరిస్థితులేవి? ఏ విధంగా వాటిని కుంతి ఎదుర్కోవటానికి ప్రయత్నించి విఫలురాలైంది? అన్న సంగతిని సహృదయ విమర్శకులు లోకానికి చాటవలసిన అవసరం ఉంది.భార్య

చనిపోతే పురుషుడు ఒంటరిగా మనుగడ సాగించలేడు. బిడ్డలను పెంచి పెద్దచేయలేడు. మనోదౌర్బల్యంతో క్రుంగిపోతాడు. లేదావ్యసనపరుడవుతాడు. లేదా మరో వివాహం చేసుకొంటాడు. స్త్రీమాత్రం ఆత్మ నిగ్రహంతో కన్నబిడ్డల కోసం అసిధారావ్రతం లాగా జీవితాన్ని జీవితాన్ని కొనసాగిస్తుంది. కుంతి ఇందుకు మహోన్నతమైన ఉదాహరణ.

ఇంతటి విలక్షణమైన, విశిష్టమైన పరిపూర్ణమైన వ్యక్తిత్వం కల్గిన కుంతిని గూర్చి పూర్వ విమర్శకులు, చారిత్రకులు వెలువరించిన అభిప్రాయాలను పరిశీలిస్తే కుంతిపాత్రను వ్యాసుడు ఏ సాంఘిక ప్రబోధం కోసం ఏ మహోన్నత ఆశయంతో చిత్రించినాడో ఆ మహదాశయం సంపూర్ణంగా అవిష్కరింపబడలేదన్న సత్యం తేటతెల్లంగా గోచరిస్తుంది.

అంతేగాక కుంతి మహనీయత, ఆమె ధీరోదాత్త వ్యక్తిత్వం పూర్వ విమర్శకులచేత సమగ్రంగా సంపూర్ణంగా చిత్రించబడలేదని కొన్న సంఘటనలు విస్మరింపబడటం లేదా వ్యతిరేకంగా వ్యాఖ్యానింపబడటం తెలియజేస్తుంది.

## కుంతిపాత్రపై పూర్వవిమర్శకుల అభిప్రాయాలు.

" దుర్వాసుని మంత్రబలమును పరీక్షింపవలెనన్న బాల్యచాపల్యముతో గాని, మార్తాండుని రూపమునుజూచి మరులు గొనియైన నేమి - కారణమేమైనను కుంతి కన్యగా నున్నప్పుడే సూర్యుని వల్ల కొడుకును గన్నది.ఒకవైపు లోకాపవాద భీతి,మరొక వైపు కడుపు తీపి ఆమె హృదయమును క్షోభపెట్టినవి.కడకు లోకాపవాద భీతియే జయించినది.ఆత్మహత్యకు పాల్పడలేక శిశుహత్యకొడిగట్టలేక,కన్న బిడ్డ నొక పెట్టెలో దాచి,గంగలో వదిలి యింటికి వెళ్లినది.కర్ణజన్మ రహస్యమును బడబాగ్ని వలె కడుపున దాచుకున్నది." [1]

"లోకాపవాద భీతిచే ఆమె అట్లు ప్రవర్తించినదే గాని, ఆమె హృదయమున స్నిగ్ధమైన మాతృప్రేమ ఎన్నడును కొరవడలేదు.తన కొడుకుల కన్న మిన్నగ సవతికొడుకు సహదేవు నామె ప్రేమించినది."[2]

"కుంతి యొక్క మహోన్నత వ్యక్తిత్వము, గంభీరధీర స్వభావము అనేక సందర్భములలో అధికముగా ప్రకటనము కాకుండుటకు కూడా కర్ణజన్మ రహస్య గోపనమే ప్రధానకారణము.పాండవులతో హస్తినలో ప్రవేశించినపుడు కొంత పరోక్షముగా, శ్రీకృష్ణుని ముఖమున కర్తవ్యమును కొడుకులకు చెప్పి పంపునపుడు

1.సజీవశిల్పాలు పుట.199 2 సజీవశిల్పాలు పుట.208

దోషములు గావు.పాండురాజు కుంతికి ,చెప్పిన శ్వేతకేతు గాథలో సంతతి గనుట స్త్రీస్త్రీనైనను ఋతుకాలమున గవటయు దోషము కాదు"[1]

4. "పాండవుల జన్మము నానాటివారు సందేహించిరి. కాని వారి జన్మము గూఢపరచి మునులచే హస్తినాపురవాసులకు చెప్పబడినది. బ్రహ్మచర్యము నందుండిన యీ పాండురాజుకు దివ్యమైన హేతువుచే ధర్ముని వలన ప్రత్యక్షముగా నీ యుధిష్ఠరుడు అచట బుట్టి యున్నాడు.అట్లే భీముడను నీ మహాబలవంతుని 'వాయు' వా పాండురాజున కిచ్చెను.ఇంద్రుని వలన కుంతి యందే యర్జునుడు పుట్టెను."[2]

5. "నిజమునకు పాండవులు కృత్రిమ జన్మము కలవారే. నాటికాలమున వైదిక దేవతలయందు మహిమలను జన సామాన్యము తలచు చుండుటచే కుంతి యెటులనో ఐదుగురు బిడ్డలను సంపాదించినదని గాని,కుంతీ మాద్రులకితరుల వలన బుట్టిరని మిష పెట్టినదని గాని చెప్పవలసియున్నది. అర్జునుడొక్కడే కుంతికి పుట్టినటుల'పార్థ' శబ్దమును బట్టి యూహింపదగియున్నది. యమ మరుత్తుల కుంతి జపించినంత మాత్రమునే వచ్చి ధర్మజ భీముల నిచ్చి పోయిరి. ఇంద్రుడటుకాక సంవత్సరము కుంతీపాండులు తపస్సు చేసిననే గాని వచ్చి యర్జుననీయలేదు. కుంతీ గర్భ జనితులగుటచేతనే కర్ణార్జునులు సమానవీరులైరి"[3]

6. "పాండవులలో ధర్మజ భీమార్జునులు కుంతీ సుతులనియు,నకుల సహదేవులు మాద్రీసుతులనియు వ్రాయబడియుండెను.ధర్మజుడు,భీముడు కుంతీ సుతులు కారేమోయను సందియము కూడ గలదు. ఎంతటి దేవతలైనను మనుష్య వ్యవహారములో మానవధర్మము నవలంబించ వలసియుండును. అందువలననే కాబోలు భారతములో బాండురాజునకు దివ్యమగు నొకకారణముచే శతశృంగ పర్వతమున నీ యుధిష్ఠరుడు జన్మించెననియు,వాయుదేవుడు భీముడను కుమారు నొసంగెననియు, దేవేంద్రుని వలన కుంతి యందే అర్జునుడు జన్మించె ననియు,మునులు హస్తినలో చెప్పిరి.పాండురాజునకు ధర్మజభీములను యమ మరుత్తు లిచ్చిరట! అర్జునుడు మాత్రము ఇంద్రుని వలన కుంతి యందు బుట్టెనట! కర్ణపార్థుల తండ్రులగు సూర్యేంద్రు లదితి పుత్రులగు సోదరులు. ఏకోదరులు త్రివిష్టపమున(త్రిబెతు) నేడునునొక వనిత యందు సంతానవంతులగు నాచారము గలదు."[4]

1. మహా.భా.చ.పుట.75 2,3.మహా.భా.చ.పుట.84 4.మహా.భా.చ.పుట.176

7. "పైయంశములేగాక భీముడు నాగుల సంబంధుడని వ్రాయబడుటయు, శ్వేతజిత్తు అనువాడు భీముని మేనమామయని కర్ణభీష్మలొకప్పు డుగ్గడించుటయు, ధర్మజ భీములుకూడ కుంతీగర్భజనితులు కారేమో యని సందేహింపబడుచున్నది. పార్థ శబ్దమొక్క యర్జునుని యందే (పృథ పుత్రుడుగాన) రూఢిగా వాడబడుట కూడ భిన్నోదరత్వము కౌంతేయుల యందనుమానింప బడుచున్నది."[1]

8. "మరి యొక విశేషము.పాండురాజు శతశృంగ పర్వతము నంద పత్యార్థినియై కుంతిని సద్బ్రాహ్మణుల వలన సంతతి నొందుమని నియోగించెను. తనకు మంత్రము వచ్చునని కుంతి చెప్పిన పిమ్మటను'ధర్మవాయ్వింద్రుల' గోరి సంతతి నొందమనెను.పురాణములలో అందు వేద ప్రవర్తక మునులలో ధర్ముడను ముని ఋగ్వేద దశమమండలము 114 వ సూక్తమునకును,వాయు ఋషి ఋగ్వేదము పదవమండలము 165వ సూక్తమునందు కొన్ని సామములకు ప్రవర్తకులు. ఇంద్రులను మునులిర్వురుగలరు.వారు ఋగ్వేద దశమ మండలమున 7 సూక్తముల కధిపులు.పై ఋషులే ధర్మజ భీమార్జునుల జనకులు కాకూడదా? పాండురాజు మరణానంతరము హస్తిపురికి శతశృంగమునులు తీసికొని వచ్చి యప్పజెప్పుట చేతను పై వితర్కము కలుగుచున్నది."[2]

ఇంతేగాక శ్రీ శాస్త్రిగారు కుంతి చరిత్ర నిట్లావిష్కరించారు.

"ఈమె చరితము లోక విదితము. పాండురాజు పోయిన పిమ్మటనే యీమె బిడ్డల గని యుండునని నాటి వారే తలచిరను వృత్తాంతమిది వరకే వ్రాసియుంటిని. కుంతి యొక్క రహస్యపు ప్రవర్తనయే యింతటి మహా యుద్ధమునకు గారణమని యుద్ధానంతరమున ధర్మరాజు కుంతిపై గినిసి శాపమిచ్చెనని శాంతి పర్వము నందుగలదు. ఈమె యాదవ (గొల్ల) వంశమున బుట్టెను. ఆమె తండ్రి 'శూరు' డనువాడు.తనమేనత్తకుమారుడు కుంతిభోజుడో, లేక శూరుడో నాగులలో ముఖ్యుడని ఆర్యకుడు అనువాని దౌహిత్రుడని చెప్పబడియున్నది."[3]

"నాగు లనార్యులనియు,నాగ వనితలు వేశ్యలుగా నుండిరనియు నిది వరకే చెప్పబడెను. కుంతియట్టి వేశ్యకుల సంపర్కము గలదనుట చేతనే రహస్యము గాను, బహిరంగముగాను,బరులకే గంగి గోవువలె బిడ్డలంగనినది.సవతి తన్ను నాక్షేపింపకుండగ నామె కిరువురం దాల్చినది.కోడలి కైదుగురు మగలగుట కనుజ్ఞ

1. మహా.భా.చ.పుట.176 2..మహా.భా.చ.పుట.177

3.ఆది.ప.128వ.అధ్యా వ్యాఖ్య

నిచ్చినది. కుంతీ ప్రవర్తనమును ధర్మజుడేగాక కర్ణుడును నీచకార్యము జేసితివని నిందించియున్నాడు.(ఉద్యోగపర్వ-145 అధ్యా) కుంతి కర్ణుని గనుటలో సూర్యుడు రహస్యముగా పొంచి,పొంచి, యంతఃపురమున నుండిన కుంతిని గలిసి యుండుననియు,గర్భమున తొమ్మిది మాసములు రహస్యముగా మోసి, ఒకనాటి రాత్రి రహస్యమగా కర్ణునిగని తన కాపురాలగు దాసిచే నదిలో బార వేయుటకు పంపుచుండగా దాసి కిష్టురాలగు 'రాథ' యనునది మార్గమధ్యమున దారసిల్లి, రహస్యముగా గురుతు పట్టి,తనకు బిడ్డలు లేనందున రహస్య భేదనము గాకుండ బెంతుననుటచే దాసి రాథకాకర్ణునిచ్చునటులును దేవీ భాగవతములో గలదు. కుంతి తొమ్మిది మాసములు మోసియే కర్ణుని గనినటుల భారతములో రెండు చోట్ల గలదు.ఈమె రహస్యము బయలైన పిమ్మట ధర్మరాజామెను గౌరవింపలేదు. ఈ నిరాదరణము నొంద లేకయే యామె వానప్రస్థయై మృతి నొందినది."[1]

కుంతిని గూర్చి శ్రీ శాస్త్రిగారి పై విమర్శలు సంస్కృత భారతాన్ని ఆధారంగా తీసుకొని వ్రాయబడినవేగాని కవిత్రయ భారతాన్ని ఆధారంగా చేసుకొని వ్రాయ బడినవికావు. శాస్త్రిగారు కుంతి హేయమైనచరిత్ర గలదానిగా వ్రాయుట, అందుకానాటి పరిస్థితులు(యుద్ధం మొదలగు వాటి మూలంగా వర్ణసంకరం ఇత్యాదులు) కారణమనుట, కౌరవ వంశములోని స్త్రీలందరి చరితములు (అంబిక,అంబాలిక,సత్యవతి, ద్రౌపది) స్వేచ్ఛాపూరితాలని,నాగుల వంశానికి చెందినదికావడంచేత ఆమె జన్మమే నీచ వంశమున జరిగినట్లు వ్రాయడం వారి పరిశోధనా పటిమకు,విమర్శనా చాతుర్యానికి నిదర్శనమని అంగీకరింప వచ్చునేమో గాని, కుంతి జీవితంలో జరిగిన సంఘటనలను,ఎదురైన సమస్యలను,వాటినామె ఎదుర్కొన్న తీరును, ఏ పరిస్థితుల్లో ఆ విధంగా ప్రవర్తించ వలసి వచ్చినదో ఆ పరిస్థితుల తీవ్రతను అర్థం చేసుకొని ఉంటె బాగుండుననిపిస్తుంది. ఆమె కులాన్ని ఎత్తిచూపి,ఆమె నడవడి అలాంటి దనడం సమంజసంకాదు.పద్మం బురదలోనే కదా పుట్టింది !

శ్రీ కత్తి పద్మారావుగారు తమ"భారతీయ సంస్కృతిలో స్త్రీ" అన్న గ్రంథంలో విభిన్న వివాహపద్ధతులు ఒకే కాలంలో వివిధ ఆర్య, అనార్య తెగల్లో అనుసరింప బడినట్లు అవగతమవుతుంది.పాండురాజు కుంతిని, మాద్రిని పెండ్లియాడుటలో బహుభార్యాత్వం ద్యోకతమవుతుంది.కుంతికి,మాద్రికి యమ, వాయు, ఇంద్ర, అశ్వినీ దేవతల వల్ల పుట్టినట్లుగా చెప్పుకుంటున్న ధర్మరాజు, భీమార్జున,నకుల

1.మహా.భా.చ.పుటలు.168.169

సహదేవులు ఏ పద్ధతిలో జన్మించారో అర్థం కావడంలేదు.వీరు కూడా నియోగ పద్ధతిలో జన్మించకపోతే దేవతలకు పిల్లలు పుట్టడం అనేది జరుగదని మానవ శాస్త్రజ్ఞులు నిరూపిస్తున్నారు."[1] అని కుంతికి పాండవులు జన్మించడంలోని విశేషాన్ని ప్రశ్నిస్తున్నారు.

"భారతాది కథలను దివ్యకథలుగా భావిస్తున్నాం, అర్చిస్తున్నాం. ఈ కథలలోని సహజతను గూర్చి ప్రశ్న వేసుకోడానికి ఇష్ట పడడంలేదు. ఆ ప్రశ్నవేసుకొని జానపద కథల్లోని కన్పించే మౌలికాంశాలతో, కథానిర్మాణ రీతులతో,ఊహలతో పోల్చిచూస్తే రూపాంతరాలు,భావాంతరాలు పొంది,శిష్టకథలుగా పరిణమించాయని తెలుస్తుంది." అంటారు. ఆచార్య హెచ్. ఎస్.బ్రహ్మానంద తమ శిష్టసాహిత్యంలో జానపద ధోరణులు అన్న గ్రంథంలో

శ్రీ యల్లంరాజు శ్రీనివాసరావుగారు తమ "మహాభారత వైభవము" అన్న గ్రంథంలో భారత కథ అంతా చారిత్రకమైన సత్యమే. అద్భుతమేమీ లేదు. అద్భుత మెక్కడ ఉన్నదంటే,అది యీ చారిత్రకమైన కథా వస్తువు కతి మానుషమైన దివ్య దానవ వృత్తాంతాలనుజోడించడం"..... "ఒకడి భార్యకు నూర్గురు పుడితే మరొకడి భార్యకైదుగురు కల్గడం, ఆ నూరు నూరు వ్రక్కలై ఘృతకుండాలలో పెడితే పిండాలు కొంతకాలానికి పిల్లలు కావడం- ఈ అయిదుగురు కూడా పతిపత్నీ సంయోగం వల్లగాక దేవతా ప్రభావం వల్ల ఆవిర్భవించడం...." అని కౌరవ పాండవ జన్మం లోక విరుద్ధంగా, అతిమానుషంగా లోకాతీతంగా ఉండడాన్ని వ్యతిరేకిస్తున్నారు.

శ్రీ మల్లాది సూర్యనారాయణ శాస్త్రిగారు కవిత్రయం వారి భాషాంతరీ కరణ పద్ధతులను విమర్శిస్తూ "నన్నయ భాషాంతరీకరణ మొక్కచో మూలాను సరణమై, మరియొకచో తద్భావాను సరణమై ఇంకొకచో విషయ ప్రధానమై ప్రధానకథను మాత్రమతిక్రమించక మూలమందలి పౌనరుక్త్యాది దోషముల కిరవుగాక సందర్భోచితమైన పద్ధతి నవలంబించి యుండును."[2]

"తిక్కన భాషాంతరీకరణము మాత్రము చాలా వరకు నన్నయ ననుసరించి యుండును.కొన్ని చోట్ల కథను పెంచుట,చిన్న కథలు విడుచుట,కొన్ని తావుల మిక్కిలి సంగ్రహించుట, కొన్ని భాగములు ముందువెనుకలు చేయుట యీతని రచన యందు విశేషముగా కనిపించును."[3]

ఎఱ్ఱన కవిత్వము చాలా వరకు నన్నయ కవిత్వమునే అనుసరించిందని

1.భా.వం.లో.స్త్రీలు.పుట. 53 2,3 A.Critical Int.Pages 28,35

చెప్ప వచ్చును. ఈతని యాంధ్రీకరణ పద్ధతి నన్నయ మార్గమునే పోలియుండును ఇతడు మూల కథకు అభ్యంతరము లేకుండా నాయా బాగములను పంగ్రహించుచు,యథేచ్ఛముగ, సరళశైలి నాంధ్రీకరించినాడు."[1] అన్నారు.

దీనిని బట్టి కవిత్రయం మూల కథను అతిక్రమించక, మూల కథకు అభ్యంతరం లేకుండానే భారత కథా రచన సాగించారని ఋజువవుతున్నది గదా! అలాంటప్పుడు వాళ్లు ముగ్గురూ కుంతిని విశిష్టంగా, ఉన్నతంగా, చిత్రించడం ఆమె ఉత్తమగుణాలు,ధర్మబద్ధతను పేర్కొనడం వాస్తవ చిత్రణేగాని,వేరుగాదని నిరూపిత మవుతుంది.

డా. నందుల గోపాల కృష్ణమూర్తిగారు తమ "ఆంధ్ర మహాభారతము - ఔపదేశిక ప్రతిపత్తి" అన్న గ్రంథంలో "వాల్మీకి మహర్షి రామాయణ మహాకావ్యంలో సీతా మహామాతను చిత్రించి భారతీయుల కారాధ్యదైవతముగా ప్రసాదించెను. వ్యాసమహర్షి భారతామ్నాయములో స్త్రీ మనస్తత్వమును,భారతీయ మహిళామణి స్వరూప స్వభావములను నిక్షేపించి కుంతీమాతను వీరమాతగా నిక్షేపించెను.కన్యగ, తల్లిగ,భార్యగ,అత్తగ, ఎంత ధర్మోదాత్తముగ ప్రవర్తించినదో సాంగోపాంగముగ ఆవిష్కరించెను."[2]

ఆమె కథయందు శుద్ధతమో మిశ్రితమైన రాజసము మూర్తీభవించినది. వినయాభిమానములు వివేక సౌజన్యాది సదమల గుణ రత్న విభూషితముగా ప్రసిద్ధి బడసినది."[3] అని కుంతిని కీర్తించినారు.

డా.ఎల్లూరి శివారెడ్డిగారు తమ "ఆంధ్రమహాభారతములో రసపోషణము" అన్న గ్రంథంలో "పరిపక్వదశలో తల్లి అనురాగమునకు,భార్య ప్రేమకు భేదము గోచరించదు.ద్రౌపదికి పతులపైని అనురాగము,కుంతికి సుతులపైన వాత్సల్యము సమాంతరముగా తోచుచున్నవి. అందుకే కుంతీ వాక్యమును ద్రౌపది యదార్థముగా వ్యక్తము చేసినది." అని అభిప్రాయపడినారు

"కడు పసిబిడ్డ వీడొకటి కాదవు నా నెఱుంగడు ముందరె
య్యెడు నొక పాటెఱుంగ డెద యెంతయు గోమల మెప్పుడైననే
గుడువగ బిల్తుగాని తనకుం గల యాకటి ప్రొద్దెఱుంగ డీ
కొడుకిటు పోకకున్ మనము గుందెడు నిన్గనియూరడిల్లెడున్"

"కుంతీదేవికి మాద్రేయులపై అంతటి అనురాగము గలదు గనుకనే ఉత్తర గోగ్రహణ సందర్భమున అర్జునునికి "కుంతీసుత మధ్యముడు" అను

1,2,3. A.Critical Int.Pages 46,311,311

విశేషణమును తిక్కన ప్రయోగించినాడు....పొట్టకూటికి పరుల పంచన ఉండవల వచ్చుట దైన్యాపాదకము.ఆమె క్షత్రియ కాంత.ఎంత దుఃఖము పొందవలెనో అంత దుఃఖము పొందిన పిమ్మట రజోగుణాధిక్యముచే తమ కష్టములకు కారకులైన వారి యందు ప్రతీకారము నెరపవలసినదని పుత్రులకు సందేశము పంపినది అని కుంతి మాతృప్రేమను,నకుల సహదేవులపై ఆమెకు గల అనురాగాన్ని,క్షత్రియ కాంతకుసహజమైన ఆమె వీరోచిత స్వభావాన్ని కీర్తించినారు.

ఎందరెన్ని విధాల విమర్శించినా, కీర్తించినా భారతీయ సాహిత్యంలో ముఖ్యంగా పౌరాణిక పాత్రలలో కుంతి విశిష్టతను సందేహించడానికి వీల్లేదు. మహాభారతంలోని స్త్రీపాత్రలన్నిటిలోనే గాదు,భారతీయ సాహిత్యమంతటిలోనూ కుంతికి సాటి మరొక పాత్రలేదంటే అతిశయోక్తిగాబోదు.ఆమె పరిపూర్ణ వ్యక్తిత్వం,ధీరోదాత్తత,త్యాగశీలత,సేవానిరతి - ఆమెలోని సమస్త గుణాలు నారీలోకానికి స్ఫూర్తి కారకాలు.భారతీయ సాహిత్యాకాశంలో ఉజ్జ్వలధృవతార కుంతి

## 8.మాద్రి

స్త్రీలలో మాతృత్వకాంక్ష అత్యంత బలీయమైనదన్న విషయానికి మాద్రి ఉదాహరణ.భర్తను, సపత్నిని వేడి,తన కోర్కె సఫలం చేసుకోగల్గిన మాద్రి భార్యగా మాత్రం కర్తవ్య నిర్వహణలో విఫలురాలైంది.ముని శాపం సంగతి తెలిసిఉండీ భర్తను ఏకాంతంలో తన సౌందర్యంతో, మనోహరమైన అలంకారాలతో పరవశుణ్ణి గావించి,అతని మరణానికి కారణభూతురాలైంది మాద్రి.తనప్రమత్తతకు మనోచాంచల్యానికి మూల్యం చెల్లించడానికి సహగమనమన్న శిక్ష విధించుకున్నది ఒకవేళ ఆమె జీవించిఉన్నా,నిరంతరం ఆత్మ నిందకు గురి అవుతూ బ్రతకవలసి వచ్చేది. పసివాళ్ళైన తన బిడ్డలను సవతియైన కుంతి కప్పగించి జీవితాన్ని ముగించుకున్న మాద్రి చరిత్రలో మాతృత్వకాంక్ష, మనోవైకల్యం, పశ్చాత్తాపం,చేసిన తప్పుకు శిక్ష అనుభవించాలన్న తెగువ ప్రస్ఫుటంగా కన్పిస్తాయి తప్ప గాంధారితో గాని,కుంతితో గాని పోల్చుకోదగిన గుణాలేవీ కన్పించవు.

'మహాభారతము-మహిళ' అన్న తమ గ్రంథంలో శ్రీ జక్కా వేంకట రమణప్పగారు మాద్రి పట్ల సానుభూతితో స్పందిస్తూ "తన ప్రవృత్తి దోషభూయిష్టమని యామె గుర్తించినది..... పతితో చితారూఢయై యగ్నిశిఖల నపగతప్రాణ యయ్యెను.ఈ విషయమున మాత్రము మాద్రి నిర్ణయము మహోదాత్తమయినది. ఆనాటి సంప్రదాయమున సహగమనము నియతము గాదు.

అయినను సిద్ధపడిన దనగా మాద్రి తానొనర్చిన కార్యమున కెంత వేదనపడినదో తెలియుచున్నది." (పుట72) అన్నారు.

శ్రీమతి శ్రీదేవి కూడ మాద్రి పట్ల అపారమైన సానుభూతితో-"తన మూలంగానే భర్త మరణించాడన్న నిజం ఆమెకు మానసిక వేదనకు గురిచేసింది. భర్తలేని భవిష్యత్తు భయంకరంగా తోచింది.మోయాల్సిన బాధ్యతలు, చేయవలసిన కర్తవ్యాలు,మోయవలసిన యౌవన భారం ఆమెకు దుస్సహంగా అనిపించాయి. తీవ్రమైన నిరాశా, ఆశాభంగం, దిగులు ఆమెను భయకంపితను చేశాయి. కాబట్టి కుంతిని వారించి తానే సహగమనం చేస్తానంది.హస్తినాపురంలో తన బోటివారు సత్యవతి,అంబిక, అంబాలిక...... వారిలో తానూ చేరిపోయి దుర్భర జీవితాన్ని అనుభవించాలి.యౌవన సుఖాలకు దూరంగా,నిశ్శబ్దంగా,నిస్తబ్దంగా, దానికంటె సహగమనం చేసి మరణిస్తే'పతివ్రత' అనే స్థానమైనా దక్కుతుంధి అని ఆశించింది. దోషం తన మీదనే వేసుకుంది.ప్రతీకారంతో ప్రజ్వరించిపోకుండా నిశ్శబ్దంగా మృత్యువును ఆహ్వానించింది.సహగమనానికి ముందు ఆయువతి హృదయం ఎంతగా క్షోభించి పోయిందో ఎంతగా కుమిలిపోయిందో!" [1] అన్నారు.

క్రీస్తుకు పూర్వం 300 సం॥లో ఉన్న 'సతి' ఆచారాన్ని గూర్చి ప్రస్తావించే సందర్భంలో భారతీయ సంస్కృతిని గూర్చి అధ్యయనం చేసిన డా. అల్టేకర్ మాద్రిని గూర్చి ఇలా వ్రాశారు -

"The most important among them is that of Madri. But in her case it is interesting to note that the assembled sages try their best to dissuade her from her resolve. She says that she is determined to die with her husband.First she was the cause of his death.Secondly because she would be unable to control her passions and thirdly because she might find it difficult to treet evenly her sons and step sons"[2]

## 9.ద్రౌపది

ఆంధ్ర మహాభారతంలోని స్త్రీపాత్రలలో ప్రధాన కథతో ప్రత్యక్ష సంబంధం కలిగిన అతి కొద్ది స్త్రీపాత్రలలో అత్యంత విలక్షణమైనదీ,మహోత్కృష్టమైనదీ,సర్వాంగ సుందరమైనదీ, ద్రౌపది పాత్ర. స్త్రీలోని సమస్త శక్తులకు, సమస్త సుగుణాలకు,

1. ప్రా. తీ. కా.వి. స్త్రీ. పుట 152. 2The position of women in Hindu Civilization

వ్యక్తిత్వ సంపదకు,శేముషీ వైభవానికి,చాతుర్యానికి,కార్యసాధనకు,గృహిణీధర్మ నిర్వహణకు, పాతివ్రత్యానికి, స్వాభిమానానికి,ఎట్టివారితోనైనా మాటపడని తీరుకు,సౌందర్యం,సౌశీల్యం, ధైర్యం, ప్రేమ, త్యాగం, సహనం - ఒకటేమిటి ఉత్తమ స్త్రీ రత్నంగా పేర్కొనడానికి ఏ అర్హతలవసరమో అవన్నీ సంపూర్ణంగా మేళవించిన భారత నారీ శిరోరత్నం ద్రౌపది.

మహావీరుడైన ద్రుపదునికి యజ్ఞకుండంలో అయోనిజగా జన్మించిన ద్రౌపది వీరపుత్రి మాత్రమేకాదు, మహావీరుడైన ద్రుష్టద్యుమ్నుని సోదరి. వీరపత్ని. మరొక మహావీరుడైన పాండురాజు కోడలు.రాయబార సందర్భంలో శ్రీకృష్ణునితో ద్రౌపది

"వరమున బుట్టితిన్ భరత వంశము జొచ్చితి నందు బాండు భూ
వరునకు గోడలైతి జనవంద్యుల బొందితి నీతి విక్రమ
స్థిరులగు పుత్రులన్ బడసితిన్ సహజన్ముల బ్రాపుగాంచితిన్
సరసిజనాభ! యిన్నిట బ్రశస్తికి నెక్కినదాన నెంతయున్"[1]

అని చెప్పడం ఆమె అభిజాత్యాన్ని సూచించే ప్రత్యక్షరసత్యం. అటువంటి ద్రౌపదికి జీవితంలో జరిగిన నీచాతి నీచమైన అవమానాలు,అదీ మహావీరులైన భర్తలముందు ప్రపంచ చరిత్రలోనే ఏస్త్రీకి ఎన్నడూ జరిగి ఉండవు. కురుసభలో సకల జన సమక్షంలో దుశ్శాసనుడామె కొప్పు పట్టి యీడ్చినాడు.కట్టిన బట్టలూడదీయ సాగినాడు.శ్రీకృష్ణుని దయవల్ల ఆమె తన మానం కాపాడుకో గలగింది. పాండవ పట్టమహిషిగా రాజసూయావభృథ స్నానమాచరించిన ద్రౌపది ధృతరాష్ట్రుని నిండు కొలువులో హీన పరాభవ స్నాత కావడం విధిచోదితం.

అత్యంత సుకుమారియైన ద్రుపదరాజనందన భర్తలతో బాటు అరణ్యవాస క్లేశాన్ని పన్నెండు సంవత్సరాలనుభవించింది. అజ్ఞాత వాసంలో సైరంధ్రిగా సామాన్య స్త్రీలాగా సుదేష్ణకు సేవలు చేసింది.కామాంధుడైన కీచకుని చేత విరాటుని నిండు కొలువులో భర్తలముందే ఘోరంగా అవమానింప బడింది. అయితే జరిగిన పరాభవానికి క్రుంగి పోకుండా ఆమె విరాటుని సభలో ప్రసంగించిన తీరు, నాట్యకత్తెలాగా పలుపోకడలు పోక వెళ్లమన్న ధర్మజుని కామె రోషంతో చెప్పిన సమాధానం ద్రౌపది ధీరత్వాన్ని మానవతీత్వాన్ని వెల్లడి చేస్తున్నాయి.

"ఈ నరపతి యాస్థానము
లో నొక్కరుడైన ధర్మలోప భయమునం

1. భార. ఉద్యోగ. ఆ. 3. ప.108

బూని తగవైన వెడపలు
కైనను బలుకంగ జాలడయ్యోడు నకటా" [1]

"ఇందఱు జూడగా నిచట నిమ్మొయి నన్ను బతివ్రతాగుణా
స్పందిత వర్తనం బరమ సాధ్వీననిందిత శీల గీచకుం
డెందును నెట్టి యంగనల నెవ్వరు జేయనియట్లు సేయగా
గొందఱకైన నిప్పు కృపకుం దతిగాదటె యేమిసెప్పుదున్" [2]

"నాదు వల్లభుండు నటుడింత నిక్కంబు
పెద్దవారి యట్ల పిన్నవారు
గాన బతుల విధమగాక యే శైలూషి
గాదనంగ రాదు కంకభట్ట" [3]

కురుసభలో ఆమె ప్రశ్నలకు భీష్మ విదురాదులే సమాధానం చెప్పలేక పోవడం ధర్మసంబంధమైన ఆమె పాండిత్యానికి సూచకం.

ఈశ్వరుని వరం వల్ల పంచభర్తృకయైనా,అర్జునునిచే స్వయంవర విజితయైనా, ద్రౌపది తన భర్తలందరినీ సమానంగా ప్రేమించింది,సేవించింది.వారి ప్రేమనూ,అనురాగాన్నీ అంతగానూ పొంద గలిగింది.అత్త కుంతీదేవినితన సేవలతో మెప్పించింది.ఆమె ప్రేమకు పాత్రురాలైంది.ద్రౌపది భర్త ప్రేమను పొందిన సౌభాగ్యవతి మాత్రమేగాదు,వారికి ఆమె అంటే భయభక్తులు కూడా ఉండేవనడానికి ఎన్నో దృష్టాంతాలు కానవస్తాయి.

ద్వారకలో సుభద్రను వివాహమాడిన తర్వాత అర్జునుడామెతో కలిసి ద్రౌపది ముందుకు రావడానికి భయపడి ఆమెను ముందుగా గోప స్త్రీలతో కలిసి వెళ్లి దర్శించి ఆమె ఆశిస్సులు పొందమనడం,మహాపరాక్రమ వంతులైన భీమార్జునుల పౌరుషత్వాన్ని రెచ్చగొట్టే తిరస్కార పూరితమైన "కట్టి విక్రమంబు కాల్పనే' అనీ 'గాండీవమున దహింపనా అని అర్జునునితోను రెండు మూడుసార్లు అన్నా వారు కిమ్మనక భరించడం, వారికామె పట్ల గల భయభక్తులకు తార్కాణం. శ్రీకృష్ణుడు కౌరవులతో సంధికై రాయభారిగా వెళ్లడం సహించక అతన్ని గూడా "నీకు చెల్లెలినై నీవు బ్రతికి ఉండగా నా కవమానం జరిగిందే" అని ఉపాలంభించింది. అతని సాంత్వన వచనాలతోగాని, ఆమె ఆక్రోశం శాంతించలేదు.

ద్రౌపది మహా ఉచితజ్ఞురాలు.ధృతరాష్ట్రుడిస్తానన్నా క్షత్రియ స్త్రీ రెండు

1. భార. విరాట. ఆశ్వా. 3.ప 141 2. అదే. ఆశ్వా2. ప.142
3 భార. విరాట. ఆశ్వా. 3.ప 152

కంటే ఎక్కువ వరాలు కోరకూడదని తిరస్కరించింది.కార్యసాధకురాలు కూడా. కీచకుని చంపగలవాడు భీముడొక్కడేయని రహస్యంగా రాత్రి అతణ్ణి కలుసుకొని మంచిమాటలతో అతణ్ణి కరిగించి తన అవమానాన్ని చల్లార్పగల వాడతడొక్కడేయని పురి గొల్పి కార్యం సాధించింది.కీచకుని నుగ్గు నుగ్గు చేసిన భీముణ్ణి తన ప్రశంసా వాక్కులతో ప్రణయ భరితమైన చూపులతో సన్మానిస్తుంది. ద్రౌపది 'కాంతాసమ్మితత్వాన్ని' తిక్కన యీఘట్టంలో ఎంతో హృద్యంగాచిత్రించినాడు

"బక హిడింబ కిమ్మీరుల బాహుబలము
నా జరాసంధు నుగ్ర దర్పాతి శయము
లోక భీకరములు విజయాకరములు
నైన నీ కరములకు లోనయ్యెగాదె" [1]

లోక భీకరమైన బక హిడింబ, కిమ్మీర, జరాసంధుల దర్పాతిశయం విజయానికి ఆటపట్టులైన నీ చేతులకు లోబడింది కదా! అంతఃపుర కాంతల వినోదం కొరకు వివేక హీనుడైన విరాటుడు నీ పోరాటం యేర్పాటు చేసినప్పుడు నీవు నీ బలంతో విజయం పొందినపుడు సంతోషించిన నన్ను నీ పట్ల నా చూపులను, సుదేష్ణ ఆమె సరిచారికలు సందేహిస్తూ ఉంటారు. నీ మూర్తి నా కంటినీ, మనస్సునూ, అనురాగ భరితం చేయగా ఒక్కొక్కసారి యేమరుపాటు చెందుతూ ఉంటాను. వారు నావిషయం గమనించినట్లు వారిని చూస్తే అర్థమైపోతుంది.

"కొలువు లోపల నిన్న కోపమగ్గలెత్తిన దలగక నిలిచిన ధైర్య మహిమ
నేడిందు జనుదెంచి నిర్వికారత బ్రజకన్నులు గప్పిన గౌరవంబు
మనవారిలోన నొక్కనినైన బిల్వకుత్సాహంబు సేసిన సాహసంబు
లోక దుర్జయుడగు నీ కీచకునిని వ్రేల్మిడి రూపుమాపిన కడిమి పెంపు

సూడ దలపోయ మెచ్చ సంస్తుతి యొనర్ప
నా దరంబె నీ యుత్తమ నాయకత్వ
మెఱిగి నిను కొనియాడ నే నెంత దాన
మహిత విస్మయానంద నిర్మగ్ననయితి"[2]

నిన్న కొలువులో అంత కోపం వచ్చినా బయటపడక నిలిచిన నీ ధైర్యం, నేడిక్కడికి వచ్చి నిర్వికారంగా ప్రజల కన్నులు గప్పిన నీ గౌరవం, మనవాళ్లొక్కణ్ణైనా పిలువకుండా నీవు చేసిన సాహసం ఎవరికీ జయించడానికి సాధ్యంకాని ఈ కీచకుణ్ణి

1. భార. విరాట. ఆశ్వా. 2.ప 194.    2. భార. విరాట. ఆశ్వా. 2.ప 194

రూపుమాపిన బలసంపద సొంపు చూడడానికీ, తలచడానికీ, చెప్పడానికీ, స్తుతించడానికీ, నాకు సాధ్యమా? నీ ఉత్తమ నాయకత్వమహిమను కొనియాడడానికి నేనెంతటి దానను? నా మనస్సు విస్మయానందాలలో మునిగిపోయింది."

ప్రణయ భరితమైన దౌపది మాటలు భీమునికి కీచక వధవల్ల కల్గిన శ్రమనంతా హరించివేసి, మంచి గంధంలాగా, మలయమారుత స్పర్శలాగా, ఆహ్లాదాన్ని కల్గించినాయి.

అనుకూలవతి, అనురాగవతి అయిన భార్య భర్తవల్ల తన లక్ష్యాన్ని ఎలా సాధించుకోగలదో, సాధించిన తన భర్తను ఎట్లా సంభావించగలదో, ఈ సన్నివేశం పరమ హృదయంగమంగా వివరిస్తుంది.

శ్రీకృష్ణుడు కౌరవ సభకు రాయబారిగా వెళ్లేటప్పుడు ద్రౌపది తన మనస్సులోని పరాభవాగ్నిని వెలిగక్కిన తీరు బహుధా ప్రశంసనీయం. విరబోసుకొని ఉన్న తన కురులను ఎడమ చేతితో పట్టుకొని "ఇవి దుశ్శాసనుడు పట్టి ఈడ్వగా మిగిలాయి. కౌరవులతో సంధిమాటలు పలికేటప్పుడు వీటిని గుర్తుచేసుకో" అని ఎంత వాడిగా మాటలాడిందో,"నీ సోదరినిగదా,నాకింత అవమానం జరిగినా సంధికి పూనుకొంటావా?" అని అంత దయనీయంగానూ అడిగింది.

అరణ్యవాస సమయంలో ద్రౌపది ధర్మరాజును క్షాత్రధర్మానికి పురికొల్పుతూ చేసిన ప్రసంగం,అరివీర భయంకరులైన భర్తలు ఆ విధంగా వనవాసక్లేశం అనుభవిస్తున్నందుకు ఆమె పొందుతున్న క్షోభను వ్యక్తం చేయడమే గాకుండా ఆమె తనకు దారుణావమానం చేసిన కౌరవజ్యేష్ఠుణ్ణీ,అతని తమ్ముడైన దుశ్శాసనునిపైనా ప్రతీకారం తీర్చుకోవడానికి పాండవులను మానసికంగా సిద్ధం చేసేదిగా కన్పిస్తుంది. ధర్మబద్ధుడైన ధర్మతనయునితో ద్రౌపది ఎంతో నిపుణంగా ధర్మచర్చ చేస్తూనే పలుమార్లు వారిని కౌరవులపైకి ఉసిగొల్పుతుంది. "కార్యేషుదాసీ, కరణేషుమంత్రీ" అన్న మనువు మాటలకు ప్రతీకగా గోచరిస్తుంది.

సాల్వకన్యను వివాహమాడటానికై వెళ్తుండిన సైంధవుడు ఆశ్రమ వాసినియైన ద్రౌపదిని చూసి మోహాంధుడై వావి వరసలు మరచి తననేలు కొమ్మని ప్రలాపించినపుడు ద్రౌపది మొదట సామోపాయంతో దుస్సల భర్తయైన అతడు తనకు తోబుట్టువు వంటివాడని, ఆ విధంగా మాట్లాడడం తగదని హితోపదేశం చేస్తుంది. ఆ 'మదాంధుడు' "వనితా రత్నము లెల్లవారికి భోగంబులు" ప్రమదాజనుల యెడ వావి వెదుకం జనదు" అనగానే 'క్రోధకలుషాంతరంగ' యై వీరావేశంతో తన భర్తల పరాక్రమాన్ని ఉగ్గడిస్తుంది. ఈ సందర్భంలో వీరపత్నియైన

ద్రౌపది క్షత్రియకాంత కుచితమైన శౌర్యప్రదర్శన తన మాటల ద్వారా చేస్తుంది. చివరకు

"నను బెఱ వనితల చందం
బున నవమానింప నీకు బోలదు మత్సా
వన పాతివ్రత్య మహిమ
ననిశము నే నీడు నెందు నందదు నన్నున్"[1]

అని తన పాతివ్రత్య మహిమ వల్ల తనకెన్నడూ కీడు జరగదని తనను ఇతర సామాన్య స్త్రీలలాగా భావించ వద్దని హెచ్చరిస్తుంది. ఈమాటలలో ద్రౌపది ఆత్మవిశ్వాసం, చెక్కుచెదరని ధైర్యం,తన పాతివ్రత్యం పట్ల ఆమెకున్న అపారమైన నమ్మకం వ్యక్తమవుతున్నాయి. తనను పట్టుకోబోయిన ఆ దురాత్ముని ఆమె ఒక్క తోపు తోయగా వాడు బోర్లా పడ్డాడు.

"పాప వినిశ్చయుండు పతి పయ్యెద కొంగు గడంగి పట్టినం
గోపముతో నుదల్చికొని కోమలియున్ వెసవాని ద్రోయుడున్
బోపటివాడు చిత్రముగ భూమితలంబున ద్రెళ్లె మామత
క్లైవవిభగ్నమూలమయి చెచ్చెర ద్రెళ్లు మహీరుహంబనన్" [2]

పెనుగాలికి మూలంతో సహాకూలిన వృక్షంలాగా వాడు నేలకూలినాడట. ద్రౌపదికి ఆత్మబలమే కాదు శారీరక బలం కూడా ఉందని దీన్ని బట్టి తెలుస్తుంది. కీచకుని కూడ ఇలాగే తోసివేస్తే వాడు సింహబలుడయి ఉండీ, నేలకూలినాడు.

తన అయిదుగురు పుత్రులను అశ్వత్థామ వధించినప్పుడు దుర్భరమైన పుత్రశోకాన్ననుభవించిన ద్రౌపది మొదట అశ్వత్థామను చంపడానికి భీముణ్ణి నియోగిస్తుంది. భీముడశ్వత్థామను పరాభవించి, అతని శిరోమణిని తెచ్చి యిచ్చి, అతడింక చచ్చినవానితో సమానమన్నప్పుడు గాని ఆమె మనస్సు శాంతించలేదు.

ఈ సందర్భంలో పోతన చిత్రించిన ద్రౌపది అత్యంత కరుణాపూర్ణ హృదయ అశ్వత్థామను చంపించి నట్లయితే అతని తల్లికి తనలాగే పుత్రశోకం కల్గుతుందని క్షమించి విడిచి పెట్టమన్న కృపాసింధువు.

ఎంతటి అవమానాలనెదుర్కొన్నా, ద్రౌపది తన ఉదాత్త గంభీర వ్యక్తిత్వాన్ని ఎన్నడూ కోల్పోలేదు. కురుసభలో ఆమె చూపిన సంయమనం .పెద్దలను నిలదీసిన వైఖరీ, ధృతరాష్ట్రుడు వరాలిస్తానన్నప్పుడు రెండు వరాలు మాత్రమే క్షత్రియ

---

1. భార. అరణ్య.ఆ6.ప.188    2. భార. అరణ్య.ఆ6.ప.190

కాంతయైన తాను కోరదగునని, వాటితో తన భర్తల దాస్యాన్ని తొలగించమని ఆమె కోరిన తీరు, కీచకుని మట్టుబెట్టిన తర్వాత సుదేష్ణ వద్ద ఎంతో నిగ్రహంతో తొణకకుండా మెలిగిన తీరు, సైంధవుడు అపహరించి తీసికొని పోతున్నా చెక్కుచెదరని ధైర్యం - ద్రౌపది విశిష్ట వ్యక్తిత్వానికి మహోన్నతమైన కొన్ని నిదర్శనాలు మాత్రమే.

ద్రౌపది మహాపతివ్రత. అయిదుగురు భర్తలనూ సమానంగా ప్రేమించింది అయినా తనను స్వయంవరంలో మత్స్యయంత్రాన్ని ఛేదించి గెల్చుకొన్న అర్జునుని మీద ఆమెకు మక్కువ ఎక్కువ ఆ కారణంగానే మహాప్రస్థానంలో ఆమె అందరికంటె ముందుగా పడిపోయిందని ధర్మరాజు సోదరులతో చెబుతాడు. తక్కిన రాజలోకాన్ని ఓడించి తన హృదయాన్ని దోచుకొన్న విజయుని పట్ల ఆమె రవ్వంత పక్షపాతం కల్గి ఉండడం క్షమార్హంకాని దోషమూకాదు, దాని వల్ల ఆమె పాతివ్రత్యానికి కల్గిన భంగమూలేదు.

సత్యభామకు పాతివ్రత్యాన్ని గూర్చి ద్రౌపది చెప్పిన అనేక విషయాలు నాటకీ నేటికీ భారతీయస్త్రీలకు ఆచరణీయాలు. ఎంతో నేర్పుతో, ఓర్పుతో ఆమె తన గృహిణీ ధర్మాన్ని నెరవేర్చింది. అత్తకుంతీదేవిని కొడుకులకన్న మిన్నగా సేవించింది, ప్రేమించింది. రాజసూయయాగ సందర్భంలో స్వయంగా దుర్యోధనుడే ద్రౌపది కార్యనిర్వహణ దక్షతను ఎంతో ప్రశంసించినాడు.

ఒక మహాపతివ్రతను దారుణంగా అవమానిస్తే అది ఎంతటి సర్వ నాశనానికి దారితీస్తుందో, అవమానించినవాళ్లకెలాంటి శిక్ష లభిస్తుందో ద్రౌపదిపాత్ర నిరూపిస్తుంది.

భారతీయస్త్రీల వ్యక్తిత్వపుటౌన్నత్యం శిఖరాయమానమై ద్రౌపదిలో గోచరిస్తుందనడంలో ఎవ్వరికి ఎటువంటి విప్రతిపత్తి లేదు. భారతంలోని అన్ని స్త్రీ పాత్రలలోను వెలలేని, తులలేని అనర్ఘరత్నం ద్రౌపది.

భారతంలోని అత్యంత ప్రముఖ పాత్రలలో అగ్ర గణ్యమైన ద్రౌపది పాత్రను గూర్చి విమర్శలు వెల్లువై ప్రవహించాయి. వానిలో కొన్ని -

మహాభారత కథను చారిత్రకంగా పరిశీలించేకృషి చేసిన విమర్శక పండితులలో అగ్రేసరులనదగిన శ్రీ పెండ్యాల వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రిగారు ద్రౌపది పాత్రను గూర్చి వెలిబుచ్చిన అభిప్రాయాలు చాలా ప్రత్యేకమైనవి, భిన్నమైనవి

"తంత్ర వార్తిక భాష్యవాక్యములచే 'భట్ట కుమారిలుని ' కాలమున

ద్రౌపది కైదుగురు భర్తలు కలరా? అర్జునుడొక్కడేనా?యను సందేహము విద్వాంసులలో కలిగియున్నదనియు, అర్జునుడొక్కడేనిజమగు భర్తయైయుండును గాని ద్రౌపది పంచపాండవైకమత్యమును లోకములో సూచించుటకై తానైదుగురకు భార్యనే అని ప్రకటించుకొనుచు గృత్రిమముగా సంచరించునది యనియు పాండవులుకూడ ద్రౌపదివలెనే గూఢవర్తనులై సంచరించువారనియు, ద్యూత కాలములో గూడ లోకములో జెప్పుకొనునంత మానభంగము ద్రౌపదికి గౌరవులు చేయకపోయినను ద్రౌపదియే ధార్తరాష్ట్రుల కపఖ్యాతి విశేషముగా గలుగు రీతిని. రజస్వలాది వేషమును వేసియున్నదనియు, స్పష్టమగుచున్నది. ద్రౌపది కర్జునుడొక్కడే భర్తయైయుండుననుటకు ధర్మరాజు భీమునితో ద్రౌపదికర్జును నందే పక్షపాతమని యొకప్పుడు చెప్పిన వాక్యము ధృడపరచుచున్నది."[1]

"ద్రౌపది తనపై అణుమాత్రపు మాటగూడ పడనీయని మానవంతురాలు. (పుట. 167)... విశేష విద్యావతి. ద్యూత సమయమున ధర్మశాస్త్రపు ప్రశ్నలచే సభికులను నిరుత్తరులను జేసినది. ప్రథమ ద్యూతమున పాండవులు కౌరవదాసులు కాగా ద్రౌపదియే బానిసతనము నుండి యుక్తిచే పాండవులను విడిపించి వారి యాయుధాదులం గౌరవులిచ్చునటుల చేసినది. బలవతి. దేహధారుఢ్యము నందామె భీమునికీడైనది. తన్ను బట్టవచ్చిన సైంధవుని బోరగిల వడద్రోసినది. వనవాస కాలమున పలుమారులు ధర్మరాజాదులను కౌరవులపైకుసికొలుపు చుండెడిది. బంధువధముచే ఖిన్నుడయి రాజ్యము నంగీకరింపనొల్లని ధర్మజుని రాజ్యోన్ముఖునిగా జేసిన యుపన్యాసము ప్రశంసనీయము. ఈమె యాభిజాత్యమున కీసుచెందియే కృష్ణుడీమె సంతతి నిలవకుండ జేసెను. .."

భారత వర్ణనా విశేషములచే ద్రౌపది నేటి పాశ్చాత్య ప్రౌఢ వనితామతల్లి కల దలదన్నిన ప్రౌఢత్వము గలదిగా దోచును,

" పాతివ్రత్యమునుంగాక తదితర విషయములలో నేటికిని భారత వర్ష వనితామతల్లికలకాదర్శముగా నుండదగినదియై యున్నది."

శ్రీ మూలంపల్లివారి వ్యాఖ్యానము -" భారత కవులు చిత్రించిన ద్రౌపది సకలస్త్రీ స్వభావ ప్రకాశమునకద్దము. అత్యున్నత గౌరవమునకును, నతి నీచావమానమునకును,అతిలోకమతివైభవమునకును, పరమపాతివ్రత్యమునకును అత్యంత సహనమునకును, వ్రేటుపడ్డ యురగాంగన తీరునకును'త్యాగమునకును,

1.మహా.భా.చ.పుట. 168

ప్రేమకును, వేయేల స్త్రీ సర్వస్వమునకు నీమె ప్రస్ఫుట ప్రకాశము ."[1]

మహాభారత కావ్యనాయిక ద్రౌపది అనిష్టీరీకరించిన శ్రీ జక్కా వెంకటరమణప్పగారు-" ఆదిగర్భేశ్వరి అయిన ఆమె ఒక్క క్షణములో నాగర్భ దరిద్రురాలివలె . ప్రవర్తించుటకు ఇసుమంతయు సంకటపాటు పడినట్లు మనకు సూచనయులేదు. వస్తువాహనములు , ఐశ్వర్యము , ఆభరణాదులు ఇవి కేవలము అశాశ్వతము లనియు, స్త్రీకి సర్వము పతియే అనియు ఈమె తన ప్రవర్తనచే నిరూపించినది. వివాహమునాటి పాండవులస్థితికి క్షణకాలములో అలవాటు పడుటలో నీ తాత్పర్యము కలదు."[2]

ద్రౌపది ఐదుమారులు భర్తృలబ్ధిని అడిగినది కాని ఐదుగురు పతుల నడగలేదు. తక్కిన పంచపతి లాభాధికము ఈశ్వర సంకల్ప జనితమైనది. దానినామె ధైర్యముతో సౌగుణ్యముతో సచ్ఛీలరూపముగా పరిణమింపజేసుకొని భరించినది. ద్రౌపదీగతముగా పాండవులైదుగురిలో నీషణ్మాత్రము వైమనస్యము విశాల కాలములో సంభవింపకుండుటయే ఆమె సౌశీల్యమునకు గొప్ప ప్రమాణము. లోకముననిట్టిది దుర్ఘటము.నిజమునకు ఒక్కపతితో వేగుటయే పడతికి అసిధారా వ్రతమువంటిది.కాగా ఐదుగురిని ఆరాధించుట వారందరిచే సమానముగా ఆరాధింపబడుట అనునవి మహావిషయములు. ఈ పంచపతిత్వ వృత్తాంతము ద్రౌపదికి భారతీయ దాంపత్యజీవితములో బరమోత్కృష్టస్థానము నొసంగుచున్నది"[3]

"సమయోల్లంఘనమునకై ధర్మజుని ప్రేరేపించునపుడు ఆమె పలికిన పలుకులు ధర్మజునంతటి వానికి మెప్పు పుట్టించినవి. ద్రౌపది సత్యభామకు చేసిన హితోపదేశము సార్వకాలిక స్త్రీ సమాజమునకు శిరోధార్యమైన ఉపదేశ రత్నము. ..... సైంధవపరాభవఘట్టములో నామె ధైర్యసాహసములు ప్రశంసింప దగినవి. "[4]

"...... వరదాన ప్రసంగమున ద్రౌపది ఎంతవివేకవతియో ఎంత రాజ నీతిజ్ఞయో, ఎంత భర్తృవ్రతయో వెల్లడియగుచున్నది."[5]

".... మహాలక్ష్మీ స్వరూపిణియైన ద్రౌపది భూలోకమున పాండవులకు నిత్యానపాయినియై వారికి ఐహికాముష్మిక సుఖములనందజేసినదని చెప్పనొప్పును..."[6]

సంస్కృతాంధ్ర భారతాలను మథించి, వేదాంత పరంగాకూడ

---

1.మహా. భా.వి.వి.కో.పుట.378 2.మహా. భా.మ.పుట.23 3. మహా. భా.మ.పుట.24
4.మహా. భా.మ.పుట.30 5.అదే.పుట.31. 6.అదే.పుట.48.

అత్యద్భుతంగా వ్యాఖ్యానించిన శ్రీ యల్లంరాజు శ్రీనివాసరావుగారు ద్రౌపదిని స్వర్గరాజ్యలక్ష్మిగా సంభావిస్తున్నారు."ద్రౌపదీ జన్మవృత్తాంతం వ్యాసుడు పాండవులకు చెప్పింది, ద్రౌపదీ పాండవులిరువురి పూర్వజన్మవృత్తాంతము ద్రుపదుడికి చెప్పింది చాలా గొప్ప రహస్యం వెల్లడిస్తాయి. దీన్నిబటి ద్రౌపది మామూలు వనితగాదు, స్వర్గరాజ్యలక్ష్మి. పాండవులు ఐదుగురినావిద వివాహమాడటంగాదు. ఐదుగురూ ఐదురూపాలలో ఉన్న ఒకేఒక ఇంద్రుడే. దూరమాలోచిస్తే ఇంద్రుడంటే జీవుడు. అతడే ఐదుప్రాణాలూ, ఐదు ఇంద్రియాలుగా భాసిస్తున్నాడు. వాడికధీనమైన ఒకేఒక జీవనశక్తే ద్రౌపది. జ్ఞానశక్తీ అదే, క్రియాశక్తీ అదే" [1]

ద్రౌపది ఉదాత్త గాంభీర్యాలను ప్రశంసిస్తూ శ్రీ అప్పజోడు వెంకట సుబ్బయ్యగారు ఇలా అంటున్నారు. -

"అసమాన సౌందర్యవతియై , అభిమాన ధురంధరయై , అయిదుగురు భర్తలకు భార్యయై- అందరిని తృప్తి పరచి,మానభంగము వంటి తీవ్రావమానమును, అరణ్యఅజ్ఞాతవాసముల వంటి కష్టములను జీవితములో ఎదుర్కొని, రాజసూయాశ్వమేధాది మహాకార్య సంరంభములతో ఎంతో నిర్వాహకత్వమును నెరపి, అందరిమన్ననలను ప్రత్యేకించి అత్తగారి ప్రశంసలను అందుకొన్న పాండవ పట్టమహిషి ద్రౌపది. ఆమె ఓర్పునేర్పులు, ఉదాత్త గాంభీర్యములు ఎవరినైన ఆకర్షింపగలవు. ఎంతో మెప్పును పొందగలవు" [2]

"మానవసమాజమున ఏర్పడు సంఘర్షణలలో మగువలకు జరుగు అవమానములు - ఆవేశములనెంతగా పెంచగలవో, ప్రతిజ్ఞలనెట్లు పలికింపగలవో .సంఘర్షణలనెంత జటిలము చేయగలవో, దోషులనెట్లు దహింపగలవో, దారుణ పరిణామములకెట్లు దారితీయగలవో మహాభారతము ద్రౌపదిపాత్ర నాధారముగా చేసి చిత్రించినది. మానవ జాతిని హెచ్చరించినది." [3]

ద్రౌపది పరాభవానికి శ్రీమతి శ్రీదేవి మరోకోణంలోనుండి కారణాలను ఇలా విశ్లేషిస్తున్నారు-" ద్రౌపది కూడా సాంఘిక కారణాలవల్ల పరాభవింపబడిన స్త్రీయే.ఐదుగురికి ఉమ్మడి భార్యగా ఉంది కాబట్టే ధర్మరాజు ఆమెనే జూదంలో పణంగా పెట్టాడు.తన భార్యను గానీ,మిగతా సోదరుల భార్యలను గానీ జూదంలో పణంగా పెట్టేధైర్యం చేయలేదు." [4]

1.మహా.భా.వై.పుట.90 2.మహా.భార.మా.స్వ.చి.పుట.219
3. మహా. భార.మా.స్వ చి.పుట219 4. ప్రా.తె.కా.వి.స్త్రీ.పుట. 115

"ఉమ్మడి భార్య అన్న ఒక్క కారణంగానే ద్రౌపది అవమానాలకు గురి కావలసి వచ్చింది. దీనికి మరో కారణంకూడా తోడయ్యింది. అది ఆనాటి సంఘంలోని దుష్ట శక్తుల ప్రభావం. దుర్యోధనుడు, దుశ్శాసనుడు, కర్ణుడు వంటి వాళ్లు ఆమెను అవమానాలకు గురిచేశారు....... కురు వృద్ధులు, పితామహులు, ఆచార్యులు, బంధువులు, మిత్రులు, పుత్రులు, పండితులు అందరూ చూస్తూ కూడా ఏమీ మాటాడక, దుశ్శాసనుని ఎదురించక ఉన్నారంటే ఆనాటి స్త్రీ దుస్థితి, సమాజంలో ఆమె పట్ల ఉండే ఉదాసీనభావం వ్యక్తమవుతోంది......."[1]

ప్రాచీన కావ్యాలలోని స్త్రీపాత్రలను స్త్రీవాద దృక్పథంతో పరిశీలించిన కాత్యాయనీ విద్మహేగారి దృష్టిలో ద్రౌపది " స్వీయవ్యక్తిత్వంతో, చలన చైతన్యాలతో కన్పించే స్త్రీ. ఈమెకు పతులతోడిదే జీవితంకాదు.పతుల జీవితం గురించి కూడ ఆమెకు కావాలి. వాళ్లమీద,వాళ్లవిధానాల మీద విమర్శలు విసరడానికి, అభిప్రాయాలు చెప్పడానికి ఆమె ఎప్పుడూ సందేహించదు..... స్వతంత్ర ప్రవృత్తికలిగి తన అభిప్రాయాలను వేటినైనా నిష్కర్షగా ప్రకటించగలిగిన ద్రౌపదికి, జరిగిన దానిని నోరుమూసుకొని అనుభవించడం,భయభక్తులతో అధీన జీవితం గడపటంతన స్వభావానికే విరుద్ధమైన ద్రౌపదికి సామాజికామోదం లభించిందంటే అది ఆమె పితృస్వామిక సామాజిక, కౌటుంబిక చట్రాన్ని అధిగమించక పోవటం వలననే..... వికసించి విజృంభించే జీవశక్తులను అణచివేసుకొని, ధర్మరాజు నీడగా తన జీవితాన్ని గడుపుకుంది ద్రౌపది.తన గౌరవాగౌరవాలు,తన హోదా,స్థితిగతులు అన్నీ భర్తమీద ఆధారపడినవి కనుకనే ఇంతటి సృజనాత్మక చైతన్యం గల ద్రౌపదికూడా కౌరవ సభలో జరిగిన అవమానానికి పరిహారంగా వరాలు కోరుకొమ్మన్నప్పుడు వ్యక్తిగా తన ఆకాంక్షలను వ్యక్తం చేయలేదు. భార్యగా మొదట ధర్మరాజును,ఆపై మిగిలిన నలుగురిని దాస్యం నుండి విముక్తి చేయమని కోరింది.వాళ్లు దాస్యంలో ఉన్నంత సేపూ భార్యగా వారికధీనమైన తన జీవితంకూడా దాసీజీవితమే అవుతుంది. తన దాస్య విముక్తి భర్తల దాస్య విముక్తితో ముడిపడి ఉంది.కనుక ఆ గ్రహింపు జ్ఞానంతోనే ద్రౌపది అలకంగా కోరుకొంది."[2]

మహాభారత మూలాన్ని పరిస్తే ద్రౌపది తెలివితేటలు,శీలం, ఔన్నత్యం బోధపడతాయని కుమారి నివేదిత అభిప్రాయపడ్డారు.[3]

ఇందరిచే ఇన్ని రకాలుగా వ్యాఖ్యానింపబడినా, ద్రౌపది యొక్క సంపూర్ణమైన, సంక్లిష్టమైన, శక్తివంతమైన,వైవిధ్యభరితమైన వ్యక్తిత్వం ఇంకా

1.ప్రా.తె.కా.వి.స్త్రీ. .పుట116 2.సం.సా.స్త్రీ.దృ.పుట.60 3. యు.యు.భా.నా.పుట.38

సంపూర్ణంగా ఆవిష్కరింపబడవలసిఉంది.

## 10 హిడింబ

రాక్షసియైన హిడింబ తాను మరులుగొన్న భీమునికై బంధుత్యాగం చేసి, సోదర వధను లెక్క చేయక తన కోరిక నెరవేరక పోతే ప్రాణత్యాగానికైనా సిద్ధపడటం ఆమెలోని కామ ప్రవృత్తి తీవ్రతను తెల్పుతున్నది. పాండవులకు ప్రథమవారసుడిని ప్రసాదించిన ఘనత హిడింబదే. రాక్షసత్వంతో బాటుయీమెలో దివ్యత్వం,స్త్రీత్వం, భూతభవిష్యత్తుల నెరుగగల శక్తి ఉండటం విశేషం.వినయం సైతం ఆమెకు ఆభరణమై కుంతీ ధర్మజుల ఆదరాన్ని పొందేందుకు తోడ్పడింది.

"ప్రియునికై సోదర వధకొప్పుకున్న హిడింబ రాక్షసకామమునే తెలిపినది."[1]

## 11 ఉలూచి

కామాతురయైన స్త్రీ ఎంతటి సాహసం చేయగలదో ఉలూచి నిరూపిస్తుంది అర్జునుని కామించి, తన పట్టణానికి, పడకటింటికి తీసుకొని వెళ్ళి, తన వలపు తెలిపి, తనను పరిగ్రహించకపోతే తన ప్రాణాలు పోతాయంటుంది.తన కోరిక నెరవేర్చుకొని సద్యోగర్భంలో పుత్రుని పొందుతుంది.వసువులు గంగ సమ్మతంతో అర్జునునికి కీడుచేయనున్నారని తెలిసి,తన తండ్రిని పంపి, వారిని శాంతింపజేసి పరిహారమార్గమడిగి చిత్రాంగదా పుత్రుడైన బభ్రువాహనుని ప్రేరేపించి,అతనిని తానావేశించి, కొడుకుచే అర్జునుని నిర్జితుని చేసి.తిరిగి సంజీవమణిచే బ్రతికించి, భర్తకు హితము, ఆయువు చేకూర్చిన పతివ్రత.అర్జునుడీమెను ఉచితమైన మాటలతో సంభావిస్తాడు.కామినియైన ఉలూచికి దక్కిన భర్తృసౌఖ్యం ఏకరాత్ర పరిమితం!

## 12 సుభద్ర

వీరపత్ని,వీరమాతయైన సుభద్ర ముగ్ధత్వం, స్త్రీత్వం మాతృత్వాల మేళనం. అర్జునుని వలచి, వలపించుకొని వివాహమాడి, ద్వారకనుండి వస్తూన్నప్పుడు అర్జునుడు యాదవ వీరులనెదుర్కోవడంలో నిమగ్నుడు కాగా సుభద్ర రథం తోలడం ఆనాటి స్త్రీలకు యుద్ధ విద్యలైన రథచోదకత్వం మొదలైన వాటిలో ప్రావీణ్యం ఉండేదనడానికి ప్రమాణం.

"సుభద్ర ముగ్ధసుందర స్త్రీ స్వభావపు మూట"[2]

---

1,2 మహా. భార. వి.వి.కో. పుట. 378

## 13 చిత్రాంగద

అర్జునుడు తీర్థయాత్రల సందర్భముగా కోరి వరించిన చిత్రాంగద తన కుమారుని చేతిలో అర్జునుడు హతుడవడం భరించలేక అతన్ని బ్రతికించమని ఉలూచిని వేడుకొంటుంది. స్త్రీలకు గర్భశోకం భరించరానిది. కాని చిత్రాంగద అర్జునుని బాణాల తాకిడికి నేలకూలిన కొడుకును గూర్చి బాధపడదు." ......కొడుకు దిక్కున నాకు నడలులేదు. వరుజూచి పొక్కెద....."[1]

".......అహి పుత్రి దెస జూచి సుతుడెట్టు లుండిన బతికి నిమ్ము జీవము...."[2] అని ప్రార్థించడం లోకసామాన్యమైన స్త్రీ స్వభావానికి విరుద్ధమైనది.

"ఉలూచీ చిత్రాంగదలు స్త్రీ కామప్రవృత్తిని జూపినారు."[3]

## 14 సుదేష్ణ

సైరంధ్రిగా వచ్చిన ద్రౌపది సౌందర్యం చూచి ఆశ్చర్యపోయిన సుదేష్ణ ఆమె సౌందర్యం మగవాళ్లను వెఱ్ఱి వాళ్లను చేయగలదని గ్రహిస్తుంది.తన భర్తల పరాక్రమాన్ని గూర్చి ద్రౌపది చెప్పగా ఆమె సామాన్యురాలు కాదని కూడా గ్రహిస్తుంది. సైరంధ్రీ సమాగమం కోరిన తమ్మునికి మొదట పరసతీ సంగమమెంత కీడుచేస్తుందో ఏ విధంగా ఇంపు గొల్పదో ఎంతో నిపుణంగా బోధిస్తుంది.కాని తన మాటలనతడు పెడచెవిన బెట్టేసరికి మన్మథ బాణాల వల్లనైనా. సైరంధ్రి భర్తల వల్లనైనా వాని చావు తప్పదని నిశ్చయించుకొని నయవంచనతో సైరంధ్రిని కీచకుని వద్దకు పంపుతుంది.

కీచకునిచే పరాభవింపబడి ధూళిధూసరితమైన దేహంతో, కాంతి తరిగిన ముఖంతో ద్రౌపది తనవద్దకు తిరిగి వచ్చినప్పుడు ఏమీ తెలియని అమాయకురాలిలా "నిన్నిలా అవమానించిన వారెవరో చెప్పు. వారిని చంపుతాను. అవమానిస్తా"నని ఓదార్పు మాటలు పలుకుతుంది.

ద్రౌపది భీమునితో తన దుఃఖం వెళ్లబోసుకుంటూ

"గొంతికి నంత వెఱవ మీ
కంత వెఱవ దైవమునకు నంత వెఱనన
త్యంత కలుషాత్మ విరటుని
కాంతకు నే వెఱతు బనులు గావించు నెడన్"[4]

---

1. భార. ఆశ్వమేధ. ఆ.4. ప. 66    2. అదే. ప. 66
3. మహా.భార. వి.వి.కో. పుట. 378    4.భార.విరాట.ఆ2.ప.185

అని సుదేష్ణను 'అత్యంత కలుషాత్మ' అని పేర్కొనడం సముచితమే. మహారాజ పత్ని అయి ఉండీ,తెలిసి తెలిసీ కామాతురుడైన తమ్ముని వద్దకు కపటపు మాటలతో సైరంధ్రిని పంపడం ఆమె చేయకూడని పని. సైరంధ్రి మూలంగా తన తమ్ములందరూ మరణించారని తెలిసిన సుదేష్ణ భయం, శోకం మనసులో దాచుకొని ఎంతో వినయంతో ఆమెను సంభావిస్తుంది. మొదట గౌరవంగా రాజు ఆమెను వెళ్లి పొమ్మన్నాడని చెప్పినా తమ్ముళ్ల మరణం గుర్తుకు వచ్చి కఠినంగా తమ రాష్ట్రంవదిలి వెళ్లిపొమ్మంటుంది.తానింక పదమూడు దినాలు మాత్రమే ఉంటానని, తన భర్తలు రాజుకు శుభం కలుగజేస్తారని ద్రౌపది చెప్పగా మెత్తబడుతుంది. తన భర్తను మాత్రం 'ఉదాత్తమతి' తో చూడమని వేడుకొంటుంది. ద్రౌపదీ సౌందర్యం తన భర్తను తన తమ్ముళ్లలాగా ఎక్కడ బలి తీసుకుంటుందో నన్న భయం ఒక వంకా,భర్తను పరస్త్రీ వ్యామోహం బారిన పడనీయకుండా కాపాడుకొనే ఇల్లాలి జాగ్రత్త మరోవంకా సుదేష్ణ మాటలలో తొంగి చూస్తున్నాయి. స్వతహాగా ఆమె మంచిదే. విధిలేని పరిస్థితులలో మాత్రమే ఆ విధంగా ప్రవర్తించిందని ద్రౌపదితో బాటు పాండవులూ అర్థం చేసుకొన్నారు. కాబట్టే ఆమెతో వియ్యమందినారు.ఆ విధంగా విరాటునితో బాటు సుదేష్ణకూ తమ కృతజ్ఞతలు తెల్పుకొన్నారు.

"సుదేష్ణలో సహజముగా మంచిదనముగలదు. తన సోదరుని పట్ల అభిమానం కలదు.తన సోదరుడు ఒక స్త్రీ నిమిత్తమై తన పతిని సైతము లెక్కచేయక "పాలన సేయుదు నేన వీటికిన్ రాజనగా నెపం విడి విరాటునకు దగుగూడు వెట్టుదున్" అనగా విని జంకినది. మాట తప్పి ద్రౌపదిని అనుచిత కార్యమునకు నియోగించినది. ఆత్మరక్షణకు పరుల జీవితమును బలిపెట్టునట్టి మానవ నైజము ప్రపంచములో ఈ నాటికిని ఉన్నదే."[1]

"ఈ అనుచిత కృత్యమును చేయుటకు ఆమె పడిన ఈ ఆవేదన సంస్కృత భారతమున చెప్పబడలేదు.బహుశః అంతఃపుర పరిచారికల సౌశీల్యమున కంత ప్రాధాన్యము లేకుండుట రాజులు,రాజబంధువులుతమ్ము కోరుటయే మహాభాగ్యమని తలచు స్వభావం పెక్కుమంది పరిచారికల్లోనుండుట ద్రౌపది కొలువులో చేరునపుడు తన సౌశీల్యమును గూర్చి విశేషముగా చెప్పినను పట్టమహిషి యైన సుదేష్ణ దృష్టికది పెద్దగా పట్టకుండుట, రాజ్యమున కీచకునిదొక కీలకస్థానమై యుండుట, అతడు అసాధారణ విరహబాధ ననుభవించుట,

1.మహా. భార.మా.స్వజచి.పుట 221

సైరంధ్రిని పొందవలెనని అతడు గట్టిగా పట్టుబట్టుట - సుదేష్ణ ఆమెను సామాన్య పరాచారికగా కీచకుని ఇంటికి పంపుటకు దోహదము చేసెనేమో"[1]

"అత్యంత కలుషాత్మయని ద్రౌపది ఈమె కిచ్చిన బిరుదమును జాగ్రత్తగా పరిశీలింప వలయును......... నిజమునకు ద్రౌపది సుదేష్ణ కంటే ఎక్కువ రాజ్జీత్వ భారమును వహించినది.కావున సేవకుల విషయమున ఎట్టి దయాదాక్షిణ్యములతో ప్రవర్తింపవలయునో ఆమెకన్నా ఈమెకెక్కువగా తెలియును.అట్టి ద్రౌపది నోట నుండి ఈ వాక్యము వెలువడెననగా సుదేష్ణ వ్యవహార ధోరణి ఎంత కఠినతమమో సువ్యక్తమవుతున్నది. తుదకు దైవమునకు కూడ వెఱవనని చెప్పినది. అజ్ఞాతవాస పరిరక్షణకు తాత్పర్యము మాత్రమే యీ వెఱపు వలన వ్యక్తమగుచున్నదని సంభావించుటకు వీలులేని విధముగా అత్యంత కలుషాత్మ అను పదము నెలకొని యున్నది. కథాభాగములో నీ యంశమును సమన్వయించి చూచినను ఇందలి యాదార్ధ్యము గోచరించును."[2]

"ఏది ఏమైనను సుదేష్ణ భవిష్యత్ పాండవ వంశ కర్తయగు పరీక్షిత్తునకు తల్లి అయిన ఉత్తరకు జన్మనిచ్చినది. అనిష్టము తోడనే యైనను ద్రౌపది అజ్ఞాతవాస విధికి సహకరించినది.భీరువే అయినను కృష్ణునితో బాటు పార్థసారథి అను బిరుదమునకు యోగ్యుడైన ఉత్తరుని పుత్రునిగా బడసినది. లోక కంటకులగు కీచకోప కీచకుల మృతికి పరోక్షముగా హేతుభూతమైనది. ఈ యంశములతో సుదేష్ణను సంభావింప వచ్చును."[3]

## 15 ఊర్వశి

వావివరుసలు పాటింపక అర్జునుని మోహించి,తన కోరికనతడు తిరస్కరించే సరికి నపుంసకుడివై పొమ్మని శపించిన ఊర్వశి స్త్రీలలో విరళంగా ఉండే వికృత కామప్రవృత్తి ఎంతటి తీవ్రమైనదో,తనకాశాభంగం కల్గించిన పురుషునికి స్త్రీ ఎంతటి హాని చేయగలదో వెల్లడి చేస్తుంది.

"వావివరుసలు లెక్కచేయక అర్జునుని మోహించి, కోరిక తీరక నపుంసకునిగా శపించినది ఊర్వశి. ఇది చిత్రాంగి స్వభావము."[4]

" ఊర్వశి దేవవేశ్య.పురూరవుని ప్రణయపారవశ్యంలో ముంచి మహనీయ రమణీయ చరిత్ర సృష్టించిన శృంగార ప్రణయ రసాధిదేవత.అమరేంద్రుని కొలువులో ఉండి స్వర్గాధిపత్యాన్ని కోరే మునీశ్వరులను ఆ ప్రయత్నం నుంచి

---

1.మహా. భార.మా.స్వచి.పుట 221 2.మహా. భార.మా.స్వ చి.పుట 221
3.మహా. భార.మా.స్వ చి.పుట 90 4. మహా. భార.వి.వి.కో పుట 379

విరమింపచేసే మరుని బాణం. అర్జునుడు స్వర్గలోకం వచ్చినప్పుడు అతనిని వలచింది. వావివరుసలు మరచి వలపు నర్పించింది.దేవతలకు వావివరుసలుండవు. మనసులో కోరికను తీర్చుకోవడమే ప్రధానంగా భావిస్తారు వారు." [1]

"ఊర్వశి శాపం అర్జునునికి అజ్ఞాతవాసంలో వరంగానే పరిణమించి అతని రహస్య జీవితాన్ని కాపాడింది." [2]

## 16 ఉత్తర

భారత కథలోని ఐదవతరానికి చెందిన స్త్రీలకు ఏకైక ప్రతినిధి ఉత్తర. బృహన్నల శిష్యురాలుగా ఉత్తర నాట్యం చేర్చుకోవడం, తండ్రి కుమార్తెకు నాట్యాచార్యుని నియమించడం ఆరోజులలో స్త్రీలు నాట్య కళ నభ్యసించేవారని రాజులు నాట్య విద్యకున్నతమైన స్థానం ఇచ్చారని తెలియజేసే ఏకైక ఉదాహరణ.

బృహన్నల శిష్యురాలైన ఉత్తర గోగ్రహణానికి బయలుదేరుతున్న బృహన్నలను,ఉత్తరుని కురువీరుల తలపాగలు తన బొమ్మ పొత్తిళ్లుగా తెమ్మని కోరడం వీరోచితమైన కార్యానికి వాళ్లను పురిగొల్పడమే.క్షత్రియ కాంత ఉత్తర అభిజాత్యానికి తగిన కోరిక అది.అంతేగాక పరోక్షంగా వారి విజయాన్ని సూచించడం కూడ.

ఆమె గర్భాన జన్మించిన శిశువే(పరీక్షిత్తు) కురుక్షేత్ర సంగ్రామానంతరం పాండవుల వారసుడుగా మిగులుతాడు.

భారత కథలోని పాండవ వంశానికి చెందిన స్త్రీలందరూ ఒక్క పాండవుల భార్యలు తప్ప వైధవ్య దుఃఖాన్ని అనుభవించిన వారే. ఉత్తరకు ముక్కు పచ్చలారని పసివయస్సులోనే భర్తృ మరణ దుఃఖం సంభవించింది.భర్త మరణించే నాటికామె గర్భవతి. మృతశిశువు జననం ఉత్తర జీవితంలో అతి భయంకరమైన రెండవ దుస్సంఘటన. శ్రీకృష్ణుని అనుగ్రహంతో ఆ శిశువు జీవించడం వేరే సంఘటన.మృత శిశువును ఒడిలో పెట్టుకొని ఉన్మాది వలె ఉత్తర ప్రలాపించడం తిక్కన అత్యంత కరుణా స్పదంగా చిత్రించినాడు.

"రాజ్యప్రయోజనాల కోసం కూతురిని అర్జునునికి ఇయ్యజూపాడు విరాటుడు........ కూతుళ్ల అభిప్రాయాలతో నిమిత్తం లేకుండా రాజకీయ ప్రయోజనాపేక్షతో వాళ్లను వస్తువులుగా వాడుకొంటున్న స్థితి ఈ సంఘటనలో స్పష్టమవుతుంది." [3]

---

1,2. ప్రా.తె.వి.స్త్రీలు పుట.21 3. సం.స్యా.స్త్రీ.వా.దృ.పుట.44

# కథతో ప్రత్యక్షసంబంధం లేని ఇతరపాత్రలు

## 1. పైలపత్ని

పైల్యుని శిష్యుడు ఉదంకుడు గురుపత్ని ఆజ్ఞ మేరకు నాల్గవ నాటికి పౌష్యపత్ని రత్నకుండలాలు తెచ్చి సమర్పించగలడన్న నిశ్చితాభిప్రాయంతో ఆమె శుచిస్నాతయై నూతన వస్త్రపరిధాన శోభితయై సిద్ధంగా ఉంటుంది. ఉదంకుడు రాగానే ఆమె ఆ కుండలాలు ధరించి, బ్రాహ్మణులను పూజించి తాను సంకల్పించిన మహోత్సవాన్ని జయప్రదంగా జరుపుకొన్న విషయం నాటికీ నేటికీ కూడ ఆభరణ ప్రియలని, మహాతపస్సంపన్నులైన ఋషుల భార్యలు కూడ ఇందుకు భిన్నం కాదని ఋజువు చేస్తున్నది.ఆది పర్వంలోని ఉదంకోపాఖ్యానంలో పైలపత్నికి పేరే లేదు. కాగా తిక్కన భారతంలో ఉదంకుని గురుపత్ని అహల్యగా, గురువు గౌతముడుగా పేర్కొనబడినారు. అహల్య శిష్యవత్సలగా, కరుణార్ద్ర హృదయగా చిత్రించబడినది. కథ ఒక్కటే. కథనం మాత్రం భిన్నంగా ఉంది. పేర్లు కూడ భిన్నంగా ఉన్నాయి. కాబట్టి ఉదంకుడు పైల్యుని శిష్యుడా, గౌతముని శిష్యుడా లేక ఇరువురూ ఒక్కరే అయి ఉండి భిన్ననామాలతో పేర్కొనబడినారా అన్న సందేహం కల్గుతున్నది. భారతంలో ఈ విధంగా పునరావృతమైన వృత్తాంతాలు మరికొన్ని ఉన్నాయి.

## 2. పులోమ

తన పేరుగల రాక్షసుడే తన నెత్తుకొని పోతూ ఉండగా తన గర్భస్థ శిశువును కుక్షిగుండా చ్యుత మొనర్చి, ఆ శిశువు తేజస్సుతో ఆ దుర్మార్గుడు అంతమయ్యేలా చేసిన పులోమ మహాపతివ్రత. ఆమె కన్నీరు కార్చినంత మేరా మహానది అయినదంటే ఆమె పాతివ్రత్యమెంత గొప్పదో తెలుసుకొనవచ్చును. "రాక్షసునిచే నపహరింపబడిన పులోమ తన గర్భము నుండి జార్చిన చ్యవనునితో ఆ రాక్షసుని చంపించినది."[1]

## 3. ప్రమద్వర

సర్పదష్టయై మరణించిన ప్రమద్వర తనను ప్రేమించి వివాహం చేసుకోవాలనుకొన్న రురుడు తన ఆయుష్షులో సగమీయగా పునర్జీవితురాలవడ మన్నది భారతంలోని విలక్షణమైన కథ. రురుని స్వచ్ఛమైన ప్రేమకు నిదర్శనం. భర్త కోసం భార్య త్యాగం చేసిన ఉదాహరణాలు భారతంలో అనేకం కన్పిస్తాయి. కాని ప్రేయసి కోసం జీవన దానం చేయడం రురుని ప్రేమలోని ఔన్నత్యాన్ని

1. మహా. భార. వి. వి. కో. పుట 372

తెలియజేస్తున్నది. ఆమె కోసం తన తపఃఫలాన్ని, అధ్యయన, దానఫలాన్ని కూడ త్యాగం చేయడానికి సిద్ధపడిన రురుని ప్రేమను అంతగా పొందగల్గిన ప్రమద్వర రూపగుణ లావణ్యాలు అపురూపమైనవి.

"సర్పదష్టయై చచ్చిన ప్రమద్వర రురునిలో నిద్రాణమైయున్న తనశ్శక్తిని విజృంభింపజేసి, పునర్జీవితయై పతికి సుఖము గూర్చినది. ఇట నన్నయ యా తపశ్శక్తి విజృంభణమునే "అలయక యేన దేవయజన (ఆది 1ఆ 148) అను పద్యమున వర్ణించును. ఈ వర్ణనము పెద్దనగారి "దాన జపాగ్నిహోత్ర పర తంత్రుడనేని" అను పద్యమునకు స్ఫొరకమైనది.

"భారతంలోని భార్యాభర్తృ సంబంధాలన్నింటిలో చాలా విలక్షణంగా కనబడేది ప్రమద్వారా రురుల సంబంధం. ఈనాడు మనకాదర్శం కావలసింది కూడ ఇదే. ప్రమద్వరా రురుల సంబంధం అచ్చమైన మానవ సంబంధం. అక్కడ వాళ్ల వివాహానికి పెద్దల నిర్ణయమో, ప్రేమ పేరు మీద చలామణి అయ్యే కామమో, పితరులకు సద్గతులు కల్గించడమో ప్రాతిపదికలు కాలేదు. రురుడు ప్రమద్వరను తోటి మనిషిగా తనతో సహ జీవనం చేయటానికి 'అతి స్నేహంబున' వివాహమాడ నిశ్చయించాడు. ఈ అతి స్నేహ లక్షణం వల్లనే సహజీవనం చేయటానికి ఆమెకు ప్రత్యామ్నాయంగా మరో స్త్రీ పనికి రాలేదతనికి. అందుకనే ఆమె సర్పదష్ట అయి మరణిస్తే వ్యాకుల హృదయుడయినాడు. చివరకు తన ఆయుష్షులో సగమిచ్చి బ్రతికించుకొని ఆమెతో జీవితాంతం సహజీవనం చేశాడు." [1]

## 4,5 కద్రూ వినతలు

సపత్నీ మాత్సర్యానికి కద్రూ వినతలు ప్రత్యక్ష ఉదాహరణాలు. స్వంత అక్కాచెల్లెళ్లు. తన కంటే ముందు కద్రువ పుత్రవతి కాగా వినత అసూయతో వినత గర్భాండాన్ని చిదిమి వేసి అసంపూర్ణ శరీరం గల పుత్రుని జన్మకు కారకురాలై అతని శాపానికి గురి అవుతుంది.

సవతిని దాసిగా చేసుకోవాలన్న దుర్బుద్ధితో కుమారులను అధర్మానికి పురికొల్పడమే గాకుండా అందుకిష్టపడని కుమారులను శపిస్తుంది కద్రువ. సవతి పట్ల ఈర్ష్య, సవతిని దాసిగా చేసుకోవాలన్న మహత్వాకాంక్షల ముందు పుత్రప్రేమ రవ్వంతైనా కొర గాకుండా పోయింది.

సవతికొడుకైన గరుత్మంతుని తేజస్సును, బల పరాక్రమాలను సహించ లేని కద్రువ అతన్ని కూడ తన దాస్యానికి నియోగిస్తుంది. తన కుమారులను

---

1. సం.సా. స్త్రీ. దృ. పుట. 11

ఎత్తుకొని తిప్పమని చెప్పడం, తానేపని చెప్పినా వ్యతిరేకించక చేయమని ఆజ్ఞాపించడం చూడగా ఈనాడు ఇంకా పల్లెటూళ్లలో కొనసాగుతున్న వెట్టి చాకిరికీ, తరతరాలుగా తండ్రుల నుండి కొడుకులకు సంక్రమిస్తూన్న దాస్యానికి వినతా గరుడుల దాస్యోదంతం ప్రతి బింబంలాగున్నది.

గరుడుడు నాగుల కోరిక మేరకు అమృతం తెచ్చి యిచ్చి తన తల్లిని దాస్యవిముక్తురాలిని గావించడం అతనికి తన తల్లి పట్ల గల ప్రేమకు, పుత్రునిగా తల్లి పట్ల అతని బాధ్యతా నిర్వహణకూ తార్కాణం.

బ్రహ్మసమానుడైన కశ్యప ప్రజాపతి భార్య అయి ఉండీ సవతియైన తన స్వంత చెల్లెలి పట్ల ఆమె కుమారుని పట్ల అంత క్రూరంగా ప్రవర్తించడం, కపటోపాయంతో వినతను దాసిగా చేసుకోవడం, కన్న బిడ్డలపై కాస్తైనా కరుణ లేకుండా శపించడం -ఇవన్నీ ఒక మహావ్యక్తి భార్యకుండదగని లక్షణాలు. పైగా ఆమెను అధోస్థానంలో నిలబెట్టిన కారణాలు.

కద్రూవినతలను గూర్చి ఇతర విమర్శకుల అభిప్రాయాలు దాదాపు ఒకే విధంగా ఉన్నాయి.

"మానవ స్వభావంలో అసూయ ఓ చెడ్డ గుణం. భర్త ప్రేమకై పందెం వేసుకొన్న పడతులు కద్రూవినతలు."[1]

"కద్రూవినతలు అచ్చుబోసిన సవతులు. ఉచ్చైశ్రవము వాలమునందలి 'నల్ల' విషయమై వారికి గల్గిన వాదము, దాన జరిగిన కుట్ర మొదలగునవన్నియు స్త్రీ స్వభావములోని యొక యంశము యొక్క సమగ్ర చిత్రణము. ఇట కద్రువ స్వశక్తిని విజృంభింపజేయగా, వినత వైనతేయుని శక్తికి స్వరూపమిచ్చి విజృంభింప జేసినది."[2]

"వినత కద్రువ ముందుగా సంతానవతి అయిందని తన అండములింకా ఫలించలేదేమో అని 'విగతధృతి' అయిందట. ధైర్యం కోల్పోవటం ఎందుకు? అంటే కద్రువ సంతానవతి కావటం ద్వారా కుటుంబంలో అధికార స్థానంలోకి చేరుకుంది. అందుకనే ధైర్యం కోల్పోయిన వినత సంతానం పొందాలన్న తొందరలో ఫలించని అండాన్ని పగలగొట్టింది."[2] ఇది శ్రీమతి కాత్యాయని విద్మహేగారి అభిప్రాయం, బహుభార్యాత్వ వ్యవస్థలో సంతానమే కుటుంబంలో స్త్రీలస్థానాన్ని నిర్ధారించే ప్రాతిపదికాంశమని, సంతానం ద్వారా స్త్రీ భర్తవంశానికి వారసుల నిస్తుందని, తద్వారా కుటుంబంలో ఆమె హోదా పెరుగుతుందని, ఒక పురుషుడికి

---

1. ప్రా. తె. కా.వి. స్త్రీ. పుట. 40   2. మహా. భార. వి.వి.కో.పుట. 372

ఇద్దరు ముగ్గురు భార్యలున్నప్పుడు ఏ భార్య సంతానవతి అవుతుందో సహజంగా ఆమెకు ఆ ఇంట్లో భర్త తరువాత అధికారం స్థిరపడుతుందని, సంతానం లేని స్త్రీ గతి అధోగతే అవుతుందని అందువల్లనే తనకన్న ముందుగా సంతానవతి అయిన కద్రువను చూచి వినత ధైర్యం కోల్పోయిందని కాత్యాయని గారి అభిప్రాయం.

## 6. జరత్కారువు

తనకు నిద్రాభంగం చేసి అవమానించిందన్న చిన్న కారణం చూపి భర్త జరత్కారువును పరిత్యజించడమన్నది భారత కాలంలో అగ్నిసాక్షిగా వివాహమాడిన భార్యను పరిత్యజించడం భర్తకెంత తేలికైన విషయమో తెలియజేస్తున్నది. భర్తకు ధర్మ లోపం కలుగుతుందేమోనని భయపడిన ఆ పతివ్రత అతనికి మేలే చేసినా పరిత్యక్త కాక తప్పలేదు. ఆమె వైవాహిక జీవితమంతా పరమ దయనీయంగా గడచింది.

"వాలు పయి నడచునట్లు
బ్బాలిక వడవడవడంకిభయమున నియమా
భీలుడగు పతికి బవళుల్
రేలును నేమఱకనుపరిచరించుచునుండెన్" [1]

కత్తిమీద సాములాగ రాత్రింబవళ్ళుఏమరుపాటు లేకుండా వణికిపోతూ భర్తకు పరిచర్యలు చేస్తూ ఉండినా అతి స్వల్ప కారణానికే ఆమెను భర్తను వదిలి పెట్టడం ఆరోజులలో వివాహిత స్త్రీల దయనీయ స్థితికి దర్పణం.

"మంచి చేసినను మహాతపస్విచే పరిత్యక్తయైన జరత్కారువు మహా సహనమునకు నెలవు" [2]

"భారతంలో వివరించబడిన దయనీయమైన స్త్రీ పాత్రలలో జరత్కారువు ఒకతె... మనసును సమాధాన పరచుకొని తన దురదృష్టానికి వగచింది. ఆస్తీకుని లాంటి మహానుభావునికి జన్మనిచ్చింది. తనలోని నిరాశా నిస్పృహలకు కుమారుని బలిచేయలేదు. పుట్టినింటనే ఉండి కుమారుడిని ఒక మహిమాన్వితునిగా తీర్చిదిద్దిన వినయ సౌజన్యమూర్తి. " [3]

"పితృ దేవతలకు సద్గతులు కలిగించటానికి పెళ్లాడిన జరత్కారుడు

---

1. ఆది. ఆ2. ప.156
2. మహా.భార. వి.వి.కో. పుట. 372
3. ప్రా.తి.కా.వి.స్త్రీ. పుట. 52

భార్య గర్భవతి అయ్యేవరకు ఆమెతో కాపురం చేశాడు. తరువాత చాలా చిన్న మిషతో- నిద్ర లేపిందని ఆమెను వదిలేస్తాడు. నిద్ర లేపకపోయినట్లయితే ఆ మిషతో నయినా అతడామెను వదిలివేసేవాడే. తనను వదిలి వెళ్లినా భర్త పితృ దేవతలకు సద్గతులు కలిగించడం కోసం సంతానాన్ని కనటం, పెంచటం ఇవన్నీ ఇక ఆమె వంతే." [1]

## 7,8 శర్మిష్ఠా దేవయానులు

సాధారణంగా వివాహ ప్రతిపాదన, ప్రేమ ప్రకటన పురుషుల నుండి వ్యక్తమవడం లోక సహజం. కాని ఆ రోజుల్లో స్త్రీలకటువంటి సంకోచం గాని, భయం గాని లేనట్లు దేవయాని కచునితో పల్కిన మాటల వల్ల వ్యక్తమవుతుంది.

"నీవును బ్రహ్మచారి వినీతుడ వేను గన్యకన్ మహీ
దేవకులావతంస రవితేజ వివాహము నీకు నాకు మున్
భావజు శక్తి నైనయిది పన్నుగ నన్ను పరిగ్రహింపు......" [2]

అన గల్గిన దేవయాని అనాటి స్త్రీలకు వివాహ విషయంలో స్వేచ్ఛ ఉండేదనడానికి నిదర్శనం.

తాను రాజకుమార్తె నన్న గర్వం శర్మిష్ఠ దేవయానితో పల్కిన ప్రతి పల్కులోను తొంగి చూస్తుంది. శుక్రుని గూర్చి ఆమె చేసిన వ్యాఖ్యలు ఆమెకు పురోహితుల పట్ల, బ్రాహ్మణుల పట్ల చాలా చిన్న చూపు ఉండేదని నిరూపిస్తాయి.

"మా యయ్యకు బాయక పని
సేయుచు దీవించి ప్రియము సేయుచు నుండున్
మీయయ్య యేటి మహిమలు
నా యొద్దనె పలుకనీకు నానయు లేదే!" [3]

అంతేగాక, శర్మిష్ఠ దేవయానిని నూతిలో త్రోసి వెళ్లడం ఆమెలోని తామస ప్రవృత్తికి నిదర్శనం.

యయాతి క్షత్రియుడని తెలిసినా అతనితో తానే పరిణయ ప్రస్తావన తేవడం, సంప్రదాయ విరుద్ధమని తన కోరికకకు తండ్రిచే అనుమతి పొందడం దేవయాని విశృంఖల ప్రవృత్తిని వ్యక్తపరుస్తాయి.

శుక్రాచార్యుని పట్ల వృషపర్వునికున్న భక్తి వినయాలు విధేయత కన్న

1. సం. సా. స్త్రీ. దృ. పుట.8
2. భార. ఆది. ఆ 3. ప.139
3. భార. ఆది. ఆ. 3. ప.187

కుమార్తెను గురుపుత్రికి దాసిని చేసేటంత గొప్పవి! రాజపుత్రి అయి ఉండి ఎంత మాత్రము వ్యతిరేకించకుండ తండ్రిమాటను తక్షణం శిరసావహించడం శర్మిష్ఠ పితృభక్తికి తార్కాణం.

శుక్రుడుకూతురినీ, అల్లునీ పూజించి సాగనంపుతాడు. మామగారు వివాహసమయంలో అల్లుని పూజించే సాంప్రదాయం ఆరోజులనుండే కొనసాగుతూ వస్తున్నదని దీనిని బట్టి తెలుస్తున్నది.

పరిచారికా సహస్రంతో దేవయానికి దాసియైన శర్మిష్ఠ తనకు పతి లాభం లేకపోవడం చేత తన యౌవనం అడవిగాచిన వెన్నెలయ్యిందని బాధపడడం తన స్వామినికి భర్త అయినవాడే తామందరికి భర్త అని, అది ధర్మమార్గమని అనడం ఆనాటి పరిచారికల దుర్భర పరిస్థితిని, వారికి వివాహ యోగ్యత లేదన్న భయంకర వాస్తవాన్ని, వెల్లడి చేస్తున్నది. రాచరిక వ్యవస్థలోని ఈ దుష్టసాంప్రదాయం నిన్న మొన్నటిదాకా, రాచరికం అంతమయ్యేదాకా కొనసాగింది.

తనకు 'ఋతుకాలోచితం' ప్రసాదించమని శర్మిష్ఠ నిర్లజ్జగా యయాతిని కోరడం ఆమె స్వేచ్ఛాచారానికద్దం పడుతుంది.

స్వతంత్రమైన ఒక మహా కావ్యంగా వ్రాయబడిన ఇతివృత్తం కలిగిన యీ కథలో దేవయాని అహంభావం, విశృంఖలత్వం తో బాటు శర్మిష్ఠ జాణతనం కూడా వెల్లడవుతుంది. ఒక సత్యనిష్ఠుని వాగ్దానభంగానికైనా పురికొల్ప గలిగిన యుక్తిపరురాలిగా, ముని వచన ప్రమాణమన్న సాకుతో యయాతిని ఒప్పించి తన అభీష్టం నేరవేర్చుకొని సంతానం పొందిన జాణగా శర్మిష్ఠ గోచరిస్తుంది.

"........నన్నేలిన దేవయానికి నరేశ్వర భర్తవుగాన
నాకునుంబోలగ నీవ భర్త విదిభూనుత ధర్మపథంబు."

" అద్దేవయానింబరిగ్రహించి నప్పుడతద్ధనం బగుట నేనునుభవత్పరిగ్రహంబు
కావున నన్నుం గరుణించి నాకు ఋతుకాలోచితంబు ప్రసాదింపవలయు."

" చనుబొంకగ బ్రాణాత్యయ
మున సర్వధనాపహరణమున వధగా వ
చ్చిన విప్రార్థమున వధూ
జన సంగమమున వివాహసమయములందున్"

" ఈ యేనింటి యందునసత్యదోషంబు లేదని ముని వచన
ప్రమాణంబు గలదు....."

యుగధర్మం ఆనాడు స్త్రీలనెంత భయంకర పరిస్థితిలో ఉంచిందో

"వధూజన సంగమంలో బొంకవచ్చు" నన్న మాటలలో తెలుస్తుంది.

భారతంలోని స్త్రీ పాత్రలను విశ్లేషిస్తూ డా.మూలంపల్ల చంద్రశేఖర శర్మగారు శర్మిష్ఠా దేవయానులను గూర్చి "శర్మిష్ఠాదేవయానుల ద్వారా ఒక విచిత్రమైన లోక స్త్రీ స్వభావ చిత్రణము జరిగినది. శర్మిష్ఠ తన దాసిగా భావించు దేవయానికి దాసియగుట భర్తృసుఖము లేమి స్వ ప్రతిభ సౌమనస్యములచే యయాతిని భర్తగా చేసికొని పుత్రులబడయుట పూరువు చక్రవర్తియై వంశకరుడగుట మొదలగునవి శర్మిష్ఠ అసహన, సహనములకు నెలవుగా చిత్రించినవి. దేవయాని కచుని యెడ వర్తించిన తీరు ప్రారంభమున సహజము. కచుని తిరస్కారముతో నది దారి తప్పినది. విశృంఖలమైనది. యయాతిచే చేపట్టించినది. శుక్రాచార్యునంతటి వానిచే సంప్రదాయసిద్ధ నియమమున కపవాదము కల్పింపచేసినది. ఇది స్త్రీ కామ ప్రవృత్తికొక చిత్రణము. దేవయాని శర్మిష్ఠయెడ వర్తించిన విధము మొదట శర్మిష్ఠలోని రాజస ప్రవృత్తికి ప్రతిఘటనమైన బ్రాహ్మణ ప్రవృత్తిగా నున్నను తరువాతనది శర్మిష్ఠయెడ తామస ప్రవృత్తిగా మారినది. ఇట్టి దేవయాని ప్రవర్తనము శర్మిష్ఠలో సుసహనమును, సముచిత ప్రజ్ఞా కౌశలమును జాగృతమొనరించి యామెను బహుమతగా జేసి వంశకరుడగు పూరునకు మాతగా రూపొందించినది. నన్నయ చిత్రించిన ఈ ఘట్టము అసాధారణ కావ్యఖండమనవచ్చును" అని వ్యాఖ్యానించినారు.

" దేవయాని ఒకప్పుడు తన దక్షిణహస్తం పట్టి రక్షించిన యయాతే తన భర్త కావాలని పట్టుపట్టి అతన్నే పెళ్లాడటం, శర్మిష్ఠ "భార్గవ కన్య దానెట్లు గోరియాతని దనకును బతి చేసికొనియె నట్టుల యేను గోరి లోకైకభార దురంధరు బరహిత ధర్మపరు నహుషాత్మజు బతిచేసుకొందు" (అది తృతీయా172) అని నిర్ణయించుకొని తానే చొరవచేసి యయాతిని ఒప్పించటం ......భార్యాభర్తృ సంబంధ విషయాలలో స్త్రీలు చొరవ చూపగలిగిన దశను నిరూపిస్తాయి" అన్నది శ్రీమతి కాత్యాయని గారి అభిప్రాయం.

" కచుడు తన ప్రేమను తిరస్కరించడం, శర్మిష్ఠ అవమానించడం, తనకు సపత్నిగా రావటం, ఇవన్నీ దేవయాని జీవితంలోని ఘోర పరాజయాలు. అడుగడుగునా వైఫల్యాలు, పరాజయాలు, శాపం, వీటితో ఆమె జీవితం సక్రమంగా సాగలేదనే చెప్పాలి."- అన్నది శ్రీదేవి అభిప్రాయం.

ఇక శర్మిష్ఠను గూర్చి శ్రీదేవి "ముందు వెనుకా ఆలోచించకుండా కన్నకూతురు భవిష్యత్తును భస్మంచేసిన తండ్రిని ఒక్కమాట అనలేదు.

రాజ్యసంక్షేమం దృష్టిలో ఉంచుకొని తనను దేవయానికి దాసిగా సమర్పించుకొంది. చాలా విశాలమైన హృదయంతో ఎన్నదగిన స్త్రీమూర్తి ఈమె. నిగ్రహం, ఓర్పు, నిర్మలత్వం, భవిష్యత్తుపై ఆశ, ఆమె జీవ లక్షణాలుగా భాసించాయి."[1] అని వ్యాఖ్యానించారు.

## 9. శకుంతల

ఆకు చాటు పిందెలాగా తండ్రి చాటు బిడ్డగా పెరిగిన ముగ్ధమోహన సౌందర్యవతి శకుంతల దుష్యంతుని మాయమాటలకు అమాయకంగా మోసపోతుంది. ఏకాంతంగా లభించిన అందాల రాశిని అనుభవించేందుకు అవకాశవాదియైన దుష్యంతుడు గాంధర్వ వివాహమన్న మిషపెట్టినాడు. శకుంతలను ఒప్పించినాడు. కోరిక తీర్చుకొని తన దారిన తాను వెళ్లిపోయినాడు. గర్భవతియై, పుత్రవతియైన శకుంతల "ఆడపిల్లలు పెళ్లయిన తరువాత పుట్టినింట్లో చాలాకాలం ఉండకూడ"దని తండ్రి పంపగా దుష్యంతుని వద్దకు వచ్చి నిండు సభలో తిరస్కరింపబడుతుంది.భార్యాపుత్రులను గూర్చి ధర్మాన్ని గూర్చిఆమె చేసిన సుదీర్ఘమైన ఉపన్యాసం దుష్యంతుని ఎంతమాత్రం కదిలించలేకపోతుంది. దైవం తప్ప తనకింక దిక్కులేదని నిరాశా నిస్పృహలకులోనైన శకుంతలను ఆకాశవాణి ఆదుకొంటుంది.ఆకాశవాణి ప్రబోధంతో దుష్యంతుడామెను స్వీకరిస్తాడు.

తల్లిదండ్రులకు తెలియకుండా,ముందువెనుకలు ఆలోచించకుండా వివాహం చేసుకొనే ఆడపిల్లలు ఏవిధంగా కడగండ్ల పాలవుతారో శకుంతల వృత్తాంతం వివరిస్తుంది.నాటికీ నేటికీ పురుషుడు అవకాశవాదే. స్త్రీ తన జాగ్రత్తలో తానుండాలి. లేకపోతే పురుషుల మాయమాటలకు లోబడే అమాయకులైన ఆధునిక శకుంతలలను ఏ ఆకాశవాణి రక్షించజాలదు.

దుష్యంతుని సభలో శకుంతల చేసిన ధర్మోపన్యాసం ఆమె వైదుష్యానికి, ధర్మ పరిజ్ఞానానికి ఉదాహరణ.ముఖ్యంగా భార్య గురించీ, సంతానం గురించీ, పుత్రపరిష్వంగసుఖం గురించి శకుంతల చెప్పిన మాటలు అనుభవైకవేద్యాలు. సహృదయ హృదయానంద సంధాయకాలు.

గర్భవతియైన కుమార్తె కోరికలు తీర్చడం లోకంలో ఉన్నదే.కణ్వమహాముని శకుంతల గర్భవతియని తెలిసి ఆమెను యిష్టం వచ్చిన కోరిక కోరుకొమ్మనగా ఆమె కోరుకున్నది తన మనస్సెన్నడూ ధర్మము నందే నిలిచి ఉండాలని.అంతటి

1. ప్రా. తె. కా. వి. స్త్రీ. పుట.84

ధర్మైక పరితంత్ర హృదయకాబట్టే ఆకాశవాణి ఆ ఉత్తమురాలిని కాపాడింది.

శకుంతలను గూర్చి కొందరు యితర విమర్శకుల అభిప్రాయాలు :-

"క్షాత్రముని కన్యయై క్షాత్ర విలాసములకు బలియైన శకుంతల సుక్షత్రియుడును, వంశకరుడునునగు పుత్రుడైన భరతునితో దౌష్యంతుని ఆస్థానమునకు వచ్చి క్షాత్రోచితముగనే - "వీడు నీ కొడుకు, కన్నులార జూచి కాదనువాడెవ"డన్నట్లు కొడుకును జూపును. కాళిదాసు శకుంతల వలె నుంగరము జూపబోయి యదిలేమి బేలకాలేదు. కావుననే రాజైన దుష్యంతునకు సూనృతయైన శకుంతలకును క్షేమకరముగా నశరీరవాణి సాక్ష్యమిచ్చుటయూ జరిగినది."[1] -శ్రీ మూలం పల్లివారు.

" స్త్రీకి పుట్టిల్లూ, అత్తిల్లూ తప్ప మరో నివాస స్థానంగాని, బ్రతుకుదెరువు గానీ లేకుండా చేసిన సమాజంలో " ఎట్టి సాధ్వులకును బుట్టిన యిండ్లను బెద్ద కాలమునికి తద్ధ తగదు. పతులకడన యునికి సతులకు ధర్మువు......" (ఆది.చతుర్థ 66)అని చెప్పబడుతున్న సమాజంలో. కల్లబొల్లి కబుర్లు చెప్పి,ఏవో ఆశలు కల్పించి,స్త్రీలను తమ అవసరాలకు, సుఖాలకు, పావులుగా వాడుకొనటానికి పురుషులకవకాశం కల్పించిన సమాజంలో 'మానినులసత్య వచనలు' (100) అన్న పెద్ద అపవాదు నిష్కారణంగా నెత్తినమోపబడ్డ స్త్రీలు తమ జీవితంకోసం భద్రత కోసం పుత్రసంతానాన్ని నిమిత్తంగా చేసుకొని పడ్డపాట్లు శకుంతల కథలో కనవడతాయి. భార్యాభర్తృ సంబంధాలలోకి ప్రవేశించేముందు ఉన్న వెసులుబాటులో వివేకంగా ఆలోచించామనుకొని ఇన్ని ముందు జాగ్రత్తలు తీసికొన్న స్త్రీకి గౌరవము, భద్రతా సందేహాస్పదంగానే ఉంటాయన్న విషయంకూడ శకుంతల అనుభవం ద్వారా అర్థంచేసుకోవచ్చు." నీ కొడుకును యౌవరాజ్య పట్టాభిషిక్తుణ్ణి చేస్తా" నని పబ్బంగడుపుకొన్న దుష్యంతుడు శకుంతల కొడుకుతో సహా అతని దగ్గరకు వెళ్లినప్పుడు " నువ్వసలెవరో నాకు తెలీనే తెలీ"దని బుకాయించి అసలుకే మోసం చేయబోయాడు. అశరీరవాణి పలుకే లేకపోతే శకుంతల బ్రతుకు అటు పుట్టింటికీ కాక ఇటు అత్తింటికీ కాక, ఏ నూతుల పాలో గోతులపాలో కావలసి వచ్చేది."-[2] శ్రీమతి కాత్యాయని.

"కణ్వాశ్రమంలో ఆ మహానుభావుని శిక్షణలో పెరిగింది. కాబట్టి ధర్మం, సత్యం, దయ, పురుషార్థం, మానవ జీవిత ధర్మాలు, వీటిని గురించి చక్కగా వివరించగలిగింది శకుంతల. వీటిలో ఏ ఒక్క మాటైనా దుష్యంతుని హృదయాన్ని

1. మహా.భార. వి.వి. కో.పుట 374    2. సం.సా.స్త్రీ.దృ పుట 8

కదిలిస్తుందని ఆమె ఆశించింది." [1]- శ్రీదేవి.

## 10 ప్రద్వేషిణి

భారతంలో భర్త పరిత్యక్తలైన స్త్రీలెందరో ఉన్నారు. కాని తానే భర్తను పరిత్యజించిన స్త్రీ ప్రద్వేషిణి ఒక్కతే. సార్థక నామధేయ. వృద్ధుడూ, పుట్టుగ్రుడ్డీ అయిన భర్తను తానే భరింపవలసి రావడంతో కొడుకులతో అతన్ని నదిలో త్రోయించింది. పతిహీనలైన స్త్రీలు మాంగల్యరహితలు అలంకార విహీనలు అవుతారన్న భర్త శాపానికి స్త్రీలోకాన్ని గురి చేసింది.

"దీర్ఘతముని భార్య ప్రద్వేషిణి తానే భరింపవలసి వచ్చుటచే పుత్రులతో కట్టియల గట్టించి భర్తను నదిలో పడవేయించినది. దాని వలన పతిహీనలగు స్త్రీలకు అనలంకృతత్వమును, మాంగల్యరహితత్వమును శాపలబ్ధమైనవి." [2] అని మూలం పల్లి చంద్రశేఖర శర్మగారి వ్యాఖ్యకూడ పై అభిప్రాయాన్నే సమర్థించిన శ్రీమతి కాత్యాయనీ విద్మహే గారు మాత్రం స్త్రీవాద దృక్పథంతో ప్రద్వేషిణి పాత్ర స్వభావాన్ని ఎంతో నిశితంగా సమీక్షించారు. - "ప్రద్వేషిణి తండ్రి విద్యా బలమున్నది కదా అని గ్రుడ్డివాడయితే నేమిలే అని మనసున మెచ్చి అతనికి తన కూతురునిచ్చి పెళ్లిచేసి ఉంటాడు. తండ్రి మెచ్చాడు కానీ ఆ భర్తను ఆమె మెచ్చలేక పోయినది. సంసారం చేస్తూ పిల్లలను కని, పెంచుతూ ఉన్నా, భర్తని మెచ్చని విషయం తనలో దాచుకోవాలని ఆమె ఏమీ అనుకోలేదు. అతనిని తాను మెచ్చని విషయం అతనికి తెలిసేటట్లు ప్రవర్తిస్తూనే ఉంది. చివరికతనిని వదిలించుకోవాలని అనుకొంది. "యిమ్ముదుకని" ఎక్కడైనా వదిలేసిరండని కొడుకులకు చెప్పి అతనిని మెచ్చలేక పోవడం ఎందుకో బహిర్గతం చేయనే చేసింది... భర్తను ద్వేషించింది. ఆ ద్వేషాన్ని పాతివ్రత్యం ముసుగులో దాచిపెట్టాలనుకోలేదు. తాను మెచ్చనివాడితో తనకు జరిగిన వివాహాన్ని భర్త ఎటువంటివాడైనా అతిక్రమించరాదని చెప్పే పితృస్వామిక సాంస్కృతికవిలువను ఆమె అతిసాధారణంగా ప్రతిఘటించింది. అట్లా ప్రతిఘటించడం తప్పని చెప్పటం, ప్రతిఘటించే స్త్రీలు ద్వేషించదగిన వాళ్ళని చెప్పటం యీ కథకు కవి ఆశించిన ప్రయోజనమైనా కుటుంబ స్వభావం స్త్రీల ప్రతిఘటనను ఎట్లా అనివార్యం చేస్తున్నదో సూక్ష్మంగా చెప్పగలిగింది."[3]

ఈ ప్రతిఘటన ప్రద్వేషిణి వివాహానికి ముందే చేసి ఉండవచ్చును. వృద్ధుడూ, పుట్టిగ్రుడ్డీ అయినవాడిని తాను జీవితమంతా భరించలేనని తండ్రితో

1. ప్రా.తె.వి.మ.స్త్రీ. పుట 162 2. మహా.భార.వి.వి.కో.పుట 373
3. సం.సా.స్త్రీ.దృ. పుట 69

వాదించి, దీర్ఘతముణ్ణి తిరస్కరించి ఉండవచ్చును. అంతేగాని ఎన్నో సంవత్సరాలు కాపురం చేసి, కొడుకులను గని ఆకొడుకులు పెద్దవాళ్లుకూడా అయిన తర్వాత, అతనిని తానే 'భరింప'వలసి వస్తున్నదన్న కారణం చేత కాళ్ళూచేతులు కట్టి నదిలో పడవేయించటం అత్యంత క్రూరమైన , కిరాతకమైన రాక్షసమైన చర్య. ప్రద్వేషిణి చేసిన ఈ హేయమైన చర్య ఏ విధంగాను సమర్థనీయం కాదు. లోకంలో ఎందరో వృద్ధులు, గ్రుడ్డివాళ్లు అంగవికలురు తమ వారిచే భరింపబడుతూ ఉన్నారు. ప్రేమ, త్యాగం, సహనం ,సేవ స్త్రీ సహజ స్వభావాలు . ప్రద్వేషిణిలాంటి స్త్రీలు కూడా లోకంలో ఉంటారని, వైవాహిక జీవితంలో అసంతృప్తికి గురయిన స్త్రీలు ఆ విధంగా అసహజమైన పైశాచికమైన పరిష్కారాన్ని ఎన్నుకొంటారని సూచించడం వ్యాసుని ఉద్దేశ్యం. తండ్రిపై అవగింజంతైనా ప్రేమలేని కుమారులు తల్లి అజ్ఞను శిరసావహించి ఆముదుసలిని గంగలో త్రోయడం మాతృసామ్యానికి సంకేతం.

"భర్తకోసంప్రాణాలుసైతం యివ్వగలిగిన (రోజుల్లోనే) మహాపతివ్రతలున్న ఆ యుగంలోనే ఈ ప్రద్వేషిణి కూడా ఉంది."[1] అన్నది శ్రీదేవి వ్యాఖ్య.

## 11 మమత

గర్భవతియై ఉండి, బృహస్పతి అత్యాచారానికి గురికాబోయి తన గర్భస్థ శిశువు మూలంగా రక్షింపబడిన అదృష్టవంతురాలు.

## 12 సుదేష్ణ

తన వంశం నిలవడం కోసం ఏ విధంగానైనా సంతానాన్ని పొందాలనుకున్న బలి తన భార్య సుదేష్ణ కిష్టం లేదని తెలిసీ బలవంతంగా ఆజ్ఞాపించడం ఆనాటి సాంఘిక పరిస్థితులను, స్త్రీల నిస్సహాయతను తెలియ జేస్తున్నది. క్షేత్రజులను నాడు సంఘం సంతానంగా ఆమోదిస్తుండే దనడడానికి బలి వృత్తాంతం తార్కాణం.

సంతానం కోసం భర్త ఎవరి వద్దకు వెళ్లమన్నా తిరస్కరించే ధైర్యం స్త్రీలకుండేది కాదని సుదేష్ణ తన దాది కూతురును దీర్ఘతముని వద్దకు పంపి తప్పించుకోవడం వల్ల తెలుస్తున్నది. కాని రెండవసారి కర్కశుడైన భర్త కఠోరమైన అజ్ఞకు ఆ తరుణి స్త్రీత్వం ఆ పండు ముదుసలి పాలైంది. ఇలాంటి సుదేష్ణలు ఆనాడు ఇంకెందరున్నారో!

---

1. ప్రా.తె.కా.వి.స్త్రీ.పుట 127.

## 13 శ్రుతసేన

ఈమెకూడా భర్త నియోగం చేతనే ఇతరుల వల్ల సంతానాన్ని పొందింది . భర్త అశక్తత అందుకు కారణం.

## 14 భద్ర

భర్తృహీనగా జీవించడం కంటె చావడం మేలనుకొన్న వ్యుషితాశ్వుని భార్య భర్తశవం నుండి వెలువడిన వాక్కు ప్రకారం ఋతుమతియైన ఎనిమిదవనాడో, పద్నాలుగవనాడో పడకలో భర్తను తలచుకొని అతని స్వప్నసమాగమం వల్ల సంతానం పొందింది. ఋతుస్నానం చేసిన స్త్రీలలో ఆ దినాలలో అండోత్పత్తి జరుగుతుందన్నది వైద్యశాస్త్ర సమ్మతమైన విషయం.

## 15 శ్వేతకేతుని తల్లి

పరమసాధ్వి అయిన తన తల్లిని అతిథిగా వచ్చిన ఒక వృద్ధ విప్రుడు కామించగా క్రుద్ధుడైన శ్వేతకేతువు అది ధర్మవిరుద్ధమని, ఆనాడు మొదలు వివాహిత యైన స్త్రీని అన్యపురుషుడు గాని, అట్లే వివాహితుడైన వానిని అన్యస్త్రీ గాని కామించగూడదని, అది సకల పాపాలకు మూలమని కట్టడి చేస్తాడు.

ఈనాటికీ శ్వేతకేతుని నియమమేలోకంలో వైవాహిక సంబంధాల పవిత్రత నిలిచి ఉండటానికి కారణమైంది.

## 16 ఏకచక్రపురంలోని బ్రాహ్మణుని భార్య

మహాపతివ్రత. విధురుడైన భర్త మళ్లీ పెళ్లాడవచ్చు గాని, విధవయైన భార్య పునర్వివాహం చేసుకోవడం లోక నింద్యమని, భర్తృహీన ఎంతటి ఉత్తమురాలైనప్పటికీ లోకంతో నిందపడుతుందని, నీచులైన పురుషులు ఆమెను కోరుకుంటారని, యుక్తవయస్కురాలైన తన కుమార్తెను భర్త లేకుండా తాను రక్షించజాలనని, కొడుకును గుణవంతునిగా పెంచజాలననీ ఆమె పేర్కోనడం భారత కాలంనాటి స్త్రీలు, ముఖ్యంగా భర్తృహీనల దయనీయ పరిస్థితికి అద్దం పడుతున్నది. శతాబ్దాలు గడచినా ఈ పరిస్థితిలో ఈ నాటికీ ఏ విధమైన మార్పు రాలేదు.

## 17 బ్రాహ్మణి కుమార్తె

తల్లి ధర్మోపన్యాసం విన్న ఆ బ్రాహ్మణి కుమార్తె తాను ప్రాణత్యాగానికి

సిద్ధమై, తల్లి తండ్రులిద్దరూ జీవించినంతకాలం ఎంతోమంది పుత్ర పౌత్రులను పొందవచ్చునని, ఇతరులకిచ్చే బదులు తనను రాక్షసునికే ఇచ్చి వంశం నిలుపుకొమ్మని చెబుతుంది.

ఈ తల్లీకూతుళ్లిద్దరూ చేసిన ధర్మోపన్యాసం అత్యంత హృదయస్పర్శిగా ఉంది. స్త్రీలెంతటి త్యాగమూర్తులో భర్తకోసం కన్న తల్లితండ్రులకోసం స్త్రీ తృణప్రాయంగా ఏ విధంగా ప్రాణాలను పరిత్యజించ సిద్ధమవుతుందో ఈ కథ నిరూపిస్తుంది.

## 18 తపతి

సంవరణుడు తనను ప్రేమించి, తాను అతనిని ప్రేమించినా తన తండ్రి సూర్యుడు సమ్మతిస్తే తప్ప తమ వివాహం జరుగదని చెప్పి కన్య పితృ పరాధీనఅన్న నాటి యుగధర్మాన్ని, కన్యాత్వం యొక్క ఔన్నత్యాన్ని కాపాడిన తపతి మహనీయురాలు. వసిష్ఠునంతటివాడు ఆమె వివాహానికి మధ్యవర్తి అయినాడు

## 19 మదయంతి

పాండురాజువలె శాపగ్రస్తుడైన భర్త తనకు సంతానోత్పత్తి సామర్థ్యం లేదని తెలిసి తనను నియోగించగా వసిష్ఠుని వలన సంతానం పొందినది.

## 20 భృగుపత్ని

క్షత్రియులనుండి కాపాడుకోవడం కోసం తన గర్భాన్ని నూరు సంవత్సరాలు తన తొడలో దాచిన మహాపతివ్రత ఈమె. భారతంలోని అతి మానుషమైన, లోకోత్తరమైన గాథలలో ఇది ఒకటి.

## 21 జటిలముని కుమార్తె

బహు భర్తృక

## 22 దాక్షాయని

ఈమెకూడా అనేక భర్తృకయే.

## 23 అజిత

ఈమె సైతం బహు భర్తృక.

## 24 తిలోత్తమ

స్త్రీ సౌందర్యం మృత్యుహేతువని, ఒకరికొకరు ప్రాణంగా మెలగిన అన్నదమ్ములు సైతం స్త్రీ పొందుకోసం పరస్పర ప్రాణ ఘాతకులవుతారని నిరూపించిన స్త్రీ.

## 25 జరిత

క్రమ్ముకొని వస్తున్న కార్చిచ్చునుండి ఇంకా రెక్కలు రాని తన బిడ్డలను రక్షించుకోలేక, వదిలి వేయనూ లేక, విలవిలలాడిపోయిన తల్లి పక్షి లావుక పెంటి జరిత. తమను గూర్చి విచారింప వద్దని, ఆమె పుణ్యం తమను కాపాడగలదని ఆమెను ఎగిరి వెళ్లి ప్రాణాలు రక్షించుకొమ్మని నలుగురు కొడుకులు కోరగా విధిలేక ఎగిరిపోతుంది. వారి స్తోత్రానికి సంతసిల్లిన అగ్ని వారిని దహింపక వదిలివేయగా సంతోషంతో తిరిగి తన పుత్రులను కలుసుకొంటుంది.

పుణ్యలోకాలకై త్వరితగతిని పుత్రులను పొందడం కొసం పక్షిగామారి సంతానం పొందిన మందపాలుడు ఇంకా రెక్కలు రాని తనకూనలను వదలి వెళ్ళి మొదటి భార్యతో విహరించడం, ఖాండవ దహనం చేస్తున్న అగ్నిని తన నల్గురు పుత్రులను మాత్రమే రక్షించమని ప్రార్థించిన తాను జరితను' క్రూరాత్మ' అని సంశయించడం, " స్త్రీలు క్రూరాత్మ" లని సాధారణీకరణం చేయడం, హాస్యాస్పదం.

## 26 జర

రాక్షసియైనా కన్న తల్లులే పడవేసిన మాంస శకలాలను శిశువుగా సంధించి జరాసంధునికి ప్రాణ ప్రతిష్ఠ చేసిన పుణ్యాత్మురాలు.

## 27 సాత్వతి.

కొడుకు వికృత రూపాన్ని పోగొట్టిన శ్రీకృష్ణుని చేతిలో వాని చావు తప్పదని తెలిసి నూరు తప్పులవరకు వానిని క్షమించమని ప్రార్థించి అనుగ్రహించబడి, కొడుకు ఆయుష్షును కాపాడాలని ప్రయత్నించిన తల్లి మనసు సాత్వతిది. బిడ్డలెంత వికృత రూపులైనా, దుర్మార్గులైనా తల్లి ప్రేమలో ఏవిధమైన లోపం ఉండదని, పైగా అటువంటి సంతానాన్ని కాపాడుకొనేందుకా తల్లి సర్వ ప్రయత్నాలు చేస్తుందని సాత్వతి పాత్ర తెలియచేస్తుంది

## 28 లోపాముద్ర.

మహామునియైన అగస్త్యుని ఇల్లాలిగా నారచీరలు ధరించి అతని

కనుకూలంగా నడచుకొన్నా రాజపుత్రియై భోగాలకలవాటుపడిన తనకు తగిన సంపదలు సమకూర్చుకొనడం కోసం భర్త తనకనుకూలుడుగా ఉన్న సమయంలో తన అభీష్టాన్ని తెల్పి, తపోబలమే తప్ప వేరు సంపద లేని భర్తను భిక్షార్థిని చేసి తన కోరిక నేరవేర్చుకొన్నది. లోపాముద్ర. శ్రీనాథుని కాశీఖండంలో వ్యాసుడామెకు పతివ్రతా ధర్మాలుపదేశిస్తాడు.

## 29 పతివ్రత

ధర్మవ్యాధోపాఖ్యానం లోని పతివ్రత తన చూపులతోనే కొంగను భస్మీభూతం చేసిన కౌశికుని సైతం ఉపేక్షించి పతిసేవ చేసింది. మహాతపస్వియైనా క్రోధవశుడైన అతనికి జ్ఞానోపదేశం చేసి ధర్మసూక్ష్మాలనెరుగమని అతనిని ధర్మవ్యాధుని వద్దకు పంపి, స్వధర్మనిర్వహణను మించిన ధర్మమేదీ లేదని, స్త్రీకి పతి సేవ కన్న మించిన ధర్మం వేరొకటి లేదని తెలియజేస్తుంది.

ఇంతచేసి, వనితలకు పరిజ్ఞానం లేదు. కాబట్టి వాళ్లెలాంటి తప్పు చేసినా క్షమించాలి గదా, కాబట్టి తనను క్షమించమంటుంది.

"నా దెసం బ్రసన్నుండ వగునది వనితకుం బరిజ్ఞానంబు లేదు. గావున వారెట్టి యపరాధంబు సేసినను సహింపవలయు గదా......" [1]

## 30 అత్రిముని భార్య

సంతానం పట్ల తండ్రికన్నా తల్లే ఎక్కువ బాధ్యతా యుతంగా ప్రవర్తిస్తుం దని నిరూపించిన ఇల్లాలు. వాన ప్రస్థానికి తనతో రమ్మన్న భర్తను ముందు కొడుకులకు తగిన ఆర్థికస్థితి ఏర్పరచమంటుంది.

## 31 దమయంతి

లోకోత్తర సౌందర్యవతియై నలుని వలచి, వలపించుకొని, ఇంద్రాది దిక్పాలకులే తనను వివాహమాడగోరినా తిరస్కరించి, నలుని వేషంలో వచ్చిన వారిని తన భక్తితో జయించి,తన ప్రేమ ఎంత మహోన్నతమైనదో నిరూపించుకొని, నలుని వివాహమాడిన దమయంతి వైవాహిక జీవితంలో అనుభవించిన కష్టాలు ఇన్నీ అన్నీ కావు. సామాన్యమైనవి అసలే కావు.

తానొక మహారాజునన్న విషయం, ప్రజలను ధర్మబద్ధంగా, న్యాయ సమ్మతంగా పరిపాలించవలసిన గురుతరమైన బాధ్యత తనపై ఉందన్న వాస్తవం, మరచి జూద వ్యసన పరుడైన నలుడు నెలల తరబడి జూదమాడి సర్వం

1. భార.ఆది. ఆ5. ప. 25

కోల్పోతాడు. ప్రేమించి పరిణయమాడిన భార్య పట్ల తన భర్తృ ధర్మాన్ని, ముద్దులు మూటగట్టే పసివాళ్లైన తన బిడ్డలకు తండ్రిగా చేయవలసిన న్యాయాన్ని సైతం విస్మరిస్తాడు.

భర్తను అభయంకరమైన వ్యసనంనుండి తప్పించడం కోసం దమయంతి చేసిన ప్రయత్నమంతా నిష్ప్రయోజనం కాగా మహారాజు పత్నియై సమస్త సౌఖ్యాలననుభవిస్తూ అసూర్యంపశ్యగా రాజాంతఃపురంలో ఉండవలసిన దమయంతి కట్టు బట్టలతో, భర్తతో అడవుల పాలవుతుంది.

చివరికా కట్టుబట్టలు సైతం కోల్పోయిన భర్తను తన చల్లని మాటలతో ఆశ్వాసించి ధైర్యం చెప్పిన దమయంతికి నలుడు చేసినదేమి? ఆమె కట్టుకొన్న వస్త్రాన్ని సగం చింపుకొని, నిర్జనారణ్యంలో అర్ధరాత్రి అర్ధనగ్నంగా ఆమెను వదిలి వెళ్ళడం !

నిదుర మేల్కొని భర్త తనను వదిలి వెళ్ళినాడని తెలుసుకొన్న దమయంతి రోదనను, అరణ్యంలో ఒంటరిగా ఆమె పడిన పాట్లను , ఆమె దుర్భరదీనస్థితిని నన్నయ అత్యంత కరుణా పూర్వకంగా వర్ణించినాడు! కిరాతునిచే బలాత్కారానికి గురికాబోయినా, దొంగలచే ముట్టడించబడినా, ఏనుగుల దాడికి గురి అయినా ఆమె తన పాతివ్రత్యమహిమవల్ల రక్షించబడుతుంది. ఎంతో ధైర్యసహనాలతో సుబాహుని అంతఃపురంలో సైరంధ్రిగా ఉంటూ ఆమె నలుని వెదికించే ప్రయత్నాలు చేయడం, నిరంతరం పుణ్యవ్రతాలతో గడపడం ఆమె సంకల్ప బలాన్ని, దృఢదీక్షను, పవిత్ర వర్తనను వ్యక్తం చేస్తాయి.

ఋతుపర్ణుని వద్దనున్న బాహుకుడే నలుడని ఆమె అనుమానించి నిర్ధారించుకొన్న తీరు, ద్వితీయ స్వయంవర మిషతో రప్పించి పరిచారిక ద్వారా వివిధ పరీక్షలకు గురిచేసి అతడు నిస్సందేహంగా నలుడని ఆమె తెలుసుకొన్న వైఖరి, దమయంతి మహారాజనీతి కోవిదురాలని ధృవీకరిస్తాయి. తండ్రి అనుమతితో నలుని రప్పించి, తన స్వయం వరాన్ని సందేహించక నలునికి అది మిథ్య అని తన నిర్దోషిత్వాన్ని, నిష్కళంకతను తెలియజేయడం ఆమె ఉదాత్త పత్నీత్వాన్ని వెల్లడిస్తున్నాయి.

రెండవసారి ఆడిన జూదంలో దమయంతిని పణంగా పెట్టి నలుడు ఈ విషయంలో ధర్మరాజుకు మార్గదర్శకుడైనాడు. ధనకనకవస్తువాహనాలవలె భార్య కూడ జూదగాండ్రకు అవసరానికి ఉపయోగించుకోదగిన వస్తువు మాత్రమే. సామాన్య జూదగానికీ , నల, ధర్మరాజులకు ఈ విషయంలో ఏమాత్రం వ్యత్యాసం

లేదు. యుగాలు మారినా వ్యసనపరులస్వభావాలు మారవు. వారి భార్యలకు కడగండ్లు, కన్నీళ్లు తప్పవని దమయంతీ ద్రౌపదుల గాథలు ఋజువుచేస్తాయి.

భర్తకు దూరమైన పతివ్రత ఎంత కఠోరనిష్ఠతో దుర్భరశోకతప్తయై జీవితం గడుపుతుందో సీతా దమయంతులిద్దరూ తామెన్నుకొన్న జీవన విధానం ద్వారా తెలియజేస్తారు. అశోకవనంలో రావణుని చెరలో ఉన్న సీతవలెనే దమయంతి భర్తృపరిత్యక్త యైననాటి నుండీ నిరలంకారంగా, భూశయనమే వ్రతంగా స్నానపానాదులు సైతం పరిత్యజించి మలిన దేహంతో, జడలుగట్టిన కేశపాశంతో నాటి సగం చింపిన చీరతోనే ఉండడం ఆమె ఎంతటి సాధ్వీలలామయో తెలియ జేస్తుంది.

సౌందర్యం, నీతి, ధర్మం, పాతివ్రత్యం, ధైర్యం, సహనం, రాజనీతి వైదుష్యం, కార్యదీక్ష, దైవభక్తి , వినమ్రత ఒకటేమిటి సమస్త సద్గుణాలతో అలరారే నారీశిరోమణి దమయంతి.

దమయంతిని గూర్చి కొన్ని ఇతర విమర్శకుల వ్యాఖ్యలు "దమయంతి నీతిధర్మముల ప్రోవు. పాతివ్రత్యపుపూర్ణమూర్తి . ఆమె యడవిలో వ్యాధుని వల్లను, గజాదుల వల్లను, చోరుల వల్లను పడినపాట్లు ఆమె సహనధైర్యములను వ్యక్తపరచును. ఆమె నలుని గనుకొన్న తీరు రాజనీతికౌశల్యమును ఆమె స్వయంవర మిషతో రప్పించిన రూపాంతరమునున్న నలుని బిలిపించి తన నిష్కళంకతను వినమ్రవినయములను జూపుటయునొక యుదాత్త స్త్రీ స్వభావమును సూచించును"[1] - మూలం వల్ల చంద్రశేఖర శర్మ.

"భర్త వ్యసనం మూలంగా అంతులేని కష్టాలననుభవించినవారు. దమయంతి, ద్రౌపది. దమయంతి ఎన్ని అవరోధాలెదురైనా ధీరచిత్తంతో వాట నెదుర్కొన్నది. భర్త ఉన్నాడో, లేడో తెలియని స్థితిలో బేలయై విలపించినా ధీరస్వాంతంతో ప్రవర్తించింది. పట్టుదలగా అతనికోసం అన్వేషించింది. ఎంత సాహసంతో మ్రొక్కవోని విశ్వాసంతో రెండవసారి స్వయంవరం ప్రకటించమః చెప్పింది చివరకు విజయాన్ని సాధించింది."[2] - శ్రీమతి శ్రీదేవి.

"దమయంతి కూడా సావిత్రిలాగా, రుక్మిణిలాగా తగిన వరు ఎంచుకోవటంలో స్వతంత్రంగానే ప్రవర్తించింది. ........జూదంలో సర్వ రాజ సంపదలు కోల్పోయి అడవుల పాలయినప్పుడు నలుడు దమయంతి తనతో కష్టాలు పడలేదని భావించి బంధుజనుల వద్దకు పొమ్మని సలహా యిస్తాడు.

1.మహా.భార. వి.వి.కో.పుట.379 2. ప్రా.తె.కా.వి.స్త్రీ. పుట 163

పోతే ఇద్దరం కలిసిపోదాం . లేకపోతే నేనూ నీతోపాటే అడవులలో ఉంటానని చెప్పి ఇది "మదనుజీవితయనియును, ననువ్రతయును, ననుకంపనీయ యనియు" భావించి అతనిని అనుసరించడానికి తనకు అనుమతివ్వమని అడుగుతుంది. నలుడిని అనుసరించటమే తన జీవితంగా వ్రతంగా పేర్కొనటమే గాక నలుడు దయచూపవలసిన అధీనస్థితిలో ఉన్నానని భావించటం ఇక్కడ కనబడుతుంది. ఈ భావనాతీవ్రత నుండే తాను పతివ్రత నన్న చైతన్యం ఆమెకు కలిగింది. ఆ చైతన్యం కారణంగానే దేహసౌఖ్యాలకు వెలియై , మలిన వస్త్రాలతో మట్టిగొట్టుకున్న శరీరంతో భర్తృవియోగకాలాన్ని గడిపింది. పాతివ్రత్య సంస్కృతి ఆమెను లోనుండి బయటినుండి కూడా హింసకు గురిచేసింది. ఈ హింసా క్రమంలో ప్రాణాలు తట్టుకోలేక బలహీనపడింది. .... నలుని అన్వేషించటానికి బ్రాహ్మణులను పంపినప్పటినుండి అతనిని గుర్తించి విదర్భకు రప్పించేవరకు జాగరూకురాలై ప్రణాళిక తరువాత ప్రణాళిక రూపొందిస్తూ వచ్చిన దమయంతి తీరా తల్లి బాహుకుడిని తన దగ్గరకు రప్పించినపుడు కన్నీళ్లు పెట్టుకొని బేలతనమే ప్రదర్శించింది."[1] - శ్రీమతి కాత్యాయని విద్మహే.

## 32,33, వేశ్యమాత, వేశ్యపుత్రి

లోకమెరుగని జడదారిని తమ సౌందర్యం,నైపుణ్యంతో సంసారిగా మార్చిన నెరజాణలు. స్త్రీ సౌందర్యసందర్శనం ఎంతటి అమాయకునైనా, తపోనిరతునైనా ప్రభావితం చేయగలదని నిరూపించినారు.

## 34 రేణుక

జమదగ్నివంటి మహర్షి భార్య అయి ఉండి పరపురుషుడు భార్యాసహితుడై జలక్రీడలాడుతుండగా చూడటం, కామమోహితయై వ్యభిచరించడం ఎంతో నిందనీయమైన విషయాలు. రేణుక అప్పటికి పుత్రవతి కూడ. పరశురాముని వంటి లోకోత్తముని తల్లి ఇంతటి హీనచరిత కావడం ఆశ్చర్యదాయకం. బహుశా నన్నయ భావం మానసిక వ్యభిచారం కావచ్చును.

## 35 సుకన్య

నాలుగువేలమంది 'దేవీనివహం' గల శర్యాతికి అతిశయ రూపలావణ్య సంపద గల కుమార్తె సుకన్య. ముగ్ధ. బాల్య చాపల్యంతో అజ్ఞానంతో తాను

సం.సా. స్త్రీ.ద్కృ పుట 57

చేసిన తప్పుకు వృద్ధముని క్రుద్ధుడై తన తండ్రి సైన్యాన్ని శపించగా, ఆ శాపాన్ని బాపుకొనేందుకు తన తండ్రి నిస్సంకోచంగా తనను ఆ ఎముకలపోగుకు సమర్పించి వెళ్ళగా అసహ్యం, బాధ, దుఃఖం - ఇవేవి లేకుండా అతి భక్తితో భర్తను సేవించిన పరమసాధ్వీశిరోరత్నం. అశ్వినులామె మనస్సును చలింప చేయాలని చూసినా, భర్తే ఆమెను తన రూపలావణ్యాలకు తగిన వరుని ఎన్నుకోమన్నా, ఎంతమాత్రం చలించక తన పతి భక్తితో భర్తకు యౌవన ప్రాప్తి కల్గించి ధన్యురాలైన సతీమతల్లి.

## 36 సరస్వతీ దేవి

స్వాధ్యాయ శీలత, జపహోమ తత్పరత, దానవ్రత పరాయణత గల తపోధనులు ఏయే పుణ్యలోకాలు పొందగలరో తెలియజేసిన చదువుల తల్లి.

## 37 కృష్ణ

సాటి ముని భార్యఅని చూడకుండా కాముకుడై తనతో ఉన్మత్త ప్రలాపం చేసిన వానిని చాకచక్యంతో, మామ సహకారంతో కడతేర్చిన పతివ్రత, బుద్ధిశాలిని.

## 38 సత్యభామ

పాండవులకు ద్రౌపదిపట్ల గల ప్రేమకు, గౌరవానికి కారణం ఆమె ప్రయోగించే 'మాయలూ, మంత్రాలా' లేక ఆమె అలంకార వైవిధ్యమా, తినిపించే మందూ, మాకులా అని ద్రౌపదినే అడిగి ఆమె చేత ఘాటైన చీవాట్లు తిని, భర్తృ వశీకరణ మార్గాలు అకృత్రిమమైన అనురాగం, గృహకార్య నిర్వహణా సామర్థ్యం, బంధుజనుల పట్ల ఆదరణ, స్వహస్తాలతో భర్తృ పరిచర్యా మొదలైనవి తప్ప అన్యంకావని జ్ఞానోపదేశం పొందిన శ్రీకృష్ణుని ప్రియపత్ని.

ద్రౌపదికన్యాయం చేసిన దుర్యోధనుని భార్యలు దిక్కులేక విలపించడ చూసి ద్రౌపది సంతోషించగలదని సత్యభామ పలికినప్పుడు ఆమె ద్రౌప. అన్నట్లుగా నిజంగా శ్రీకృష్ణునికి తగిన యిల్లాలు కాదేమోనన్న సందేహం కల్గుతుంది. తప్పుచేసిందీ, పాండవులకన్యాయం చేసిందీ దుర్యోధనుడైనప్పుడు నిరపరాధలైన అతని భార్యలు దుఃఖించడం చూసి ద్రౌపది హర్షాతిరేకం పొందుతుందా? పొందితే అంతకన్నా రాక్షసత్వం ఇంకొకటి ఉంటుందా?

మాయలు, మంత్రాలు మందుమాకుల గురించి ప్రస్తావించినప్పుడే సత్యభామ వ్యక్తిత్వపు తీరు తేటతెల్లమవుతుంది. అభిజాత్య గౌరవం, సౌందర్య

గర్వమూ తప్ప చెప్పుకోదగిన గొప్ప గుణాలేవీ సత్యభామలో కన్పించవు. కాని భర్త ప్రేమను మాత్రం సవతులకన్నమిన్నగా పొందగల్గిందని పారిజాతాపహరణ కావ్యంలో నంది తిమ్మన పేర్కొన్నాడు. బహుశా తాను భర్తను అంతగా ప్రేమించడమే అందుకు కారణమై ఉండవచ్చు.

## 40 ఆరుగురు కృత్తికలు

కాముకుడైన భర్త కోరిక తీర్చడం కోసం అగ్ని భార్యస్వాహాదేవి తమ రూపాలు ధరించి భర్తతో రమించగా ప్రజల నిందలకు, భర్తల సందేహాలకు బలియైపోయి, భర్తృపరిత్యక్తలైన అమాయక స్త్రీలు మాతృత్వ సౌభాగ్య వంచితలై కుమారస్వామిని తమను మాతలుగా స్వీకరింపుమని యాచించిన దైవోపహతులైన వారు, సప్తర్షులలో ఆరుగురి భార్యలు. (వసిష్ఠుని భార్య అరుంధతి తప్ప)

## 40. స్వాహాదేవి.

బాల్యంలో తనను వివాహమాడిన భర్త యిపుడు తననిష్ట పడటం లేదని అగ్నిభార్య,దక్షుని పుత్రి అయిన స్వాహాదేవి కుమారస్వామితో మొరపెట్టుకుంటుంది. సంవత్సరాల తరబడి కాపురం చేసిన తర్వాత భార్యపై మోజుతీరి పోయిన భర్త పరస్త్రీల యందాసక్తుడైతే నిస్సహాయంగా, మౌనంగా లోలోపలే కుమిలిపోతూ ఎడమొహం పెడమొహంగా ఉన్నా, పైకిమాత్రం అన్యోన్యంగా ఉన్నట్లు నటించే భార్యలు యీనాటి సమాజంలోనే గాక ఆనాడూ ఉన్నారని స్వాహాదేవి ఉదంతం తెలియజేస్తున్నది.

అయితే స్వాహాదేవి నిస్సహాయంగా ఉండిపోకుండా భర్తృప్రియం కోసం ఋషిపత్నుల వేషాలు ధరించి భర్తృసమాగమాన్ని, పుత్రలాభాన్ని పొందడం ఆమెలోని స్వార్థభావనకు పరాకాష్ఠ. తన స్వార్థంకోసం ముని పత్నులకపకీర్తి నాపాదించడానికైనా ఆమె వెనుకాడలేదు.

అయితే పశ్చాత్తాపమామెను నిలువనీయ లేదు. జనాపవాదాన్ని నమ్మిన ఋషులు భార్యలను పరిత్యజించడం చూసి, తన మూలంగా వారికి జరిగిన అన్యాయాన్ని సరిచేయాలనుకొని ప్రయత్నించి విఫలురాలవుతుంది. భర్తకు అనుచితమార్గంలో తాను ప్రియమొనరించీ అతని ప్రియురాలు కాలేకపోతుంది. భార్యాభర్తలిద్దరూ చేసిన తప్పుకు బలిపశువులైనది మాత్రం కృత్తికలు,

## 41 సప్తమాతృకలు

స్త్రీలలోని అసూయా మాత్సర్యాలకు సప్తమాతృకలు ఉదాహరణ. ఇతర

మాతృకలకంటె తమ కెక్కువ ఖ్యాతి రావడం కోసంవారు అన్నెంపున్నెంఎరుగని శిశువులకు కీడు చేయగోరడం వారిలోని విపరీత, వికృత కీర్తికాంక్షకు ప్రతీక. వీరి అతి క్రూరమైన యీ ధోరణి స్త్రీ ప్రవృత్తి లోని చీకటి కోణానికి తార్కాణం.

## 42,43,44,పుష్పోత్కటా మాలినీ పాబకలు

పరిచారకులుగా కుబేరునిచే విశ్రవసువుకు సమర్పింపబడి, తమ నృత్యగీతాలచే, ఉపచారాలచే అతనిని మెప్పించి రావణ కుంభకర్ణాది సంతానాన్ని పొందిన రాక్షసస్త్రీలు.

"......... నృత్యగీత విద్యావిశారవదలయిన రాక్షసస్త్రీలం బుష్పోత్కటయు, మాలినియు,పా(బ)కయు, ననువారు ముప్వురు నవ్విప్రవరునకు బరిచారికలుగా నిచ్చిన"[1]

"పురుడును నయ్యువతులునొం
డొరులం గడవంగ విలసదుపచార సమా
చరణ ప్రవీణ భంగుల
బరితోషితు జేసి రాతపస్వివరేణ్యున్"[2]

"ఇట్లు ప్రీతుండై యతండు వారలకు బుత్రదానంబు చేసిన నందు బుష్పోత్కటకు రావణ కుంభకర్ణులును, మాలినికి విభీషణుడును,పా(బ)కకు ఖరుడును, శూర్పణఖయను కన్యకయు మిథునంబై ప్రభవించిరి."[3]

## 45 శూర్పణఖ

దుష్టచరిత. తన దుశ్చేష్టకు ఫలితంగా లక్ష్మణునిచే వికృతరూపిణిగా చేయబడినది.

## 46 తార

పంచ కన్యలలో ఒకతె యైన తార మహాబుద్ధిశాలిని.భర్తక్షేమం కోరి ఎంతో వివేకంతో అమె చెప్పిన మాటలను సుగ్రీవుని పట్ల ఆమెకున్న పక్షపాతంగా వాలి భావించడం అమె పట్ల అతనికి నమ్మకం లేదనడానికి ఋజువు. తనను నమ్మిన తమ్ముని పారద్రోలి ఆతని భార్య రుమను చేపట్టినాడు గదా! కామెర్ల రోగికి లోకమంతా పసుపే!

---

1. భార. అరణ్య. ఆ. 6 ప. 271, 272, 273

## 47 త్రిజట

గంజాయి వనంలోని తులసిమొక్కలాగా రాక్షసస్త్రీలలోని ఉత్తమురాలు. తన స్వప్న వృత్తాంతంలో సీత నాశ్వాసించిన సాధుస్వభావ. భర్తృ వియోగంతో, నిరంతర శోకంతో పరితపిస్తున్న సీతకు దొరికిన ఒకే ఒక ఆత్మీయురాలు, రాముడు తనకై రాబోతున్నాడన్న శుభవార్త చెప్పి సీత ప్రాణాలు నిలబెట్టిన పుణ్యాత్మురాలు.

## 48 సీతకు కాపలా ఉన్న రాక్షస స్త్రీలు

తమ పేర్లెంత వికృతంగా ఉన్నాయో అంత కన్నా ఎక్కువ క్రూరమైన మనస్సూ చేష్టలూ గల దుష్టరాక్షసగణం.

## 49 సీత

తన ఆజ్ఞ ప్రకారం భర్తను రక్షించడానికి వెళ్లని లక్ష్మణుని సీత అవమానించి తూలనాడటం ఆనాటి సంఘంలో 'దేవర న్యాయం' అన్న సాంఘికాచారం (అన్నదమ్ములు ఒకరి భార్యనొకరు పొందడం) ఉండేదని తెలియజేస్తున్నది. వాలి సుగ్రీవుల ఉదంతంకూడ ఆ కాలానిదే.

పరమ పతివ్రత యైన సీతతో, ఏడాదిపాటు తన నామస్మరణే సర్వస్వంగా, నిరాహారంగా, స్నాన, పాన, అలంకార నిద్రాదులు సర్వం త్యజించి తపస్వినిగా గడిపిన తన ధర్మపత్నితో రాముడు పల్కిన మాటలు అతి క్రూరంగా నిర్దయగా ఉండి మనస్సును పిండి వేస్తాయి.

" అతి మలినాంగి జీర్ణమలినాంబరధారిణి సంతతాశ్రు పం
కిత విలసత్కపోల బరికీర్ణ జటాయిత కేశభార నా
యత ఘనదుఃఖ దూషిత బ్రియాంగన గన్గొని యప్రియాత్ముడై
నుత చరితుండు తద్దయు మనోవ్యథ సేయుచు నింతికిట్లనున్ " [1]

అధిక దుష్టాచారుడైనదశానను డింతకాలము తన యింట బెట్టి
కొని యున్న నిన్నుగైకొనిన నస్మచ్చరిత్రమునకు దొడరదే ధర్మహాని
పరిభవంబునకు నై ప్రతికారముగ వైరి గూల్చితి గాని నీకొరకు గాదు
మెలత నీ చరితంబు మేలైన గీడైన గానిమ్ము నిన్ను నిక్కముగ నొల్ల

1. భార. అరణ్య. ఆ. 7. ప.156

బరగ గుక్కవాత బడిన హవ్యము భంగి
యయ్యె నీ తెఱగు నరయనిపుడు
కాన యిచట దడయగాదు చెచ్చెర నీకు
నిష్టమైన కడకు నేగు మతివ"[1]

భర్తే దైవంగా భావించిన సీతకు భర్త వల్ల జరిగిన తిరస్కారం, అవమానం రాముని ధర్మపరాయణతకు, ఆదర్శ ధర్మ స్థాపనకు ఉదాహరణ అని వాల్మీకాదులు కీర్తించడం సీతకు అన్యాయం చేయడమే. నారీలోకాన్ని కించపరచడమే అవుతుంది. అంతకాలం రావణుని చెరలో అష్టకష్టాలనుభవించిన భార్యను, తానంతకాలం కాపురం చేసిన తన ధర్మ పత్నిని రాముడంత హీనంగా మాట్లాడడం, తిరస్కరించడం ఒక సగటుమానవుని పురుషాహంకార ప్రవృత్తికి, నిర్దయత్వానికి నిదర్శనంగా మాత్రమే కనబడుతుంది. సీత కన్యాయం చేసిన రాముని దైవత్వం నారీలోకానికి ప్రశ్నార్థకమే.

సీతలోని ఉత్తమలక్షణాలైన తపస్సు, ఆత్మసంయమనం,అద్భుతమైన మేధాశక్తి, అచంచలమైన భక్తి, సహనం స్త్రీలేకాదు పురుషులు కూడ గుర్తుంచుకో దగినవి.స్వామి వివేకానంద ఇలా అన్నారు."సీత ఒక విశిష్టమైన వ్యక్తి.సీత పాత్రను శాశ్వతంగా చెరగి పోకుండా చిత్రీకరించాడు వాల్మీకి. భారత స్త్రీ వాస్తవరూపానికి ప్రతీక సీత. సీత జీవితం నుండి ఆదర్శ మహిళా చిత్రాన్ని భారతీయులు ఊహించుకున్నారు. మన పురాణాలన్నీ మాయమైపోయినా, మన వేదాలు కనపడకుండా పోయినా, సంస్కృతభాషకూడ అదృశ్యమైనా,అతిసామాన్య జానపద మాండలికంమాట్లాడే ఒక్క హిందువు జీవించి ఉండేదాకా సీత కథ బ్రతికి ఉంటుంది. గుర్తుంచుకోండి.మన జాతి జీవనాడిలో సీత ఉంది.ప్రతిహిందూ స్త్రీ పురుషుని రక్తంలో సీతమ్మ ఉంది. మనమంతా సీతమ్మ పిల్లలం"-'యుగయుగాల్లో భారతీయ నారీత్వం' అన్న తన పుస్తకంలో కుమారి నివేదిత వ్యాఖ్య.

శ్రీమతి శ్రీదేవి సీతను గూర్చి ఇలా అన్నారు.-" రాముడు సీత సౌశీల్య అని పరిపూర్ణంగా విశ్వసించినా,లోకాచారం కోసం ఆమెకు అగ్ని పరీక్ష అవసరమైంది తరువాత ఉత్తరకాండలో కూడా లోకాపవాద భయం వల్లనే రాముడు సీతను పరిత్యజించాడు....ఈ విధంగా సీత ఆనాటి కఠిన సాంప్రదాయాలకు, నియమాలకు, రాజరిక వ్యవస్థకు బలైపోయిన నారీమణి" (ప్రాచీన తెలుగు కావ్యాలలో విఫల మనోరథలైన స్త్రీలు పుట 113)

1. భార. అరణ్య. ఆ. 7. ప.157

"కుల సతిని చెరపట్టి తీసుకొని పోయిన వాడిని ఉపేక్ష చేశాడన్న మాట తనకు రాకుండా రావణున్ని చంపానని,పరపురుషుడు తీసుకుపోయి అంతకాలం ఉంచుకున్న సీతతో తనకికి పనిలేదని ఆమెను ఆమె యిష్టం వచ్చిన చోటుకే వెళ్లమని అంటాడు రాముడు.నా మనస్సు తెలిసీ ఎందుకిలా మాట్లాడతావంటూనే సీత తనయందు ఏ పాపమూ లేదని ఖచ్చితంగా చెబుతుంది. అయినా ఈ సమాజంలో దాన్ని ఋజువు చేసుకోవలసిన బాధ్యత తన మీదే ఉంటుందని, భర్త అన్న వాడు తనే పాపము ఎరుగననే విషయాన్ని మనసానమ్మితే గాని స్త్రీకి సమాజంలో గుర్తింపూ గౌరవం లేవని ఆమెకు తెలుసు. అందుకనే గత్యంతరం లేక సీత అగ్ని పరీక్షకు సిద్ధపడుతుంది." [1] శ్రీమతి కాత్యాయని వ్యాఖ్య

భారతంలో ఎఱ్ఱన చిత్రించిన సీతయైనా,రామాయణంలోని సీతయైనా చిత్రణ ఒక్కటే.యుగధర్మం రాజధర్మం రామునిచే ఆ విధంగా మాట్లాడించాయని పెక్కుమంది విమర్శకులు రాముని సమర్థించడం,సీత మహాపతివ్రత అని నిర్ద్వంద్వంగా ఘోషించడం,అలా ఉంచితే సీతను రాముడంత హేయంగా క్రూరంగా మాటలాడవలసిన పని ఉన్నదా? భర్తృ పరిత్యాగమే ఆ పతివ్రతకు అశనిపాతం కాగా భర్త అంతమందిలో ఆవిధంగా అతి నిర్దయగా పలికిన ఆ అవమాన పూర్వకమైన మాటలు ఆమె సున్నితమైన హృదయాన్ని,శరీరాన్ని వేయి పిడుగులై దహింపవా అన్నది విమర్శకులు సమాధానమీయవలసిన ప్రశ్న. తనకావిధంగా చేయక తప్పదని,మరోమార్గం లేదని, రాజదంపతులమైన తాము ప్రజలకోసం ఆ విధంగా తమ వ్యక్తిగత జీవితాలు బలిపెట్టక తప్పదని, సంప్రదాయ పరిరక్షణ, సతీ పరిగ్రహణం కన్న మిన్న అనీ రాముడు సీతకు ఉచితమైన మాటలతోనే తెలియజేసి ఉండవచ్చును.

## 50 శచీదేవి

మహా పతివ్రతయైన ఇంద్రపత్ని శచీదేవికి కామాతురుడైన నహుషుని వల్ల సామాన్య స్త్రీలాగ బాధలు తప్పలేదు. దేవతలు తమ చేతగానితనంతో ఆమెను నహుషుని కప్పగించాలని బృహస్పతిని కోరడం,ఇంద్రపదవిలో ఉన్నందున శచీదేవి నతడు కోరడం సమంజసమే అనడం రాజ్యమూ, స్త్రీ బలవంతునివే అన్న ఆనాటి యుగధర్మాన్ని తెలుపుతున్నాయి.

## 51 సావిత్రి

పతివ్రతలనగానే లోకంలో ముందుగా సీతాసావిత్రులను తలచడమే

1. సం. సా. స్త్రీ. దృ. పుట. 36

పరిపాటి. పతి ఆయుర్దాయంకోసం ప్రాణహరుడైన యముడినే వెంటాడి సాధించుకొన్న సాధ్వీశిరోమణి సావిత్రి.ఆదర్శ భారతనారీవ్యక్తిత్వ సౌందర్యమంతా ముద్దకట్టిన మహిళామణి, లోకోత్తర స్త్రీరత్నం సావిత్రి. వలచి వివాహమాడిన భర్త అల్పాయుష్కుడన్న కఠోరసత్యాన్ని కొంగున అగ్నిని దాచినట్లుగా దాచి, పైకి చిరునవ్వులు చిందిస్తూ. భర్తను తన ప్రేమతో, సేవలతో పరవశింప జేస్తూ. మనసులో దుర్భర దుఃఖవేదన ననుభవిస్తూ,అనుదినం భర్త ఆయువును లెక్కిస్తూ, కఠోరనియమ, వ్రత ఉపవాసాదులతో దైవానుగ్రహం కోసం పాటుపడుతూ, వృద్ధులైన అత్తమామల శుశ్రూషను ఏమరుపాటు లేక భక్తిశ్రద్ధలతో ఆచరిస్తూ తన వినయ విధేయతలతో, పాతివ్రత్యంతో,సేవాభావంతో, ప్రేమాదరాలతో అందరి మనస్సులు చూరగొన్న సావిత్రి సమస్త సద్గుణాలరాశి, ధీరమతి, ధీరవిచార, ప్రియభాషిణి.

పరమ కాఠిన్యంతో తన విధిని నెరవేర్చే యముణ్ణి సావిత్రి తన పాతివ్రత్యంతో, మృదుమధురవచనాలతో, సంభాషణాచాతుర్యంతో ప్రసన్నుని చేసికొన గలిగింది. 'భర్తకు దీర్ఘాయువునే కాక వృద్ధుడూ, అంధుడూ, రాజ్యభ్రష్టుడూ అయిన మామకు దృష్టినీ, పోయిన రాజ్యాన్నీ, పుత్రహీనుడైన తండ్రికి శత పుత్రలాభాన్నీ, కల్గించగల్గింది.

ప్రియభాషణాలు,హితవాక్కులు వినయపూరిత వర్తనం ఎంతటివారినైనా వశపరుచుకోగలవనడానికి సావిత్రి చక్కని ఉదాహరణ. సౌశీల్యం, సౌజన్యం, మధుర భాషణాచాతుర్యం,సావిత్రికే గాదు, స్త్రీ పురుషులెవ్వరికైనా పెట్టని ఆభరణాలు.

ఇక పలువురు విమర్శకాగ్రేసరులు సావిత్రిని గూర్చి చేసిన వ్యాఖ్యలలో మచ్చుకు కొన్ని -"ఒక పతివ్రతయైన కులస్త్రీ తన పాతివ్రత్యప్రభావంచే అల్పాయుష్కుడై మృత్యువు వాతపడిన తన భర్త అలాపడిపోకుండా మృత్యు తోనే పోరాడి, అతని ప్రాణాలు కాపాడి, మరలా అతన్ని దీర్ఘాయువుగ యమునివల్లనే పొందగల్గిందని చెప్పటమే దీని సారాంశం. దీని మూలంగా బోధపడిందేమిటంటే మీరలా రాజ్యలక్ష్మికి దూరమయ్యామని బాధపడకండి. ఎప్పటికైనా మీ కనపాయినిగా మెలిగే యీ ద్రౌపది పాతివ్రత్య మాహాత్మ్యమే మిమ్ము కాపాడుతుంది.మీకు విజయాభ్యుదయ మీవిడ శీలమే సంపాదించి ఇస్తుందని భావ్యర్థాన్ని మహర్షి వ్యంగ్యంగా సూచించడమిది."-మహాభారత వైభవం అన్న తమ గ్రంథంలో శ్రీ యల్లంరాజు శ్రీనివాస రావుగారు(పూర్వార్థం పుట97)

శ్రీచంద్రశేఖర శర్మగారు-"ఆదర్శ భారత స్త్రీ. ధీరవిచార,నియమ వ్రతశీల, వాజ్నిపుణయు నైన సావిత్రి అత్యుత్తమ స్త్రీ స్వభావములైన త్యాగము,తపము, వృద్ధసేవ, సహనము,యుక్తానురాగము, పతిభక్తి, సంలాపసౌందర్యము మొ॥ వాని నన్నింటిని ప్రకాశించజేసినది." [1]

శ్రీమతి శ్రీదేవి-"మహాసాధ్వి సావిత్రి తన లక్ష్యం నెరవేరే వరకు గమ్యం చేరేవరకు ఆగని స్థిరచిత్తం కలిగినది. ఆమెలోని ఆత్మవిశ్వాసం, పతిభక్తి దేన్నైనా సాధించాలి అనే పట్టుదల భారతనారి సతీత్వానికి ప్రతినిధిగా నిలువగల ధీరోదాత్తత పాఠకులను ముగ్ధులను చేస్తాయి.సావిత్రిలో ధైర్యంగా తలఎత్తి,నిలిచి పరిస్థితులతో వీరోచితంగా పోరాడే వీరనారి కనిపిస్తుంది. సతీత్వానికి చెరగని చిహ్నామామె."[2]

సంప్రదాయ సాహిత్యంలో స్త్రీ వాద దృక్పథాన్ని పరిశోధించి వెలికి తీసిన శ్రీమతి కాత్యాయని సావిత్రిని గూర్చి "సావిత్రి తనకు కావలసిన వరుడిని నిర్ణయించు కోగలిగిన వివేకం కలిగిన స్త్రీయేగాని స్వతంత్రంగా ప్రవర్తించలేదు. వివాహ ప్రస్తావన తండ్రి తీసుకొని వచ్చినప్పుడు మాత్రమే ఆమె తన అభిప్రాయాన్ని చెప్పి 'యాతనికి నిమ్మనను బ్రీతి మెయిన్' అని పలికింది. ఆరకంగా తాను తండ్రి అదుపులో నున్న కన్యనన్న వివేకాన్ని ప్రదర్శించింది."భర్తృ శుశ్రూషణా పరత"తో భర్తకు అధీనురాలినని చెప్పకనే చెప్పింది.ఆ పతిభక్తి కారణంగానే తాను అధికురాలినయినానని అనుకుంటుందికూడా.మామూలుగా ఈ మాటలు, మాటతీరు అహంకార స్వభావాన్ని వ్యక్తంచేస్తాయి.ఆమె అహంకరించి మాట్లాడడాన్ని యముడు గుర్తించాడు కూడా."దాని ప్రగల్భ వచనంబులకు అద్భుతంబంది." ( అరణ్యపర్వం 7-223) న యముడు "తదుదార వాగ్భంగి" నీ మెచ్చాడు. సావిత్రి అహాన్ని 'ఉదార వాగ్భంగి'అని యముడు మెచ్చుకొన్నాడంటే ఆ అహం స్త్రీలకు ఆదర్శమైన అధీనతయొక్క పరాకాష్ఠ రూపం కావటం వల్లనే.సావిత్రి ఆలోచన, ప్రణాళిక, ప్రవర్తన, తర్కం, సంభాషణా చాతుర్యం అన్నీ 'పతిభక్తి' పరిధికి లోబడ్డవి కనుకనే సావిత్రి సామాజికామోద యోగ్య అయ్యింది.స్త్రీలకు ఆదర్శ నమూనా అయ్యింది. అట్టి స్త్రీలే తమను తాము సమర్థించుకొంటారు, భర్తని అత్తమామలను తల్లిదండ్రులను కూడ ఉద్ధరిస్తారని చెప్పే సావిత్రి కథ అధీనతా స్థితిలోని హీనతను గుర్తించకుండా చేయడంలో ప్రముఖపాత్ర వహిస్తుంది"[3] అంటారు.

---

1. మహా.భా.వి.వి.కో.పుట.376 2.ప్రా.తె.లి.మ.స్త్రీ.పుట.163
3.సం.సా.స్త్రీ.దృ.పుట.56

## 53 జనకుని భార్య

రాజర్షి, మహావేదాంతీ, నిష్కామయోగీ, అయిన జనకునికి అతని భార్య ఎంతో చక్కగా ధర్మోపదేశం చేయడమే గాకుండా అతని భిక్షావృత్తి పూనికను సహేతుకంగా విమర్శించ గల్గినదంటే ఆమె యోగ్యత, ఆమె పాండిత్యం, ఆమెకుండిన స్వాతంత్ర్యం ప్రశంసింపదగ్గవి. స్త్రీలలో అంతటి యోగ్యత గలవారి శాతం భారతంలో బహుతక్కువ.

## 54 సుకుమారి

బ్రహ్మమానస పుత్రుడై నిరంతరం హరినామస్మరణ చేస్తూ ఉండే నారదుడు కూడ మన్మధుని బారినుండి తప్పించుకొనలేక పోయినాడని సుకుమారి కథ తెలుపుతున్నది. శరీర సహజధర్మాన్ని తప్పించుకోవడం దేవతలకే కాదు. దేవర్షులకూ సాధ్యంకాదని యీ కథ నిరూపిస్తుంది.

పతివ్రతయై, భర్త కోతిముఖంతో ఉన్నా అసహ్యించుకోకుండా సేవలు చేసిన సుకుమారిని దేవలోకం గుర్తుకురాగానే వదిలివేసి నారదుడు తన దారిన తాను పోయాడు.కొన్ని సంవత్సరాలు కాపురం చేసిన భార్యను అవలీలగా వదిలివేయ గలిగాడు. కోర్కెల విజృంభణ తగ్గేవరకు శారీరకావసరాలు తీరేటంతవరకు, మాత్రమే అతనికి భార్యకావలసి వచ్చింది. అందుకు సుకుమారి బలిపశువయ్యింది.

ఆ తరువాత సుకుమారి వృత్తాంతమేమైనదో పాఠకులకు కవి తెలియ జేయలేదు.యావజ్జీవితం భరింపవలసిన భార్యను, ఏదోషం చేయనిదానిని కారణం లేకుండా అర్ధాంతరంగా వదిలివేస్తే ఇదేమని పిల్లనిచ్చిన మామకూడ ప్రశ్నింప లేదు.పైగా నారదుని వల్ల తనకు పుత్రసంతానవరం కోరుకొన్నాడు.

తాను వెళ్లడానికి నారదుడు మామ సృంజయుని అంగీకారం కోరుతాడే గాని భార్య అనుమతి కావాలని తలచడు. భర్తృవంచితులైన వారునేడేకాదు, ఆనాడూ ఉండేవారనడానికి సుకుమారి పాత్ర దృష్టాంతం.

## 55 పూజని

పగను గూర్చి సహేతుకంగా సవిస్తరంగా చర్చించి,పగవారిని నమ్మకూడదని సిద్ధాంతీకరించిన శారిక.

## 56 కపోతి

మనస్సును కరుణరసప్లావితం చేసే కపోతోపాఖ్యాన మందలి కపోతి

భర్తనువ్యాధుని కాతిథ్యమీయమని ప్రబోధించడం, భర్త ప్రాణత్యాగంతో పలవించిన పలుకులు, కపోతి ఆత్మత్యాగం -భారతీయుల దాంపత్య ధర్మంలోని మాధుర్యాన్ని, మహనీయతను త్యాగనిరతిని,అతిథి సేవాతత్పరతను అత్యంత మనోహరంగా సహృదయుల హృదయాలను ద్రవీభూతం చేసేంత గొప్పగా చిత్రించబడినాయి. కపోతి అనురాగవతి,భర్తృ ప్రియయైన భారతనారికి ప్రతీక.

## 57 చిరకారి తల్లి

ప్రత్యక్షంగా గాక కుమారుని పలుకుల ద్వారా మాతృత్వపు మహనీయతను తెలియజేసి, తనయుని హృదయంలో మాతృదేవతగా స్థానం సంపాదించుకొన్న ధన్యురాలైన తల్లి.

## 58 సులభ

జనకునితో ఆయనకు దీటుగా వేదాంత చర్చ చేయగలిగిన ఆధ్యాత్మజ్ఞాన సంపన్నురాలు. జనకుని ఆవేశించి, అతని యోగతత్వాన్ని పరీక్షింపగల్గిన అసాధారణ శక్తి వంతురాలైన యోగిని.భారతీయ స్త్రీ ఆధ్యాత్మిక జ్ఞాన సంపదకు సులభ నిదర్శనం.

## 59 భంగ్వాసని

పురుషుడు స్త్రీగా మారితే తిరిగి పురుషుడుగా మారడానికి ఇష్టపడదని నిరూపించిన విచిత్రమైన పాత్ర.

## 60 గౌతమి

తన పుత్రుని చంపిన పామును చంపుతానన్న కిరాతుని వలదని వారించి వేదాంతాన్ని బోధించిన కరుణామయి.

## 61 ఓఘవతి

అతిథి పూజను మించిన ధర్మంలేదని, అతడు కోరినదేదైనా సంకోచించక ఇచ్చి సంతృప్తి పరచమన్న భర్త ఆదేశాన్ని పాటించలేక , కాముకుడై తనను కోరిన అతిథికి తనను సమర్పించుకోలేక నలిగిపోయి, చివరకు భర్త చేయమన్నదే తన కర్తవ్యమని నిర్ణయించుకొని, తన పవిత్రతచే రక్షింపబడిన పతివ్రత. బొందితో స్వర్గానికి వెళ్లే యోగ్యతను భర్తకు కల్గించిన భర్తృ వాక్యపరాయణ.

## 62, 63 సత్యవతి,ఆమె తల్లి

గర్భం దాల్చడానికి సత్యవతి, ఆమె తల్లి వృక్ష సంబంధమైన 'చరువు'

లుపయోగించడం, వృక్షాలను కౌగిలించుకోవడం విశేషం.

## 64 ఉత్తరదిశ

ఒక పరమ నిష్ఠాగరిష్ఠుని బ్రహ్మచర్యాన్ని పరీక్షించడానికి హద్దు మీరిన శృంగార పరీక్షలు నిర్వహించింది.

"పితా రక్షతి కుమారే, భర్తా రక్షతి యౌవనే" అని మనువు చెప్పిన విధంగా స్త్రీలకు స్వాతంత్ర్యం లేకపోవడం అష్టావక్రుని కాలంలోనే ఉండేదని ఈ కథ తెలియజేస్తుంది.

## 65 పంచచూడ

స్త్రీలత్యంత కామాతురలనీ, అన్య పురుషాసక్తలనీ, సకల దోషాలకు మూలమని సాధారణీకరించిన దేవవేశ్య.

## 66 కుశికుని పత్ని

మహారాణియై ఉండి, భర్త అడుగుజాడలలో నడిచి పరమ శాంతమూ, సహనమూ కల్గి మునికి పాదసేవ చేసి, రథంలాగి ములుకోల దెబ్బలు తిన్న సహనశీలి, అతిథి సేవా పరాయణ. మహారాజ పత్నియైనా భర్త అడుగుజాడలలో నడిచి, నిద్రాహారాలు లేకుండా ఇరవై ఒక్క రోజులు రాత్రింబవళ్లు పాదసేవ చేయడమే గాకుండా అతడెక్కిన రథాన్ని లాగుతూ, అతని ములుగోలపోట్లకు శరీరమంతా రక్తసిక్తమై పోయినా, కిమ్మనకుండా భరించిన సహనమూర్తి.

## 67 లక్ష్మీదేవి

లోకమంతా తన అనుగ్రహం కోసం తపించినా, తాను గోవులలో ఉండగోరి వారి అనుగ్రహం కోసం తపించినది. గోమూత్ర పురీషాలలో నివసించడం తన పుణ్యంగా భావించినది.

## 68 రుక్మిణి

శ్రీకృష్ణుని అష్టమహిషులలో ప్రథమగణ్యయైనా దుర్వాసుని కోపాన్ని, క్రౌర్యాన్ని, మారుపలుకకుండా సహించిన సహనమూర్తి శ్రీకృష్ణ నిర్యాణంతరం అతనితో సహగమనం చేస్తుంది.

## 69 మృత్యుదేవత

మానవ సంహారం కోసమే సృష్టింపబడినా, ఆ క్రూరకార్యం తాను చేయ జాలనని విలపించి, వేడుకొని సంవత్సరాల తరబడి దుష్కరమైన వ్రతాలు, తపస్సు చేసీ, ఫలితం లేకపోగా బ్రహ్మ ప్రార్థనపై, అతని శాపానికి భయపడి తన కప్పగించ

బడిన క్రూరకార్యానికి గుండె రాయి చేసుకొని పూనుకొన్న సున్నిత హృదయ. మృత్యుదేవత హృదయం స్త్రీ సహజమైన కరుణ, ప్రేమలచే విహ్వలమైనది. శిరీష కుసుమ సదృశ కోమలమైనది.

## 70 భుజగాంగన

భర్త పై అనురాగం, భర్త దూరదేశగతుడై ఉండగా అతి జాగ్రత్తగా సంసార నిర్వహణ, భక్తి ప్రపత్తులతో అతిథి సేవ, పతివ్రతా ధర్మం రాశీ భూతమైన ఆదర్శ భారతనారి. అలసి వచ్చిన భర్తకీమె చేసిన సేవ, చెప్పిన స్వాగతము, సంలాప సౌందర్యము, అతిథి సేవకై భర్తను ప్రబోధించిన తీరు ఎంతో విశిష్టంగా మనోమోహకంగా ఉన్నాయి. కాంతాసమ్మితంగా ఆమె చేసిన ఉపదేశంతో భుజగుడు కర్తవ్యోన్ముఖుడై బ్రాహ్మణుని కలునుకోవడాని కుద్యుక్తుడవుతాడు.

**"నీ యట్టి భార్య గలుగుట;**
**దోయజ దళనయన యిట్లు దొలగతి దురితా**
**పాయంబున బొరయక యే ;**
**బోయెద నవ్విప్రు కోర్కి పూర్ణము సేయన్"** [1]

"నీ వంటి భార్య నాకు లభించడం వల్ల నేను పాపం పొందకుండా రక్షింపబడినా"నని భర్త చేత పొగడబడిన భుజగాంగన ధన్యురాలు.

## 71. సోమకుని నూర్గురు భార్యలు

విశిష్టమైన, పరిపూర్ణమైన మాతృత్వపు మమకారానికి ప్రతిబింబాలు. యజ్ఞ కుండంలో ప్రభవించిన జంతుని నూర్గురూ సమానంగా ప్రేమించడం, అతనికే కాస్త కీడు కల్గినా విలవిలలాడిపోవడం, యజ్ఞపశువుగా అతడు వధింపబడగా ఆడు గొఱ్ఱెలవలె ఆర్తనాదాలు చేయడం ఆ తల్లులందరి విలక్షణమైన మాతృత్వాన్ని వ్యక్తీకరిస్తాయి.

## 72 పులి తల్లి

చెప్పుడు మాటల ప్రభావంతో ఎంతో విశ్వసనీయుడైన ఆప్తమిత్రుని వధింపమని ఆజ్ఞాపించిన కుమారునికి సమయోచితమైన హితోపదేశం చేసి హితుడైన మంత్రిని కుటిలాత్ములు వంచనతో నాశనం చేయజూస్తారని, రాజు విశదంగా పరీక్షించిగాని నిర్ణయాలు తీసుకోకూడదని ఉపన్యసించిన మహారాజ నీతిజ్ఞురాలు.

---

1. భార.శాంతి.ఆ6.ప.590

## 73 శాండిలి

గృహిణీ ధర్మాన్ని ఆదర్శవంతంగా నిర్వహించిన స్త్రీకి ఇహపర సౌఖ్యాలు కరతలామలకాలవుతాయని నిరూపించిన ఉత్తమ ఇల్లాలు. గృహలక్ష్మి ఎట్లా మెలగవలెనో, ఏ పనులు చేయాలో, ఏవి చేయకూడదో అతి విశదంగా బోధిస్తుంది. ఇవన్నీ స్త్రీలకు సార్వకాలికాలైన ఆచరణీయ ధర్మాలు.

## 74 ఉమ (పార్వతి)

సుదీర్ఘమైన ఉమామహేశ్వర సంవాదంలో పార్వతి భర్తను ఎంతో వినయంతో ప్రశ్నించి, అతని ఉగ్రరూపము, శ్మశానవాసము, వర్ణాశ్రమ సమాచారం మొదలైన విషయాలే కాకుండా తపస్స్వరూపం, రాజత్వ మహిమాతశయం, ఆయుర్వృద్ధి క్షయాదులకు కారణాలు, మానస, వాచిక, కాయికాదులనే త్రివిధ పాపాలు, స్వప్నాదుల తీరు, దాన ఫల విశేషాలు, ధర్మవిశేషాలు, సాంఖ్య ప్రకారం, ఆత్మ సాయుజ్యప్రాప్తి సాధనాలు - మొదలైన ఎన్నో గహనమైన విషయాలు, ఆధ్యాత్మ సంబంధమైన విషయాలు విపులంగా తెలుసుకొంటుంది.

భర్తను తన ప్రవర్తనతో, వినయంతో అనుకూలతతో, అనురాగంతో ప్రసన్నచిత్తుడిని చేసుకోగల్గితే ఆ భార్య భర్త ప్రేమాదరాలను అపారంగా పొంద గల్గుతుందని, భర్త ఎంతటి గాఢమైన, గూఢమైన విషయాలనైనా ఆమె నుండి దాచక వివరిస్తాడని, అంతే గాక అటువంటి భార్యను భర్త అమితంగా గౌరవించి తనకూ, ఆమెకూ భేదం లేనట్లుగా భావిస్తాడని ఉమామహేశ్వర సంవాదం వల్ల విదితమవుతుంది.

"చతురవు వివేక విభవో
న్నత చిత్తవు వ్రత విధాన నైష్ఠికతాసం
యుత మతివి లౌకిక జ్ఞా
నితా మహిమ సహజమతి వనిందిత వరయన్ "[1]

"నీవు చతురురాలవు. వివేక వైభవం గల గొప్ప మనస్సు కలదానవు. వ్రత విధానాదుల పట్ల ఎంతో నిష్ఠ గలదానవు. లౌకిక జ్ఞానం గలదానవు. గౌరవనీయురాలవు" అని శివుడు పార్వతిని మెచ్చుకోవడమే కాకుండా స్త్రీ ధర్మాలను ఆమె వలన తెలుసుకోవాలనుకొంటాడు.

పార్వతి పేర్కొన్న సతీ ధర్మాలు నాడైనా, నేడైనా స్త్రీలు ఆచరింపదగినవి.

1. భార.అనుశా.ఆ5.ప.275

పతివ్రత, గృహిణి యైన స్త్రీ చేయవలసిన పనులు

"లలన యిలువాడి నాథుడు
వలచిన చవివంటకములు వండి యిడి తనుం
గలయ దలంచిన మెయికొని
యెలమిం గైసేసి హృదయ మీ వలయు శివా"

"భార్య మంచి నడత కల్గి, భర్త కిష్టమైన వంటలు ప్రేమతో వండి పెట్టాలి. భర్త తనను పొంద గోరితే మనోహరంగా అలంకరించుకొని హృదయ పూర్వకంగా తనను తాను సమర్పించుకోవాలి.

ధనవంతుడు, నిర్ధనుడు, కురూపి, రూపసి, రోగి,ఆరోగ్యవంతుడనుకొనక భర్తను ప్రియమార సేవించాలి. "భర్తే భార్యకు ఇహము, పరము-" పార్వతి పేర్కొన్న ఈ సమస్త ధర్మాలు స్త్రీ లోకానికి ఆచరణీయాలైన సార్వకాలీక ధర్మాలు.

పతివ్రతా ధర్మాలు, స్త్రీ ధర్మాలు, స్త్రీలు చేయకూడని పనులు ఎంతో విపులంగా పరమేశ్వరునికి విన్నవించిన పార్వతిని పరమ శివుడేగాక ఆ ప్రసంగం విన్న వారందరూ ముక్త కంఠంతో ప్రశంసిస్తారు.

తన మాటలలో ఏదైనా అనుచితమైనదైదే తన తప్పు మన్నింపమని, చాపల్యంతో అఖిలేశ్వరుడైన పరమేశ్వరునికి తాను చెప్పబూనటం దోషమని, పార్వతి తనను క్షమించమని అడగటం ఆ జగన్మాత వినయానికి మరింత శోభ గూర్చింది. మహనీయులకు వినయమే ఆభరణమని తెలియజేస్తుంది

## 75 దుస్సల

అన్నదమ్ముల పిల్లల మధ్య స్వంత అన్నాచెల్లెళ్లకుండే ప్రేమానుబంధాలే ఉంటాయని దుస్సలకూ, అర్జునునికీ జరిగిన సంభాషణ తెలియజేస్తుంది. కౌరవుల ఏకైక సోదరి దుస్సల నూరుగురు సోదరులను, తల్లి దండ్రులనే గాక భర్తనూ, కుమారునీ కోల్పోయిన దురదృష్టవంతురాలు.

యాగాశ్వం వెంట వచ్చిన అర్జునుడు సింధు రాజసైన్యాన్ని తుత్తునియలు జేసిన ఉదంతం విని దుస్సల తన మనుమనితో కలిసి వచ్చి అతడిని కాపాడమని వేడుకొంటూ "ఇతడు నీ అల్లుని కొడు"కని చూపడం, "నా అల్లుడేడి?" అనిఅర్జును డడగటం సహృదయ పాఠకుల మనస్సులను కలచివేస్తాయి. దుర్యోధన దుశ్శాసనుల దుర్మార్గాలు కానీ, భర్త సైంధవుడు ద్రౌపది పట్ల ప్రవర్తించిన అతి హేయమైన, పాప పంకిలమైన తీరు గాని ఆ అన్నా చెల్లెళ్ల అనురాగాన్ని మలినం చేయలేకపోయాయి.

"వచ్చి కన్నీళులు వదనంబు పై వెల్లిగొన రోదనంబు చేసిన నతండు
దయ నిలనిడియె గోదండ మప్పడతుక పౌత్రుని జూపి యిబ్బాలు గావు
మితడు మీ యల్లుని సుతుడన్న నప్పార్థుడిప్పుడునా యల్లుడెచటనున్నవాడని
యడిగిన ..........." [1]

".........శోకాక్రాంతుడై గాండీవి వదనంబు వాంచియుండ...."[2]

అర్జునుడు చెల్లెలిని అక్కున చేర్చుకొని ఓదార్చటం అతనికి చెల్లెలి పట్ల, ఆమెకు కల్గిన కష్టాల పట్ల కల సానుభూతిని, అతని భ్రాతృ ప్రేమను వ్యక్తం చేసే మనోహరమైన సన్నివేశం.

## 76 జాంబవతి

శ్రీకృష్ణుని అష్ట మహిషులలో ఒకతె. కృష్ణ నిర్యాణంతరం భర్తృ వియోగాన్ని తట్టుకోలేక రుక్మిణితో కలిసి సహగమనం చేసిన పతివ్రత.

## 77 సురభి

బలహీనమైన తన సంతానాన్ని (ఎద్దులను) కృషీవలులు పనులు చేయించుకొనేటప్పుడు బలంగల వాటి కంటే అవి వెనుక బడటం సహింపక ములుగోలలతో పొడిచి హింసించడం సహింపలేక కన్నీరు కార్చి, ఇంద్రునితో మొర పెట్టుకొన్న మాతృదేవత. తల్లులకు తమ సంతానంలో దుర్బలులపైనే ప్రేమ ఎక్కువని నిరూపించిన దయార్ద్ర హృదయ.

## 78. పౌష్యపత్ని

మహా పతివ్రత. అశుచులకు కన్పించనిది. భర్త తన పాతివ్రత్యాన్ని ప్రశంసించే అదృష్టం కల్గిన యిల్లాలు. గోమయ భక్షణం చేసిన ఉదంకునికి మొదట కన్పించక, ఆచమించి వెళ్లిన పిదపనే కన్పిస్తుంది.

## 79 ఇంద్రసేన

స్త్రీలలోని అతి కామ ప్రవృత్తికి దృష్టాంతమైన ఇంద్రసేన మహాపతివ్రత.భర్త కుష్ఠరోగి అయినా,అతని వ్రేలు తెగి అన్నంలో పడినా, అసహ్యించుకోక అతని ఉచ్ఛిష్టాన్ని ప్రియమారా భుజించి, అతని అనురాగానికి పాత్రురాలై వరంపొంది, యౌవనమూ, మనోహర రూపమూపొంది, అయిదు రూపాలలో తనను రమించమని వేడుకొన్న దుస్సహమైన కామప్రవృత్తిగల ఇంద్రసేన భర్త తన కోరికను

1. భార.అశ్వమేధ.ఆ4.ప.45 2.అదే.ప.46

మన్నించి ఎన్నోవేల సంవత్సరాలు తనతో భోగించినా తనివి తీరక మరుజన్మలో శివుని గూర్చి తపస్సు చేసి, అతని వల్ల అయిదుగురు భర్తలను వరంగా పొంది ద్రౌపదిగా జన్మిస్తుంది.

## 80 సుశోభన

తన సౌందర్యంతో ఎందరో రాజులను ఆకర్షిస్తూ, మధ్యలోనే అదృశ్యమవుతూ వారిని అమితవేదనకు గురి చేసిన మాయావిని యైన మండూక రాజ కుమార్తె.

## 81 లపిత

భర్త తన సవతిని,ఆమె పిల్లలను వారి ఆపదసమయంలో తలచుకొన్నా సహింపని అసూయాగ్రస్తురాలు.

## 82 అరుంధతి

మహాపతివ్రతయైన అరుంధతి బ్రహ్మర్షియైన భర్తను స్త్రీ విషయంలో అనుమానించిందని మందపాలుడు తన భార్యతో పేర్కొనడం వల్ల పతివ్రతలకైనా భర్తల విషయంలో పర స్త్రీలపట్ల అనుమానాలు సహజమని వెల్లడవుతుంది.

## 83 సత్యవంతుని తల్లి

రాజ్యసంపదతో బాటు నేత్ర సంపదను కోల్పోయి కుమారుని పైనే పంచప్రాణాలు పెట్టుకుని జీవిస్తున్న వృద్ధమాత.సత్యవంతుడు తన తల్లిని గురించిభార్య సావిత్రితో పల్కిన మాటలు ఆ తల్లికి కొడుకుపైగల ప్రేమతో బాటు అతనిపై ఆ వృద్ధదంపతులు పెట్టుకున్న ఆశలను కూడ సువ్యక్తం చేస్తున్నాయి.

"సంధ్య ప్రొద్దునన్ను జనని యెన్నడు నిలు
వెడల నీదు నేడు విపిన భూమి
మధ్యరాత్రి వేళ మసలుట కాయమ
యెట్టి పాటు వడునొ యే నెఱుంగ"[1]

"కౌగిట నను గదియించి శిరము మూర్కొంచును బాష్పముల్ గురియుచుండ
బట్టి మాయొడలును బ్రాణంబులును నెల్లయర్థముల్ నీవ మా యన్న నీవు
తేపగా సంసార తీరంబు సేరెదమని తలంచెదము సుమ్మన్న యన్న
కన్నులు లేని మాకు కన్నులు గాళులు నీవ కదన్న మా నిఖిల వంశ
మును సముద్ధరింపు మోపునీ యదియక

దన్న యనుచు నిట్టు లగ్గలంపు
ప్రేమననుదినంబు ప్రేముడింతురు వృద్ధు
లక్కటకట యేమి యైరొ నేడు" [2]

తమను సంసారతీరం చేరుస్తాడని,కళ్ళూ, కాళ్ళూ లేని తమకు సర్వం అతడు అని, వంశాన్ని ఉద్ధరించేభారం అతనిదే అని ఆ తల్లి పల్కిన మాటలు లోకంలోని వృద్ధులైన కన్న తల్లులందరి ప్రేమకూ,ఆశలకూ ప్రతిబింబాలు.లోకంలో చెడ్డ కొడుకులుంటారు గాని, చెడ్డ తల్లులుండరు. తల్లులందరూ సత్యవంతుని తల్లి లాగానే బిడ్డలపైనే ప్రాణాలు పెట్టుకొని అనుక్షణం వారికే కీడు మూడుతుందో అని తల్లడిల్లుతూ,దైవాన్ని ప్రార్థిస్తూ ఉంటారు.కాని, యీనాడు సత్యవంతునిలాంటి కుమారులు మాత్రం అరుదు.

## 84 అహల్య

ఉదంకుని గురువైన గౌతముని పత్ని. శిష్యవత్సల.గురువు గురుదక్షిణ కోరడానికి తిరస్కరిస్తే ఉదంకుడు గురపత్నిని ప్రార్థిస్తాడు.అహల్య మొదట తిరస్కరించినా, తరువాత మెత్తబడి తనకు మిత్ర సహాఖ్యుని భార్య కుండలాలు తెచ్చి ఇమ్మంటుంది. గౌతముడది తెలిసిఆ రాజు నరమాంస భక్షకుడైనాడని తెలుపగా అహల్య భయపడుతుంది.ఎంతో పశ్చాత్తాపం చెందుతుంది.ఉదంకునికే ఆపదా రాకూడదని,ఆ విధంగా చేయమని భర్తను వేడుకొంటుంది.మునిపత్ని అహల్యకు ఆభరణ ప్రియత్వం ఉండడం, అదీ వేరొక రాజు భార్యవి కోరడం విచిత్రం.

ఆదిపర్వంలో నన్నయ రచించిన ఉదంకోపాఖ్యానం, అశ్వమేధ పర్వంలోని ఉదంకోపాఖ్యానం కొంత వేరుగా ఉన్నాయి.నన్నయ కథలో ఉదంకుని గురుపత్ని పైలుని భార్య. పేరులేదు.కోరినది పౌష్యపత్ని కుండలాలు.అతడు నరమాంస భక్షకుడు కాదు.తిక్కన అశ్వమేధ పర్వంలోని ఉదంకుడు గౌతముని శిష్యుడు.తన కుమార్తె నతని కిచ్చి వివాహం చేస్తాడు.రెండు కథల లోనూ గురుపత్నులు కోరినది కుండలాలే.ఇద్దరూ అలంకారప్రియలే.

## 85. సుజాత

తపస్వులైన మునులు భార్యల ఆలనా-పాలనా పట్టించు కోరన్న విషయానికి సుజాత నిదర్శనం.నిండు గర్భిణి అయిన సుజాత ప్రసవానంతరం

కావలసిన ధాన్యాదులు గాని,వస్త్ర సముదాయంగాని లేనందున తీరని మనోవేదనకు గురి అవుతుంది.దుర్భర దారిద్ర్యాన్ని, ప్రసవానంతరం కలగబోయే ఇబ్బందులను ఊహించి, భయపడి కావలసిన వస్తువులను తెమ్మని, రాజు సహాయం కోరమని భర్తను ప్రార్థిస్తుంది.శిష్యులతో ఎప్పుడూ వేదపఠనం చేయించడం తప్ప,పూర్ణ గర్భిణి అయిన భార్యను గూర్చి ఆలోచనగాని,కాస్త కనికరంగాని లేని ఏకపాదుడామె భర్త.

## 86 మాధవి

భారతంలోని దురదృష్టవంతులైన స్త్రీలలో మాధవి కథ మరీ విచిత్రమైనది.అత్యంత దయనీయమైనది.ఎంతో కీర్తిమంతుడూ,గొప్పవాడైన యయాతిమహారాజు గాలవుడు తనను కోరిన గుఱ్ఱాలు తన వద్ద లేనందున వాటికి బదులుగా తన కుమార్తె నీయడం, పైగా ఆమెకోసమై ఏ రాజైనా వాటి నతని కీయగలడని చెప్పడం ఆ రోజుల్లో కన్నకూతురిని కూడ ఎలాంటి మమకారం లేకుండా 'దానం'ఇచ్చేవారని, అంతేగాకుండా ఒక వస్తువునుపయోగించుకొన్నట్లుగా, ధనాన్ని ఉపయోగించుకొన్నట్లుగా కుమార్తెను రాజులకిచ్చి పబ్బం గడుపుకొమ్మని కన్న తండ్రే చెప్పడ మన్నది కూడ అతి సాధారణ విషయమని తెలియజేస్తున్నది.

వివాహసమయంలో పెండ్లికుమార్తె వెంట వచ్చిన దాసీలు తమ యజమానురాలికి పరిచారికలే గాక ఆమె భర్తకు 'ఉపభోగ్య' వస్తువులన్న విషయం శర్మిష్ఠ కథలో వెల్లడయ్యింది.మాధవి కథలో స్త్రీల దౌర్భాగ్యం మరింత ఉచ్చస్థాయికి చేరుకొన్నది. కన్న తండ్రి, అందునా మహారాజు తన కుమార్తెను ఆ విధంగా ఇచ్చి వేయడమన్నది ఆనాటి సామాజిక పరిస్థితిని,సమాజంలో స్త్రీలదయనీయ స్థితిని అద్దంలో లాగ ప్రతిబింబిస్తున్నది. గరుత్మంతుడు గాలవునితో ఆమెను 'పుత్రార్థమై' తాత్కాలికంగా రాజులకిచ్చి బదులుగా గుఱ్ఱాలు పుచ్చుకోమని చెప్పడం, స్వయంగా మాధవే తననావిధంగా రాజులకు సమర్పించమని చెప్పడం, గాలవుడు ఆమెను ముగ్గురికా విధంగా' తార్చి' చివరకు గురు దక్షిణ క్రింద గురువుకూ తార్చడం ఎంతో హేయమైన విషయాలు.

పురుషులు స్త్రీలను తమకున్న ఆస్తిపాస్తులలో ఒక భాగంగా భావించే వారని, ఆమె కెలాంటి స్వాతంత్ర్యం గానీ,ఎదురు తిరిగే అవకాశంగానీ ఉండేవి కావని మాధవి కథవల్ల తెలుస్తున్నది.కన్న తండ్రే కూతురికావిధమైన దుర్దశ

కల్పించడమన్నది కంచే చేను మేసిన చందంగా, రక్షకుడే భక్షకుడైన తీరుగా కన్పిస్తున్నది. దౌర్భాగ్యురాలైన మాధవికి తనను తాను సమర్పించుకోవడం కంటె వేరు దారిలేదు. కాబట్టే గాలవుడు గురు దక్షిణ సమర్పించడం కోసం ఆమె తన శీలాన్ని పణంగా సమర్పించు కొన్నది. చివరకు విరాగిణియై తపస్సు చేసుకోవడం కోసం వెళ్లిపోవడంలో ఆమెకు జీవితం పట్ల,తనను స్వార్థపరులైన పురుషులు 'వాడుకోవటం' వల్ల ఎంత విరక్తి కల్గిందో వెల్లడవుతున్నది. ముగ్గురు రాజులూ, విశ్వామిత్రుడూ ఆమెను 'కాంట్రాక్టు' పద్ధతిలో ఉపయోగించుకొన్నారు. ఒక వస్తువును తాకట్టు పెట్టినట్లుగా గాలవుడామెను 'తాకట్టు'పెట్టి తన పని నెరవేర్చుకొన్నాడు. తాను గురుదక్షిణ చెల్లించినానని సంతృప్తి చెందిన ఆ పురుష పుంగవుడుతన గురుదక్షిణ కోసం అమాయకురాలైన ఒక కన్య జీవితంతో చెలగాట మాడినానని గాని, ఆమె జీవితానికి వివాహయోగ్యత అన్నది లేకుండా "కుక్కలు చింపిన విస్తరి"లాగా చేసానని గాని రవ్వంతైనా పశ్చాత్తాపపడలేదు.

"యయాతి మహారాజు ఈ విధంగా తన కుమార్తెను అద్దెకివ్వడం లాంటిది గాలవ ఋషి కథలో చెప్పబడింది.వెట్టిచాకిరీ అమలులో ఉన్న సమాజంలో ఆడదాన్ని కొనుక్కోవడం, అమ్మడం,దానంచేయడం చాలా సామాన్యమైన విషయాలు" అంటారు శ్రీమతి అనుపమా నిరంజనగారు తమ 'కల్యాణి' (మాధవి) గ్రంథంలో)( పుట 2)

"పురుషాధిక్య సమాజంలో తండ్రి స్వార్థానికి, ఆనాటివ్యవస్థకు బలైపోయిన విశిష్ట స్త్రీ మూర్తి మాధవి. తన స్వార్థం,కీర్తి ప్రతిష్ఠలముందు కుమార్తె భవిష్యత్తు ఏమిటని గుర్తుకు రాలేదా తండ్రికి.తను రాజు కనుక ఏమి చేసినా చెల్లిపోతుందని భావించి ఉంటాడు."[1] అంటారు శ్రీమతి శ్రీదేవి.

---

1.ప్రా.తె.కా.వి.స్త్రీ.పుట.81

# అధ్యాయం 4
# స్త్రీ పాత్రలు - భారతీయ సంస్కృతి

మానవజాతి ఆవిర్భావం నుండి వివిధపరిణామాలకు లోనవుతూ వచ్చింది.జంతు దశనుండి మానవునిగా మారటం, భాష, వ్యవసాయం, వస్తూత్పత్తి, సృజనాత్మకత, మతం, దైవం, తాత్విక చింతన - ఈసమస్త విషయాలతో అతని జీవితం ముడిపడిపోయింది. కుటుంబం మానవ సంఘంగా, చిన్న చిన్న రాజ్యాలుగా, విశాల సామ్రాజ్యంగా, రాష్ట్రంగా, దేశంగా వ్యాప్తి నొందుతూ వచ్చింది. వీటన్నిటి వల్లా మానవుని దైనందిన జీవితంలో, ఆచార వ్యవహారాలలో వేషభాషలలో చోటు చేసుకొన్న సమస్త పరిణామాలే సంస్కృతి. ఇది వస్తుగతం, భావగతం అని ద్వివిధంగా పేర్కొన వచ్చును.

వస్తూత్పత్తిలో, అర్థసంబంధమైన విధానంలో, వాణిజ్య వ్యాపార రంగాలలో, ఆహారవిహారాలలో, వస్త్రాలు, ఆయుధాలు, ఆభరణాలు, నిత్య జీవితావసరాలకు సమకూర్చుకొనడాని కవసరమయ్యే సాధనాలు మొదలైన వాని సృష్టిలో, వినియోగంలో జరిగిన పరిణామ పరంపర వస్తు సంస్కృతి. కాగా, ధర్మార్థ కామ మోక్షాలనే పురుషార్థాలపై ఆధారపడేది. భావ సంస్కృతి. ఇది నిరంతరం మార్పులకు లోనవుతూ ఉంటుంది. ఏ దేశంలోనైనా సంస్కృతి అన్నది జీవులు, దైవం, జనన మరణాలు, అరిషడ్వర్గాలు, పాపపుణ్యభీతి, జీవన మౌల్యాలు, ధర్మసంబంధమైన వివేచన పేరే సంస్కృతి.

సంస్కృతిని గూర్చి ప్రఖ్యాత చరిత్రకారులు, పరిశోధకులు, విమర్శకుల అభిప్రాయాలు తెలుసుకోదగినవి.

"అనాగరికత నుండి నాగరికతకు, అజ్ఞానం నుండి విజ్ఞానానికి, పశుప్రవృత్తి నుండి మానవతకు సాగే పరిణామం సంస్కృతీ చరిత్ర."[1]

"మతం, తత్త్వశాస్త్రం, సాహిత్యం, లలిత కళలు, సంస్కృతిని సూటిగా ప్రభావితం చేయగా ఆర్థిక, రాజకీయ పరిణామాలు, సామాజిక చట్టం, పరోక్ష నేపథ్యంగా ఉపకరించాయి."[2]

---

1.భారతీయసంస్కృతి పీఠిక 2.అదే.పుట.23

"సామాజిక ఆచరణలోని చరిత్ర, ఆర్థిక విధానం, రాజకీయ సామాజిక పార్శ్వాలు వస్తుగతమైనవీ, భౌతికమైనవి కాగా ఈ పునాది పై ఉద్భవించి, తిరిగి ఈ పునాదిని ప్రభావితం చేసే అంశాలు చాలా ఉన్నాయి. మత తాత్విక భావాలు విశ్వాసాలు, భాష, సాహిత్యం, నైతిక సూత్రాలు, కట్టు, బొట్టు, మాట, ఆట,పాట, ఇవన్నీ అలాంటివే........ ఈ మొత్తం జీవన విధానం వలన ఒక సంస్కారం అలవడుతుంది. దీనినే సంస్కృతి అంటాము. వ్యక్తిపరంగా సంస్కారం, సమాజ పరంగా సంస్కృతిగా రూపొందుతుంది. సమాజంలో శ్రేణులు,విభాగాలు హెచ్చినకొద్దీ, ఒకే సంస్కృతిలో అంతర్భాగంగా ఉపసంస్కృతులు, ఒకే సంస్కృతి గాక పలు సంస్కృతులు రూపొందుతాయి." [1]

"మానవ అవసరాలను, ప్రయోజనాలను,సంతృప్తిపరచే కార్యక్రమంలో కొత్తకొత్త భౌతిక అధ్యాత్మిక విలువలు సృష్టించబడుతుంటాయి. ఈ విలువలను సృష్టించేది, సంధానించేది, సంరక్షించేది ప్రజలు. ఆ క్రమంలో వాళ్ల మధ్య ఏర్పడే సాంఘికజీవన సంబంధాల అభివ్యక్తి రూపం సంస్కృతి. సమాజంలో అభివృద్ధి చెందే భావజాల సంబంధమైన నైతికమైన వాతావరణాన్ని సూచించే సున్నితమైన, సునిశితమైన సూచిక ఇది. దీనిని ఎప్పటికప్పుడు చర్చకు పెట్టి, విశ్లేషించి, విమర్శకు పెట్టటం ద్వారా మన సంస్కృతిలో ముందు తరాలకు తీసికొని పోవలసిన దేమిటో వదిలేయవలసినవి, సహకరించవలసినవేమిటో తెలిసికొన వీలవుతుంది.[2]

మహాభారతంలో ప్రతిబింబించిన సంస్కృతిని గూర్చి పలువురు పండితుల అభిప్రాయాలు -

"భారతీయుల భావనలకును, జీవితములకును మహాభారతము ఒక నిజమైన విశ్వ విజ్ఞాన కోశము. కావుననే భారతములో గనబడని మానవభావననా విషయములే మానవునియందును గనబడవు. అటులనే భారతమున లేని పరిస్థితులు మానవునకు జగత్తున కనపడవు." [3]

"మహాభారతము ఒక హిందూ సభ్యతా సంస్కృతుల విశాల బృహత్కోశము"[4]

"రామాయణ భారతములు మన జాతీయేతిహాసములు. భారతీయ సభ్యతయొక్క భవ్యరూపమందు గోచరమైనట్లు మరెచ్చటను కనపడదు. భారతదేశము కేవలం పాండవుల యితిహాసమును మాత్రము చెప్పుగ్రంథము

---

1.స్త్రీపురుష సమానతాసంస్కృతి.పుట.3. 2.అదే పుట. 23

3Cultural History of India Page 47. 4. మహాభారతమీమాంస Page 3

కాదు. అదిమనహిందూధర్మముయొక్క విస్తృతమైన, సంపూర్ణమైనచిత్రణముకూడ"[1]

"భారతమొక ఆశ్చర్యదాయకమైన మానవ శాస్త్ర గ్రంథము. ప్రపంచంలోని సర్వ మానవ ప్రవర్తనను, పాత్రలను కరవులలో పోసి,పోగారుతనము వెలార్చి, మనకు శాశ్వతముగ నందించిపోయిన మహాశిల్పి వ్యాసమహర్షి. మానవ ప్రవర్తన విషయమై ఇది కలదు,అది లేదు అను మాట పుట్టుటకు వీలులేని పట్టు మహాభారతము. ఈ పాత్రలలో చిన్న పాత్ర,పెద్దపాత్ర అన్న పాక్షిక దృష్టి కన్పించదు. శిష్ట పాత్ర దుష్టపాత్ర అన్న భేదము బుద్ధికి సోకదు. అన్ని పాత్రలును అవసరమును బట్టి స్వయంభువులై జీవన క్షేత్రమున మొలిచినట్లు కన్పించును"[2]

" విశ్వసాహితిలో మహాభారతము వలె మాననవ స్వభావమును మథించి వివిధ రీతుల విస్తృతముగా చిత్రించిన మహాకావ్యమింకొకటి లేదు. అట్లే ధర్మ తత్త్వమును, వివిధ ధర్మములను ఇంత సమగ్రముగ దర్శించి, ఇంత సరసముగా మానవ జీవితమున కన్వయించి ప్రబోధించిన మహాగ్రంథము గూడ మరొకటి లేదు. ఒకవిధమున మహాభారతము మానవుని విశ్వరూప ప్రదర్శనము. "[3]

"వేదంలాగా భారతం కూడా అముష్మికమైన ధర్మమోక్షాలనే నిరూపిస్తుంది. మహాభారతమామూలచూడంగా తడవిచూచిన ప్రతిపాఠకుడికీ చక్కగా హృదయగమనమయ్యే సత్యమిది. కథాభాగం వదిలేస్తే- ఇక ఎక్కడ ఏమూల దృష్టిసారించినా ఇటు ధర్మమో- మోక్షమో - ఈ రెండు విషయాలను గూర్చే విచారణ. లోకోత్తరమైన ఈ రెండింటి విజ్ఞానాన్ని మనకందివ్వటమే అసలు భారతం తాలుకు ప్రధానాశయం. పోతే దాని చుట్టూ అల్లుకుంటూ వచ్చిన ఒకానొక కవచమే కథావస్తువంతా. ముందు చెప్పినట్లిది లౌకికమైన అర్థకామాలను మాత్రమే ఆశ్రయించి నడుస్తుంది. బాహ్యమైన కథావస్తువిలా అర్థకామాత్మకంగా సాగుతుంటే అంతర్వాహినిగా ధర్మమోక్షాలతాలూకు విజ్ఞానం ప్రవహిస్తూ పోతుంది."[4]

"భారతీయ వాఙ్మయమునందు స్మరణ దర్శన లేఖన పఠనపాఠనాదులచే బురుషార్థము నర్థులకొసగునది. మహాభారతమని యార్యులు నుడువుదురు. రామాయణ మహాభారత గాథ లాసేతు హిమాచలము పెక్కు విధముల నాబాల గోపాలము గానము చేయగల సర్వసంపత్తి గలవైయున్నవి. "[5]

" భారతము పంచమవేదము. ధర్మార్థ కామమోక్షములకు సమగ్రమైన

1.మ.భా.వి.వి.కో.ప్రశంస 2.అదే. 3.సజీవశాల్పాలు పీఠిక
4.మ.భా.వై.పుట.5. 5.మ.భా. చ. పీఠిక

ప్రమాణ గ్రంథము కావుననే మానవకోటికిది యొక విజ్ఞాన సర్వస్వము. ....ఇందలి కథ పాత్రలు,దేశము, కాలము, సమస్యలు మున్నగునవన్నియు సార్వకాలిక సార్వజనీన లక్షణ యుక్తము. లగుటచే శాశ్వతత్త్వము సంతరించుకొన్నవి." [1]

ఇవి మహాభారతాన్ని గూర్చి కొందరు పరిశీలకుల అభిప్రాయాలు మాత్రమే. మొత్తమ్మీద మహాభారతం ప్రాచీన భారతీయ సంస్కృతికి దర్పణమన్నది ఏకాభిప్రాయం.

అటువంటి మహాభారతం లోని స్త్రీపురుష పాత్రలనుగూర్చి పరిశోధకుల అభిప్రాయాలు.

"మహాభారతపాత్రలు నిత్యము లోకములో మనకగుపించేవ్యక్తులు. మహాభారత సన్నివేశములు. మానవజీవిత సహజభాగములు. ప్రాంతీయ పరిధులుగాని, జాతిమత వివక్షలుగాని, కనీసము క్రొత్తపాత్రలు గాని యీ గ్రంథమునకు పట్టవు. నేలమీద మానవుడున్నంత కాలము ఇది నిత్యనూతనము. మహాభారతపాత్రలు సహజ సుందరములు. వాస్తవికతా మనోహరములు మనలోని పుత్రమమకారము, అసూయాగ్రస్త మనస్తత్వము, స్వాతిశయ పరాయణత్వము, ప్రగల్భ వక్తృత్వము, కర్మకుశలత్వము, ధర్మప్రియత్వము మొదలగు అనేక గుణములు ఆ పాత్రలలో అగుపించును"

"ఆ వ్యక్తులు మనవలె, మనవారివలె మనమధ్యమసలుచున్నట్లు, మనతో మాట్లాడుచున్నట్లు,అగుపింతురు. మన మనస్సు నాకర్షింతురు. మహాభారత పాత్రలు సజీవ శిల్పాలు. వ్యాసమహర్షి వానిని అద్భుతముగా తీర్చిదిద్దినాడు. మరపురాని మనోహర మూర్తులుగా మన కన్నులముందు నిలిపినాడు" [2]

"భారతంలోని స్త్రీత్వ మాహాత్మ్యము శ్రద్ధాసక్తులతో పరిశోధింపతగినది." [3]

" స్త్రీల గురించి మహాభారతంలో ఉన్నదంతా వివరిస్తే అది ఉద్గ్రంథమే అవుతుంది. మహాభారతంలోని కొన్ని భాగాలు యితరులు వ్రాసినవి చోటు చేసుకొన్నాయి. ముఖ్యంగా అవి సంభాషణా రూపంలో ఉన్నాయి. కొంతమంది ఆ భాగాలను ఉదహరిస్తూ మహాభారత కాలంలో స్త్రీల స్థానం ఘోరంగా ఉన్నదని చెప్పవచ్చును.కాని అలా చెప్పడం వాస్తవాన్ని చెప్పడంకాదు.మహాభారతం లోని ప్రధానకథను పరిశీలించినప్పుడు మహాభారతాన్ని మొత్తంమీద పరిగణలోనికి తీసుకున్నప్పుడు స్త్రీపట్ల భారతీయుల సమగ్ర దృక్పథం స్పష్టమవుతుంది." [4]

---

1.మహాభారతము-మహిళ-పీఠిక 2.సజీవ శిల్పాలు.పీఠిక

3,4మహాభారతకాలంనాటి స్త్రీ పుట.34

కేవలం భారతంలోని స్త్రీపాత్రలను పరిశీలనా దృక్పథంతో అధ్యయనం చేయగా, ఆ నాటి స్త్రీల కుటుంబ, ధార్మిక, సాంఘిక, రాజకీయజీవితాలు ఏ విధంగా ప్రతి బింబించినాయో పరిశోధించగా, స్త్రీల వైయక్తిక జీవితం ఏ యే విషయాలను బహిర్గతం చేస్తున్నదో క్రోడీకరించగా, తేలిన అంశాల నీ క్రింది విధంగా పేర్కొన వచ్చును.

1 భారత కాలంనాటి స్త్రీలలో దైవభక్తి విక్కువ.పాతివ్రత్యమే పరమావధిగా జీవించేవారు.అతిథి బ్రహ్మణ సేవలను భక్తిశ్రద్ధలతో చేసేవారు. కుంతి కన్యగా ఉన్నప్పుడు నిరంతరం అతిథిసేవా వ్రతశీలయని తండ్రి పేర్కొంటాడు. పాండురాజుతో కలసి అరణ్యవాసం చేసినప్పుడు, ఏకచక్రపురంలోనూ,ధర్మరాజు రాజైనతర్వాతకూడ,నిరంతర పుణ్యవ్రతాలతోనూ,బ్రాహ్మణ సేవలోనూ గడిపింది. అంబ, దమయంతి, సావిత్రి - వీళ్లంతా తమ లక్ష్యసాధనకై కఠోర నియమాలతో పుణ్యవ్రతాలు చేశారు.

2 కన్యాశుల్కం నాడు ఆచారం దాశరాజు సత్యవతిని శంతనుడికియడానికి ఆమె కుమారుణ్ణే రాజుగా చేయమని కన్యాశుల్కంగా కోరతాడు.ద్రౌపది, సుభద్ర, ఉత్తరల వివాహ సమయంలో అధిక(వేల) సంఖ్యలో రథాలు, ఏనుగులు, అశ్వాలు, ఆభరణాలు,దాసదాసీజనం కానుకలుగా యివ్వబడినాయి.అర్జునుడు చిత్రాంగదను వివాహమాడగోరగా ఆమె తండ్రి మణిపుర మహారాజు ఆమెకు పుట్టబోయే శిశువును తమ వంశానికి వారసుడిగా యివ్వమని కన్యాశుల్కంగా కోరుతాడు.

3 బహుభార్యాత్వం నాటి సంస్కృతిలో సర్వసాధారణమైన సాంఘిక దురాచారం. రాజులందరికీ ఎందరో భార్యలుండేవారు.

4 బహుభార్యాత్వం భారతంలో పేర్కొనబడినా పాండవులకాలంనాటికది దాదాపుగా అంతరించిపోయింది. ద్రౌపదిని పాండవులకిచ్చి వివాహం చేయడానికి సంకోచించిన ద్రుపదునికి వ్యాసుడు బహుభర్తృకలైన జటిలముని కుమార్తె, అజిత మొదలైనవారి ఉదాహరణలనిస్తాడు. పాండవులు బహుభార్యాత్వాన్నీ, బహుభర్తృత్వాన్నీ, ఆచరించారు.

5 నియోగపద్ధతి, దేవరన్యాయం నాటి సామాజికన్యాయాలు. భర్త మరణిస్తే బావనో, మరిదినో భర్తగా స్వీకరించడం దేవరన్యాయం.సంతానం లేకపోతే బావ, మరిది, సన్నిహిత బంధువులు లేక యితరుల ద్వారానైనా సరే సంతానం పొందటం నియోగ పద్ధతి. తన ప్రథమ పుత్రుడైన వ్యాసుని ద్వారా సంతానం పొందమని సత్యవతి తన కోడళ్లు అంబిక, అంబాలికలను నియోగిస్తుంది.పాండురాజు కోరికపైనే

నియోగ పద్ధతిలో కుంతీమాద్రులకు ధర్మానిలశక్రాశ్వినుల ద్వారా పాండవులు జన్మించారు. బలి భార్య సుదేష్ణ, కల్మాషపాదుని భార్య మదయంతి, శారదండాయని భార్య శ్రుతసేన భర్తల ఆజ్ఞతోనే బ్రాహ్మణుల వలన నియోగపద్ధతిలో సంతానం పొందారు.

6 సంతానం ద్వారా వంశవృద్ధినాటి సాంస్కృతిక భావన. దానికి ప్రతినిధులే సత్యవతి, ఉత్తర.

7 భర్తలేకపోతే సంసారాన్ని, సంతానాన్ని చూసుకోవలసిన బాధ్యత స్త్రీలపైనే ఉండేది. కుంతి ఆ బాధ్యతానిర్వహణ కోసమే బ్రతికింది.

8 భర్తలననుసరించి భార్యలు జీవించేవారు. ఈ ధర్మాన్ని భారతంలోని ఎందరో స్త్రీల ద్వారా వ్యాసుడు చెప్పించినాడు. భార్య భర్తకు విధేయురాలైన, ఇష్టురాలైన సేవకురాలిగా ఉండేది. అతిథిఅభ్యాగతులు, బంధుమిత్రులు మొదలైన వారి స్వాగత సత్కారాలు, ఆదరణ, పశుపోషణ, దానదాసీజన పర్యవేక్షణ, వారి జీతభత్యాల నిర్వహణ, కోశాగార భాండాగార పర్యవేక్షణా నిర్వహణలు, వంటావార్పు, అందరి భోజనాదులు, గృహంలోని సమస్త కార్య నిర్వహణాభారం గృహిణిమీదే ఉండేది. స్వయంగా ద్రౌపది యీ విషయాలన్నీ సత్యభామతో చెబుతుంది. ఉమామహేశ్వర సంవాదంలో పార్వతి ద్వారా, కైకేయీ శాండిలీ సంవాదంలో శాండిలి ద్వారా, పద్మడనే భుజగుని భార్యద్వారా కూడాఈ విషయాలు చెప్పబడ్డాయి.

9 భర్తను వశపరచుకోవడం కోసం మందులూ, మాకులూ వాడటం ఆ రోజులలో ఉండేదనిసత్యాద్రౌపదీ సంవాదం ద్వారా తెలుస్తున్నది.

10 వివాహమే లేకుండా స్వేచ్ఛగా పురుషునికి తన కోరికను తెలియజేసి, తీర్చుకొని పుత్రవతులైన స్త్రీలకు కూడ నాడు సంఘంలో గౌరవ మర్యాదల కెటువంటి లోటులేదు. వారు భార్యస్థానంలో గౌరవింపబడేవారు. ఉలూచి ఆవిధంగా అర్జునుని ద్వారా ఇలావంతుడనే పుత్రుని పొందుతుంది. హిడింబ భీముని ద్వారా ఘటోత్కచుణ్ణి, శర్మిష్ఠ యయాతి ద్వారా ముగ్గురు పుత్రులను పొందుతుంది.

11 అతిథిని సంతృప్తి పరచడంకోసం గృహస్థు తన భార్యను సంతోషంగా సమర్పించేవాడు.సుదర్శనుడు తన భార్య ఓఘవతిని ఆ విధంగా చేయమని కోరతాడు. ఉచథ్యుడనే మునిపత్ని మమతను, గర్భవతిని అభ్యాగతుడుగా వచ్చిన బృహస్పతి పొందగోరుతాడు.

12 యజ్ఞాది కర్మలు నాడు బ్రాహ్మణులచేత, రాజుల చేత విరివిగా చేయించబడేవి.యజ్ఞాలలో స్త్రీలచేత జుగుప్సాకరమైన కార్యాలు చేయించేవారు.

"ప్రాచీన కాలమున మతమన యజ్ఞాది కర్మములే. వానిలో అశ్వమేధ యాగము ప్రధానమైనది. భారతకాలమున స్త్రీలకు నియమాభావము యజ్ఞములలోనే ప్రధానత నొంది యున్నది. ప్రతియిష్టికిని 'అగ్నీధ్రుడు'చేయు'పత్నీ సన్నహన' కార్యము, జ్యోతిష్టోమమున 'నేష్ట' చేయు' పత్నీ సమార్జనకర్మము మొదలగునవి స్త్రీకి ఏకపత్నీత్వాభావమునే సూచించును. స్త్రీని సోముడు, గంధర్వుడు, అగ్నియను దేవతలు వరించిన పిమ్మటను మనుష్యులు వరింతురు.అను నంశము కూడ స్త్రీలనేక పతులు గలవారను నంశమునే దృఢపరుచు చున్నది. 'అగ్నీధ్ర' 'నేష్టా' దుల కర్మములు బాహ్యముగనో, ఆంతరంగికముగనో స్త్రీయొక్క ఏకపత్నీత్వ ధర్మమును కళంకిత మొనర్చుచున్నవి. ఈ యజ్ఞకర్మములన్నిటి కంటె 'అశ్వమేధము' న జేయు సోమిదమ్మ యొక్క యశ్వసేవ మరియు నసహ్యకరమై యుండును. ఆమె ఋత్విక్కులు మంత్రములు చదువుతుండగా, భర్త చూచుచుండగా భర్తతో వ్యవహరించినట్లె ఆ అశ్వముతో వ్యవహరింప వలెను.ఆ రాత్రియంతయు మృతాశ్వముతోనే శయనింపవలెను. 'అధ్వర్యుడు' 'సుభగే కాంపిల వాసిని' యను మంత్రమును చదువుచు పట్టుబట్టతో రాణిని, గుజ్ఞమును గప్పును."[1]

"ఇంతమాత్రమేకాదు, యజమానుడు తన భార్యల నల్వురను ఋత్విక్కులకు దానమీయ వలయును.ఆ యంశము ఇట్లు చెప్పబడినది. పట్టపు రాణిని బ్రహ్మయను ఋత్విక్కునకును, ఉపేక్షింపబడిన రెండవ భార్యను 'హోత' యను ఋత్విక్కునకును,రాజుయొక్క భోగకన్యను 'ఉద్గాత' యను ఋత్విక్కునకును రాజులకు పాత్రాదులనొసగు స్త్రీని 'అధ్వర్యుడు' అను ఋత్విక్కునకును, దానమీయవలయును. ఆ ఋత్విక్కులు ఆ స్త్రీలను భర్తలవలె హస్తములను గ్రహించిన పిమ్మట రాజు తగిన ధనమిచ్చి ఋత్విక్కులనుండి ఆ స్త్రీలను పుచ్చుకొనును. ఈ అశ్వసేవాది నికృష్టకార్యముల జూచియే జనమేజయుడు నేడు మొదలెవరును అశ్వమేధయాగము జేయరాదనినాడు. ఇది మత సంఘధర్మములలో గొప్పదగు మార్పేయగును.పిమ్మట స్మృతికర్తలు కలియుగమున నశ్వమేధము కూడదని శాసించిరి." [2]

13 శ్వేతకేతువు నాటిదాకా స్త్రీలకు వివాహ నియమమేలేదు. అతడే ఒక స్త్రీ

---

1.మహా.భా.వి.వి.కో.పుట.247 2 మ.భా.చ.వు.247

ఒక పురుషునికే లోబడి యుండవలెనని, అట్లే ఒక పురుషుడు ఇతరుల భార్యలను బలాత్కరించ కూడదని కట్టడి చేసినాడు. తాను, తన తండ్రి యెదురుగా ఉండగానే తన తల్లిని బలాత్కరించి, సంతానం పొందడంకోసం బ్రాహ్మణుడొకడు చేయి పట్టుకొనితీసుకొని పోతుండగా కోపించిన శ్వేతకేతువును తండ్రి "నాయనా, కోపించకు. ఇది సనాతన ధర్మము. గోవుల వలె స్త్రీలు 'అనావృత'లై (ఒక పురుషుననికే లోబడినవారై) యుందురు." [1] అన్నాడు.

ఋతుస్నాతయైన స్త్రీ యెవతె యైనను పురుషుడు చేరి మంచిమాటల చేతగాని, ధరవస్త్రాదులనిచ్చిగాని యామెను గూడి సంతతిని గనవచ్చును. అట్లా స్త్రీ అంగీకరించనిచో ఆమెను బలాత్కరించియు, రజ్జువుతో గాని, దండముతో గాని కొట్టియు ఆ స్త్రీని లోబరచుకొని యామెను గూడవచ్చునను నియమము బృహదారణ్యకోపనిషత్తు యొక్క ఎనిమిదవ యధ్యాయమున నాల్గవ బ్రాహ్మణమున 'కుమారహారీతు' లను ఋషులచే పేర్కొనబడినవి." [2]

14 అతిస్వల్ప కారణానికే నాడు భర్తలు భార్యలను వదలివేసేవారని జరత్కారువు ఉదంతం తెలియజేస్తుండగా కారణం లేకుండానే పురుషులు భార్యలను వదలివేసేవారని అగ్ని, నారదుల వృత్తాంతాలు తెలియజేస్తున్నాయి. నిద్రిస్తున్న తనను లేపినందుకు జరత్కారువు, భార్యపై 'మోజు' తీరిపోవడంతో అగ్ని, నారదుడు భార్యలను వదలివేస్తారు.

15 స్త్రీలు తామే వివాహప్రస్తావన చేయడంకూడ భారతంలో సకృత్తుగా కనబడే అంశం. దేవయాని యయాతిని తనను భార్యగా స్వీకరించమని ప్రస్తావించడం ఇందుకు ఉదాహరణ.

16 అల్లుని పూజించే ఆచారం ఆనాటికే ఉంది.శుక్రుడు తన కుమార్తె దేవయానిని యయాతికిచ్చి వివాహం చేసి, అతనిని పూజిస్తాడు.[3]

17 స్త్రీలకు అలంకార ప్రియత్వం, ఆభరణధారణపై మోజు భారతకాలంలోనే ఉండేవి. ముని పత్నులు కూడ ఆభరణ ప్రియలే.అంతేకాదు " శుచిస్నాతలై, నూతన వస్త్ర పరిధానశోభితలై బ్రాహ్మణులను పూజించి, ఉత్సవం (పేరంటం) చేసి, నూతన ఆభరణాలు ధరించేవారని ఉదంకుని గురుపత్ని ఉదంతం తెలియజేస్తోంది.[4] సప్తర్షులు యజ్ఞం చేస్తూండగా వారి భార్యలు చక్కగా అలంకరించుకొని అగ్ని కార్యంలో భర్తలకు సహకరిస్తారు.

---

1.భార.ఆది.అ3.ప.169 2.మ.భా.చ.పు.247

3.భా.ఆది.అ3.ప.169 4.భార.ఆది.అ1.ప.115

18 నాడు బ్రాహ్మణులు,రాజులు విద్యాధ్యయనం చేయాలంటే గురుకులంలో గురుశుశ్రూష చేయడమే గాక, గురుపత్ని ఆజ్ఞలుకూడ పాటించేవారు. వంటకట్టెలు తేవడం మొదలైన గృహకృత్యాలు చేస్తూ గురుపత్నులకు సహాయ పడేవారు.ఉదా. ఉదంకుని వృత్తాంతం.

19 పందేలు ఒడ్డడమన్నది మగవారిలోనే గాక స్త్రీలలోనూ ఉండేది. కద్రూవినతలు అక్కాచెల్లెళ్లు. సవతులు. సముద్రతీరంలో విహరిస్తూన్న ఉచ్చైశ్రవం తోక నల్లగా ఉందని కద్రువ, తెల్లగా ఉందని వినత వాదించుకొని, పందెం వేసు కొంటారు. గెలిచిన వాళ్లు ఓడినవాళ్లను దాసిగా స్వీకరించడమన్నది వీళ్ల పందెం.

20 మాతృస్వామ్యవ్యవస్థ భారతకాలంలో కూడా కొనసాగుతూ ఉండేదన డానికి కూడ కద్రూవినతల చరిత్ర ఆధారం. ఉచ్చైశ్రవం వాలాన్ని నల్లగా చేయమన్న కద్రువ ఆజ్ఞను అధర్మమని జంకి మాత్రమే పుత్రులు పాటించరు.కాని కర్కోటకుడనే వాడు తల్లి ఆజ్ఞను శిరసావహిస్తాడు. వినత పుత్రుడు గరుత్మంతుడు మహాబలవంతుడై ఉండి కూడ తల్లి ఆజ్ఞ ప్రకారం తల్లితో బాటు పెదతల్లికీ, ఆమె పుత్రులకూ దాస్యం చేస్తాడు.సత్యవతి, కుంతి మాతృస్వామ్యంలో స్త్రీలు బిడ్డల నెంత యోగ్యులుగా తీర్చి దిద్దగలరో, కుటుంబ నిర్వహణ ఎంత చక్కగా చేయగలరో నిరూపిస్తారు.

21 నాటి స్త్రీలు వివాహితలు, అవివాహితలు నోములు నోచుకొనేవారు. తాను 'కొరనోములు' నోచినందుననే పతిచేత పరిత్యజింపబడినానని శకుంతల వగచడం ఇందుకు తార్కాణం. దమయంతి సుబాహుని అంతఃపురంలో సైరంధ్రిగా ఉంటూ నోములూ, వ్రతాలూ అభీష్టసిద్ధికోసం చేస్తూఉంటుంది.

22 స్త్రీలుకూడ ఓడనడిపేవారని సత్యవతి వృత్తాంతాన్ని బట్టి తెలుస్తున్నది. రథం నడిపే విద్య సుభద్రకూ, సత్యభామకూ వచ్చును.

23 వివాహితయైన రాజకుమార్తెతో బాటు పుట్టింటి నుండి అరణంగా వచ్చిన వందలు, వేలాది మంది దాసీలమీద ఆమె భర్తకు సర్వహక్కులూ ఉంటాయి. ఈ దాసీలజీవితం ఎంతో దయనీయం, హీనం, దీనం, నికృష్టం. వాళ్లకు వ్యక్తిగతమైన కోరికలుగాని, స్వేచ్ఛగాని, జీవితంగాని, కుటుంబజీవన సౌఖ్యం, గృహిణీత్వం - సామాన్య స్త్రీలకు లభ్యమైన ఈ అతిసాధారణ విషయాలలో ఏ ఒక్కటిగాని ఉండేవికావు.యజమానురాలి భర్త చిత్తప్రకారం వారి జీవితాలు నడవవలసిందే. దేవయాని యయాతితో తనతో బాటు తన కన్యకాసహస్ర

దాసీజనాన్ని పరిగ్రహించి దేవేంద్ర సమానమైన భోగాలనుభవించమని చెబుతుంది. శర్మిష్ఠ కూడ ఆ దేవయాని నతడు పరిగ్రహించినపుడే తామందరమతని సొత్తైనామని, కాబట్టి తనకు 'ఋతుకాలోచితం' ప్రసాదించమని నిస్సంకోచంగా అడుగుతుంది.

24 అబద్ధమాడటంలో తప్పులేదని పెద్దలు చెప్పారని శర్మిష్ఠ యయాతితో చెప్పిన అయిదు సందర్భాలలో 'వధూజన సంగమ' మొకటి.

"చను బొంకగ బ్రాణాత్యయ
మున సర్వధనాప హరణమున వధగావ
చ్చిన విప్రార్థమున వధూ
జన సంగమమున వివాహ సమయములందున్"[1]

దీనిని బట్టి ఏ స్త్రీసాంగత్యమైనా నాటి పురుషులకవలీలగా ప్రాప్త మయ్యేదని, స్త్రీల విషయంలో యుక్తాయుక్త, ధర్మాధర్మ, పాపపుణ్య విచక్షణ లుండేవికావని తెలుస్తున్నది.

అబద్ధ మాడటానికి చెప్పబడిన పై అయిదు సందర్భాలు నాటినుండి నేటి దాకా పాటింపబడుతూనే ఉన్నాయి.

25 వృద్ధవివాహాలు ఆ రోజుల్లో సర్వసాధారణం. యుక్త వయస్సు వచ్చిన కొడుకులున్నా,తండ్రులు వివాహాలు చేసుకొనేవారు. కొన్ని సందర్భాలలో కొడుకులే తండ్రుల వివాహాలకై ప్రయత్నాలు చేసి జరిపించేవారు. దేవవ్రతుడు (భీష్ముడు) సత్యవతిని తన తండ్రికిచ్చి వివాహం చేయమని తానే దాశరాజును అడుగుతాడు. వేలకొద్దీ సంవత్సరాలు తపస్సు చేసిన చ్యవనుడు బాల్యమింకా వీడని సుకన్యను వివాహమాడతాడు.వయోవృద్ధుడైన దీర్ఘతముడు అతి పిన్న వయస్కురాలైన ప్రద్వేషిణిని వివాహమాడతాడు.

26 గర్భవతులకు నేడు జరిపే శ్రీమంతం మొదలైన గర్భసంస్కారాలు భారత కాలంలో జరపబడేవి.శకుంతల గర్భవతి అన్న విషయం తెలుసుకొని కణ్వుడామెకు గర్భ సంస్కారం నిర్వహిస్తాడు.భరతుడు పుట్టిన తర్వాత జాత కర్మాది క్రియాకలాపాలు నిర్వహిస్తాడు.కుంతి పాండవులను ప్రసవించిన తర్వాత శతశృంగంలోని మునులే జాతకర్మాది క్రియాకలాపాలు నిర్వహిస్తారు.

27 పెళ్లైన ఆడపిల్ల ఏ కారణం చేతనైనా సరే, పుట్టినింట్లో ఎక్కువకాలం ఉండటం నాటి సంఘంలో నిషిద్ధం. ఈ విషయంలో కూడ నాటికీ నేటికీ స్త్రీల

1.మహా.భార.ఆది.ఆ3.ప.117

పరిస్థితులలో పెద్దగా వ్యత్యాసాలు లేవు. భర్త ఎటువంటి వాడైనా, తనను పరిత్యజించినా అతడే ఆమెకు దైవం, శరణ్యం,

"ఎట్టి సాధ్వులకును బుట్టిన యిండ్లను
బెద్దకాల మునికి తద్ద తగదు
పతుల కడన యునికి సతులకు ధర్మువు
సతుల కేడు గడయు బతుల చూవె"

కణ్వుడు శకుంతలతో చెప్పిన ఈ మాట నాటి సంస్కృతిలో వివాహితల స్థానమెక్కడో తెలియజేస్తుంది.నేటి భారతీయ సంస్కృతిలో అత్యధిక శాతం తల్లిదండ్రులుతమ కూతుళ్లచే శిరసావహింప జేస్తున్న అక్షర కఠోర సత్యం కూడా ఇది.

28. నాడు స్త్రీకి రక్షణలేదన్న విషయాన్ని భారతంలోని అనేక స్త్రీపాత్రలు వెల్లడి చేస్తున్నాయి.ఒంటరిగా దొరికిన స్త్రీలపై పురుషుడత్యాచారం చేయబోవడం ఆ నాడు సర్వసాధారణం. భర్తచే పరిత్యజింపబడి అడవిలో ఒంటరిగా సంచరిస్తున్న దమయంతి దీనావస్థను,ధూళిధూసరితమైన ఆమె దయనీయరూపాన్ని చూచికూడ కిరాతుడామెను బలాత్కరించబోయి, ఆమె పాతివ్రత్యం వల్ల మరణిస్తాడు. శాపభయంతో లొంగదీసుకొని కుంతి పట్ల సూర్యుడు చేసిన దత్యాచారం క్రిందకే వస్తుంది.ఏకాంతంగా ఉన్న మత్స్యకన్య తన కన్యాత్వాన్ని రక్షించుకోవడానికెన్నో సాకులు చూపి నిష్ఫలయై, పరాశరునికి తన్ను తాను అర్పించుకోవలసి రావడం అత్యాచారం కాదనలేము.ద్రౌపదిపై కీచకుడు, సైంధవుడు జరిపినవి అత్యాచార యత్నాలే. నిండు గర్భవతులపై కూడ అత్యాచార యత్నం జరిగేది.ఉదా: పులోమ, ఔర్వుని తల్లి, భృగుపత్ని మొ ॥. యవక్రీతుడనే ముని రైభ్యముని కోడలు. తన తోడి ముని భార్య (పరావసుని పత్ని) కృష్ణను కామించి, ఆమెయుక్తి వల్ల, రైభ్యుని తపోమహిమ వల్ల నిహతుడవుతాడు. స్త్రీలపట్ల పురుషుల ఎల్లలు లేని కామం భారతంలో అనేక సందర్భాలలో వర్ణించబడింది. సప్తర్షులు భార్యలలో అరుంధతి తప్ప ఆర్గురు కృత్తికలు అగ్నిదేవునికామానికి అపఖ్యాతిపాలై, భర్తృ పరిత్యక్తలవుతారు.

29 లోకాపవాద భయం వల్ల కూడ నాడు స్త్రీలకు అన్యాయం జరిగేది.తమ భార్యలు నిరపరాధలని తెలిసినా, సప్తర్షులు (వశిష్ఠుడు తప్ప) తమ భార్యలను వదలివేస్తారు. దీన్నిబట్టి సామాన్యస్త్రీల పరిస్థితి నాడెలా ఉండేదో ఊహించ వచ్చును.

30 భర్తలు వానప్రస్థాశ్రమం స్వీకరించగా భార్యలు వారి ననుసరించేవారు.

అప్పుడు కూడ స్త్రీలు కుటుంబ బాధ్యతలు ఎంతో అప్రమత్తంగా,సమర్థంగా నిర్వహించిన తర్వాతే భర్తల ననుసరించేవారు. పురుషులివన్నీ పట్టించుకొనేవారు కాదు. అత్రి ముని భార్యతో వానప్రస్థానికి సిద్ధమైనపుడు ఆమె ముందుగా కుమారులకు తగిన ఆర్థిక స్థితి ఏర్పరచమని భర్తను హెచ్చరిస్తుంది.

31 దిక్పాలకులైన ఇంద్రాగ్నుల కామప్రవృత్తికి భారతంలో పలు చోట్ల ఉదాహరణాలు లభిస్తాయి. దేవవర్మ భార్య రుచిని పొందటానికి ఇంద్రుడు పొంచి ఉండి, పలుయత్నాలు చేసి,విఫలుడవుతాడు.గౌతముని భార్య అహల్యపై ఇంద్రుడు చేసిన అత్యాచారం, అతనికి లభించిన శాపం సర్వ విదితం. దమయంతి నలుణ్ణే తప్ప అన్యులను భర్తగా వరింపదని తెలిసి కూడ దిక్పాలురు మాయానలుని వేషాలలో స్వయంవర మంటపంలో సాక్షాత్కరిస్తారు.సప్తర్షులు యజ్ఞం చేస్తూన్నప్పుడు వారి భార్యల పట్ల అగ్ని ప్రదర్శించిన చాపల్యం (కాముకత్వం) అతిహేయంగా వర్ణించబడినది.

32 వ్రతాలతోను, ఔషధ ప్రభావంతోను, మంత్రాలతోను,అలంకార నైపుణ్యంతోను, భర్త నాకర్షించే ప్రయత్నం చేసేవారు 'దుష్టస్త్రీలు'గా పరిగణింప బడేవారని ద్రౌపది సత్యభామతో పల్కిన పలుకుల వల్ల విదితమవుతుంది.

33 ఎంతటిధనవంతురాలైనా, మహారాణియైనా భర్త స్నాన, భోజన , మజ్జనాది పరిచర్యలు భార్య స్వయంగా ఆచరించడం నాడు భార్య విధులలో అతి ముఖ్యమైనది. స్నాన, భోజన,శయనాదులు భర్తకంటె ముందుగా భార్య ఆచరించకూడదు.[1]

34 భర్తసంపదను జాగ్రత్తగా కాపాడటం ఆదాయవ్యయాలు అతిసమర్థతతో నిర్వహించడం భార్యల బాధ్యతే.[2]

35 భర్తలు ఊళ్లోలేనపుడు, భర్తవదిలివేసినపుడు, భార్యపూలు, గంధం, ఆభరణాలు,మంచివస్త్రాలు- వీటన్నిటినీ దూరంగా నిరలంకారంగా ఉండాలి. దమయంతి సుబాహుని అంతఃపురంలో సైరంధ్రిగా, రావణుని చెరలో సీత నెలల తరబడి నిరలంకారంగా మాత్రమేకాదు, నిరాహారంగా, నిర్నిద్రగా, స్నానాదికాలు సైతం పరిహరించి మలినదేహంతో, జడలుకట్టిన కేశపాశంతో చినిగిపేలికలైన వస్త్రాలతో గడిపారు.ఆ విధంగా ఉండటమే పతివ్రతా ధర్మమని పలుచోట్ల ప్రస్తావించబడింది. (ద్రౌపది,శాండిలి, పార్వతి పాత్రలచే)

---

1.అరణ్యపర్వంలో ద్రౌపది సత్యభామతో 2 మ.భా.ఉద్యోగ.ఆ1.ప.149

36 'సతుల చరితలతి దుష్కరములు' అని ద్రౌపది సత్యతో అనడమేగాక పార్వతి శంకరునితోకూడ అంటుంది. ఇంకా పలుచోట్ల ఈ మాటప్రస్తావించబడింది. మందపాలుడనే ముని తన భార్యతో, దుష్యంతుడు శకుంతలతో "ఎఱుక గలదె సతులకెందు" అని స్త్రీలు జ్ఞానహీనలని సాధారణీకరణం చేయడం చూడగా స్త్రీలశీలం పట్ల, స్త్రీల జ్ఞానం పట్ల నాటి పురుషుల కెంతటి చిన్న చూపో విదిత మవుతుంది.

37 కన్నకుమారునితో నైనాసరే, స్త్రీలు ఒంటరిగా ఉండకూడదని పార్వతీ ద్రౌపదులు పేర్కొంటారు.

38 రాజ్యమూ, స్త్రీ- రెండూ బలవంతుని సొత్తులే నన్న నాటి యుగధర్మం ఇంద్రుని భార్య శచీదేవిని నహుషుడు కామించడంతో ఋజువవుతుంది.[1]

39 పుత్రవతులైనా కన్యాత్వం పోనివారు నాడున్నారు. కుంతి, సత్యవతి, ద్రౌపది, యయాతి కుమార్తె మాధవి. ఇది లోకసహజంకాని విషయం.

40 తన స్వార్థంకోసమో, కీర్తికోసమో తండ్రులు కన్న కుమార్తెల జీవితాలనే బలిపెట్టేవారు. చ్యవనుని శాపంనుండి తన సైన్యాన్ని కాపాడుకొనేందుకు శర్యాతి ముక్కుపచ్చలారని ముగ్ధమోహన రూపసియైన తన కుమార్తె సుకన్యను శతాధిక వృద్ధుడైన చ్యవనునికి సమర్పిస్తాడు. గాలవుడు కోరిన 'గుఱ్ఱాలు' తన వద్ద లేనందున, బదులుగా తన కుమార్తె మాధవిని అతనికిచ్చుకున్నాడు యయాతి.

41 మహారాజ పుత్రియైన మాధవి గాలవుని 'గుఱ్ఱాల' దాహానికి నలుగురికి తాత్కాలిక 'భార్య'గా (వారివల్ల పుత్రుణ్ణి పొందే పర్యంతం) తార్చబడుతుంది. ఆమె విలువ రెండు వందల గుఱ్ఱాలు. ఇదినాటి స్త్రీల దుర్దశకద్దం పడుతుంది [2.]

42 మనుస్మృతి, పరాశర స్మృతికర్తలు భర్త శుశ్రూష పేరుతో స్త్రీకి శాశ్వత బానిసత్వాన్ని శాసించారు. ఆ విధంగా చేయకపోతే నరకానికి పోతారని భయపెట్టేరు. భారతకాలంలోను అంతే.

**" పత్యే జీవతి యా నారీ ఉపోష్యవ్రతమాచరేత్;**
**ఆయుష్యం హరతే భర్తుస్సా నారీ నరకం వ్రజేత్ "[3]**

భర్త శుశ్రూషను ఉపేక్షించి ఉపవసించినా దోషమే.

43 భర్త ఆజ్ఞలేకుండా దేవతా పితృకార్యాలు చేసినా, ఆ స్త్రీ నరకానికి పోతుందని పార్వతి శంకరునితో చెప్పడాన్ని బట్టి పురుషుని ఆధిపత్యానికి స్త్రీలు ఏవిధంగా కట్టుబడవలసిన పరిస్థితులు నాడుండేవో వెల్లడవుతున్నది.

---

1,2 మ.భా.ఉద్యోగ.ఆ1.ప.149 3.పరా స్మృ 4వ.పుట.17వ శ్లోకం

44 వైశ్యులు, శూద్రులు ధర్మంతప్పి, బ్రాహ్మణస్త్రీల నపహరించేవారు. ఏకచక్రపురంలోని బ్రాహ్మణుని భార్య బకాసురునికి తాను ఆహారమవుతానన్న భర్తను వారిస్తూ, భర్త లేకుండా యుక్తవయస్కురాలైన తన కుమార్తెను దుర్మార్గుల బారినుండి రక్షించుకోజాలనంటుంది.

45 పతివ్రతలను 'దిక్పాలకులు' కాపాడేవారు. దమయంతి పతివ్రత అని, శీలవతి అని ఆమెను తాను చంద్రసూర్యులు మూడు సంవత్సరాలు కాపాడినామని వాయుదేవుడు ప్రత్యక్షమై నలునితో చెబుతాడు.

46 'ఆకాశవాణి' కూడ పతివ్రతల పాతివ్రత్యానికి సాక్షీభూతమయ్యేది. శకుంతల పతివ్రత అని దుష్యంతుని సభలో ఆకాశవాణి ఘోషిస్తుంది.పాండవులు జన్మించి నప్పుడు ఆకాశవాణే వారికి నామకరణం చేస్తుంది.

47 పతివ్రతలు తమ పాతివ్రత్యాన్ని నిరూపించుకొన్నప్పుడు దేవదుందుభులు మ్రోగేవి. దేవతలు పుష్పవృష్టిని కురిపించేవారు.

48 'స్త్రీలను నమ్మేవారు బుద్ధిహీను' లనికూడా భారతంలో చాలాచోట్ల ప్రస్తావించబడింది. దమయంతిని గూర్చి నలుడు, తన పక్షిభార్య జరితను గూర్చి మందపాలుడు ఆవిధంగా భావిస్తారు.

49 స్త్రీలు జ్ఞానశూన్యులని నాడు స్త్రీలే అంగీకరించడం ఆశ్చర్యదాయకం. కౌశికునికి ధర్మబోధ చేసిన పతివ్రత,సూర్యునితో ఎంతో ధైర్యంగా వాదించిన కుంతి స్త్రీలు జ్ఞానహీనలు కాబట్టి వారి అజ్ఞానాన్ని మన్నించి క్షమించాలని ప్రార్థిస్తారు.

50 మునులు, ఋషుల తపోభంగం చేయడానికి అప్సరసలు,(దేవవేశ్యలు) వేశ్యలు నియోగింపబడేవారు. విశ్వామిత్రుని తపోభంగానికై మేనకను, శరద్వంతుడనే ముని నిష్ఠను పాడుచేయడానికి 'జానపది' అనే యువతిని, పృషతుడనే పాంచాలరాజు తపోనిష్ఠను పాడుచేయడానికి తిరిగి మేనకను, దధీచికి తపోభంగం చేయడంకోసం అలంబుసను ఇంద్రుడు నియోగించాడు. ఋష్యశృంగుని తపస్సును, బ్రహ్మచర్యాన్ని పాడుచేయడానికి వేశ్యలు నియోగింపబడినారు.

51 మాయోపాయంతో రాక్షసులను సంహరించడానికి ప్రత్యేకంగా సౌందర్యవతుల సృష్టి జరిగేది. సుందోప సుందులను సంహరించడానికి బ్రహ్మ తిలోత్తమను సృష్టిస్తాడు.

52 స్త్రీల మానసిక వ్యభిచారం కూడతీవ్రంగా పరిగణింపబడి, క్రూరమైన దండన విధింపబడేది. జమదగ్ని భార్య రేణుక చిత్రరథుడనే రాజు భార్యాసహితుడై

జలక్రీడలాడుతుండగా చూచి మోహిస్తుంది.ఆమె వ్యభిచరించిందని భావించి జమదగ్ని ఆమెను సంహరించమని కొడుకులనాదేశిస్తాడు.

53 జూదం, మద్యపానం, వ్యభిచారం (పురుషులది) నాడు నేరాలేకావు.కాని వాటిఫలితం స్త్రీల జీవితాలపై ఘోరంగా ప్రతిఫలించేది. జూద వ్యసనానికి బానిసలైన నలుడు, ధర్మరాజు తమ భార్యలనే పణంగా పెట్టారు. ఫలితంగా వారు సైరంధ్రులుగా బ్రతకవలసి వచ్చింది. సుదేష్ణ మద్యపాన వ్యసనం ద్రౌపదిని కీచకుని బారిన పడేట్లు చేసింది. స్త్రీలు కూడ సురాపానం చేసేవారనడానికి సుదేష్ణ నిదర్శనం.

54 వేదకాలంలో ఆమోదింపబడిన విధవా వివాహాలు భారతకాలంనాటికి మృగ్యమయ్యాయి. విధవలు పునర్వివాహం చేసుకోరాదని బకాసురుని వృత్తాంతంలోని బ్రాహ్మణ స్త్రీ మాటల వల్ల వ్యక్తమవుతుంది.

55 స్త్రీలు బిడ్డలను కని వంశవృద్ధి చేస్తే భర్త ఋణం తీర్చుకొన్నట్లే. భారతంలోని శతాధిక స్త్రీలు వంశవృద్ధి విషయంలో మాత్రమే పేర్కొనబడినారు.

56 బహుసంతానాన్ని పొందడమే భార్యలవల్ల రాజులు ఆశించిన ప్రయోజనం. అందుకోసమనే వందలు, వేలసంఖ్యలో రాజులు స్త్రీలను వివాహమాడేవారు. గాంధారి నూర్గురు పుత్రులను పొందేవరం పరమేశ్వరుని వల్ల కలిగి ఉన్నదనే భీష్ముడామెను ధృతరాష్ట్రుడికిచ్చి వివాహం చేస్తాడు. ధృతరాష్ట్రునికి గాంధారి కాక నూటపదిమంది భార్యలు.వాళ్ల సంతానం మాత్రం పేర్కొనబడలేదు. సోమకుడనే రాజు యజ్ఞంచేసి నూర్గురు భార్యల వల్ల నూరుమంది పుత్రులను పొందుతాడు. శర్యాతికి నాలుగు వేలమంది భార్యలు.శశిబిందుడనే రాజుకు లక్షమంది భార్యలు.

57 రాజవంశాలలో రాజకీయ ప్రయోజనాలకోసమే చాలా వివాహాలు జరిగేవి. సుబలుడు తన కుమార్తె గాంధారిని పుట్టు గుడ్డివాడైన ధృతరాష్ట్రుని కీయడానికి కారణం బలవంతుడైన భీష్మునితో నెయ్యమొందడం కోసమే. అప్పటికే నలుగురు భార్యలున్న అర్జునునికి విరాటుడు తన కుమార్తె ఉత్తరనిస్తాననడం పాండవుల ప్రాపుకోసమే.

58 వ్యసన పరుల భార్యలకు సాంఘిక గౌరవం నాడు మృగ్యం. అంతేకాదు, వారు ఘోరంగా అవమానింప బడేవారుకూడ. ధర్మరాజు జూదవ్యసనం కారణంగా ద్రౌపది భర్తముందే జుట్టుబట్టి ఈడ్వబడింది. వస్త్రాపహరణం గావించబడింది. "జూదరి ఆలికి గౌరవమెక్కడిది?" అని విరాటుని సభలో ద్రౌపది ధర్మరాజుతో పల్కుతుంది.

వేదంలోని అక్షసూక్తంలోని ఈ శ్లోకార్థాన్ని బట్టి జూదరి భార్యకు కలిగే పరాభవం ఎంత దారుణంగా ఉండేదో అర్ధమవుతుంది.

**"అన్యే జాయాం పరిమృశన్త్యస్య**
**యస్యా గృధద్వేదనే వాజ్యక్షః**
**పితామాతా భ్రాతర ఏన మాహుః**
**న జానీమో నయతా బద్ధ మేనమ్"(ఋగ్వేదము)**

బలీయవిధి వంటి యక్షము ఏకితవుని ధనము నోడించునో, ఆతని భార్యను ప్రతికితవులు కేశాకర్షణ వస్త్రాకర్షణాది క్రియలచే స్పృశించి మానభంగము గావింతురు. తల్లియు, తండ్రియు, సోదరులు నాతని బంధించి తీసికొని మీ యిచ్చ వచ్చిన చోటికి కొనిపొండని ప్రతికితవులతో చెప్పుదురు.

" జాయా తప్యతే కితవస్యహీనా
మాతా పుత్రస్య చరతః క్వస్విత్
ఋణావా బిభ్యద్ధన మిచ్ఛమానో ఉ
న్యేషా మస్త ముపనక్తమేతి"(ఋగ్వేదము)

"ఓడి ఎచటనో చరించు కితవుని భార్య హీనయై (పరులతో నవమానింప బడి) పరితపించును. తల్లియు పుత్రశోకతప్తురాలవును. ఋణ భయమున కితవుడు రాత్రులలో దొంగతనము జేయుట కితరుల యిండ్లకు జేరును".

"ప్రమా యుజ్రే ప్రయుజో జనానాం
వహామి స్మ పూషణ మంతరేణ
విశ్వేదేవా సో అధ మా మరక్షన్
దుఃశాసు రాగా దితి ఘోష ఆసీత్"(ఋగ్వేదము)

"జననాయకులు నన్ను బిలువనంపిరి. మధ్యన పూషదేవుని కిరణములు మోయుచుంటిని.(ఎండకన్నెరుగని దాని నెండ వేడినిమోయుచుంటిని) దేవత లందరాతర్వాత నన్ను రక్షించిరి. (కాని యంతకుముందు) దుఃశాసుడు (దుశ్శాసనుడు) వచ్చెనని పెద్ద గోల వినబడెను."

**"సంమా తప న్త్యభి తస్సపత్నీ రివ పర్శవః**
**నిపాతతే అమతి ర్నగ్నతా జసుర్వేర్నవే వీయతే మతిః "** (ఋగ్వేదము)

"శత్రువుల వలే పర్శువులు చుట్టుముట్టి నాపై బడుచున్నారు. బుద్ధిహీనయు (వ్యక్తి) వస్త్రములేమిచే ఏర్పడిన నగ్నతయు నన్ను బాధించుచున్నవి.

వ్యాధ భయమున పక్షి వణకినట్లు నా మతి కంపించుచున్నది."

పై బుక్కులను సామూహికముగా పరిశీలించి చూచినచో నవి ధర్మజుని ద్యూతమును -ద్రౌపది కేశాకర్షణ వస్త్రాపహరణాదులను వ్యక్తీకరించును.[1]

కానీ చరిత్రకారులనుబట్టి వేదకాలానికీ, భారతకాలానికీ 1100 ఏళ్ల వ్యత్యాసం ఉన్నది. జూదరి భార్య హీనాతిహీనంగా అవమానింపబడేదని, అదివేద కాలం నుండి భారత కాలం దాకా కొనసాగిందని నిర్ధారింపవచ్చును.

59 సంతానం పొందటంద్వారానే స్త్రీకి కుటుంబంలో గౌరవం పెరిగేది. అదీ మగశిశువుకు జన్మనీయటం ద్వారానే. సామాజిక గౌరవం కూడ దీనిపై ఆధారపడి ఉండేది. బహు భార్యాత్వం విపరీతధోరణిలో విశృంఖలంగా రాజ్యమేలుతున్న ఆ నాటి వ్యవస్థలో స్త్రీలకు కుటుంబజీవితంలో భద్రత కూడ తమకున్న పురుష సంతానం మీదే ఆధారపడి ఉండేది.సవతులలో వాళ్ల 'హోదా' పెరిగేది.

సంతానం ద్వారానే కుటుంబంలో స్త్రీకి ఉదాత్త, అనుదాత్త స్థాయి హోదాలు లభిస్తాయి. కనుకనే భారతంలో సత్యవతి సంతానానికి రాజ్యాధికారం ఇస్తేనే శంతనునితో వివాహానికి ఆమోదిస్తానన్నాడు దాశరాజు. శకుంతల తనకు పుట్టబోయే బిడ్డకు రాజ్యాధికారం ఇస్తే గాంధర్వ వివాహానికి సిద్ధమేనని దుష్యంతుడితో చెప్పింది."పితృస్వామిక సమాజంలో, తనకు పూర్తిగా పరాయిదయిన కుటుంబంలో స్థిరమైన, గౌరవప్రదమైన (అది ఎన్ని పరిధులకు లోబడినదైనా) స్థానం కోసం స్త్రీలు పడిన తపన యొక్క ప్రతిధ్వనులే ఈ చర్యలన్నీ. కొడుకులను బట్టే తల్లులకు కుటుంబంలో స్థానం, సామాజిక గౌరవం అని ఈ సందర్భం మనకు స్పష్టం చేస్తున్నది." [2]

60 అత్తలుగా స్త్రీలు పొందే గౌరవం కూడ ఈ అంశం పైనే ఆధారపడి ఉండేది. ఒక మగవాడికి తల్లి అయినందుకే ఆమెకా గౌరవం." అత్తలుగా స్త్రీలు పొందే గౌరవం రాజమాతలుగా పొందే గౌరవం వంటిదే. ద్రౌపది ద్వారా కుంతి అటువంటి గౌరవాన్నే పొందింది."[3]

60 స్త్రీలకు కుటుంబ జీవిత సంబంధాలలో ఉన్నంత భాగస్వామ్యం నాటి సామాజిక జీవితంలో లేదు.చాలా వరకు వాళ్ల జీవన పరిధి కుటుంబ చట్రంమించి విస్తరించలేదు. స్త్రీలెంత యోగ్యులైనా, మేధాసంపద, విద్యాసంపద గలవారైనా, రాజనీతిజ్ఞులైనా సమాజంలో వారికి తగినగుర్తింపు లభించిన దాఖలాలు గాని, రాజకీయరంగంలోగాని శాసనాధికారాలలోగాని వారికి యోగ్యమైన స్థానం లభించిన

1. మహా. వి.వి. కో. పుట. 110,111 2 సంసా. స్త్రీ. దృ. పు. 47 3. అదే. పుట. 48

దృష్టాంతాలు గాని భారతంలో కన్పించవు. ఉదా:- దమయంతి, ద్రౌపది ఎంత బుద్ధివైభవం,మేధాసంపద, రాజనీతివైశారద్యం గలవారో వారి జీవితాలలోని క్లిష్ట సమస్యలను వారెదుర్కొన్నతీరే విశదం చేస్తుంది. అయినా నలుని భార్యగా దమయంతి, పాండవుల పట్టమహిషిగా ద్రౌపది గుర్తింపు పొందారు తప్ప మరే విధమైన పదవీ బాధ్యతలు నిర్వహించే అవకాశం వారికివ్వబడలేదు.

"పురాణేతిహాసాలలో స్త్రీలు కౌటుంబిక జీవిత సంబంధాలలో భాగంగా కనబడినంతగా సామాజిక జీవిత సంబంధాలలో కనపడరు.దాశరాజు కూతురు ఇంటి పరిధిదాటి ఓడ నడపడం వృత్తిగా చేసుకుంది.అయితే అదీ తండ్రి నియోగం వల్లనే. ద్రౌపది కౌరవపాండవుల రాజకీయాలలో పాండవులు ఏ విధానాన్ని అవలంబించాలో సలహా యియ్యడానికి తగిన తెలివితేటలు, సంసిద్ధత కలవ్యక్తే. అరణ్యవాసం చేస్తున్నపుడు ద్రౌపది ధర్మరాజుకు దుర్యోధనాదుల మీద కోపం తెచ్చుకొని భీమాదులను నియోగించి కోల్పోయిన రాజ్యసంపదను తిరిగి పొందమని సూచించింది. రాయబారం వెళ్లే కృష్ణుడికి యుద్ధమే తన మతమన్న అభిప్రాయాన్ని చెప్పడానికి వెనుకాడలేదు. అయితే ఆమెకు ధర్మరాజును అధిగమించి స్వతంత్రంగా ప్రవర్తించే అవకాశం లేదు."[1]

61 వివాహ విషయంలో స్త్రీలకు స్వేచ్ఛ లేకపోవడం నాడు దాదాపుగా సర్వత్రా కన్పించిన విషయం. తండ్రి ఇష్టాన్ని అనుసరించే, అతడు నిర్ణయించిన వరుణ్ణే అతడెలాంటి వాడైనా సరే, స్త్రీలు పెళ్లాడ వలసి వచ్చేది. ఒక్క వివాహ విషయంలోనే కాదు, మరే విషయంలోనూ స్త్రీలకు స్వేచ్ఛ ఉండేది గాదు. వృషపర్వుడు తన దానవ సామ్రాజ్యప్రయోజనం కోసం, శుక్రాచార్యుని అనుగ్రహంకోసం తన కుమార్తెను శుక్రుని కుమార్తెకు దాసిగా సమర్పిస్తాడు. శర్మిష్ఠ కిమ్మనకుండా తండ్రి ఆజ్ఞ తలదాల్చింది.

**"పితా రక్షతి కౌమారే, భర్తా రక్షతి యౌవనే;**
**రక్షంతి స్థావిరే పుత్రా నస్త్రీ స్వాతంత్ర్య మర్హతి" (మనుస్మృతి-9-3)**

అన్న మనువు సిద్ధాంతం నాడు అక్షరాలా అమలు జరిగేది. తండ్రీ, సోదరుల అండగాని, సన్నిహిత బంధువుల అండగాని పొందకుండా స్త్రీ స్వతంత్రించిన సందర్భాలు భారతంలో కనబడవు.ఒక్క అంబ విషయంలో తప్ప.

62 అన్ని ధర్మ శాస్త్రాలలో పేర్కొనబడిన అష్టవిధ వివాహాలు భారత కాలంలో ఆచరణలో కన్పిస్తాయి.

---

1. సం. సా. స్త్రీ. దృ. పుట. 49

**అష్టవిధ వివాహపద్ధతులు** :- తల్లిదండ్రులు నిర్ణయించి తగిన వరుడని భావించి తమ కుమార్తెకు వివాహం చేయటం బ్రాహ్మ్యం. ఇది ఉత్తమం. వరుడు తానై కన్యను ఎన్నుకొని ఆమె తల్లిదండ్రుల అనుమతితో వివాహం చేసుకోవడం ప్రాజాపత్యం. వివాహానికై కన్య తల్లిదండ్రులకు కొంత ధనం చెల్లించడం ఆర్షం. కన్యాశుల్క దురాచారం దీన్నుండే పుట్టింది.వరుడెవరూ దొరక్కపోతే పురోహితునకిచ్చి పెండ్లి చేయడం దైవం. స్త్రీ పురుషులు పరస్పరం యిష్టపడి, స్వంత నిర్ణయంతో పెళ్లిచేసుకోవడం గాంధర్వం.ఆసుర, రాక్షస వివాహాలలో కన్యను బలాత్కారంగా అపహరించుకుపోవటంఉంది. అవివాహిత కన్యపై అత్యాచారం చేసి, తప్పని సరిగా ఆమె అతడితో వివాహానికి ఒప్పుకొనే పద్ధతిని కల్పించటం పైశాచిక పద్ధతి.

గాంధారీ ధృతరాష్ట్రులు, ఉత్తరాభిమన్యులు, ఓఘవతీ సుదర్శనులు - వీరి వివాహాలు పెద్దల నిర్ణయాలే. ఇవి బ్రాహ్మ్యపద్ధతిలోనే జరిగాయి. తపతీ సంవరణుల వివాహం ప్రాజాపత్యం. సత్యవతీ శంతనుల వివాహంలోనూ, చిత్రాంగదా అర్జునుల వివాహంలోనూ కన్యాశుల్కంగా షరతులు విధింపబడినాయి కాబట్టి వాటిని ఆర్ష వివాహాలన వచ్చును. రుక్మిణీకృష్ణుల వివాహం భారతంలో పేర్కొనకపోయినా, అది ఆకాలంలో జరిగినదే. శ్రీకృష్ణుడు రుక్మిణి నెత్తుకొని పోయి వివాహం చేసుకొన్నాడు. అది రాక్షస వివాహం. శకుంతలా దుష్యంతుల వివాహం గాంధర్వం.

ఇవిగాక అనులోమ, ప్రతిలోమ వివాహాలుండేవి."అగ్ర వర్ణాల స్త్రీలు నిమ్న వర్ణాల పురుషులను వివాహం చేసుకుంటే వాటిని ప్రతిలోమ వివాహాలనే వారు. వీటికి వివాహవిధులు లేవు. ఇవి చాటుమాటుగానో, అనధికారికంగానో జరిగేవి.ఈ విధంగా జరిగిన వివాహాలలో కలిగిన సంతానం తప్పని సరిగా వర్ణ వ్యవస్థలో క్రిందకి జరిగి తీరవలసిందే. సంతానంతో బాటు తల్లి కూడా క్రింది మెట్టుకు దిగిపోతుంది.ఇదే వర్ణసంకరం"[1]

బ్రాహ్మణ, క్షత్రియవర్ణాలపురుషులు అన్యవర్ణాలస్త్రీలను వివాహమాడటం అనులోమ వివాహంగా పరిగణించబడేది." అనులోమ వివాహాల విషయంలో కూడా ధర్మశాస్త్రాలు పరస్పర విరుద్ధంగా చెబుతూ ఉంటాయి. అనులోమ వివాహాలు అనుమతించ దగ్గవే అని ఒక సూత్రంలో చెప్పిన మనువే ఆ వెంటనే దానిని ఖండిస్తూ మరొక సూత్రం చెప్పాడు. కాని ఆనాటి పురుషాధిక్య సమాజంలో

---

1. భారతీయ సంస్కృతి. పుట 76

బ్రాహ్మణక్షత్రియవర్ణాలు అన్యవర్ణ స్త్రీలను వివాహరూపంలోనో,అనధికారికంగానో చేరదీయడం సర్వసామాన్యమైనది.ఎన్ని నిషేధాలు విధించినా పై వర్ణం స్త్రీలు క్రింది వర్ణ పురుషులతో సంతానం కనడం సాగుతూనే ఉండేది." [1]

"బ్రాహ్మణ పురుషునికి, బ్రాహ్మణేతర స్త్రీకి కలిగిన బాలిక తిరిగి బ్రాహ్మణ పురుషుని ద్వారా సంతానం పొందితే, ఏడు తరాలలో ఆ సంతానం బ్రాహ్మణత్వం పొందుతుంది. క్షత్రియవైశ్యవర్ణాలకూ ఇదే వర్తిస్తుంది. ప్రతిలోమ వివాహాల ద్వారా కలిగే సంతానం క్రిందికి జరుగుతుంది.

"అనులోమవివాహాలు సామాజికఊర్ధ్వచలనానికి ఎంతో కొంత తోడ్పడగా,ప్రతిలోమ వివాహాలు మాత్రం సామాజిక అధోచలనానికి త్రోవతీశాయి. అనులోమ వివాహాలలోనూ ఒక వ్యత్యాసం ఉంది. బ్రాహ్మణ పురుషుడు తనకంటె ఒకడుగు తక్కువ వర్ణం, అంటే క్షత్రియులు, రెండడుగులు తక్కువ వర్ణం అంటే వైశ్యులకు చెందిన స్త్రీల ద్వారాసంతానం కంటే అదొకరకం. శూద్రస్త్రీ ద్వారా సంతానం కంటే ఇక ఆ సంతానం వ్రాత్యులు అనగా వైదికాచార దూరులు. అలాంటి సంతానం ఊర్ధ్వచలనం పొందడం అసాధ్యం. ఆంధ్రులు అలాంటి సంకరజాతి అనే ఆక్షేపణ ఉంది."

పురుషుని అగ్రవర్ణ పవిత్రత కంటె స్త్రీ నీచవర్ణ అపవిత్రత ఎక్కువన్నమాట. ప్రతిలోమ వివాహాలలో స్త్రీ అగ్రవర్ణ పవిత్రత అన్యవర్ణ పురుషుని సంపర్కంతో ఒక్క సారిగా అధః పతనమవుతుంది. వర్ణసంకర భావనలోఅడుగడుగునా స్త్రీ హీనపరిస్థితి, శూద్రులపట్ల దారుణ వివక్షకొట్ట వచ్చినట్లు కన్పిస్తుంది." [2]

దేవయాని, యయాతి - వీరి వివాహం ప్రతిలోమం. బ్రాహ్మణుడు నిషాదిని భార్యగా స్వీకరించినట్లు గరుత్మంతుని వృత్తాంతంలో తెలుస్తుంది.

63 క్షత్రియులలో నాడు స్వయంవర పద్ధతి ఉండేది.ఇది స్త్రీలకున్న వివాహ విషయ స్వేచ్ఛను తెలియజేస్తుంది. కుంతిని పాండురాజు, దేవికను ధర్మరాజు, సహదేవుడు విజయను, దమయంతి నలుని - స్వయంవర పద్ధతిలోనే వివాహ మాడారు. [3]

64 కుమార్తెల మనస్సు తెలుసుకొని వారి వివాహం జరిపించిన తండ్రులు కూడ నాటి కాలంలో ఉండేవారు.సావిత్రి మనోభీష్టం ప్రకారమే తండ్రి ఆమెను సత్యవంతునకిచ్చి వివాహం చేస్తాడు.

65 "వర్ణసంకరం అనే మాటను అర్జునుడు భీష్మునితో అంటాడు. ఈ మాటలో

1. అదే. పుట 77 2. అదే. పుట. 78. 3. అదే. పుట. 76

పురుషాధిక్యత యిమిడి ఉంది. బ్రాహ్మణ క్షత్రియులు ఎంతమంది స్త్రీలనైనా వివాహం చేసుకోవచ్చును. పాండవులు ద్రౌపదినే కాక ఒక్కొక్కరు అనేక మందిఅన్యవర్ణాల స్త్రీలను వివాహమాడారు."ఈ వివాహాల ద్వారా కలిగే సంతానానికి సవర్ణ వివాహాల ద్వారా కలిగే సంతానం స్థాయి మాత్రం లేదు.సుభద్ర మనుమడైన పరీక్షిత్తు రాజైనాడు. హిడింబ కొడుకు ఘటోత్కచుడు యుద్ధంలో మరణించాడు. బతికి ఉంటే సేనాపతి అయ్యేవాడేమో."[1]

66 మనుస్మృతి రజస్వల కాని 'కన్య' కు వివాహం చేయాలని చెప్పింది.

**"యావన్న లజ్జితాంగాన్ని కన్యా కన్యాపురుష సన్నిధౌ**
**యోన్యాదని న గుహేత తావద్భవతి కన్యకా ॥ "**

(ఈ శ్లోకం పురాణం లోనిదని పేర్కొన బడిందిగాని ఏ పురాణంలోనిదో చెప్పబడలేదు

వస్త్రవిహీన అయినపుడు పురుషుని చూచి కూడా సిగ్గు పడనిది కన్య అని చెప్పబడింది.అంటే స్త్రీత్వాన్ని ఇంకా గుర్తించని దశ అని బోధపడుతుంది. " రజస్వలఅయిన తర్వాత బాలికకు వివాహం చేస్తే దారుణమైన శిక్షకు గురి కావలసి వచ్చేది. మానవతా విలువలను తగలేసే యీ నియమాలను బ్రాహ్మణ సమాజం మన సమాజంమీద అమానుషంగా రుద్దింది."[2]

బాల్య వివాహమనగానే ఈ దురాచారం భారత కాలంనాటికి దాదాపుగా అంతరించింది."భారతంలోని ప్రసిద్ధ కాంతామణులు సత్యవతి, అంబిక, అంబాలిక, గాంధారి, కుంతి, ద్రౌపది, సుభద్ర, ఉలూచి, హిడింబ, శకుంతల, దేవకి, దమయంతి మొదలైన కన్యలెవరూ ఆ వయసులో పెండ్లి చేసుకొన్నవారు కాదు. అలాగే రామాయణ కాంతామణులైన దశరథుని భార్యలు కౌసల్య, సుమిత్ర, కైకేయిలు, రామలక్ష్మణుల, భరత శత్రుఘ్నుల భార్యలు సీతా ఊర్మిళాదులకు గాని పెండ్లిండ్లు ఎనిమిదేళ్లకు లేక పదిపన్నెండేళ్లకు లోపు జరగలేదు. కన్య వయస్సును రజస్వలకు ముందు నిర్దేశించడం ద్వారానే బాల్యవివాహం అనే దురాచారం ప్రబలింది."[3]

67 దమయంతి తన సోదరుని స్నేహితుని ద్వారా ఋతుపర్ణునికి తన ద్వితీయ స్వయంవర వృత్తాంతం చెప్పి పంపుతుంది.దీన్ని బట్టి భారతకాలం నాడు కూడ నేటి కాలపు ఆడపిల్లల కున్నట్లుగా సోదరుల స్నేహితులతో స్నేహపూర్వకమైన సత్సంబంధాలుండేవని తెలుస్తోంది.

---

1. భార. సం. పుట122 2. భా. సం. లో. స్త్రీ. పుట 122 3. అదే. పుట. 123

68 మద్రదేశపు స్త్రీల లైంగిక సంబంధాల విశృంఖలత భారత కాలంనాటికే పేరు మోసింది.అయినా అటువంటి మద్రరాజ పుత్రితో పాండురాజు వైవాహిక సంబంధాన్ని యేర్పరచుకొన్నాడు.

69 మాహిష్మతీ పట్టణం లోని స్త్రీల 'స్వైరిణీత్వం' ఆమోదింప బడాలని అగ్నిదేవుడా పట్టణరాజును కోరుతాడు.అంగీకరింప జేస్తాడు. అంటే వ్యభిచారం నాడు చట్టబద్ధమైనది.( అన్ని చోట్లాకాదు) సంఘం ఆమోదించ నందుననే అగ్ని ఆ విధంగా కోరవలసి వచ్చింది.

70 అవాంఛిత శిశువులను చెత్తకుండీలలో పడవేసే తల్లులను గూర్చి నేడు మనం అప్పుడప్పుడూ వింటున్నాం.భారత కాలంలో కూడా అటువంటి తల్లులుండి నారని తెలిసి ఆశ్చర్యం కల్గుతుంది.శకుంతలను కని, మేనక వదిలేసి వెళ్లిపోయింది. 'జానపది' అనే యువతి అలా వదలి వెళ్లిన శిశువులే కృపి, కృపుడు.

71 భారత కాలంలో జరిగిన యుద్ధాలలో పురుషులు నశిండం వల్ల, వారి సంఖ్య తక్కువై నందువల్లనే స్త్రీలలో వ్యభిచార మెక్కువైంది.

"మహాభారతము నాటికి దేశము నందనేక యుద్ధములై పురుషసంతతి నశించుటచే స్త్రీలలో వ్యభిచారమెక్కువై సంకర సంతానమెక్కువైనది. మహా యుద్ధములచే ననేకరీతుల సంతతి కలిగినటు లాదిపర్వము నందును, శాంతిపర్వము నందును గాథలు గలవు. ఔర్వ, పరశురామ సగరుల గాథల బరిశీలించినచో నీ సంగతి తెలియనగును."[1]

72 ఆర్థిక హక్కుల విషయంలో నాడు పురుషునిదే సర్వాధికారం." ఆనాటి ఆస్తి, వారసత్వ చట్టాలను పరిశీలించినా పురుషాధిక్యత, అందునా బ్రాహ్మణాధిక్యత కనిపిస్తుంది."[2] స్త్రీలకు ఆస్తిగాని, వారసత్వాధి కారంగాని లభించిన ఉదాహరణలు భారతంలో లభింపవు.

73 గురుపుత్రితో వివాహం నాడు నిషిద్ధం. ఈ కారణంగానే కచుడు దేవయానిని తిరస్కరిస్తాడు. ఉదంకునికి తన కుమార్తెనీయడానికి గౌతముడీ నిషేధాన్ని సడలిస్తాడు.

74 సనామయైన కన్యనే వివాహం చేసుకొనే ఆచారం కూడనాడు అరుదుగా కన్పిస్తుంది. ఉదా:- జరత్కారువు జానపద సంస్కృతి దీనికి కారణం.

75 భర్తల, పెద్దల వంశవృద్ధికాంక్ష స్త్రీలను మానసిక హింసకు గురిచేసినా ధిక్కరించే ధైర్యం వారికుండేది కాదు.అందువల్ల వాళ్లు ఇతర ఉపాయాలన్వేషించి

1. మ. భా. చ. పుట. 54 2. భారతీయ సంస్కృతి పుట 78

ఇష్టం లేని సమాగమాలను తప్పించుకొనేవారు. అత్తగారి ఆజ్ఞమేరకు రెండవసారి వ్యాసుని సమాగమానికి ఇష్టపడని అంబిక తన దాసిని పంపుతుంది.అయినా భర్త నిరంకుశాధికారం వల్ల ఆమె కతనితో సంతానం పొందక తప్పలేదు.

76 బ్రహ్మజ్ఞానులు, బ్రహ్మచారులైన మునులు, ఋషులు కూడ రాజుల పెద్దల అభ్యర్థనను మన్నించి తమ బ్రహ్మచర్యాన్ని తాత్కాలికంగా 'త్యాగం' చేసేవారు. ఉదా:- వ్యాసుడు. బ్రహ్మర్షియైన వశిష్ఠుడు కల్మాషపాదుని భార్య మదయంతికి సంతానాన్ని ప్రసాదించాడు.

77 ఋతుమతులైన స్త్రీలు ఏకవస్త్రలుగా ఉండే ఆచారం ఆ నాడు ఉండేది.వారు ఆ రోజుల్లో పదిమంది లోకి రావడం నిషిద్ధం. ప్రాతిగామి తనను కౌరవసభకు రావలసిందన్న దుర్యోధనుని అజ్ఞ విన్పించగా ద్రౌపది పై కారణం చెబుతుంది.

78 స్త్రీల జీవితంలో అతి సహజమైన శారీరక ధర్మమైన ఋతుమతీత్వం భారతంలో పలుచోట్ల ప్రస్తావించబడింది. ఉదా:- గిరిక, సత్యవతి, ద్రౌపది.

79 పురుషులకు, ఋషులకు స్త్రీలను చూడగానే "రేతః స్థలనం" కల్గినట్లుగా భారతంలో ఎన్నోసార్లు ప్రస్తావించబడింది. చాలా 'పచ్చి' గా ఈ విషయాలను ప్రస్తావించడానికి కారణం పురాణ రచనలలోని మొరటుదనం. పురాణేతిహాసాల రచనలలో ఉచితానుచితాల ప్రసక్తి లేనే లేదు. స్త్రీ పురుష సంబంధాల విషయాలను, కామసంబంధమైన విశృంఖలత్వాన్ని, దాపరికం లేకుండా ఇతిహాసకారులు చిత్రించడానికి కారణం వారిది కావ్యదృష్టి ప్రధానమైన రచనకాదు, యదార్థకథనమే వారిలక్ష్యం.

80 పశుపక్ష్యాదులు స్త్రీపాత్రలు కావటం నదులు స్త్రీలుగా మారటం భారతంలో కన్పిస్తుంది. ఈ పాత్రలన్ని ఏదో ఒక ధర్మాన్ని స్థాపించడం కోసమో, సందేశాన్నియడం కోసమో సృష్టించబడ్డాయి. ఉదా : కపోతి, వ్యాఘ్రమాత, గోరువంకపూజని.

81 ఒకే పాత్రకు వివిధ పేర్లుకన్పిస్తాయి. ఉదా:- మత్స్యగ్రంధి , యోజనగంధి సత్యవతి ఇవి వారి సాంఘికస్థితిని సూచించేవిగా ఉన్నాయి.

82 స్త్రీపాత్రలలో చాలాపేర్లు గుణాత్మకంగా ఉన్నాయి. ఉదా:- సిద్ధి, బుద్ధి, మర్యాద, ధృతి, మతి, కీర్తి. కొందరి స్త్రీల పేర్లు వైదికనామాలు. శృతి, మేధ, శ్రద్ధ మొ॥ భారతంలో సంకేతాత్మకత వేదాన్ని ఆశ్రయించి ఉండటం వల్ల తత్సంబంధమైన పేర్లు కొన్ని కన్పిస్తాయి. అలాగే చారిత్రకత ఉంది కనుక చరిత్ర

సంబంధమైన పేర్లు కొన్ని కన్పిస్తాయి. జానపదాత్మకత ఉంది. కనుక జానపదానికి సంబంధించిన పేర్లున్నాయి.

83 స్త్రీ పాతలలో కొన్ని పేర్లు తండ్రిని సూచిస్తున్నాయి. ఉదా:- కుంతి, ద్రౌపది. తల్లిని సూచించే కొడుకుల పేర్లున్నాయి. గాంగేయుడు, సాత్యవతేయుడు, పార్థుడు మొ॥. కాని తల్లిని సూచించే స్త్రీల పేర్లు మాత్రం లేవు.

84 ఇతిహాసకారుడు స్త్రీని సంఘానికి, కామానికి, బలమైన ఆకర్షణకు సంకేతంగా భావించాడు. అందుకే ఎంతటి వారైనా దీనికి అతీతులు కారని చెప్పడం కోసమే 'రేతః పతనాన్ని' గురించిన సందర్భాలు చాలాసార్లు చెప్పాడు. 'స్త్రీ' అనగానే ఆమె శారీరిక సౌందర్యం,ఆకర్షణ పురుషుని కంటికి కన్పిస్తాయే తప్ప ఆమె 'మనస్సు' గురించి పట్టించుకోని పరిస్థితులే నాటి నుండి నేటిదాకా కొనసాగుతున్నాయి.

85 స్త్రీని కించపరచే సంబోధనలే భారతంలోను పురాణేతిహాసాలలోను అడుగడుగనా కానవస్తాయి. ఉదా:- సుశ్రోణీ, కామిని, మదిరాక్షి, గజగామిని, మదిరేక్షణ ఇత్యాదులు.

86 'పాణిగ్రహణం' చేస్తే భర్త అయినట్లు దేవయాని చెబుతుంది. ఇదీ జానపద సంస్కృతి నుండే వచ్చింది.

87 బ్రాహ్మణ్యాన్ని స్థాపించడం కూడ నాటి సంస్కృతిలో విరివిగా కానవస్తుంది. బ్రాహ్మణుణ్ణి చేసుకోవడం ద్వారా నిషాది పవిత్రురాలైంది. కథలో ఇది ముఖ్యమైన అంశం. (గరుత్మంతుని వృత్తాంతం- ఆది పర్వం). ఇది ఇతిహాస రచనలో సాధారణ సూత్రంగా ఉంది.

88 స్త్రీలు చపలచిత్తులుగా, వ్యభిచార ప్రవృత్తి కలిగి ఉండేవారుగా,పురుషుని కన్న ఉద్ధృతంగా 'కామం' (అష్టగుణ కామం) కలవారుగా, పురుషుని చూస్తే చాలు, స్త్రీలు శృంగార భావాలతో పరవశించిపోతారని భారతంలోని పంచచూడా వృత్తాంతంలో చెప్పబడింది. స్త్రీల పట్ల ఇంతకన్న అవమానకరమైన, దారుణమైన, హేయమైన విమర్శ మరొకటి లేదు. ధర్మజుడూ, భీష్ముడూ నారదుని కథనాన్ని సమర్థిస్తారు.

89 "విడాకుల ప్రస్తావన అన్ని ధర్మశాస్త్రాలలోనూ ఉంది. భర్త విదేశాలకు వెళ్లిపోయినా, ఏడు సంవత్సరాల పాటు అదృశ్యమైనా, స్త్రీ తిరిగి వివాహం చేసుకోవచ్చు. వితంతు పునర్వివాహాన్ని మనుస్మృతి, యాజ్ఞవల్క్యస్మృతి

నిషేధించాయి. కాని నారద స్మృతి అంగీకరిస్తుంది. పరాశర స్మృతి కూడ ఆమోదిస్తుంది". [1]

భారతంలో గంగ శంతనుని పరిత్యజించటం, అతనితో తన వివాహ సంబంధాన్ని రద్దు చేసుకోనటం విడాకులివ్వటమే. జరత్కారువు భర్త ఆమెను పరిత్యజించడం విడాకులీయడమే.

90 వివాహ సంబంధం రద్దైనా స్త్రీలకు సంతానం పట్ల మమకారం పోదు. శంతనుణ్ణి విడిచిపెట్టినా గంగ తనకతని వల్ల కలిగిన పుత్రుణ్ణి సకల విద్యా పారంగతుని, సాటిలేని ధనుర్విద్యానిపుణుని చేసి, తిరిగి అతనికి అప్పగిస్తుంది. భారతంలోని ఈ రెండు విడాకుల సందర్భాలలోను అతిస్వల్ప కారణాలే చూపబడినాయి. జరత్కారువు తనను నిత్యకర్మ నిమిత్తమే నిద్రలేపినా భర్త ఆమెను పరిత్యజిస్తాడు. తన స్వేచ్ఛను భర్త ప్రశ్నించినాడని లేదా అడ్డుకొన్నాడని, గంగ అతన్ని విడిచిపెడుతుంది. జరత్కారువు తన సోదరుని అండతో తన కుమారుని పెంచి పెద్దజేస్తుంది.

91 బిడ్డల పెంపకంలో స్త్రీలే పురుషులకన్న మిన్నగా తమ యోగ్యతను నిరూపించుకొన్న వృత్తాంతాలు, మగవాడి అండలేకపోయినా ఆడది అబల కాక సబలగా గృహ నిర్వహణ సమర్థవంతంగా నిర్వహించి రాణించిన సంఘటనలు స్త్రీశక్తిని, మాతృస్వామ్యం గొప్పతనాన్నీ ఋజువు చేస్తాయి. గంగా జరత్కారువులే గాక సత్యవతి, కుంతి ఇందుకు బలమైన సాక్ష్యాలు.

92 ఇవి ఇలా ఉండగా పుట్టిన బిడ్డలను పుట్టినట్లే ఏటిపాలు చేసిన గంగమ్మలూ, భర్తతో కాపురం చేసి, బిడ్డలను కని , వారు పెద్దవారైన తర్వాత భర్త మీది రోతతో ఆ బిడ్డలతోనే భర్తను ఏట్లో త్రోయించిన ప్రద్వేషిణులూ భారత కాలంలో ఉన్నారు.

93 స్త్రీ వల్లనే తపోభంగం ఋషులకు కల్గిందని పెక్కు సందర్భాలలో నొక్కి చెప్పడం ద్వారా స్త్రీ వల్లనే పురుషుడి ఆధ్యాత్మిక ప్రగతికి అవరోధ మేర్పడుతుందని నాడు నిర్ధారించడం జరిగిందని వ్యక్తం చేస్తున్నది.

94 ద్విరూపధారణ కొన్ని స్త్రీ పాత్రలలో కన్పిస్తుంది. గంగ స్త్రీ గాను, నది గాను చిత్రించబడింది. సరస్వతీ నది స్త్రీగా అవతరించి మునుల సాంగత్యంతో బిడ్డలను కంటుంది. గంగ శాపంతో అంబ నదిగానూ, తన తపోబలం వల్ల స్వీయ రూపంతోను ఉన్నట్లు చిత్రించబడింది. ఓఘవతి కూడ నదిగానూ మారుతుంది.

1. భారతీయ సంస్కృతి పుట 78

అదే సమయంలో భర్త సాన్నిధ్యాన్ని కల్గి ఉంటుంది.

95 స్త్రీలు పురుషులుగా మారటం శిఖండి వృత్తాంతంలోనూ, పురుషులు స్త్రీలుగా మారటం భంగ్వాసనుని విషయంలోనూ,స్థూల కర్ణుడనే యక్షుని విషయంలోనూ కన్పిస్తుంది.

96 భారత కాలంలో మృతులకు తిలోదక ప్రదానం చేసే క్రియాకలాపంలో స్త్రీల ప్రాతినిధ్యం కన్పిస్తున్నది. కురుక్షేత్ర యుద్ధానంతరం ధృతరాష్ట్రుడు గాంధారీ సహితుడై, పాండవులు భార్యా సహితులై పిండ ప్రదానాదికాలు చేసినట్లు వ్రాయబడింది. తరువాతి కాలంలో ఇది క్రమంగా అంతరిస్తూ వచ్చింది.

97 క్రూరాత్మలై వ్యాధి రూపాలై శిశువులను పీడించి ఆ విధంగా శాశ్వత స్థానాన్ని (దుష్కీర్తిని) చరిత్రలో పొందాలని కాంక్షించిన సప్తమాతృకలు ఆ కాలం లోని వారే.

98 దిక్కులకు సంబంధించిన స్త్రీలూ నాడున్నారు. ఉదా :- ఉత్తర దిశ

99 వర్ణ వ్యవస్థ యొక్క భయంకర రూపం సమాజ స్వరూపాన్ని విషయుక్తం చేయడం, అగ్ర వర్ణాల వారిచే క్రింది వర్ణాల వారు అవమానింపబడటం, క్రింది వర్ణాల వారిలో అగ్రవర్ణాల వారిపట్ల ఏహ్యాభావం, తిరస్కార పూరితమైన ధోరణి, ఫలితంగా పరస్పర విద్వేషాలు - ఇవి స్త్రీ పాత్రలలోనూ ప్రతిఫలించాయి. దేవయాని తాను బ్రాహ్మణ కన్యనన్న ఆభిజాత్య గర్వంతో శర్మిష్ఠ కట్టిన మైలబట్టలు తాను కట్టనంటుంది. దాంతో ఆమె దేవయానిని ఈసడించి, బావిలో త్రోయించి వెళ్తుంది. తాను బ్రాహ్మణ కన్య కాబట్టి ఉన్నతురాలినన్నది దేవయాని భావన. బ్రాహ్మణ ఔన్నత్యాన్ని స్థాపించే అంశాలలో ఇదీ ఒకటి. కాని ఇతిహాసకారుడికి బ్రాహ్మణుడి కంటె బ్రాహ్మణ్యం పైనే గురి.

100 గోవులకు, గోమాతలకు ఆనాడు ఎంతో ఉన్నతస్థానం ఇవ్వబడింది. గోలోకం ఊర్ధ్వలోకాలలో అన్నిటి కంటె ఎత్తైనది. గోలక్ష్మీ సంవాదంలో లక్ష్మీదేవిని తమ మూత్ర పురీషాలలో ఉండమని గోవులు అనుమతించడం, అందుకు లక్ష్మి సంతోషంగా అంగీకరించినట్లు చిత్రించడం- గోవుల ఔన్నత్యాన్ని నిరూపించే అంశం. భారతీయ సంస్కృతిలో గోమాత స్థానం నేటికీ ఎంతో ఉన్నతమైనది. గోవును మాతృ స్థానంలో గౌరవించడం అనాదిగా కొనసాగుతున్న సంప్రదాయం.

101 విద్యా విషయానికి వస్తే స్త్రీలు విద్యలు నేర్చినట్లుగా పేర్కొన్న ఎలాంటి ఉదాహరణాలూ భారతంలో కన్పించవు. నాడు గురుకులాలలో విద్య నేర్వవలసిన పరిస్థితి ఉండింది. బాలికలకు గురుకులాలలో ప్రవేశం లేదు. వేదకాలంలో

విద్యావతులై బ్రహ్మవాదినులైన 'ఋషికలు' దాదాపు పదిమంది దాకా పేర్కొనబడినారు. ఆ తర్వాత పురుషాధిక్య వ్యవస్థ స్త్రీలను అణగార్చటంతో వారు కేవలం వంట యింటికి, గృహకృత్యాలకు, సమాజ సేవలకు పరిమితమయ్యారు. ఆధ్యాత్మిక విద్యానిపుణయైన సులభ ప్రశంస మహాభారతంలోనే ఉంది. ఆమె జనకునితో అతని ఆస్థానంలోనే అతనితో అనేక ఆధ్యాత్మ ఆముష్మిక విషయాలు చర్చించి అందరి ప్రశంసలు పొందుతుంది.

"భారతంలో స్త్రీలు కూతుళ్లుగా, ప్రేయసులుగా, భార్యలుగా, తల్లులుగా రకరకాల మానవ సంబంధాలలో కనబడతారు. కానీ వాళ్ల చదువుల ప్రస్తావన మాత్రం అసలే లేదు. పెళ్లయ్యే వరకు స్త్రీలకు క్షాత్ర విద్యలుండవు, బ్రహ్మ విద్యలుండవు. మరి ఉండే విద్యయేమిటి? పెళ్లయిన తర్వాత బాధ్యతతో చేయవలసిన గృహకృత్యాలకు తగిన శిక్షణ. కుంతి శూరుడి పెద్ద కూతురు. వసుదేవుడి సోదరి. ఆమెను శూరుడు పెంచుకొనటానికి తన మేనత్త కొడుకైన కుంతిభోజుని కిచ్చాడు. ఆ రకంగా ఆమె కుంతి అయ్యింది. ఆమె అసలు పేరు పృథ. తండ్రి యింట్లో ఉండి అతని ఆజ్ఞానుసారం అమె చేసిన పని ఏమిటంటే అనేక మంది బ్రాహ్మణులకు, అతిథులకు ఎడతెగకుండా ఇష్టమైన విందు భోజనాలు యేర్పాటు చేయించి వడ్డించటం. అంటే కుంతిభోజుడు కూతురిని క్షణం తీరిక లేని ఇంటి పనులలో నియమించాడన్న మాట. తన పెంపకంలో అతనామె కిచ్చిన శిక్షణ ఇది. ఇదే ఆమె విద్య.

స్త్రీలందరికీ ఇదే విద్య. కనుకనే అరణ్య పర్వంలో ద్రౌపది ఈ రకమైన విద్యానిబద్ధత వల్లనే స్త్రీలు పురుషుల - ప్రేమకు పాత్రులు కాగల్గుతారని సత్యభామకు అధికారికంగా చెప్పగలిగింది"[1]

"సంసార లంపటత్వం నుండి బైటపడి, సాత్విక ప్రవృత్తి నలవరచుకొని ఉత్తమ పౌరునిగా రూపొందాలనేది ఆశ్రమ ధర్మంలోని అంతరార్థం. ఈ ఆశ్రమ జీవిత సౌకర్యం కూడ శూద్రులకు, స్త్రీలకు లేదు. వారు యావజ్జీవితం సమాజానికో, కుటుంబానికో సేవ చేస్తూ తనువు చాలించవలసిందే. స్త్రీలకు, శూద్రులకు వేదాధ్యయన హక్కు లేదు. గనుక వారికి ఇతరుల వలె మోక్ష ప్రాపిక్తి కూడ అవకాశం లేదు."[2]

సుభద్ర రథం తోలే విద్య నేర్చినట్లుగా వివాహానంతరం అర్జునుని కామె సారథ్యం చేయడం వల్ల తెలుస్తుంది.

1. సం. సా. స్త్రీ. వా. దృ. పుట. 40 2. భార. సం. పుట. 82

నృత్యగానాదులైన లలిత కళలు స్త్రీలు నేర్చినట్లుగా మాత్రం ఒకటి రెండు ఉదాహరణాలు లభిస్తున్నాయి. విరాటుడు తప కుమార్తె ఉత్తరకు నాట్యం నేర్పటానికి బృహన్నలను నియమిస్తాడు. భారతంలోని అరణ్యపర్వంలో ఎఱ్ఱన వ్రాసిన రామాయణ గాథలో రావణ కుంభకర్ణ విభీషణుల తల్లులైన పుష్పోత్కట, మాలినీ, పా(బ)కలు తమ నృత్యగానాదులచే పులస్త్యుని మెప్పించినట్లుగా పేర్కొబడింది.

102 సతీ సహగమనం భారత కాలంనాటికి నిర్బంధమైన అచారం కాదు. మాద్రి ఇచ్ఛాపూర్వకంగా తనకుతానే ఆ శిక్ష విధించుకొన్నది.

103 భార్య అన్న పదానికి పర్యాపదంగా వాడబడిన ఇతర శబ్దాలు నాడు వివాహంతో కుటుంబంలో ఆమెకు లభించిన స్థానాన్ని తెలియజేసేట్లుగా ఉన్నాయి. ఈ వ్యుత్పత్తులు గమనించండి.

1. పత్ని - ఈమెతో పతికి యజ్ఞ సంయోగమున్నది.[1]
2. ద్వితీయ -యజ్ఞాధికార ఫలమును పొందునపుడు పతితో కూడ తాను రెండవది.[2]
3. సహధర్మిణి - పతితో కూడ దానయజ్ఞాది ధర్మములు కలిగినది.[3]
4. పురంధ్రి - పురమును అనగా గృహమును ధరించునది.[4]
5. కులపాలిక - కులమును రక్షించునది.[5]
6. కుటుంబినీ } గేహస్తురాలు, పురంధ్రి.[6]
7. గృహిణీ }
8. వల్లభ
9. ప్రియ
10. దయిత
11. రమణీ } ప్రియురాలైన పెండ్లాము.[7]
12. ఇష్టా
13. ప్రణయినీ
14. ప్రేయసీ

104 స్త్రీఅన్న పదానికున్న వ్యుత్పత్తిని, ఇంకా స్త్రీకి పర్యాయపదాలుగా వాడబడిన అనేక ఇతర నిర్వచనాలను పరిశీలిస్తే అవన్నీ పురుష సంబంధం చేత ఏర్పడిన వ్యుత్పత్తులే. పురుషాధిక్య సూచకాలే.

---

1 నుండి 5 వరకు గురుబాల ప్రబోధిని పుటలు 354, 55, 56
6. భార.సంలో స్త్రీ. పుట. 142 7. అదే. పుట. 143
8. గుతు బాల ప్రబోధిని పుట 353

"స్త్యాయతి సంఘాతో భవతి అస్యాం గర్భః ఇతి స్త్రీ " 1

ఈమె యందు గర్భము పెరుగును అని వ్యుత్పత్తి.

"స్త్రీ నామము లిట్లు నిర్వచింపబడినవి - గర్భమును ధరించునది, పురుషునితో కూడినది, అల్పమైన బలము కలది, పురుషుని స్వవశమున త్రిప్పుకొనునది, భర్త చేత భరింపబడునది, పురుషుని పొందునది, పూజింప బడునది, కోరబడునది, లెస్సగా నాదరింపబడునది, నాయకుని రమింప జేయునది- ఇత్యాదిగా స్త్రీ పర్యాయపదానికి వ్యుత్పత్తులు కానవచ్చుచున్నవి.[1] వీనిలో కొన్ని ప్రవర్తనకు సంబంధించినవి, అనేకము సౌందర్య, ఆకర్షణాదులకు సంబంధించినవి" [2]

భారతం లోని స్త్రీ పాత్రల అధ్యయనం ద్వారా నాటి సంస్కృతిలో స్త్రీల కీయబడిన స్థానాన్ని గూర్చి చర్చించి నిగ్గు తేల్చిన సత్యాల నింతవరకూ పేర్కొనటం జరిగింది.

ఇక భారతీయ సంస్కృతిలో స్త్రీలకు మహోన్నత స్థానమీయబడిందని ఘంటాపథంగా పేర్కొన్న విమర్శకుల అభిప్రాయాలు ఈ సందర్భంగా గుర్తు చేసుకొనదగినవి.

105. "భారతీయ సంస్కృతిలో భార్యాభర్తలు ఉత్తమ సంస్కారాలు పొంది తమ జీవిత సారాన్ని కుటుంబం కోసం వినియోగించాలనే మహోన్నత లక్ష్యాన్ని కల్గి ఉండటం వల్ల ఇతర అల్ప విషయాలు తమ ప్రాముఖ్యం కోల్పోతాయి. సంతానోత్పత్తి భార్యాభర్తల ఇంద్రియ తృప్తి కోసం కాక పరమేశ్వర కార్యంలో అదొక భాగమవుతుంది. భారతీయుల సంతానం తల్లిదండ్రుల రెండు శరీరాలను ఒక భాగంగా రూపొందిస్తుంది. దీన్ని బట్టే ఆపస్తంభ సూత్రంలో "జాయాపత్యోర భేదః" అని చెప్పబడినది.[2]

106. "కవిత్రయంవారికి భారతస్త్రీ పాత్రలందు ప్రత్యేక గౌరవాదరములు గలవు. తమ కాలము నాటికి సంఘములో వచ్చిన మార్పులను దృష్టిలో పెట్టుకొని మాత్రమే వారుపాత్ర నిర్మాణాదులలో కొన్ని మార్పులు చేసిరి.నన్నయ శకుంతలను, శర్మిష్ఠా దేవయానులను తదితర పాత్రలను దీర్చిన తీర్పులో పై యభిప్రాయమును విస్పష్టముగా కానవచ్చును. నన్నయ, తిక్కన, ఎఱ్ఱనలు తమ రచనా ప్రారంభము లందు దేవతా ప్రార్థనా రూపమున స్త్రీమూర్తులను సముచిత స్థానమిచ్చి గౌరవించిరి." [3]

---

1.యదార్థభారతి. ఆగస్టు. 2. మహా.భార. మ. పుట.5

3. కు.వ్య. అవసరమా. పుట 29

"ధర్మసూక్ష్మాలు తెలుసుకోవడానికి ఋషులందరూ వశిష్ఠుని ధర్మపత్ని అయిన అరుంధతి వద్దకు వెళ్లారట."[1]

" శివపార్వతుల సంవాదం మహాభారతం లోని ఒక రసవత్తర ఘట్టం. పరమేశ్వరుడు పార్వతితో సృష్టిగురించి వివరిస్తూ ఇలా అంటాడు.- "నా శరీరంలో సగం నీ శరీరంలో సగం నుండి తయారయింది."[2] ఆదర్శవంతమైన భారతీయ మహిళ గురించి మాత్రమే కాదు, జీవితానికి సంబంధించిన అనేక రంగాలగురించి అనేక విషయాలు ఆ ఘట్టం ద్వారా మనకు తెలుస్తాయి."

110 " మరో ఉపాఖ్యానంలో స్వర్గానికి వెళ్లున్న మనువు పురుషునికి స్త్రీని అప్పచెప్తూ ఆమెలో గల ఉన్నత లక్షణాలను, సహజమైన బలహీనతలను వివరిస్తాడు. చివరకు ధర్మానికి ఆధారమూ, ఫలస్వరూపమూ అయిన స్త్రీని తప్పక రక్షించాలని అంటాడు. మహాభారతమంతా ధర్మంయొక్క ప్రాధాన్యతను, ధర్మాచరణ ప్రాధాన్యతను వివరించడానికి వ్రాయబడిందా అని మనకు సందేహం కలుగుతుంది."[3]

111 " విదురనీతిలో విదురుడు స్త్రీలను సంరక్షించాలని స్పష్టంగా చెప్తూ, ఎందుకంటే వారు ఆరాధ్యులు, పవిత్రులు, అదృష్టప్రదాతలు, గృహానికి వెలుగునిచ్చేవారు, గృహలక్ష్మిగా ప్రకాశించేవారు అని వివరిస్తాడు."[4]

ఉద్యోగ పర్వంలో ధృతరాష్ట్రునికి ఉచితసలహాలనిస్తూ సనత్సుజాతుడు ప్రపంచంలో పదమూడు రకాల దుర్మార్గులు ఉన్నారంటారు. అందులో ఒక రకం స్త్రీలను ద్వేషించేవారు."[5]

"మరో ఉపాఖ్యానంలో ఆశ్చర్యకరమైన ఉదంతమొకటుంది. స్త్రీలందరూ ధర్మాన్ని తు.చ. తప్పకుండా పాటించడంతో సమాజంలో పాపం చేసేపురుషులే లేరట. అప్పుడు దేవతలు బ్రహ్మదేవుని వద్దకు వెళ్లి స్వర్గంలో రద్దీ ఎక్కువైపోతోందని నివేదించుకొన్నారట .అప్పుడు కృత్య పేరుగల రాక్షసిని బ్రహ్మదేవుడు సృష్టించాడట. ఆమె పిల్లలు ధర్మమార్గం నుండి పురుషులు వైదొలగేటట్లు ప్రలోభాలను కలిగిస్తారట. ఈ కథ ద్వారా తెలిసే ముఖ్య విషయమేమిటంటే పురుషుల మంచితనం స్త్రీల మంచితనం పై ఆధారపడి ఉందని, మౌలికంగా స్త్రీ చెడుగా ప్రవర్తించలేదని."[6]

"మహాభారత కాలం నాటి స్త్రీలు విద్యావంతులుగా, పరిపాలనా

---

1. మభామ. పుట 192.యు.యు. భా. నా. పుట 34 3,4,5. అదే పుట 35
6. యు.యు.భా. నా. పుట 35.

దక్షులుగా, ప్రతిభా సంపన్నులుగా పేరొందారు. తండ్రులపై, కుమారులపై, భర్తలపై తమ ప్రభావాన్ని చూపించేవారు." 2 మొత్తంమీద మహాభారత కాలంలో స్త్రీలను గౌరవించేవారనీ, స్త్రీలకు తమ జీవితాదర్శం సుస్పష్టమనీ మనకు తెలుస్తుంది."3

"వనవాసానికి వెళ్లిన మొదట్లో పాండవులకూ ద్రౌపదికీ ద్యూతం, దాని పరిణామాలను గూర్చిన చర్చ జరుగుతుంది. ఆ చర్చలో పాండవులు ద్రౌపదిని ధర్మార్థకుశలే, మహాప్రజ్ఞే, పండితే వంటి పదాలతో సంబోధించడం మనం చూడవచ్చు."[1]

" వేదకాలంనుండి మహాభారత కాలం వరకూ స్త్రీలకే కాదు, యావత్-భారత సమాజానికి ఉజ్జ్వలమైన, వైభవోపేతమైన సమయం. స్త్రీపురుషు లిద్దరూ ధర్మాన్ని ఆచరిస్తూ ఉండేవారు.యావత్ సమాజానికి విశ్వంపై సమగ్రమైన దృక్పథం ఉండేది." [2]

" స్త్రీలు సర్వదోష నిలయములని యున్నను, భారత కాలమున స్త్రీ గౌరవం మిక్కిలిగా పాటింపబడినట్లు తెలియును. కలకంఠకంఠి కంట కన్నీరొలికిన సిరియింట నుండనొల్లదను విషయము పెక్కుచోట్ల వివరింపబడినది. సావిత్రి, శకుంతల, తపతి, విదుల, సులభ, సుకన్య మొదలగు వారి చరితముల వల్ల స్త్రీ యత్యున్నత గౌరవదశ ననుభవించు చుండెడి దనవచ్చును." [3]

" భారత స్త్రీలు మొత్తముపైన ధర్మ- అర్థ-కామ మోక్షములను లక్ష్యముగా జేసికొని ప్రవర్తించిన స్త్రీలు"

"స్త్రీ యన్నది శక్తి స్వరూపిణి. అది యొకప్పుడు స్వయంశక్తి స్వరూపిణియగును. మరొకపుడు పురుషునిలోని శక్తికి స్వరూపమిచ్చి విజృంభింప జేయును. మహాభారతమంతయు నీ శక్తి విజృంభణమే యన్నట్లు గన్పడును." [4]

" స్త్రీ యరిషడ్వర్గమునకు మొదట సులభముగా గురియగును. దానికి సహనము సైతము మెండు.ఆ సహనముతో తనశక్తిని మహాశక్తిగా రూపొందించు కొని మహోదారయై చిచ్ఛక్తియై దివ్యవిజ్ఞానమును బ్రకాశింపజేసి, లోకమునంతయు రసైక తానముగ జేయును. ఈ విషయము మహాభారతమున సుస్పష్టము." [5]

"రామాయణ భారతములు భారతీయ సంస్కృతికి అమృత కలశములు"[6]

"శూద్రస్సాధుః కలిస్సాధుః సాధుస్సాధ్వశ్చ యోషితాః" అని వ్యాసుడు

1. అదే పుట.36  2.. అదే పుట.40  3,4మహా.భా.వి.వి.కో.పుట.283
5.అదే.పుట.284  6.సజీవశిల్పాలు పీఠిక.

చెప్పాడని భగవద్గీతా హరికథా మంజరిలో కీర్తిశేషులు హెచ్. సుబ్రహ్మణ్యశాస్త్రిగారు ప్రస్తావించారు..

శూద్రులుత్తములని, కలియుగం ఉత్తమమైనదని, స్త్రీలు ఉత్తములలో కెల్లా ఉత్తములని పై శ్లోక భావము.

ఈ సమస్త విషయాలనూ సావధానంగా లోతుగా పరిశీలిస్తే స్త్రీలకత్యున్నత స్థానం వేదకాలంలో ఇవ్వబడిందనీ, క్రమేణా పురుషాధిక్యత, పురుషస్వామ్యవ్యవస్థ భారత కాలంనాటికి చోటుచేసుకొని, వృద్ధిపొందుతూ వచ్చిందని తెలుస్తుంది. అంతేకాదు, స్త్రీలపై అత్యాచారాలు, స్త్రీలను శారీరక, మానసిక హింసకు గురి చేయడం, వారిని ఇంటిపనికే పరిమితం చేయటం, అణచివేత, సమాజంలోగాని, శాసనాధికారాలలో గాని స్త్రీలకు భాగస్వామ్యమన్నదే లేకుండా చేయడం- ఇవన్నీ భారతకాలంలోని స్త్రీల దుస్థితి కద్దం పడుతున్నాయి.

అయితే భారతీయ సంస్కృతీవైభవానికి, విశిష్టతకూ మూలస్తంభాలైన స్త్రీల మహోన్నత వ్యక్తిత్వపు ఉజ్జ్వల కాంతులు భారతమంతా వ్యాపించి ఉన్నాయి. స్త్రీ పాత్రలన్నీ అపురూపమైన, అపూర్వమైన, అద్వితీయమైన వ్యక్తిత్వసంపదతో అలరారుతూ ఉన్నాయని, సహనం, త్యాగం, ప్రేమా, సేవాస్వభావం, కరుణ, నిస్వార్థభావం, సమయస్ఫూర్తి, కఠోరదీక్ష, కర్తవ్యనిర్వహణా సామర్థ్యం, బంధుజనుల పట్ల ప్రేమాదరాలు, దైవభక్తి, గురుజన శుశ్రూష, అన్నిటినీ మించిన పాతివ్రత్యం- ఈ సమస్త సద్గుణాలు రాశీభూతమైన రమణీయమూర్తులుగా భారతం లోని స్త్రీలు శోభించుతూ ఉన్నారని కూడ ఈ అధ్యయనం ఋజువు చేస్తుంది. మూడువందల అరవై స్త్రీ పాత్రలలో వేళ్లపై లెక్కపెట్టదగిన కొన్ని పాత్రలు - ప్రద్వేషిణి, ఊర్వశి, కద్రువ, సప్తమాతృకలు, మేనక, ఘృతాచి, జానపది మొదలైన అప్సరసలు మాత్రమే పురుషులకు నష్టమో, కష్టమో కలిగించిన పాత్రలు. ప్రద్వేషిణి భర్తను ఏటిపాలు చేసింది. ఊర్వశి వల్ల తాత్కాలికంగా అర్జునునికి పేడిరూపు (అదీ తాత్కాలికంగా కలిగి అతనికి ప్రయోజనకారే అయ్యింది.) సంభవించింది. కద్రువ శాపభయం వల్ల ఆమె కొడుకులలో ఒకడు అధర్మాచరణకు పూనుకొంటాడు. అప్సరసలు మునులకు తపోభంగం కల్గించినా అది ఇంద్రుని ఆజ్ఞవల్లనే తప్ప స్వభావసిద్ధంగా చేసిన పనికాదు. అది వారి 'విధి నిర్వహణ' లో భాగం.

తక్కిన స్త్రీపాత్రలన్నీ తమ వారికోసం, సమాజంకోసం, కుటుంబం కోసం తమ జీవితాలను కర్పూరంలాగ కరిగించినవే. తల్లిగా, చెల్లిగా, కుమార్తెగా, భార్యగా,

అత్తగా, కోడలిగా భారతంలోని స్త్రీ పాత్రలు ఆదర్శప్రాయమైన వ్యక్తిత్వాలతో విలసిల్లుతున్నాయి. స్త్రీల మహోదాత్త వ్యక్తిత్వ దివ్యదీప్తుల ముందు భారతం లోని పురుషుల పాత్రలన్నీ వెలవెల బోతున్నాయనడంలో ఆశ్చర్యంలేదు.

కన్యగా మత్స్యగంధి ప్రదర్శించిన సమయజ్ఞత, విజ్ఞతల ముందు పరాశరుడు, గాంధారి మహోన్నతమైన ధర్మపరాయణత ముందు ధృతరాష్ట్రుడు, కుంతి మహనీయత ముందు పాండురాజు, ద్రౌపదివిశిష్ట గుణాలముందు పాండవులు, శకుంతల పాతివ్రత్యం, ధర్మజ్ఞత ముందు దుష్యంతుడు, దమయంతీ సావిత్రుల సతీత్వం ముందు నలుడు, సత్యవంతుడు చంద్రుని ముందు నక్షత్రాలవలె ఎంతో అల్పంగా కనిపిస్తారు. భారతం లోని ప్రఖ్యాత పురుషులందరి విజయాలు, కీర్తి ప్రతిష్టల వెనుక అందుకు కారణమైన స్త్రీ మూర్తులు దివ్యదీప్తులతో దర్శనమిస్తారు.

వ్యాసమహర్షి పురుష పక్షపాతి అనీ, అందువల్లనే భారతంలో స్త్రీల అణచివేత, స్వాతంత్ర్యహీనత, తెరమరుగుతనం కన్పిస్తున్నాయనీ కొందరు స్త్రీ వాదులు చేస్తున్న వాదన సరికాదు.వ్యాసుడు స్త్రీ పక్షపాతి. కాకపోతే మహాభారత కథను గంగ పాత్రతో ప్రారంభించి ఉత్తర పాత్రతో ఎందుకు ముగిస్తాడు? ఇతిహాసకారుడు చేయవలసిన పని యదార్థకథనమే తప్ప కావ్యసృష్టికాదు. నాటి సమాజంలో స్త్రీల పరిస్థితి ఇతిహాసమైన వ్యాసభారతంలో చోటు చేసుకుంది.

విశ్వంలోనే విశిష్టమైన భారతీయ సంస్కృతీ మహనీయతకు భారత స్త్రీ పాత్రలు పట్టుగొమ్మలు.

# అధ్యాయం 5

# ఆంధ్రమహాభారతంలోని మాతృస్వామ్యలక్షణ రేఖలు

మహాభారతంలోని మాతృస్వామ్య వ్యవస్థ  క్షణాలను శోధించడానికి ముందు అసలు మాతృస్వామ్యవ్యవస్థ లక్షణాలేమిటో, చరిత్రకారులు, పరిశోధకులు దానిని ఏ విధంగా  నిర్వచించారో తెలుసుకొందాము.

"మాతృస్వామ్యవ్యవస్థలో తల్లే నాయకురాలిగా ఉండేది.మానవ అభివృద్ధి చరిత్రలో స్త్రీ ప్రధాననిర్మాత. ఆమెకృషి, ఆలోచన, విశాలత, సమిష్టిభావం, మానవ సమాజంలో వ్యవస్థా నిర్మాణానికి దోహదం చేసేది. అందుకే రాతియుగం వరకు స్త్రీలే సమాజంలో అన్ని రంగాలలోను ముందంజలో ఉన్నారు."[1]

" స్త్రీ వ్యక్తిత్వం పునాదిగా నడచిన వ్యవస్థను మాతృస్వామ్య వ్యవస్థ అని పిలిచేరు. ఆదిమ సామాజిక రూపానికి ఇది అత్యున్నతమైన వ్యవస్థ.సామాజిక భావాన్ని సహజంగానే కల్గిన స్త్రీ సమాజరూపాలను అనేకయుగాల్లో నిర్ణయించి, నిర్మించి, వాటి  పరిణామాలకు మూలశక్తిగా నిల్చింది."[2]

అంతేకాదు, శ్రీకత్తి పద్మారావుగారు ప్రాచీన భారతీయ సంస్కృతి మాతృ స్వామికమైనదేనని, ఆర్యులు పితృస్వామిక సంస్కృతిని భారతదేశానికి వలస తెచ్చారని, ఆ నాటి నుండి స్త్రీ మీద పురుషపెత్తనం మానవతా రహితంగా అన్ని రంగాల్లో, అన్ని దిశల్లో కొనసాగుతున్నదని పేర్కొన్నారు."[3]

" ప్రసిద్ధ చారిత్రకులు శ్రీ రాహుల్ సాంకృత్యాయన్ తన జగత్ప్రసిద్ధమైన నవల "ఓల్గా నుండి గంగా తీరము"లో రాతి యుగంలో మానవ గణాలకు స్త్రీయే నాయకత్వం వహించిందని వేటలో కూడ స్త్రీదే అగ్రస్థానం అనీ పేర్కొన్నారు.

".....అందరి కన్న ముందు బలిష్ఠమైన శరీరంగల ఒక స్త్రీ ఉంది. ఆమె కుడి భుజాన్ని చూస్తే ఆమె చాలా బలిష్ఠయని తెలిసిపోతుంది. ఆమె ఎడం చేతిలో  మూడుగజాల పొడవైనవాడి భూర్జవృక్షపు కర్ర ఉంది. ఒక పదునైన రాతిగొడ్డలి తోలుతో చేసిన తాడుతో ఆమె కుడి చేతిలోని కర్ర పిడికి కట్టబడిఉంది.

---

1.భారతీయ సం.లో.స్త్రీ.పుట.23  2.అదే.పుట.21  3.అదే.పీఠిక

ఆమె వెనుక నలుగురు పురుషులు, ఇద్దరు స్త్రీలు నడుస్తున్నారు......"[1]

పైనిర్వచనాలను దృష్టిలో ఉంచుకొని చూస్తే మహాభారతం మాతృస్వామ్య వ్యవస్థకొక బలమైన ఉదాహరణగా నిలిచిపోగల గ్రంథం. ఆది నుండి అంతందాకా స్త్రీపాత్రలు ఎంత శక్తివంతంగా కథను నడిపించినాయో పరిశీలిస్తే ఈ విషయం విదితమవుతుంది భారతంలోని స్త్రీపాత్రలలో అత్యంత ప్రధాన పాత్రలైన సత్యవతి. కుంతి పాత్రలకు పై లక్షణాలన్నీ సంపూర్ణంగా ఉన్నాయి. అసలు కౌరవ వంశస్థాపనకు బీజావాపన చేసింది సత్యవతి. తాను కన్యగా ఉన్నపుడు తనకు పరాశర మహర్షి వల్లజన్మించిన వ్యాసుని ఆజ్ఞాపించి, వితంతువులైన తన కోడళ్లు అంబిక, అంబాలికలకు నియోగ పద్ధతిలో సంతానం కల్గేటట్లు చేస్తుంది. మహాభారత నిర్మాతయైన వ్యాసుడు భారతంలో 'సాత్యవతేయుడు' గానే అధికంగా సంబోధింపబడినాడు.

ఇక కుంతి లేకపోతే పాండవుల కథలేదు. భారతంలో కౌరవ పాండవుల కథ సత్యవతితో ప్రారంభమై, కుంతితో కొనసాగి, ఉత్తరతో ముగుస్తుంది. 'ఉత్తర' అంటేనే తరువాతది అన్న అర్థం.ఉత్తరా గర్భస్థ శిశువైన పరీక్షిత్తే కురుక్షేత్ర యుద్ధానంతరం పాండవుల వారసుడు.దీన్ని బట్టి చూస్తే మహాభారతం మాతృస్వామ్య ప్రాతినిధ్యాన్ని విస్పష్టంగా చూపుతున్నది.

వ్యాసుడు మాతృవిధేయుడే అయినా ఆయన రచించిన భారతం ('జయం') లో మాత్రం పురుషాధిక్యత కొనసాగింది.స్త్రీ పాత్రలకు పురుషపాత్రల కివ్వబడినంత ప్రాముఖ్యం, ప్రాధాన్యం ఇవ్వబడలేదు. అయినా సత్యవతి, కుంతి. ద్రౌపది పాత్రల ప్రాధాన్యం తక్కిన పాత్రలపై ఆదినుండి అంతందాకా అడుగడుగునా మనకు ద్యోతకమవుతున్నది. చుట్టూ ఉన్న పురుషపాత్రల మధ్య ఆ స్త్రీపాత్రల ఉజ్జ్వల దీప్తులు భారత కథను జాజ్వల్యమానం చేస్తాయి.

సత్యవతి వ్యాసుని నియోగించక పోతే కౌరవవంశమేలేదు. కుంతి తోడ్పాటు లేకపోతే పాండురాజుకు సంతతే లేదు.వీరిద్దరూ విధవలే అయినా ఎంతో దక్షతతో కాగల కార్యాలు నడిపించినారు. పురుషుడు భార్యను కోల్పోతే నిర్వీర్యుడవుతాడు. స్త్రీ తోడ్పాటు లేకుండా అతడు ముందుకు పోలేడు. కాని భర్తలను కోల్పోయిన కుంతీ సత్యవతులు ధైర్యంగా జీవితాన్ని గడిపినారు. కార్యాచరణలో ఎంతో దక్షతను చూపించి పరిస్థితులను చక్కదిద్దుకొన్నారు. ముఖ్యంగా కుంతి పాత్ర ఇందుకు ప్రధానమైన ఉదాహరణ.

---

1.వోల్గానుండి గంగాతీరం.అధ్యాయిశా -పుట7

భారత కథతో ప్రత్యక్ష సంబంధం ఉన్న అతి కొద్ది స్త్రీపాత్రలలో అత్యంత ప్రధానమైన పాత్రకుంతి. ఆమె జీవితమంతా సమస్యలమయమే. అయినా ఒంటరిగా పోరాటం సాగించి, పితృవిహీనులైనతన బిడ్డలను ఎంతోగుణ వంతులుగా సమర్థులుగా, సచ్ఛీలురుగా తీర్చిదిద్దింది. పాండవులు మొదటినుండీ చివరిదాకా తల్లికి విధేయురాలిగా, ఆమె మాట జవదాటని వారుగా ఉన్నారు.

పాండవులైదుగురికీ ద్రౌపది భార్యకావడానికి కుంతి వాక్కే కారణం. "పాండవులకు నామె వాక్కునందు వేదప్రామాణ్యము గలదు. దీనిని బట్టి పెంపకములో నామె నేర్పెట్టిదో అభివ్యక్త మగుచున్నది."[1]

ద్రౌపదీ స్వయంవరంలో మత్స్యయంత్రాన్ని ఛేదించి అర్జునుడు ద్రౌపదిని గెలుచుకొంటాడు. తర్వాత భీమార్జునులు ద్రౌపదితో కలసివచ్చి తామొక భిక్ష తెచ్చినామని తల్లికి నివేదిస్తారు. ఆమె వెనుదిరిగి చూడకుండా దానిని మీ అయిదుగురూ సమానంగా పంచుకొండని ఆజ్ఞాపిస్తుంది.

"...... భీమార్జునులు ద్రౌపదీసహితులై చనుదెంచి మ్రొక్కి మేమొక భిక్ష తెచ్చితిమని తల్లికి నివేదించిన నెఱుంగక యెప్పటియట్లు కావగచి కుంతీదేవి సంతసిల్లి దాని మీరేవురు నుపయోగింపుడని కొడుకుల నియోగించి భువనత్రయ రాజ్యలక్ష్మియుం బోలెయున్న యక్కన్నియం జూచి లజ్జించి యధర్మభీత యయి ధర్మతనయున కిట్లనియె"[2]

"..... నాయుక్తి దొల్లి యనృత మెన్నండు గాదనఘ మీరెప్పుడు మద్వచనా తిక్రమంబు సేయరిది లోకమున లేనియది యేమిసేయంగ నగునని చింతా కులాత్మయైన"[3]

కుంతి మాటలను బట్టి పాండవులెప్పుడూ ఆమె మాటలను అతిక్రమించ లేదని తెలుస్తుంది. పాండవుల ప్రతిచర్యా మాతృవిధేయంగానే ఉన్నట్లు భారతంలో ఎన్నో ఉదాహరణలున్నాయి.

క్లిష్ట సమస్యలలో నామె నిర్ణయము పాండవులకు శిరోధార్యము."[4]

భారత యుద్ధానికి కుమారులను ప్రోత్సహించిందీ, వాళ్లలో క్షాత్రాన్ని రగుల్కొలిపి వాళ్లను కర్తవ్యోన్ముఖులను చేసిందీ కుంతి. యుద్ధానంతరం ధర్మరాజుతో అశ్వమేధయాగం చేయించినది కూడా కుంతిఅని, సామ్రాజ్య నిర్వహణలో అడుగడుగునా ధర్మరాజుకు ఆమెయే సలహాలనిచ్చేదని కుమారుల

1.మహా.భా.మహిళ పుట59. 2,3 భార.ఆశ్రమ.అ1.ప.158
4.మహా.భార.మహిళ పుట.57

నాజ్ఞాపించి కార్యాలు నడిపించేదని, ధర్మజ భీమసేనులు కుంతితో చేసిన సంభాషణ వల్ల తెలుస్తుంది.

"ఇది యేమి చేయంగ నెత్తికొంటిమ్మాట యాడకు మేనునిన్నడవికేగ
బనుతునే మము దొల్లి పనుల్ గొనుభంగిన సామ్రాజ్యభారనిర్వ
హణము తెఱుంగులు నప్పటి కప్పటి కిట్లని యానతియిచ్చినడిపి
పంపకయున్న నొప్పమిరాదె మాకు మున్నీవును గృష్ణుండు నే విధమున
నడిపితిరి కార్యమెరుగవే యడలు వెల్లి
మమ్ముబాంచాలి నిటుముంచి యమ్మయడవి నెట్టు లుండెదవనగ......"[1]

" అయ్యమ లాత్మతోడ బవనాత్మజు డిట్లను ధర్మపుత్రునీ
వెయ్యది యుక్తహేతువుగ నిమ్మెయి బాసెదు నీదు పన్నునం
గయ్యము చేసి భూపతి నికాయములం బరిమార్చె దల్లినీ
కియ్యన లక్ష్మి నూది చరియింపక యిప్పుడు పాయబాడియే"[2]

ధర్మరాజాదులను కుంతీపుత్రులనేవారు. భీష్ముని గంగా పుత్రుడని సంబోధించేవారు. నకుల సహదేవులను మాద్రేయులని పిలిచేవారు. తల్లి ద్వారా వారసత్వం వచ్చే రోజుల్లో తల్లికి ప్రాముఖ్యం ఉండేది. మాతృస్వామ్యాన్ని అణచివేసి పితృస్వామ్యం అవతరించిన తర్వాత తండ్రి ద్వారా గుర్తింపు, తండ్రి ఇంటిపేరున పిలవటం వాడుకలోకి వచ్చాయి.[3]

భారతాన్ని పరిశీలిస్తే పై విషయంలోని వాస్తవికత బోధపడుతుంది. పురుషపాత్రలన్నీ తల్లి పేరుమీదనే పిలువబడటం అత్యధికంగా కన్పిస్తుంది. భీష్ముడు గాంగేయుడని, వ్యాసుడు సాత్యవతేయుడని, ధృతరాష్ట్రుడు ఆంబికేయుడని, కర్ణుడు రాధేయుడని, పాండవులు కౌంతేయులని, కౌరవులు గాంధారేయులని, అర్జునుడు పార్థుడని పిలువ బడటం అడుగడుగునా కన్పిస్తుంది. ఆంధ్రభారతం లోను, వ్యాసభారతంలోను ఇలాఎన్నైనా ఉదాహరణలు చూపించ వచ్చును. మచ్చుకు

"న సాధు కౌన్తేయ ఇతోవాస మర్జున రోచయ"[1]
"యద్వేషా పార్థో రాధేయకృతాం కార్యం....."[2]
"ఆంబికేయుండు గోడంద్ర నెల్ల సముచిత వచనంబుల మరలనియమించె"[3]
"భవదనుజ్ఞా గౌరవంబున గాంగేయాదులు దీనికి నొడబడుదురు......"[4]

1.వ్యాసభార.విరాటపర్వ అధ్యాయ 1శ్లోక8 2 అదే.అధ్యా.38శ్లోకం 15
3.భార.ఆశ్రమ ఆ1.ప.45 4 అదే. ఆ6.ప.131

మొదలైనవి.

ఇక భీష్ముని మాతృవిధేయత శిఖరాయమానమైనది. తమ్ముల కొరకు కాశీరాజ కన్యల స్వయంవరానికి వెళ్లడానికి తల్లి సత్యవతి అనుమతి పొందిగాని వెళ్లడు.

"తల్లి కెఱిగించి యొంటిమై దత్పురమున;
కాయితంబై పోయితి నరదమెక్కి"[1]

అంబతాను సాళ్వుని ప్రేమించిన విషయం చెప్పి, తనను అతని వద్దకు పంపమనికోరగా ఆ విషయం తల్లికి తెల్పి, ఆమె అనుజ్ఞతో వృద్ధాంగనలను తోడిచ్చి పంపుతాడు.

"అన విని సత్యవతికి జె
ప్పిన నాయమ వనుప నంబ బెంపుగ వృద్ధాం
గనలం దోడుగ నప్పుడ
పనిచి యనిచితిని జనంబు ప్రస్తుతి సేయన్"[2]

పరశురామునితో అంబ విషయమై తలపడ వలసి వచ్చినప్పుడు కూడ భీష్ముడు తల్లి అనుమతి పొందుతాడు. "అని పలికి యతనికిం బ్రణమిల్లి సత్యవతి కింతయు విన్నవించి యద్దేవి యనుమతి వడసి....."[3]

సత్యవతి తన కోడండ్రయందు సంతానం కల్గించ వలసిందని భీష్ముని 'ఆజ్ఞాపిస్తుంది.'

"భరతాన్వయావలంబనుడవు నీవని నిన్నొకడు పంచెద జేయుము మత్ప్రియంబుగాన్."[4]

తన భీష్మప్రతిజ్ఞను ఎంతో వినయంతో తల్లికి తెలియజేసిన విధం కూడ అతని మాతృవిధేయతకు అద్దం పడుతుంది.

"మీ కిట్లని యానతియీయాయదగునె...."[5]

"మీ యానతిచ్చినట్లు నా యెఱుంగని ధర్మువులు లేవు"[6]

తల్లి 'ఆజ్ఞ' పొందిగాని భీష్ముడేపనీ చేయనంతటి మాతృభక్తుడు.

తన ఱెక్కలను కదిలించడం చేత కులపర్వతాలను సైతం కంపింప జేయగల్గిన గరుత్మంతుడుమాతృవిధేయుడు.

---

1.భార.ఉద్యోగ.ఆ4.ప.270 2. అదే.ప.276 3. అదే.ప.315
4.అదే.ఆ4.ప.220 5.అదే.ది.ఆ4.ప.223 6.అదే.ప.224

"గరుడుండును గద్రువపంచిన పనులెల్లను వినత యనుమతంబున నతి వినయ పరుడై చేయుచు"[1]

"ఆయత పక్షతుండహతి నక్కుల శైలము లెల్ల నుగ్గుగా
జేయు మహాబలంబున బ్రసిద్ధియునుం గలనాకునీ పనిం
బాయక తొమ్మనం దవుడు బాముల మోయను వారికిం బనుల్
సేయను నేమి కారణము సెప్పుము నాకు బయోరుహాసనా"[2]

"నా విశాలమైన తెక్కల బలంచేత, ముక్కుయొక్క బలం చేత, కుల పర్వతాలను పిండిచేయగల మహాబలము, ప్రసిద్ధిగల నేను నీ యాజ్ఞచేత నింద్యములైన యీ నాగులనునా తొమ్మన మోస్తున్నాను. ఇందుకు కారణం నాకు తెలియజేయ వేడుతున్నాను."

భారతదేశంలో పితృస్వామ్య వ్యవస్థ బలపడిన రోజులలో వ్రాయబడిన గ్రంథం భారతం. అయినా మాతృస్వామ్య వ్యవస్థ అవశేషాలు పై ఉదాహరణలలో కనబడుతూ ఉండటం వల్ల భారతం మాతృపితృ స్వామ్యాల సంధియుగంలో వ్రాయబడిందని చెప్పవచ్చును.

---

1.భార.ఆదిప.ఆ2..ప.44 2.అదే.ప. 49

## పర్వక్రమంలో స్త్రీపాత్రల పరిచయం

| | | | |
|---|---|---|---|
| 1. దేవశుని సరమ | ఆది- | ఆ1- | ప 83- 85 |
| 2. పైలపత్ని | ॥ | ॥ | ప. 93 |
| 3. పౌష్యపత్ని | ॥ | ॥ | ప 97-98 |
| 4.5. ధాత విధాతలు | ॥ | ॥ | ప 100 |
| 6. పులోమ | ॥ | ॥ | ప 129-136 |
| 7. సుకన్య (చ్యవనుని భార్య) | ॥ | ॥ | ప 144 |
| 8. ఘృతాచి | ॥ | ॥ | ప 144 |
| 9. ప్రమద్వర | ॥ | ॥ | ప 145-150 |
| 10, 11 కద్రూవినతలు | ॥ | ఆ2 | ప 2-121 |
| 12 నిషాది | ॥ | ॥ | ప 64 |
| 13 జరత్కారువు | ॥ | ॥ | ప 139-161 |
| 14 శుక్తిమతి | ॥ | ఆ3 | ప 26 |
| 15 గిరిక | ॥ | ॥ | ప 26 |
| 16 అద్రిక | ॥ | ॥ | ప 31-33 |
| 17 మత్స్యగంధి | ॥ | ॥ | ప 33-44 |
| 18 ధరణి | ॥ | ॥ | ప 59-60 |

## దక్షప్రజాపతి యేబదిమంది కుమార్తెలు

ఆది - ఆ3 -ప 61

19 కీర్తి
20 లక్ష్మి
21 ధృతి
22 మేధ
23 పుష్టి
24 శ్రద్ధ మనువు భార్యలు
25 క్రియ
26 బుద్ధి
27 లజ్జ
28 మతి

29 అశ్వని
30 భరణి
31 కృత్తిక
32 రోహిణి
33 మృగశిర
34 ఆర్ద్ర
35 పునర్వసు
36 పుష్యమి
37 ఆశ్లేష
38 మఖ
39 పూర్వ ఫల్గుని
40 ఉత్తర ఫల్గుని
41 హస్త
42 చిత్త
43 స్వాతి
44 విశాఖ
45 అనూరాధ
46 జ్యేష్ఠ
47 మూల
48 పూర్వాషాడ
49 ఉత్తరాషాడ
50 శ్రవణం
51 ధనిష్ఠ
52 శతభిషం
53 పూర్వాభాద్ర
54 ఉత్తరాభాద్ర
55 రేవతి
56 అదితి
57 దితి
58 దను

29 నుంచి 54 వరకు మొత్తం 27 మంది చంద్రుని భార్యలు

59 కాల
60 అనాయు
61 సింహిక
62 ముని
63 కపిల
64 వినత
65 క్రోధ
66 ప్రాధ
67 క్రూర
68 కద్రువ

ఈ పదమూడు మంది కశ్యపుని భార్యలు

69 గుణాశ్రయసిద్ధియోగ - అంగీరసుని పుత్రి ఆది - ఆ3 - ప 65
70 ధూమ్ర
71 బ్రహ్మవిద్య
72 మనస్విని
73 రత
74 శ్వేత
75 శాండిలి
76 ప్రభాత

ఈ యేడుగురు ప్రజాపతి భార్యలు ఆది - ఆ3 ప 67

77 మనోహర - సోముడనే వసువు భార్య
78 పృథ - సోముని కుమార్తె - అదే -
79 జ్యోతి - పృథ కుమార్తె - అదే -
80 శివ - అనిలుడనే వసువు భార్య - అదే -
81 యోగసిద్ధి - బృహస్పతి చెల్లెలు. విశ్వకర్మ తల్లి - అదే -
82 ప్రాప్తి
83 రతి
84 నంద

మనువు కుమారులైన శమ, కామ, హర్షుల భార్యలు ఆది - ఆ3 - ప69

85 త్వాష్ట్రి - సవితృని భార్య-బడబారూపధారిణి-అశ్వినులతల్లి-ఆది ఆ3 ప69
86 లక్ష్మి - బ్రహ్మకుమార్తె- ధాతవిధాతల సోదరి- అదే.
87 సుర - వరుణుని కుమార్తె ఆది ప 71

88 తామ్ర
89 కాకి ) తామ్ర కుమార్తెలు ఆది ప 71
90 శ్యేని
91 హాసి
92 ధృతరాష్ట్రి ) తామ్ర కుమార్తెలు ఆది - ఆ3 ప71
93 శుకి
94 మృగి
95 మృగనంద క్రోధుని కుమార్తెలు
96 హరి అదే ప 71
97 భద్రమనస ఈ విధంగా సకల భూతాలు
98 మాతంగి జన్మించాయని వైశంపాయనుడు
99 శార్దూలి జనమేజయునికి వివరిస్తాడు
100 శ్వేత
101 సురభి
102 సురస
103 రోహిణి
104 గంధర్వి
105 అనల
106 దేవకి ) వసుదేవుని భార్యలు ఆది- ఆ3- ప76
107 రోహిణి )
108 రుక్మిణి - శ్రీ కృష్ణుని భార్య
109 పదహారు వేలమంది శ్రీకృష్ణుని అంతఃపురస్త్రీలు
అప్సరసల అంశతో జన్మించారు.
110గాంధారి
111 కుంతి
112 మాద్రి
113 ద్రౌపది
114 యమున
115 తపతి ) సూర్యుని కుమార్తెలు ఆది.ప - ఆ3 ప89
116 ఊర్వశి - పురూరవుని భార్య ఆది.ప - ఆ3 ప92

| | |
|---|---|
| 117 స్వర్భానవి - ఆయువు భార్య | ఆది.ప - ఆ3 ప92 |
| 118 ప్రియంవద - నహుషుని భార్య | ఆది.ప - ఆ3 ప94 |
| 119 దేవయాని | ఆది.ప - ఆ3 ప104 |
| 120 శర్మిష్ఠ | ఆది.ప1- ఆ3 ప134 |
| 121 ఘూర్ణిక | ఆది.ప - ఆ3 ప145 |
| 122 కౌసల్య - పూరుని భార్య | ఆది. ఆ-4. ప2 |
| 123 అనంత - జనమేజయుని భార్య | ఆది. ఆ-4. ప2 |
| 124 అశ్మకి - ప్రాచీశుని భార్య | ఆది. ఆ-4. ప2 |
| 125 వరాంగి - సంయాతి భార్య | అదే |
| 126 భానుమతి - అహంయాతి భార్య | అదే |
| 127 సునంద - సార్వభౌముని భార్య | అదే |
| 128 సుశ్రవస - జయత్సేనుని భార్య | అదే |
| 129 మర్యాద - అవాచీనుని భార్య | అదే |
| 130 ఆంగి - అరిహుని భార్య | అదే. |
| 131 సుపుష్ఠ - మహాభౌముని భార్య | అదే |
| 132 కామ - అయుతానీకుని భార్య | అదే |
| 133 కరంభ - అక్రోధనుని భార్య | అదే |
| 134 మర్యాద - దేవాతిథి భార్య | అదే |
| 135 సుదేవ - ఋచీకుని భార్య | అదే |
| 136 జ్వాల - ఋక్షుని భార్య | అదే |
| 137 సరస్వతి (నది) మతినారుని భార్య | ఆది - ఆ4.ప4 |
| 138 కాళింది | అదే - ప5 |
| 139 రథంతరి | అదే - ప5 |
| 140 మేనక - అప్సరస | అదే - ప6 |
| 141 శకుంతల - | అదే - ప24 |
| 142 సునంద - భరతుని భార్య | అదే - ప111 |
| 143 విజయ - భమన్యుని భార్య | అదే - ప111 |
| 144 సువర్ణ - సుహోత్రుని భార్య | అదే - ప111 |
| 145 యశోధర - హస్తి భార్య | అదే - ప111 |
| 146 వసుదేవ - వికుంఠనుని భార్య | అదే - ప111 |

147 కైకేయి
148 గాంధారి } అజమీఢుని భార్యలు అదే - ప111
149 ఋక్ష
150 శుభాంగి - కురుని భార్య అదే - ప113
151 సుప్రియ - విదూరథుని భార్య అదే - ప113
152 అమృత - అనశ్వని భార్య ఆది - ఆ4 - ప113
153 సుయశ - పరీక్షితుని భార్య ఆది - ఆ4 - ప113
154 కుమారి - భీమసేనుని భార్య ఆది - ఆ4 - ప113
155 సునంద - ప్రతీపుని భార్య ఆది - ఆ4 - ప113
156 గంగ
157 సత్యవతి } శంతనుని భార్యలు ఆది - ఆ4 - ప114
158 అంబిక
159 అంబాలిక } విచిత్రవీర్యుని భార్యలు ఆది - ఆ4 - ప114
160 అంబికా పరిచారిక - విదురుని తల్లి ఆది - ఆ4 - ప114
161 దేవిక - ధర్మరాజుకు స్వయంవర లబ్ధ ఆది - ఆ4 - ప114
162 జరంధర - భీముని భార్య ఆది - ఆ4 - ప114
163 సుభద్ర - అర్జునుని భార్య ఆది - ఆ4 - ప114
164 కరేణుమతి - నకులుని భార్య ఆది - ఆ4 - ప114
165 విజయ - సహదేవునికి స్వయంవరలబ్ధ ఆది - ఆ4 - ప114
166 ఉత్తర - అభిమన్యుని భార్య ఆది - ఆ4 - ప117
167 మాద్రవతి - పరీక్షిత్తు భార్య ఆది - ఆ4 - ప212
168 అంబ - ఆది - ఆ4 - ప227
169 మమత ఆది - ఆ4 - ప227
170 ప్రద్వేషిణి - ఆది - ఆ4 - ప227
171 సుదేష్ణ - బలి అనేరాజు భార్య ఆది - ఆ4 - ప223
172 సుదేష్ణ దాది కూతురు - ఆది - ఆ4 - ప223
173 సత్యవ్రత
174 సత్యసేన
175 సుదేష్ణ } గాంధారి చెల్లెళ్లు
176 సంహిత ధృతరాష్ట్రుని భార్యలు ఆది - ఆ5 - ప12

177 తేజశ్రవ
178 సుశ్రవ
179 నికృతి
180 శుభ
181 సంభవ
182 దశార్ణ

(177–182: గాంధారి చెల్లెళ్లు ధృతరాష్ట్రుని భార్యలు)

183 రాధ - కర్ణుని పెంచిన తల్లి ఆది - ఆ5 - ప31
184 శృతసేన- కుంతి చెల్లెలు-శారదండాయని భార్య ఆది - ఆ5 - ప35
185 భద్ర - వ్యుషితాశ్వుని భార్య - ఆది - ఆ5 - ప80
186 శ్వేతకేతుని తల్లి ఆది - ఆ5 - ప84
187 జానపది - ఆది - ఆ5 - ప185
188 కృపి - కృపాచార్యుని చెల్లెలు ఆది - ఆ5 - ప188
189 ఘృతాచి - అప్సర - ఆది - ఆ5 - ప194
190 మేనక - అప్సర - ద్రుపదుని జన్మకు కారకురాలు ఆది - ఆ5 - ప196
191 నిషాదవనిత - లక్కయింటిలో మరణించినది ఆది - ఆ6 - ప160
192 హిడింబ ఆది - ఆ6 - ప186
193 ఏకచక్రపురంలోని బ్రాహ్మణునిభార్య ఆది - ఆ6 - ప253
194 ఏకచక్రపురంలోని బ్రాహ్మణుని కూమార్తె ఆది - ఆ6 - ప260
195 కోకిలాదేవి - ద్రుపదుని పత్ని ఆది - ఆ7 - ప17
196 శచీదేవి - ఇంద్రునిభార్య ఆది - ఆ7 - ప25
197 కుంభీనసి - అంగార వర్ణుడనే గంధర్వుని భార్య ఆది - ఆ7 - ప46
198 తపతి, సావిత్రి - సూర్యుని కుమార్తెలు ఆది - ఆ7 - ప66
200 నందిని- వశిష్ఠుని హోమధేనువు ఆది - ఆ7 - ప106
201 అదృశ్యంతి - శక్తిభార్య-వశిష్ఠుని కోడలు ఆది - ఆ7 - ప124
202 మదయంతి - కల్మాషపాదుని భార్య ఆది - ఆ7 - ప130
203 ఆంగిరసి - బ్రాహ్మణుని భార్య ఆది - ఆ7 - ప130
204 భృగుపత్ని - ఔర్వుని తల్లి ఆది - ఆ7 - ప134
205 జటిలుని కుమార్తె ఆది - ఆ7 - ప253
206 దాక్షాయణి ఆది - ఆ7 - ప253
207 ఇంద్రసేన ఆది - ఆ7 - ప257

208 అజిత - ఔశీనరుని కుమార్తె ఆది - ఆ7 - ప279
209 తిలోత్తమ - ఆది - ఆ8 - ప103
210 ఉలూచి - ఆది - ఆ8 - ప130
211 చిత్రాంగద - ఆది - ఆ8 - ప140
212 నంద
213 సౌరభేయి
214 సమీచి
215 బుద్బుద
} కుబేరుని ప్రియసఖులు అప్సరసలు
216 లత ఆది - ఆ8 - ప153
217 జరిత -పక్షి -మందపాలుని భార్య ఆది - ఆ8 - ప300
218 లపిత " ఆది - ఆ8 - ప313
219 జరాసంధుని తల్లులు - సభా - ఆ1 - ప114
220 జర - రాక్షసి - సభా - ఆ1 - ప147
221 మాషిష్మతీపట్టణం లోని స్త్రీలు సభా - ఆ1 - ప258
222 సాత్వతి - శిశుపాలుని తల్లి సభా - ఆ2 - ప52
223 దమయంతి - అరణ్య - 2 - 8-230
224 కేశిని - దమయంతి దాసి అరణ్య - 2 - 186
225 రాజమాత - దమయంతి పినతల్లి అరణ్య - 2 - 115
226 సునంద - రాజమాత కుమార్తె అరణ్య - 2 - 121
227 లోపాముద్ర - అగస్త్యుని భార్య అరణ్య - 2 - 326
228,229 వైదర్భి, శైబ్య అరణ్య - 2 - 358
230 ఊర్వశి అరణ్య - 3 -48
231 వేశ్యమాత ) ఋష్యశృంగుని తపోభంగానికి
232 వేశ్యాపుత్రి ) నియోగింపబడినవారు అరణ్య - 3 - 96
233 శాంత - ఋష్యశృంగుని భార్య అరణ్య - 3 - 98
234 సత్యవతి - గాధి కుమార్తె అరణ్య - 3 - 114
235 భృగుపత్ని - అరణ్య - 3 - 131
236 రేణుక - పరశురాముని తల్లి అరణ్య - 3 - 139
237 సుకన్య - చ్యవనుని భార్య అరణ్య - 3 - 176
238 సోమకుని నూర్గురు భార్యలు అరణ్య - 3 - 207

| | |
|---|---|
| 239 శర్యాతి భార్యలు (4000 మంది) | అరణ్య - 3 - 176 |
| 240 సుజాత - ఏకపాదుని భార్య- | అరణ్య - 3 - 237 |
| 241 కృష్ణ - రైభ్యుని కోడలు- | అరణ్య - 3 - 262 |
| 242 అత్రిభార్య - | అరణ్య - 4 - 193 |
| 243 సరస్వతీ దేవి - | అరణ్య - 4 - 209 |
| 244 సుశోభన | అరణ్య - 4 - 223 |
| 245 పతివ్రత | అరణ్య - 5 - 57 |
| 246 బృహద్భాస | అరణ్య - 5 - 167 |
| 247 నిశ - | అరణ్య - 5 - 168 |
| 248 ముదిత | అరణ్య- ఆ5 - ప168 |
| 249శివ - అంగిరసుని భార్య | అరణ్య- ఆ5 - ప153 |
| 250 భానుమతి - శివ కుమార్తె | అరణ్య- ఆ5 - ప153 |
| 251 రాక, 252 సినీవాలి, 253 గుహువు, 254 నర్భిష్మతి, 255 మహిష్మతి, 256 మహామతి } శివ కుమార్తెలు | అరణ్య - ఆ5 - ప153 |
| 257 సత్య - శంయుని భార్య - | అరణ్య - ఆ5 - ప153 |
| 258 భారతి - భరద్వాజుని పుత్రి | అరణ్య - ఆ5 - ప155 |
| 259 వీర - భరద్వాజుని భార్య - | అరణ్య - ఆ5 - ప155 |
| 260 సరయువు - వీరుని భార్య | అరణ్య - ఆ5 - ప155 |
| 261 దేవసేన | అరణ్య - ఆ5 - ప181 |
| 262 దైత్యసేన | అరణ్య - ఆ5 - ప181 |
| 263 ఆరుగురు కృత్తికలు - | అరణ్య - ఆ5 - ప195 |
| 264 అరుంధతి - వసిష్ఠుని భార్య | అరణ్య - ఆ5 - ప195 |
| 265 హవిష, 266 కాళి, 267 కౌశిక, 268 ఉద్ధత } సప్త మాతృకలు | |

| | | |
|---|---|---|
| 269 శీర్య | | |
| 270 ఆర్య | సప్త | |
| 271 వైధాత్రి | మాతృకల | అరణ్య - ఆ5 - ప245 |
| 272 లోహితాస్య - కుమారస్వామి దాది | | అరణ్య - ఆ5 - ప214 |
| 273 వినత | మాతృగణంతో కలసి | |
| 274 దిత | శిశుపీడ, పశుపీడ | |
| 275 సురభి | చేసేవారు. | |
| 276 సరమ | | |
| 277 కరంజ | | |
| 278 కద్రువ | | అరణ్య - ఆ5 -ప 252 |
| 279 ధాత్రేయిక - ద్రౌపది పరిచారిక | | అరణ్య - ఆ6 - ప297 |
| 280 సత్యభామ | | అరణ్య - ఆ5 - ప290 |
| 281 కౌసల్య | | |
| 282 సుమిత్ర | దశరథుని భార్యలు | అరణ్య - ఆ6 - 269 |
| 283 కైకేయి | | |
| 284 మంథర - కైక దాసి - | | అరణ్య - ఆ6 - 369 |
| 285 పుష్పోత్కట - రావణుని తల్లి | | అరణ్య - ఆ6 - 271 |
| 286 మాలిని - విభీషణుని తల్లి | | అరణ్య - ఆ6 - 271 |
| 287 పా(బ) క - ఖర, శూర్పణఖల తల్లి | | అరణ్య - ఆ6 - 271 |
| 288 శూర్పణఖ - | | అరణ్య - ఆ6 - 271 |
| 289 సీత - రాముని భార్య | | అరణ్య - ఆ6 - 304 |
| 290 తార - వాలి భార్య | | అరణ్య - ఆ6 - 372 |
| 291 త్ర్యక్షి | | |
| 292 లలాటాక్షి | సీతకు కాపలా | |
| 293 త్రిస్తని | ఉన్న రాక్షసస్త్రీలు | అరణ్య - ఆ6 - 391 |
| 294 ఏకపాద | | |
| 295 దీర్ఘజిహ్వా | | |
| 296 అజిహ్వా | | |
| 297 ఏకలోచన | | |
| 298 త్రిజట | | |

| | |
|---|---|
| 299 రంభ | అరణ్య - ఆ6 - 395 |
| 300 ప్రభావతి - తాపస స్త్రీ | అరణ్య - ఆ7- 15 |
| 301 సావిత్రి | అరణ్య - ఆ7 - 71 |
| 302 మాళవి | అరణ్య - ఆ7 - 71 |
| 303 సత్యవంతుని తల్లి | అరణ్య - ఆ7 - 261 |
| 304 సుదేష్ణ - కీచకుని సోదరి | విరాటం - ఆ1 - 301 |
| 305 ఉత్తర - విరాటుని కుమార్తె | విరాటం - ఆ1 - 312 |
| 306 శచీదేవి | ఉద్యోగ - ఆ1 - 149 |
| 307 ఉపశృతి | ఉద్యోగ - ఆ1 - 171 |
| 308 మాధవి | ఉద్యోగ - 3 - 312 |
| 309 శిఖండుని భార్య | ఉద్యోగ -ఆ4 -ప375 |
| 310 శిఖండి భార్య, దాసి | ఉద్యోగ -ఆ4 -ప375 |
| 311 ప్రభావతి | శల్య - ఆ2 - ప196 |
| 312 అలంబుస | శల్య - ఆ2 - ప203 |
| 313 జనకుని భార్య | శాంతి - ఆ1 - 130 |
| 314 శశిబిందుని లక్షమంది భార్యలు | శాంతి - ఆ2 - 138 |
| 315 సుకుమారి | శాంతి - ఆ2 - 247 |
| 316 భూదేవి | శాంతి - ఆ2 - 91 |
| 317 పూజని | శాంతి - ఆ3 - 245 |
| 318 కపోతి | శాంతి - ఆ3 - 310 |
| 319 చిరకారి తల్లి | శాంతి - ఆ5 - 266 |
| 320 సులభ | శాంతి - ఆ6 - 170 |
| 321 ఘృతాచి | శాంతి - ఆ2 - 250 |
| 322 సుదర్శన | అనుశాసన- ఆ1- 48 |
| 323 భంగ్వాసని | అనుశాసన- ఆ1- 289 |
| 324 గౌతమి | అనుశాసన- ఆ1- 5 |
| 325 నర్మద | అనుశాసన- ఆ1- 44 |
| 326 ఓఘవతి | అనుశాసన- ఆ1- 62 |
| 327 సుప్రభ | అనుశాసన- ఆ2- 3 |
| 328 ఉత్తరదిశ | అనుశాసన- ఆ2- 22 |

| | |
|---|---|
| 329 పంచచూడ | అనుశాసన- ఆ2- 172 |
| 330 రుచి | అనుశాసన- ఆ2- 198 |
| 331 కుశికుని పత్ని | అనుశాసన- ఆ2- 292 |
| 332 లక్ష్మీదేవి -(గో శ్రీసంవాదం) | అనుశాసన- ఆ3- 113 |
| 333 సురభి | అనుశాసన- ఆ3- 120 |
| 334 గండ | అనుశాసన- ఆ3- 209 |
| 335 వృషాదర్భుని హోమంలో పుట్టిన రాక్షసి | అనుశాసన- ఆ3- 222 |
| 336 ఉమ - శంకరుని భార్య | అనుశాసన- ఆ4- 419 |
| 337 బ్రాహ్మణుని మొదటి భార్య | అనుశాసన- ఆ5- 287 |
| 338 బ్రాహ్మణుని రెండవ భార్య | అనుశాసన- ఆ5- 287 |
| 339 గోదావరి | |
| 340 కౌశికి | |
| 341 కావేరి | |
| 342 కృష్ణవేణి | |
| 343 పెన్న | |
| 344 నర్మద | |
| 345 బాహుద | |
| 346 రేవ | |
| 347 తమస | అనుశాసన- ఆ5- 280 |
| 348 మృత్యుదేవత | శాంతి - 5 - 203 |
| 349 పద్మడనే భుజగుని భార్య | శాంతి - 6 - 564 |
| 350 గౌతముని కుమార్తె -ఉదంకుని పత్ని | అశ్వమేధ - 3 - 74 |
| 351 గౌతముని భార్య అహల్య | అశ్వమేధ - 3 - 83 |
| 352 మిత్ర సహాఖ్యుని భార్య మదయంతి | అశ్వమేధ - 3 - 95 |
| 353 పులి తల్లి | శాంతి - ఆ3 -ప68-73 |
| 354 దుస్సల | అశ్వమేధ - ఆ4 - 44 |
| 355 కైకేయి | అనుశాసనిక - 4-356 |
| 356 శాండిలి | అనుశాసనిక - 4-356 |
| 357 జాంబవతి - శ్రీకృష్ణుని పత్ని | మౌసల - 1 - 204 |
| 358 సరస్వతీ నది | శల్య - 2 - 270 |
| 359 సక్తుప్రస్థుని భార్య | అశ్వమేధ - 4 - 230 |
| 360 సక్తు ప్రస్థుని కోడలు | అశ్వమేధ - 4 - 236 |

(339–346: నదులు స్త్రీరూపంలో పార్వతిని వెన్నంటి ఉండేవారు)

## అకారాది క్రమంలో పాత్రల పట్టిక

1 అంబ
2 అంబాలిక
3 అంబిక
4 అంబికాపరిచారిక
5 అజిత
6 అజిహ్వా
7 అత్రిభార్య
8 అదితి
9 అద్రిక
10 అదృశ్యంతి
11 అనంత
12 అనల
13 అనాయ
14 అనూరాధ
15 అభయ
16 అమృత
17 అరుంధతి
18 అలంబుస
19 అశ్మకి
20 అశ్విని
21 అహల్య
22 అష్టమ వసువు భార్య
23 అంగి
24 ఆంగిరస
25 ఆంగిరసి
26 ఆర్ద్ర
27 ఆర్య
28 ఆశ్రేష
29 ఇంద్రసేన
30 ఉత్తర
31 ఉత్తర (దిశ)
32 ఉత్తరాభాద్ర
33 ఉత్తరాషాడ
34 ఉద్ధత
35 ఉపశృతి
36 ఉమ
37 ఉలూచి
38 ఊర్వశి
39 ఋక్ష
40 ఏకపాద
41 ఏకలోచని
42 ఓఘవతి
43 కద్రువ
44 కపిల
45 కపోతి
46 కమలపాలిక
47 కరంబ
48 కరేణుమతి
49 కాకి
50 కామ
51 కాల
52 కాళి
53 కాళింది
54 క్రియ
55 కీర్తి
56 కుంతి
57 కుమారి
58 కుశికుని పత్ని
59 కృత్తిక
60 కృత్తికలు
61 కృపి
62 కృష్ణ
63 క్రూర
64 కేశి

256 శర్మిష్ఠ
257 శ్రవణ
258 శ్రద్ధ
259 శాంత
260 శాండిలి
261 శార్ద్దాలి
262 శ్వస
263 శిఖండి
264 శిఖండి భార్య
265 శివ
266 శుకి
267 శుక్తిమతి
268 శుభ
269 శుభాంగి
270 శృతసేన
271 శూర్పణఖ
272 శ్యేని
273 శ్వేత
274 శ్వేతకేతుని తల్లి
275 శ్వేని
276 శౌర్య
277 సత్యవతి (ఋషిభార్య)
278 సత్యవతి తల్లి
279 సత్యవతి (మత్స్యగంధి)
280 సత్యవ్రత
281 సత్యసేన
282 సత్యభామ
283 సత్య
284 సరస్వతి(మతినారుని భార్య)
285 సరస్వతి(వాణి)
286 సుప్రియ
287 సప్తర్షుల భార్యలు
288 సంభవ
289 సంహిత
290 సరమ
291 సరయు
292 సమీచి
293 స్వర్భానవి
294 సావిత్రి
295 సాత్వతి
296 స్వాహాదేవి
297 స్వాతి
298 సినీవాలి
299 సింహిక
300 సీత
301 సుకన్య
302 సుకుమారి
303 సుజాత
304 సుదర్శన
305 సునంద (ప్రతీపుని భార్య)
306 సునంద
307 సునయన
308 సుమిత్ర
309 సుదేష్ణ
310 సుదేష్ణ (బలి భార్య)
311 సుదేవ
312 సుప్రభ
313 సుప్రియ
314 సుభద్ర
315 సుయశ
316 సుపుష్ట
317 సుశ్రవన
318 సురస
319 సుర

మహాభారత మహిళాదర్శనం
320 సురభి
321 సువర్ణ
322 సులభ
323 సౌరభేయి
324 హరి (క్రోధుని పుత్రి)
325 హవిష
326 హస్త
327 హిడింబ
328 సక్తుప్రస్థుని భార్య
329 సక్తుప్రస్థుని కోడలు



## ఉపయుక్తగ్రంథసూచి
## తెలుగు

1 ఆంధ్రమహాభారతము - అష్టాదశపర్వములు - కవిత్రయము - వావిళ్లప్రెస్. మదరాసు.1929, 1954, 1959, 1964
2 ఆంధ్రమహాభారతము - అష్టాదశపర్వములు - సంశోధితప్రతి - కవిత్రయము - ఉస్మానియా విశ్వవిద్యాలయము 1968- 1973
3 ఆంధ్రమహాభారతము - ఔపదేశిక ప్రతిపత్తి - డా. నందుల గోపాలకృష్ణమూర్తి
4 ఆంధ్రభారత కవితా విమర్శనము - కోర్హాడ రామకృష్ణయ్య 1929
5 ఆంధ్రమహాభారతము - కవిత్రయము. ఆచార్య దివాకర్ల వెంకటావధాని.
6 ఆంధ్రమహాభారతోపన్యాసములు - ఆంధ్ర సారస్వత పరిషత్తు ప్రచురణ
7 ఆంధ్రులచరిత్ర - సంస్కృతి - కంభంపాటి సత్యనారాయణ అనువాదం. డా. మహీధర రామమోహనరావు.
8 ఆధ్యాత్మికవ్యాసమంజరి - ఆచార్య వేదుల సుబ్రహ్మణ్యశాస్త్రి - ఎక్వేరియన్ ప్రింటింగ్ స్కూల్ - విశాఖపట్టణం.
9 ఉదయశ్రీ - కరుణశ్రీ జంధ్యాల పాపయ్యశాస్త్రి - న్యూస్టూడెంట్స్ బుక్‌సెంటర్. విజయవాడ 1979
10 ఓల్గానుండి గంగాతీరము - రాహుల్ సాంకృత్యాయన్. రవీంద్రపబ్లిషింగ్ హౌస్ తణుకు 1960
11 ఋగ్వేదకాలంలో స్త్రీ - పాపినేని శివశంకర్ ప్రజాసాహితి ఏలూరు.1984
12 ఋగ్వేద ఆర్యులు - రాహుల్ సాంకృత్యాయన్ - అనువాదం - మిక్కిలినేని సుబ్బారావు జూలై 1974
13 కల్యాణ కల్పతరువు సంపుటి 41 - సంచిక 1 (స్త్రీల సంచిక) అక్టోబరు 1975
14 తిక్కన.కావ్యశిల్పము - డా. కేతవరపు రామకోటిశాస్త్రి - నాగేంద్ర ఆర్టు ప్రింటర్స్. శివాజీ ప్రెస్ - సికిందరాబాదు.
15 తిక్కన భారతదర్శనము - శ్రీ నండూరి రామకృష్ణమాచార్యులు.
16 తిక్కన చేసిన మార్పులు. - ఔచిత్యపు తీర్పులు - డా. పి సుమతీ నరేంద్ర- ప్రచురణ బాలకృష్ణభారతి - విజ్ఞానపురి -హైదరాబాదు.
17 ధర్మశాస్త్రాలలో స్త్రీ - వ్యాససంకలనం - రాచమల్లు ప్రగతి గుప్త.
18 నన్నయగారి ప్రసన్న కథా కలితార్థ యుక్తి - విశ్వనాథ సత్యనారాయణ

మహాభారత మహిళాదర్శనం
19 పతివ్రతల చరిత్రలు - వావిళ్లవారి ప్రచురణ - మద్రాసు
20 పాతివ్రత్యం నుండి ఫెమినిజందాకా - మల్లాది సుబ్బమ్మ - విశాలాంధ్ర ప్రచురణ హైదరాబాదు ఆగస్టు 1991
21 ప్రాచీన కవితా వైజయంతి పండితుల వ్యాససంకలనం - సంపాదకుడు - పింగళి లక్ష్మీకాంతం - తెలుగు విశ్వవిద్యాలయం హైదరాబాదు.1988
22 ప్రాచీన తెలుగు కావ్యాలలో విఫల మనోరథలైన స్త్రీలు - కె. శ్రీదేవి. తెలుగు అధ్యయన శాఖ శ్రీకృష్ణదేవరాయ విశ్వవిద్యాలయం-అనంతపురం నవంబరు 1997
23 ప్రబంధవాఙ్మయము - డా. పి యశోదారెడ్డి - ప్రపంచతెలుగు మహాసభల ప్రచురణ - ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ -కళాభవన్ - సైఫాబాద్ - హైదరాబాదు
24 తెలుగు జానపద సాహిత్యము-పురాణగాథలు రావి ప్రేమలత 2-2-1105/10
తిలక్ నగర్ హైదరాబాదు 1983
25 భారత ధ్వని దర్శనము - శలాక రఘునాథశర్మ - ఆనంద వల్లీ గ్రంథమాలా - బి 4 పి.జి. సెంటర్ క్వార్టర్సు - శ్రీవెంకటేశ్వరపురం (పోస్టు) అనంతపురం 1979
26 భారతీయ సంస్కృతి - ఏటుకూరి బలరామమూర్తి - విశాలాంధ్ర ప్రచురణలు - హైదరాబాదు - 1972
27 భారతీయ సంస్కృతిలో స్త్రీలు - కత్తి పద్మారావు - సృజన ప్రింటర్స్ పొన్నూరు. జూన్ 1973
28 భారతము - ధర్మాద్వైతము - డా. మోపిదేవి కృష్ణస్వామి - ది వరల్డ్ టీచర్ ట్రస్టు ప్రచురణ అమలాపురం శాఖ
29 మహాభారత చరిత్ర - పెండ్యాల వేంకట సుబ్రహ్మణ్యశాస్త్రి విశాలాంధ్ర పబ్లికేషన్స్ - డిసెంబరు 1991
30 మహాభారత తత్త్వ కథనము - తృతీయభాగము వారణాసి సుబ్రహ్మణ్య శాస్త్రి - శ్రీశారదా ముద్రణాలయం భట్టవిల్లి ద్వితీయముద్రణ 1963
31 మహాభారత విమర్శనము - పుట్టపర్తి నారాయణాచార్యులు 1965
32 మహాభారత రహస్యము - శిష్టా సూర్యనారాయణ శాస్త్రి వావిళ్ల ప్రచురణ 1938
33 మహాభారత మీమాంస - చర్ల నారాయణ శాస్త్రి
34 మహాభారతము - మహిళ - జక్కా వేంకట రమణప్ప - భారత్ ప్రింటింగ్

మహాభారత మహిళాదర్శనం
ప్రెస్ - హిందూపురం - 1977
35 మహాభారతము - మానవ స్వభావ చిత్రణ - అప్పజోడు వేంకట సుబ్బయ్య
6-1-911, ప్రగతి గీతా ప్రెస్ ఖైరతాబాదు - హైదరాబాదు 1977
36 మహాభారతము- విశ్వవిజ్ఞాన కోశము .డా. మూలంపల్లి చంద్రశేఖర శర్మ.
హెచ్.నెం. 165/ఎస్.ఆర్.టి సైదాబాదు కాలనీ హైదరాబాదు మే 1989
37 మహాభారత వైభవము - ఎల్లంరాజు శ్రీనివాసరావు - మురళీకృష్ణా ప్రింటర్స్
హోమ్స్ పేట ప్రొద్దుటూరు నవంబరు 1992
38 తెలుగు సాహిత్యంలో మనోవిశ్లేషణ - కోడూరి శ్రీరామమూర్తి - కొండపల్లి
ముద్రాక్షరశాల రాజమండ్రి 1979
39 యుగయుగాల్లో భారతీయ మహిళ జె. వరలక్ష్మి - ప్రియదర్శిని ప్రచురణ
వి.డి.పి.యల్. కాలనీ, హైదరాబాదు. సెప్టెంబరు 1977
40 యుగయుగాల్లో భారతీయ నారీత్వం - బి. నివేదిత భారతీయ ప్రచారసమితి
హైదరాబాదు
41 వ్యాసరత్నావళి- మల్లాది సూర్యనారాయణ శాస్త్రి
42 విజ్ఞాన సర్వస్వం - 6 వ భాగం - తెలుగు భాషాసమితి హైదరాబాదు. 1961
43 శిష్టసాహిత్యంలో జానపద ధోరణులు - ఆచార్య హెచ్. ఎస్. బ్రహ్మానంద -
విశాలాంధ్ర బుక్‌హౌస్, హైదరాబాదు 1989
44 సంప్రదాయ సాహిత్యం - స్త్రీవాద దృక్పథం డా. కాత్యాయనీ విద్మహే నవోదయా
బుక్ హౌస్, 3-3-865 ఆర్యసమాజ్ ఎదురుగా కాచిగూడ హైదరాబాదు 1997
45 సారస్వత వ్యాసములు ప్రథమ సంపుటము - జి.వి. సుబ్రహ్మణ్యం ఆంధ్రప్రదేశ్
సాహిత్య అకాడమీ, హైదరాబాదు 1987
46 సాహిత్యంలో స్త్రీ- జాతశ్రీ (సంకలన కర్త) - ఖమ్మం జిల్లా అభ్యుదయ రచయితల
సంఘం - ఖమ్మం. 1981
47 సాహిత్య వ్యాసములు - కొండూరు వీరరాఘవాచార్యులు - కె.వి. ఆర్ &
సన్. గాంధీనగర్ - తెనాలి 1969.
48 స్త్రీ పురుష సమానతా సంస్కృతి - (అమృతసంస్కృతి గ్రంథంనుండి)
డా. కాత్యాయనీ విద్మహే. సంపాదకుడు.పేర్వారం జగన్నాథం- వరంగల్లు - 1998
49 ఆంధ్ర మహాభారతము -స్త్రీల మనస్తత్వ నిరూపణ -డా.అయ్యగారి విజయలక్ష్మి
50 తిక్కన కావ్య నిర్మాణ వైభవము - గడియారం వేంకటశాస్త్రి.

# ENGLISH

1. The Indian Heritage - Dr. V. Raghavan - The Institute of world culture, 6 North Public Squar Road, Basavanna gudi - Bangalore - 1958.

2. The Mysteries of Mahabharata - Vol 1. N.V. Thadani - Bharat Publishing house, Karachi - 1931

3. The Great Epic of India - E.W.Hopkins - Published by Shankar Bhattacharya - Punti Pustak, Mohan Bazar lane, Calcutta-4, 1969

4. The History and the Culture of the Indian people. Vol I to XII - chief Editor R.C. Majumdar.

5. Women of India - Swami Vivekananda - Bharatiya Sanskriti prachara samithi, Flat No.3, Nirmit Niketan Apartments, 3-4-12, Kachiguda, Hyderabad.

6. Indian Women through Ages - P. Thomas - Asia publishing House - 1964.

7. Women in Ancient India - Moral and Literary Studies - Clarisse Baorer - The Choukhamba Sanskrit Series office - Post box-8, Varanasi 1964.

8. D.D.Kosambi on History and Society-Problems of Interpretation - Department of History of Bombay University publication - Edited by A.J.Syed.

9. The Culture and Civilisation of Ancient India - D.D. Kosambi- Vikas Publishing House Pvt Ltd. 1977.

10. Lokayata - Devi Prasad Chattopadhyaya.

11. A History of India- Romila Thaper.

12. A Critical Introduction to Andhra Maha Bharatam - Malladi Suryanarayana Sastri- Vavilla Ramaswami Sasturlu & Sons, Madras- 1915.

13. The Position of women in Hindu Culture - Motilal Banarasides

Banaras 1956.
14. The Culture Heritage of India - Vol II, 4,5,6 Essays. P.L. Vidya Hema Chandra Ray, P.A. Karmarkar - Rama Krishna Mission - institute of Culture - Calcutta- 1962.
15. Marriage and family in India K.M. Kapadiya - 1966.

## సంస్కృతము

1. శ్రీ మన్మహాభారతమ్ - విరాటపర్వ - అనువక్త - శలాక రఘునాథశర్మ - ఆనందవల్లీ గ్రంథమాల - వేంకటేశ్వరపురం- అనంతపురం - 1985.
2. మనుస్మృతి - (కుల్లూకభట్టు వ్యాఖ్యతో) - మనువు నిర్ణయ సాగర - 1933
3. భారత భావదీప వ్యాఖ్య - నీలకంఠుడు - చిత్రశాల ప్రెస్సు 1929-36
4. మహాభారతము - వ్యాసుడు - వావిళ్ల - 1936
5. ఋగ్వేదము - సాయణభాష్యముతో - వైదిక సంశోధన మండల్ 1941

## హిందీ

1. వైదిక్ సాహిత్య ఔర్ సంస్కృతి - బలదేవ ఉపాధ్యాయ - శారదా మందిర్ - గణేశ్ దీక్షిత్. కాశీ - 1958
2. మహాభారత మీమాంసా - పండిత దేవీదత్త శుక్ల - సరస్వతీ సీరీస్ - 36, ఇండియన్ ప్రెస్ లిమిటెడ్. ప్రయాగ 1960.
3. పురాణ్ విమర్శా-బలదేవ ఉపాధ్యాయ-విద్యాభవన్ రాష్ట్ర భాషాగ్రంథమాలా 1965
4. రశ్మిరథీ - దినకర్

## సంకేతముల వివరణ

1. ఆ.భా - ఆంధ్రమహాభారతము
2. భార - భారతము
3. ఆ - ఆశ్వాసము
4. ప - పర్వము
5. ఆది - ఆది పర్వము
6. సభా - సభాపర్వము
7. అరణ్య - అరణ్య పర్వము
8. విరాట - విరాట పర్వము
9. ఉద్యోగ - ఉద్యోగ పర్వము
10. భీష్మ - భీష్మ పర్వము
11. శల్య - శల్య పర్వము
12. స్త్రీ - స్త్రీ పర్వము
13. శాంతి - శాంతి పర్వము
14. అనుశాస - అనుశాశనిక పర్వము
15. అశ్వమేధ - అశ్వమేధ పర్వము
16. ఆశ్రమ - ఆశ్రమ వాస పర్వము
17. మౌసల - మౌసల పర్వము
18. మహా. భార. వి.వి.కో - మహాభారతము - విశ్వవిజ్ఞానకోశము
19 సం. సా. స్త్రీ. దృ - సంప్రదాయ సాహిత్యం - స్త్రీవాద దృక్పథం
20. మహా. భా. చ - మహాభారత చరిత్ర
21. ప్రా.తె. కా.వి. స్త్రీ - ప్రాచీన తెలుగు కావ్యాల్లో విఫల మనోరథలైన స్త్రీలు
22. మహా. భా. వై - మహాభారత వైభవము
23. A Critical Int-A Critical Introduction to Andhra Maha Bharatam
24. మహా. భా. మా. స్వ.చి - మహాభారతము - మానవస్వభావ చిత్రణ.
25. మహా. భార. మహిళ - మహాభారతము - మహిళ
26. మహా. మ. - మహాభారతము - మహిళ
27. భార. సం.లో. స్త్రీ - భారతీయ సంస్కృతిలో స్త్రీ
28 కు. వ్య. అవసరమా - కుటుంబ వ్యవస్థ అవసరమా
29. యు. యు. భార. నారీ - యుగయుగాల్లో భారతీయ నారీత్వం



స్త్రీ అంటే సత్వరజస్తమో గుణాల మిశ్రమమేకాదు, నాదృష్టిలో 'స్త్రీ' అన్న పదం లోని 'స'కారం సహనానికి 'త'కారం త్యాగానికి 'ర' కారం శారీరక బౌద్ధిక, మానసిక రమ్యత్వానికి ప్రతీకలు. ఆమెలోని స్త్రీత్వం, మాతృత్వపు మమకారమూ, సేవాభావమూ, ప్రేమపూర్ణమైన హృదయమూ, దయార్ద్రమైన అంతరంగం, చిరునవ్వుతో ఎంతటి భారాన్నైనా సహించే ధీరగుణం, బాధలను కడుపులో దాచుకొని, బాధ్యతలను తలపై మోపుకొని గరళాన్ని మింగి, అమృతాన్ని పంచే దైవత్వమూ -వీటన్నిటి సాకారరూపమేస్త్రీ.

--డా.ఎన్.శాంతమ్మ

మాతృదేవోభవ, పితృదేవోభవ
ఆచార్యదేవోభవ, అతిథిదేవోభవ"

"ముదితల్ నేర్వగరాని విద్యగలదే ముద్దారనేర్పించినన్"

"నీ చేయితప్ప నీ కన్నీరు తుడవగల సాధనం వేరొకటిలేదు సుమా!"
(రవీంద్రనాథ్ ఠాగూరు)

"-- సమస్యలు చుట్టిముట్టినప్పుడు స్త్రీ హృదయంతో వాటిని పరిష్కరించుకొంటుంది. పురుషుడు మేధస్సుతో పరిష్కారం వెదుకుతాడు. అందుకనే ప్రపంచ భవిష్యత్తు తండ్రి మేధస్సుకన్నా తల్లిహృదయంలో భద్రంగా ఉంటుంది --'

"స్త్రీ కి శరీరం ఉంది, దానికి వ్యాయామం కావాలి.
హృదయం ఉంది, దానికి అనుభూతి కావాలి
మేధస్సు ఉంది, దానికి ఆలోచన కావాలి" (చలం)